# ఒకటి

## డా॥ బాబాసాహెబ్ అంబేద్కరు

పుట్టుకైతే మనిషి చేతిలో లేదు కాని పుట్టీపుట్టగానే మనిషికి జాతి, వంశం, మతం అన్నవి సంక్రమిస్తాయి. వాటినుంచి మనిషి తప్పించు కోలేడు. మనిషి జీవితాన్ని పాడు చేసేది బాగు చేసేదీ ధర్మమే ! అతని చేతలు అతణ్ణి అపకీర్తి పాలన్నా చేస్తాయి లేదూ కీర్తిశిఖరాలని అందుకునే అదృష్టానన్నా కలగచేస్తాయి. ఏ మనిషీ పుట్టుకతోనే గొప్పవాడు కాడు. ప్రపంచంలోని మహాపురుషుల జీవితాలు ఈ విషయం చెప్పక చెపతాయి. ఎంతో త్యాగం, మరెంతో శ్రమపడి ఆ గొప్పదనాన్ని పొందాల్సి ఉంటుంది. అంచేతే మహాభారతంలో కర్ణుడి నోట చెప్పించిన ఈ మాటలు ఎంతో యుక్తమైనవి.

**దైవాయత్తం కులేజన్మ**
**మదాయత్తం తు పౌరుషమ్**

కర్ణుణ్ణి రాధేయుడని, సూతపుత్రుడని అవమానిస్తూ ఉండేవారు. అతడు పుట్టిన కులం అతిహీనమైనదని ఎంతగా ప్రకటించినా, అందులో కర్ణుణి తప్పు ఏముందిట ? తన పౌరుషాన్ని ప్రదర్శించడం అన్నది తన చేతిలోనే ఉన్నాది అన్న సంగతి కర్ణుడికి బాగా తెలుసు. ఆ కారణం చేతే పౌరుషం గురించిన చర్చ వచ్చినా, దానశీలత గురించి చెప్పుకోవలసి వచ్చినా కర్ణుడి పేరు కాక మరొకరి పేరు చెప్పుకోక తప్పటంలేదు. అమెరికా, రష్యాలు రెండూ రెండు బలసంపన్నమైన దేశాలు. ఈ రెండింటిని తీర్చిదిద్దిన మహనీయులుగా స్టాలినునీ, అబ్రహాం లింకనునీ పేర్కొంటారు. రష్యాకి ఒకప్పుడు తానే సర్వేసర్వాగా ఉన్నవాడు స్టాలిను. అమెరికాకి అధ్యక్షుడు అబ్రహాం లింకను. ఈ ఇద్దరు మహనీయులూ అతి సామాన్యమైన కుటుంబాల్లో పుట్టారు. స్టాలిను ఓ చర్మకారుడి ఇంట్లో పుట్టాడు. లింకను పళ్ల తోటల్లో పనిచేసే ఓ మహిళకి పుట్టిన అక్రమ

సంతానం. అయితే జీవితంలో వృద్ధిలోకి రావడానికి ఈ ఇద్దరికీ సాంఘికంగా ఉండే బానిసత్వపు సంకెళ్లు అడ్డంకులు కాలేదు. అస్పృశ్య జాతి కింద పరిగణించబడే మహార్ కులంలో అంబేద్కరు పుట్టారు. ఆ కారణం చేత ఆయన సాంఘిక వాతావరణం లింకనూ, స్టాలినుల దానికి భిన్నమైనది. అలా అయినా ఈ దేశపు ప్రజాజీవితంలో ఆయన తెచ్చిన విప్లవానికి సాటియైనది, దృష్టాంతంగా చెప్పుకోవడానికి మరొకటి కనిపించదు. అది అద్వితీయమైనదని చెప్పకతప్పదు. అబ్రహాం లింకను అమెరికా దేశపు ఉత్తర భాగాన్ని దక్షిణ భాగాన్ని ఐక్యం చేసి అక్కడ నల్లవాళ్లకి తెల్లవాళ్లకి మధ్య ఉన్న వ్యత్యాసాన్ని మొట్టమొదటిసారి తుదముట్టించాడు. అమెరికాలో మొట్టమొదటిసారి ప్రజాస్వామ్య పరిపాలనా విధానానికి పునాది వేశాడు. దీనికి భిన్నంగా వ్యక్తి స్వాతంత్ర్యాన్ని వ్యతిరేకించి యావత్తు దేశంలో స్టాలిను కమ్యూనిస్టు ఆర్థిక వ్యవస్థని రూపొందించాడు. ప్రజాస్వామ్యాన్ని సామ్యవాదాన్ని రెండింటిని సమన్వయపరచాలనే కలని యథార్థం చేయాలని అంబేద్కరు కృషి చేశారు. ఎన్నోవేల సంవత్సరాల నుండి హిందూ మతం చేత మన్నించబడిన అస్పృశ్యతని అంబేద్కరు చట్టం ద్వారా రూపుమాపించారు. ఈ దేశపు ప్రజానీకంలో పాతుకు పోయిన భేద భావాన్ని రూపుమాపి సమానమైన హక్కుల్ని అందరికీ ఇచ్చే రాజ్యాంగాన్ని ప్రసాదించారు. రెండు వేల ఐదువందల సంవత్సరాల తర్వాత మొట్టమొదటిసారిగా ప్రజాస్వామ్యపు విలువలకు పునాది వేశారు. ఇలాంటి అద్భుతమైన వ్యక్తిత్వం - ఎప్పుడూ ఎక్కడా కనీవిననిది - అంబేద్కరు వ్యక్తిత్వం ! ఆయన జీవితం ఎంతగా సంఘర్షణలతో కూడుకుని ఉన్నదో అంతగానూ ఆకర్షణీయమైనదీ - నేర్చుకోదగినదీనూ.

డా|| బాబాసాహెబ్ అంబేద్కరు పూర్తిపేరు భీమరావు రామ్జీ అంబేద్కరు. ఆయన తాత ముత్తాతల ఊరు రత్నగిరి జిల్లాలోని మండణగడ్ తహసీలు లోని ఓ చిన్న పల్లెటూరు. దానిపేరు ఆంబవడే. భీమరావు తల్లిపేరు భీమాభాయి. తండ్రి పేరు రామ్‌జీ పుత్రుడు మాలోజీ సకపాల్. ఆయన మహార్ కులంలో పుట్టారు. మహారాష్ట్రలో ఇది వీరత్వానికి, పరాక్రమానికి, నిజాయితీకి పేరూ పలుకుబడి ఉన్న జాతి. అస్పృశ్య జాతిగా పరిగణించ బడే జాతి. భీమరావు తాతగారు మాలోజీ సైన్యంలో హవల్దారు హోదా పొందినవారు. కుటుంబంలోని అబ్బాయిలకి అమ్మాయిలకి చదువు చెప్ప

డానికి పగటిపూట పాఠశాల జరిగేది. వయస్సు పైబడ్డ వాళ్లకోసం రాత్రిపూట క్లాసులు జరిగేవి. ఈ పాఠశాలలో రామోజీ సూబేదారు ప్రధానోపాధ్యాయుడిగా పధ్నాలుగేళ్లు పనిచేశారు. సైన్యంలో ఉన్న రోజుల్లో లక్ష్మణ్ మురబాడ్కర్‌తో ఆయనకి సన్నిహిత సంబంధం ఏర్పడ్డాది. మురబాడ్కర్ తన కూతురు భీమాభాయిని రామ్‌జీకి ఇచ్చి పెళ్లి చేశారు.

భీమాభాయి డబ్బు ఉన్న గొప్పింట్లో పెరిగింది. పూనాలో ఉపాధ్యాయ ట్రైనింగు స్కూల్లో ఉపాధ్యాయుడిగా పనిచేస్తున్నప్పుడు రామ్‌జీకి చాలా తక్కువ జీతం వచ్చేది. దానిలోంచి అతి తక్కువ మొత్తాన్ని ఆయన భీమాభాయికి బొంబాయి పంపగలిగేవారు. ఆ కారణం చేత భీమాభాయి అతికష్టంగా రోజుల్ని లేమితో గడిపింది. 1890 సరికి రామ్‌జీకి పదముగ్గురు సంతానం కలిగారు.

రామ్‌జీ సూబేదారు కంపెనీ మధ్యప్రదేశ్‌లోని 'మహూ' సైనిక శిబిరంలో ఉన్నప్పుడు, 14 ఏప్రిలు, 1891ని భీమాభాయికి కొడుకు పుట్టాడు. పిల్లవాడికి 'భీమ్' అని పేరుపెట్టారు. కుటుంబ సభ్యులు పిల్లవాణ్ణి 'భీవా' అని పిలుస్తూ ఉండేవారు. ఓ రెండేళ్ల తర్వాత రామ్‌జీ సైన్యం నుండి రిటైరయినారు. రత్నగిరి తహసీలులో కాపధా పోలి ఊళ్లో తదితర రిటైరయిన సైనికులతోపాటు స్థిర నివాసం ఏర్పరచుకోడానికి వెళ్లారు.

1894 దరిదాపుల్లో దాపోలీ పట్టణ కౌన్సిలు పాఠశాలల్లో అస్పృశ్య విద్యార్థులకు ప్రవేశం నిషిద్ధంగా ఉండేది. దాన్ని వ్యతిరేకిస్తూ అస్పృశ్య పెన్షనుదార్లు అందరూ కలిసి జిల్లా కలక్టరుకి అర్జీ పంపారు. తన అర్జీలో రామ్‌జీ సూబేదారు తాను ఉండడానికి గాను స్థలం కావాలని డిమాండు చేశారు. దాపోలీలో తన పిల్లల్ని పాఠశాలలో చేర్పించడం అన్నది అసంభవం అని రామ్‌జీకి బోధపడ్డాది. ఆయన తన కుటుంబాన్ని తీసుకుని బొంబాయి వెళ్లిపోయారు. అక్కడే కాపరం పెట్టారు. అక్కణ్ణించి ఆయన సైన్యాధికారులకి అర్జీ పెట్టుకున్నారు. సాతారా పి.డబ్లు.డి. ఆఫీసులో ఆయనకి స్టోరుకీపరు పని ఇచ్చారు. సాతారా సైన్య శిబిరంలో ఆయన కాపరం పెట్టారు. సాతారాలో సైన్య శిబిరంలో కొంకణ వాస్తవ్యులు, మహార్‌జాతి వాళ్లు - పెన్షను పుచ్చుకుంటున్న కుటుంబాల మధ్య భీమ్ బాల్యం గడిచింది. ఆయన ప్రాథమిక విద్య కూడా అక్కడే జరిగింది.

భీమ్ చిన్నతనంలో చాలా పెంకిగా ఉండేవారు. మర్రిచెట్టు ఎక్కి రోజూ 'సూర్‌పార్‌వ్యా' ఆట ఆడేవారు. దెబ్బలాటలు నెత్తిమీదకి తెచ్చుకునేవారు. తెగ అల్లరిచేసి కొట్లాటలతో ఏదో ఓ పితూరీ చేసేవారు. భీమ్ వల్ల వచ్చే ఈ తగవులాటలని తీర్చడానికి, సర్దడానికి ఇంట్లోవాళ్లకి నానా బాధగానూ ఉండేది. ఆయనకి ఆరేళ్లున్నప్పుడు ఆయన తల్లి చనిపోయారు. ఆయన తల్లి ప్రేమకి దూరమైపోయారు. అవధ్యురాలైన మేనత్త మీరాభాయి ఆ తర్వాత ఆయనని పెంచి పెద్దచేసింది.

సూబేదారు రామ్‌జీ కబీరు మార్గానికి చెందినవాడు. ఆయన రోజూ తన పిల్లలకి భజనలు, అభంగ్‌లు, దోహాలు చెపుతూ ఉండేవారు. పొద్దున్న లేస్తూనే పిల్లచేత అభ్యాసం చేయించేవారు. కారణంచేత మతపరమైన సంస్కారాల గట్టి ముద్ర భీమరావ్ మనస్సు మీద పడ్డాది.

అస్పృశ్యుడైనప్పటికీ భీమ్‌రావంటే అభిమానపడే ఉపాధ్యాయులు కూడా కొందరు ఉండేవారు. అంబేద్కరు అనే ఇంటిపేరు (టైటిలు) ఉన్న బ్రాహ్మణ అధ్యాపకుడు ఒకాయన తన ఇంటిపేరు - కులం పేరు భీమ్‌రావ్‌కి ఇచ్చారు. అంతేకాదు, మధ్యాహ్నం విరామ సమయంలో ఆయన భీమ్‌రావ్‌కి తినడానికి రొట్టెలు కూడా ఇస్తూ ఉండేవారు. 1927 దరిదాపుల్లో అంబేద్కరు ఉపాధ్యాయుడు తమని కలవడానికి వచ్చినప్పుడు ఆయనని చూసి బాబాసాహెబు పులకరించిపోయారు. ఆయన కంఠం ఆర్ద్రమైంది. ఎంతో ప్రేమతో ఆ మాస్టరుగారు తనకి రాసిన ఓ ఉత్తరాన్ని బాబాసాహెబు చాలా రోజుల వరకూ ఎంతో పదిలంగా దాచుకున్నారు.

1900 నవంబరు ఏడవ తారీఖున అక్కడున్న హైస్కూల్లో భీవా మొదటి తరగతి ఇంగ్లీషులో చేరారు. ఓ రోజు స్కూలు నుంచి సెలవు తీసుకోవడానికి గాను భీవా వానలో తడుస్తూ స్కూలుకి వచ్చారు. పేంద్సే అనే అధ్యాపకుడు ఆయనని తన ఇంటికి పంపించి కట్టుకోవడానికి లంగోటీని, కప్పుకోవడానికి అంగ వస్త్రాన్ని యిప్పించారు. తన క్లాసులో కూచోమని ఆదేశించారు. ఆ రోజున తనకి సమాజ స్వభావం అయిన మొండిపట్టుని విడిచివెయ్యాలని నిర్ణయించుకున్నారు. అయితే ఆయన జీవితంలోని ఘటనలని చూస్తే ఆయనకి సహజసిద్ధమైన ఆ మొండిపట్టు స్వభావం ఆయనని వదిలినట్టు ఎంతమాత్రమూ తోచదు.

సాతారాలో ఉన్నప్పుడు తన చిన్నతనంలో భీవాకి అస్పృశ్యత కారణంగా ఎన్నోపాట్లు పడవలసి వచ్చేది, బాధపడవలసి వచ్చేది. ఆయనకి జుట్టు కత్తిరించి క్రాపు చెయ్యడానికి ఏ మంగలీ ఒప్పుకునేవాడు కాడు. అంచేత ఆయన అక్కగారే ఆయనకి క్షవరం చేస్తూ ఉండేది. కరువు కాలంలో రామ్‌జీ సూబేదారుని గోరేగాం దగ్గర పనికి నియమించారు. ఆయన పిల్లలు సాతారాలో ఉండేవారు. ఓసారి భీమ్ తన సోదరుణ్ణి, ఒదినగారిని తీసుకుని రైల్లో గోరేగాం వెళ్లారు. స్టేషను నుంచి ఊళ్లోకి వెళ్లాలంటే వాళ్లకి బండన్నది దొరకలేదు. అంటరానివాళ్లు అయిన కారణంచేత ఏ బండివాడూ తన బండిమీద ఆయనని ఆయనతో ఉన్న వాళ్లని ఎక్కించుకోవడానికి ఒప్పుకోలేదు. చివరికి ఎలాగో ఓ ఎద్దుబండి వాడు ఒప్పుకున్నాడు. అయితే బండిని భీమ్ తోలవలసి వచ్చింది. బండివాడు బండిలో ఉండడమైతే ఉన్నాడు. అంటరానివాడి కోసం బండి తోలడం వాడికి నామర్దాగా అనిపించింది. ఈ పిల్లలమీద ఏ ఒక్కరికీ కనికరం కలగలేదు. రోజున్నరపాటు తాగడానికి నీళ్లు లేకుండా ఉండాల్సి వచ్చింది. అంటరానివాళ్లు అయిన కారణంచేత ఏ నూతి నుంచీ వాళ్లకి తాగడానికి నీళ్లు దొరకలేదు. భీమ్, అతనితో ఉన్న వాళ్లూ ఆకలిదప్పులతో సగం చచ్చి రెండో రోజుకి తమ గమ్యస్థానం చేరుకున్నారు. ఓసారి నల్లబల్లమీద రేఖాగణితంలోని ఓ సిద్ధాంతాన్ని ఋజువు చెయ్యడానికి గాను మాస్టరు భీమ్‌ని పిలిచారు. క్లాసులోని విద్యార్థులందరూ పెద్దగోలచేసి ఆ నల్లబల్లకి దగ్గరగా పెట్టిన తమ టిఫిను డబ్బాలను అక్కణ్ణించి తీసేసారు. లేకపోతే అవన్నీ మైలపడిపోతాయి అన్నారు. వాళ్లు వాటన్నిటినీ తీసేసిన తర్వాతే బోర్డుమీద భీమ్ ఆ సిద్ధాంతాన్ని ఋజువు చేసి చూపెట్టగలిగాడు. ఇలాంటి అవమానంతో నిండిన సంఘటనల వలన భీమ్ మనస్సు తిరగబడ్డానికి సిద్ధమవుతూ వచ్చింది. భీవా నాల్గవ క్లాసు ఇంగ్లీషుని 1904లో పాసయిన వెంటనే సూబేదారు రామ్‌జీ తమ కుటుంబాన్ని తీసుకుని బొంబాయి వెళ్లిపోయారు. పరేలు పేటకి చెందిన డబక్‌లో ఇల్లు తీసుకుని నివాసం ఏర్పరచుకున్నారు. అక్కడ అంతకుముందు నుంచీ కొంకణ్ వాస్తవ్యులైన మహార్ కుటుంబాలు ఉంటున్నాయి. భీవాని గవర్నమెంటు ఎల్ఫిన్‌స్టన్ హైస్కూల్లో తొమ్మిదవ తరగతిలో చేర్చారు. ఈ మధ్యకాలంలో రామ్‌జీ రెండో పెళ్లి చేసుకున్నారు. తన తల్లి నగలు తన

సవతి తల్లి ఒంటిమీద ఉండడాన్ని చూసి భీమా మనస్సునిండా రోషం పుట్టుకువచ్చింది. అప్పట్నించి ఇల్లంటే ఆయన మనస్సు విరిగిపోయింది. ఓ రోజు తన బతుకు మీద విరక్తి కలిగి ఇల్లు విడిచి సిద్దార్థుడిలా వెళ్లిపోయారు. అయితే తన జీవిత లక్ష్యం కోసం తిరిగి ఆయనకి వివేకం కలిగింది. తొందరగానే ఇంటికి తిరిగి వచ్చేశారు. ఆయన తిరిగి వచ్చేసరికి ఆయన ఆత్మీయులు, చుట్టాలు, పక్కాలు బంధువులు చింతలో మునిగి కన్నీళ్లతో ఉండడాన్ని చూసి ఆయన చలించిపోయారు.

పై క్లాసులకి వెళ్తున్నకొద్దీ ఆయనలో ఆయనకి స్వభావసిద్ధమైన మొండిపట్టు తొందరపాటుతనం, పెంకితనం తగ్గడం మొదలుపెట్టాయి. చదువుమీద శ్రద్ధ పెరిగింది. స్కూలు వదలగానే చర్నీ రోడ్డు తోటకి వెళ్లి పాఠ్యక్రమంలో ఉన్న పుస్తకాలనీ, ఇతర పుస్తకాలని అధ్యయనం చేస్తూ ఉండేవారు. ఆ తోటకి కృ.అ. కేలూస్కర్ గురూజీ కూడా సాయంత్రం పూట వస్తూ ఉండేవారు. ఆయనా తన అధ్యయనంలో మునిగిపోయే వారు. ఓ రోజు ఆయన భీమ్‌తో మాట్లాడారు. చదవవలసిన పుస్తకాలు ఏవో, ఎలాగ వాటిని ఎంచుకోవడమో చెప్పారు.

ఎల్ఫిస్టన్ హైస్కూల్లో చదివే రోజుల్లోనే రామ్‌జీ సూబేదారు భీమా పెళ్లి భికూ వలంగ్‌కర్ కూతురు రమాబాయితో చేశారు. పెళ్లినాటికి రమాకి తొమ్మిది-పది ఏళ్లు ఉంటాయి. భీమా పదిహేడు ఏళ్లవాడు.

ఆ రోజుల్లో మెట్రికులేషను పరీక్ష గట్టెక్కడం చాలా కష్టం అనుకునేవారు. అస్పృశ్య విద్యార్థుల్లో మెట్రిక్యులేషను పరీక్ష ఉత్తీర్ణుడైన మొదటి విద్యార్థి భీమరావే ! 'డబక్' లోని నివాసులందరూ కలిసి ఆయనని అభినందించడానికి గాను ఓ సభను ఏర్పాటుచేశారు. ఆ అభినందన సభలో కేలూస్కర్ గురూజీ తాను మరాఠీలో రాసిన భగవాన్ బుద్ధుడి ఆత్మకథని భీమాకి బహుమతిగా ఇచ్చారు. అంతేకాదు, బరోడా రాజు శ్రీమంత సయాజీరావు గాయక్‌వాడ్ గారి చేత పై చదువులకుగాను ఆర్థిక సహాయం తాను ఇప్పించగలనని హామీ ఇచ్చారు. ఆ తర్వాత ఆయన భీమ్‌రావుని బరోడా రాజు గారి దగ్గరకి తీసుకువెళ్లారు. శ్రీమంత్ గాయక్‌వాడ్ నెలనెలా ఇరవై రూపాయలు స్కాలర్‌షిప్ ఇవ్వడానికి ఒప్పుకున్నారు.

1908 జనవరి 3 వ తేదీన భీమా ఎల్ఫిస్టన్ కాలేజీలో చేరారు. ఇప్పుడు ఆయనకి తన బాధ్యత బాగా తెలిసివచ్చింది. ఆయన మనస్సు ఆటల

మీదకి అంతగా పోవడం మానేసింది. షేక్స్పియర్ నాటకం 'కింగ్‌లియర్' ఆధారంగా 'శహాణీములగీ' అన్న పేరుతో ఓ ప్రహసనాన్ని కూడా ఆయన ప్రదర్శించారు. సాయంత్రం పూట క్రికెట్ ఆడడానికి వెళ్తూ ఉండేవారు. పరీక్ష రోజుల్లో వాళ్ల నాన్నగారు అర్ధరాత్రి రెండు గంటలకు ఆయనని లేపి చదవడానికి కూర్చోపెట్టేవారు. ఆయన చదువు బాగా సాగాలన్నదే తండ్రి గారి ఉద్దేశం. భీవా పుస్తకాల దాహం తీర్చడానికి గాను ఆయన అప్పుడప్పుడు తన కూతురు ఇంటికి వెళ్లి ఆవిడ నగలు తాకట్టు పెట్టి డబ్బు తెచ్చేవారు.

ఆ రోజుల్లో ఎల్ఫిన్‌స్టన్ కాలేజీలో డబ్బున్న గొప్పవాళ్ల పిల్లలు, ఉన్నత తరగతుల వారి పిల్లలూ ఎక్కువ సంఖ్యలో ఉండేవారు. భీవాకి ఇంగ్లీషు, ఫారసీ భాషల్లో మంచి ప్రావీణ్యం ఉండేది. అంచేత ఫారసీ అసిస్టెంటు ప్రొఫెసరు కె.వి. ఇరానీ, ఇంగ్లీషు ప్రొఫెసరు ముల్లర్ భీవాని ఎక్కువగా అభిమానించేవారు. ప్రొ. ముల్లర్ అయితే తన షర్టులు కూడా భీవాకి ఇస్తూ ఉండేవారు. ఆయనకి భీవా అంటే అంత ఆపేక్ష ఉండేది. ఆ రోజుల్లో ఎల్ఫిన్‌స్టన్ కాలేజీలో ప్రొ. ఓస్‌వాల్డు, ముల్లర్, జార్జ్ అండర్‌సన్, ప్రిన్స్‌పాల్ కావ్ అర్నలన్ లాంటి పేరుమోసిన ప్రొఫెసర్లు ఉండేవారు. అయినప్పటికీ భీవాలో నవచైతన్యం అన్నది కలగలేదు. ఇదిమాత్రం వాస్తవం. బాబాసాహబు మాటల్లోనే చెప్పాలి అంటే - "నేను ప్రతి సంవత్సరం విశ్వవిద్యాలయపు పరీక్షల్లో ఎప్పుడూ పాసవుతూనే వచ్చాను. అయినా సెకండు క్లాసులో పాసు కాలేదు. బి.ఏ పరీక్షలో కూడా కొద్ది మార్కుల తేడా కారణంగా నాకు సెకండు క్లాసు రాలేదు."[1]

ఆ రోజుల్లో అస్పృశ్య సమాజం వారి దైన్యస్థితిని, విద్యపట్ల వారి తటస్థతని, వారి నిర్లక్ష్యభావాన్ని దృష్టిలో పెట్టుకుని చూసినట్లైతే రామ్‌జీ సూబేదారు పట్టుదలగా ఉత్సాహంతో బి.ఏ. వరకూ భీవాని చదివించడం అన్నది నిజంగా ఎంతో మెచ్చుకోదగ్గ విషయం. 1912 నవంబరు నెలలో భీవా బి.ఏ. పాసయ్యాడు.

ఆయనకి 750 మార్కులకి 280 మార్కులు వచ్చాయి. అందరూ చెప్పరానంత సంతోషించారు. ఆయన చదువు కోసం ఆయన తండ్రి

1. తాను లెక్కల్లో వెనకబడి ఉన్న కారణంగా 1908 నవంబరు పరీక్షకి కూర్చోనని భీవా ప్రిన్స్‌పాల్‌కి చెప్పారు. ఆ కారణం చేత ఆయనకి ఓ సంవత్సరం వ్యర్థం అయింది. (కాలేజీ రికార్డు నుంచి)

ఎంతోగానో శ్రమపడ్డారు. భరించలేని ఖర్చుని ఆ బరువుని ప్రాణాలన్నీ ఒడ్డి మరీ భరించారు. బాబాసాహబు ఆ తర్వాత అనేక పర్యాయాలు తన తండ్రికి మనస్ఫూర్తిగా కృతజ్ఞతలు చెప్పుకున్నారు.

కాలేజీ నుంచి భీమారావు అంబేద్కరుకి మార్కుల లిస్టు[1] వచ్చింది. ఆ లిస్టుని చూసినట్లయితే ఆయనని ప్రథమ తరగతి విద్యార్థుల్లో ఒకరుగా చెప్పడం కుదరదు అన్న విషయం విశదం అవుతుంది. అయితే కాలేజీ విద్యే మనిషి అదృష్టానికి అద్దం పట్టదు. బి.ఏ. డిగ్రీ పరీక్షలో వచ్చిన మార్కుల లిస్టు ఆధారంగా ఈ భీమారావు అంబేద్కరు అన్న పేరుగల విద్యార్థి ప్రఖ్యాతి గణించిన విద్వాంసుడవుతాడని, పేరు తెచ్చుకుంటాడని ఎవరైనా భవిష్యత్తు గురించి జోస్యం చెప్పి ఉంటే ఆ చెప్పినవాడు పిచ్చివాడిగా పరిగణించబడి ఉండేవాడు. అయితే వ్యక్తి తెలివితేటలకి, నైపుణ్యానికి విస్తృతమైన కార్యరంగం దొరికినప్పుడు ఎల్లాగ్గా అవి వృద్ధిచెంది వికసిస్తాయన్నది భీమారావు తదుపరి జీవితాన్ని చూసి అంచనా వెయ్యవచ్చును.

బి.య్యే పరీక్ష పాసైన తర్వాత భీమారావు తన తండ్రి అభిమతానికి విరుద్ధంగా ఉద్యోగం చెయ్యాలని నిర్ణయించుకున్నారు. బరోడా సంస్థానానికి ఆయన ఓ దరఖాస్తు పంపారు. బరోడా సంస్థానపు సైన్యంలో లెఫ్టినెంటు హోదాలో నియామకం చేసి పనిలో చేరవలసినదిగా వెనువెంటనే ఆదేశాలు వచ్చాయి. ఆయన అక్కడ పనిలో చేరి పదిహేను రోజులైనా అయ్యాయో లేదో ఇంతలో తండ్రికి చాలా సీరియస్‌గా ఉందని టెలిగ్రాం వచ్చింది. అది 1913 జనవరి నెల. వెంటనే ఆయన బరోడా

1 1909 వ సంవత్సరం ప్రీవియస్‌లో ఉత్తీర్ణులైన పదమూడు మంది విద్యార్థుల్లో 884 మార్కులకి 282 మార్కులు వచ్చాయి. 1910 ఇంటర్మీడియేటు పరీక్షలో భీమారావుకి వచ్చిన మార్కులు ఈ విధంగా ఉన్నాయి.

| | ఇంగ్లీషు | పారసీ | గణితం | తర్కశాస్త్రం |
|---|---|---|---|---|
| మొత్తం మార్కులు | 200 | 100 | 200 | 100 |
| ఉత్తీర్ణులవడానికి అవసరమైన మార్కులు | 60 | 30 | 60 | 30 |
| వచ్చిన మార్కులు | 69 | 52 | 60 | 42 |

(ఎల్ఫిన్‌స్టన్ కాలేజీ రికార్డు ఫైలుల నుంచి)

నుండి రైల్లో బయల్దేరారు. తోవలో బండి సూరత్ స్టేషన్‌లో ఆగినప్పుడు కుటుంబ సభ్యుల కోసం మిఠాయి కొందామని బండి దిగారు. ఆయన వచ్చేలోగా బండి వెళ్లిపోయింది. దానివల్ల ఆ మర్నాటికి బొంబాయి చేరగలిగారు. ఇంటికి వెళ్లేసరికి తండ్రి మృత్యుశయ్య మీద ఉన్నారు. కొడుకుని చూడ్డం కోసమే ఆ తండ్రి ప్రాణాలు నిలిచి ఉన్నాయా అని అనిపించింది. 1913 ఫిబ్రవరి 2వ తారీఖున రామ్‌జీ సూబేదారు చనిపోయారు.

రామ్‌జీ సూబేదారు చనిపోయిన తర్వాత భీమరావుకి ఇహ తన కాళ్లమీద తాను నిలబడవలసిన అవసరం కలిగింది. ఆయన తన ఉద్యోగానికి బరోడా వెళ్లాలని అనుకోలేదు. అదే సమయంలో బరోడా రాజుగారు కొంతమంది విద్యార్థులను ఉన్నతవిద్య కోసం అమెరికా పంపాలని నిశ్చయించారు. బొంబాయిలోని రాజుగారి నివాస స్థానం రాజవాడ్‌లో భీమారావు ఆయనని కలిసారు. మహారాజు దరఖాస్తు పంపమన్నారు. 1913 జూన్ 4వ తేదీని బరోడా వెళ్లి విద్యాశాఖ డిప్యూటీ మంత్రి కార్యాలయంలో ఒప్పంద పత్రం మీద అంబేద్కరుకి సంతకం చెయ్యవలసి వచ్చింది. ఆ ఒప్పందం ప్రకారం తమ ఉన్నతవిద్య పూర్తి కాగానే పది సంవత్సరాలపాటు బరోడా రాజ్యంలో భీమారావు ఉద్యోగం తప్పకుండా చేసి తీరాలి.

ఆ తరువాత వెనువెంటనే భీమారావు అమెరికా వెళ్లడానికి సంసిద్ధులయ్యారు. ఇరవై రెండేళ్ల యువకుడికి, అందులోనూ అస్పృశ్య యువకుడికి అత్యున్నతమైన దేశంలో ఉన్నత విద్యాభ్యాసానికి అవకాశం రావడం అన్నది అందరానిది అందడమే !! ప్రపంచంలో ఉన్నత విద్యాసంస్థలు ఎక్కడైతే ఉన్నాయో, ఆకాశాన్ని అంటుకునేటట్టుగా మిక్కిలి ఎత్తు ఉన్న భవనాలు ఎక్కడైతే ఉన్నాయో, అక్కడికి, అలాంటి దేశానికి, అక్కడున్న మహత్తరమైన విద్యాసంస్థలో విద్యావంతుడవడానికి భారతదేశపు ఓ బీదవిద్యార్థి వెళ్తున్నాడు !!![1] ఈ మాటలు అన్నది మరెవరో కాదు - విద్యావేత్త అమర్‌నాథ్. అంబేద్కరు వెళ్తున్నప్పుడు అన్నారు !

జూలై 12వ తారీఖున అంబేద్కరు న్యూయార్కు చేరుకున్నారు. ప్రవాసకాలంలో అధ్యయనం చేయటానికి గాను తమతోపాటు బౌద్ధధర్మ

1. ఖనోధా రామచంద్ర - అంబేడ్కర్ జీవన్ సంఘర్ష్ ; పే. 19

గ్రంథాలని పట్టుకుని వెళ్లారు.[1] కొద్దిరోజులపాటు కొలంబియా విద్యాపీఠ్ లోని "హార్ట్‌లే హాలు" హాస్టల్లో ఉన్నారు. ఆ తరువాత 554 వెస్ట్, 144 మార్గంలో ఉన్న కాస్మపాలిటిన్ క్లబ్‌లో తదితర భారతీయ విద్యార్థులతో పాటు ఉన్నారు. అటు పిమ్మట నవల భతనా అనే పారసీ విద్యార్థితో పాటు ఆయన లివింగ్‌స్టన్ హాల్ హాస్టలులో ఉన్నారు. శ్రీ భతనాతో వారి మైత్రి జీవితాంతం చెక్కు చెదరకుండా ఉన్నది. అమెరికాలో ఆయనకున్న ఒకేఒక మిత్రుడు సి.ఎస్. దేవల్. గంటల తరబడి ఆయనతో కలిసి చర్చలు సాగిస్తూ ఉండేవారు.[2]

# రెండు

ఇతర విద్యార్థులు సినిమాలకి, మద్యానికి, సిగరెట్లకి డబ్బుని నీళ్లలా ఖర్చు చేసేవారు. భీమారావు మాత్రం ఒక్క పుస్తకాలు కొనుక్కోవడానికి తప్ప ఇంక దేనికీ ఖర్చు పెట్టేవారు కాదు. మద్యాన్ని కాని సిగరెట్టుని కాని ఆయన ఎప్పుడూ ముట్టుకోలేదు. అయితే ఒకటి, చిన్ననాటినుండి ఆయనకి అలవాటైన అలవాట్లు టీ తాగడం, కిళ్లీ వేసుకోవడం - రెండూ ఎక్కువయ్యాయి. ఈ రోజుల్లోనే ఆయన కళ్లకి కళ్లజోడు వచ్చింది.

అమెరికాలో ఉన్న రోజుల్లో తన జీవితంలో వచ్చిన మార్పు వెంటనే ఆయనకి అర్థమయింది. ఇక్కడ జీవితం నూతన అనుభవాలతో నిండుగా ఉంటోంది. ఆయన మనోపరిధి విస్తృతమవుతోంది. కాయశరీరంతో, బలిష్ఠమైన భుజాలతో దృఢంగా ఉన్న ఆయననీ ఆయన రూపాన్నీ చూసి అమెరికా విద్యార్థులు ఆయనని గౌరవనీయులుగా భావించడం మొదలు పెట్టారు. భీమారావు భారతీయుల పద్ధతి ప్రకారం వ్యాయామం చేస్తారని

1. అదే పుస్తకం ; పే 17
2. బనోధా రామచంద్ర ; పే 17
తదితర జీవిత చరిత్రల్లో శ్రీ దేవల్ గురించి ఉల్లేఖించబడలేదు. అయితే బనోధా ఇచ్చిన వివరణ డా. అంబేద్కరు స్వయంగా ఆయనకి చెప్పినదని బనోధా రాశారు.

వాళ్ళకి తెలిసింది. దాంతో వ్యాయామం ఎలా చెయ్యాలో నేర్చుకోవడానికి గాను ఆయన దగ్గరకి రావడం మొదలుపెట్టారు.

ఇలాంటి ఔన్నత్యస్థితిలో, ప్రౌఢ వయస్సులో ఉన్నవాడిలా నిండా ఉపదేశాలతో ఆయన ఉత్తరాలు రాశారంటే ఆశ్చర్యపడవలసినది ఏమీ లేదు. జమేదార్ అనే ఆయనకి రాసిన ఉత్తరంలో షేక్స్పియర్ నాటకంలోని కొన్ని పంక్తులను ఉటంకిస్తూ, తేటతెల్లం చేస్తూ ఆయన ఇలా రాశారు - "మనిషి జీవితంలో అవకాశాల సముద్రం పొంగుతూ తరంగాలుగా వస్తుంది. ఆ అవకాశాలను సరిగ్గా వినియోగించుకుంటే అతనికి మహనీయత సిద్ధిస్తుంది." సాంఘిక జాడ్యాలకు ఔషధాన్ని సూచిస్తూ ఆయన ఇలా చెప్పారు - "తమ సంతానానికి తల్లిదండ్రులు జన్మదాతలే. అదృష్టదాతలు కారు అనే దైవ విధానాన్ని మనం పరిత్యజించాలి. సంతానపు భవిష్యత్తు తల్లిదండ్రుల చేతుల్లోనే ఉంది అన్న విషయాన్ని మనం బాగా జ్ఞాపకం ఉంచుకోవాలి. దానిని మనం దృఢంగా విశ్వసించాలి. కొడుకులతో సమానంగా మన కుమార్తెలకి కూడా చదువు సంధ్యలు చెప్పించినట్లయితే మనం ఇంకా త్వరితగతిని అభివృద్ధిని సాధిస్తాం అన్నమాట ఖాయం." అంబేద్కరు మనస్సులో స్వావలంబన, స్వాభిమానం, ఆత్మ ఉద్ధరణల గురించి ఆరంభం అయిన మథన ఈ ఉత్తరంలో స్పష్టంగా గోచరిస్తుంది.

డబ్బుకి ఎప్పుడూ ఆయనకి లోటే. అంచేత షైర్లు కొట్టడం, తిరగడాలకి వెళ్లడం, సినిమాలు చూడ్డం మొదలైన వాటివైపు ఆయన మనస్సు ఎప్పుడూ పరుగులు పెట్టేది కాదు. తన భోజనానికి గాను ఒక డాలరు నూరు సెంట్లు ఆయనకి ఖర్చు చెయ్యవలసి వచ్చేది. ఆ డబ్బుకి ఒక కప్పు కాఫీ రెండు కేకులు, ఒక ప్లేటు చేపలు లేదూ ఒక ప్లేటు కూరా వచ్చేవి. బాగా ఆకలేస్తేనే తప్ప ఆయన భోజనానికి కూడా ఖర్చు పెట్టేవారు కాదు. ఆయనకి వచ్చే స్కాలర్షిప్పులోంచి తన భార్యకి ఇంటి ఖర్చులకు గాను కొంత మొత్తాన్ని భారతదేశానికి కూడా పంపేవారు. ఆయన తోటి విద్యార్థులు చెప్పినదాని ప్రకారం ఆయన తన విద్యార్థి జీవితంలోని ప్రతి క్షణాన్ని అధ్యయనం చెయ్యడంలోనే గడిపారు.

1913 నుండి 1916 వరకూ భీమరావు న్యూయార్కు పట్టణంలోనే ఉన్నారు. లిబర్టీ దేవత విగ్రహం ఆ నగరానికి దగ్గరలోనే ఉన్నది. బొంబాయిలోని ఎల్ఫిన్స్టన్ కాలేజీలోని అణిచి తొక్కి ఉంచేటట్టు ఉన్న

వాతావరణానికి, న్యూయార్కులోని స్వేచ్ఛా స్వాతంత్ర్యాలతో ఏ బంధనాలు లేని జీవితానికి గల తేడాని ఆయన తన మనస్సులో తులనాత్మకంగా బేరీజు వేసుకుని చూసి ఉండి ఉండవచ్చును.

ఆ రోజుల్లో కొలంబియా విశ్వవిద్యాలయంలో జాన్‌డ్యూయీ, జేమ్సు శాట్‌వెల్, ఎడ్విన్ సెలిగ్మన్, జేమ్సు హావే రాబిన్‌సన్, ఫ్రేంకలిను, గిడ్డింజ్, అలెగ్జాండరు, గోల్డెను బేయుర్ వంటి దిగ్గజాల్లాంటి విద్వాంసులు విద్యా బోధన చేసేవారు. అమెరికా ఆలోచనా విధానానికి చెందిన జీవితం మీద వీరందరి ప్రభావం ఎక్కువగా ఉన్నది. ఇటువంటి గొప్ప అధ్యాపకుల సాహచర్యంతో గడిపిన కాలంలో ఆశావాదంతో కూడిన ప్రగతిశీలమూ, విశాలమూ అయిన భావాలూ, ఆలోచనలు ఆయనకి కలగటం అన్నది సహజమే.[1]

ఆయన చరిత్ర, సాంఘిక శాస్త్రం, మానవ శాస్త్రం (ఏంత్రోపోలజీ), తత్వజ్ఞానం, మనోవైజ్ఞానిక శాస్త్రం, అర్థ శాస్త్రం అక్కడ అధ్యయనం చేశారు.

ఆయన పుస్తకాలు చాలావాటిలో జాన్‌డ్యూయీ ఆలోచనల ప్రభావమూ, ముద్రా గోచరిస్తాయి. క్లాసులో పాఠం బోధించేటప్పుడు కూడా ఆయన జాన్ డ్యూయీ శైలిని అనుకరించేవారు.[2] 'జాతి సంస్థే చే ఉచ్చాటన్' పుస్తకం జాతి భేదాన్ని రూపుమాపే విషయం మీద ఆయన రాసిన పుస్తకం దానిలో ఆయన స్పష్టంగా ఇలా రాశారు – "జాన్ డ్యూయీ నా గురువు గారు. ఆయన దగ్గర నేను చాలా నేర్చుకున్నాను". 1939 అక్టోబరు 20వ తేదీన జాన్ డ్యూయీ తన 80వ పుట్టినరోజు చేసుకున్నారు. ప్రజాస్వామ్య పరిపాలన మీద ఒక విశిష్టమైన వ్యాసాన్ని రాసి ఆ సందర్భంలో తన విద్యార్థులకు సందేశాన్ని యివ్వడానికి గాను ఆ ఉత్సవ సమావేశంలో చదివారు. ఈ ఉత్సవ సభకి డాక్టరు అంబేద్కరు స్వయంగా హాజరు కాలేకపోయారు. కాని ఆ వ్యాసం కాపీని తన దగ్గర ఆయన అతిపదిలంగా భద్రపరుచుకున్నారు.[3]

1. ఝెలియట్ : 80
2. ఝెలియట్81
3. ఝెలియట్ – 88 హైకోర్టు కాగితం – 24.8.1954 నాడు డాక్టరు అంబేద్కరు డ్యూయీ రాసిన 'ప్రజాస్వామ్యం పరిపాలన' వ్యాసపు కాపీని తనకి పంపమని ఉత్తరం రాశారు.

భారతదేశం తిరిగివచ్చాక కూడా ఆయన తన ప్రొఫెసరుతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుతూనే ఉండేవారు. సిడెన్‌హామ్‌లో లెక్చెరరుగా ఉన్నప్పుడు ఆయన తన విద్యార్థుల్ని కొంతమందిని డాక్టరు సెలింగ్మన్ దగ్గరకు పంపారు.[1]

అమెరికాలో అధ్యయనం చేస్తున్న కాలంలో కూడా ఆయన భారతదేశపు సమస్యల గురించి ఆలోచిస్తూ ఉండేవారు. ఆయన చదివిన వ్యాసాలకి, సమర్పించిన వ్యాసాలకి భారతదేశానికి చాలా గట్టి సంబంధం ఉండేది. అమెరికా వాసులు, నీగ్రో సమాజపు వారి సమస్యలని భారతదేశపు అస్పృశ్యుల సమస్యతో ఆయన ఎప్పుడూ జోడించలేదు.[2] "అస్పృశ్యులు సంఘానికి సంబంధించినంత వరకూ వేరు ఏం కాదు. సరికదా వాళ్లు భారతీయ సంస్కృతిలో అవిభక్తమైన భాగం" అని ఆయన తన వ్యాసం 'భారతీయ జాతి' లో ప్రతిపాదించారు. తర్వాత ఆయన చేసిన పరిశోధన లన్నిటికీ ఈ సిద్ధాంతమే మూల ఆధారం అయింది.

ఇలాగా భీమారావ్ అంబేద్కరు తమ జ్ఞానార్జనలో మునిగి ఉన్నారు. ఆయన ప్రతిరోజూ 18 గంటలు అవిరామంగా తమ సాధనలో మునిగి ఉండేవారు. **Administration and Finance of East India Company** అన్న విషయం మీద తన పరిశోధనా వ్యాసాన్ని సమర్పించి 1915లో ఎం.ఏ. డిగ్రీని పొందారు.[3] ఈ రోజుల్లోనే **National Dividend of India - A Historical and Analytical Study** అన్న విషయం మీద కూడా ఆయన పరిశోధన చేస్తూ ఉండేవారు. 1910 సంవత్సరంలో ఈ పరిశోధనా వ్యాసాన్ని పరిశీలనార్థం కొలంబియా విశ్వవిద్యాలయంలో సమర్పించారు. 1925లో దీనిని లండనులోని పి.ఎస్. కింగ్ అండ్ కంపెనీ వారు **The Evolution of Provincial Finance in British India** పేరుతో ప్రచురించారు. (తర్వాత కొలంబియా విశ్వవిద్యాలయం వారు ఆయనకి పి.హెచ్.డి. డిగ్రీ ఇచ్చారు). ఆ సమయంలోనే అంటే 1916లో డాక్టరు గోల్డన్ వైజర్ యాంత్రోపాలజీ

1. ఝెలియట్ : 87 (5)
2. ఝెలియట్ : 81
3. డాక్టరు కనిలాన్ (ఇన్వెస్టిగేటరు) ఆ అముద్రిత వ్యాసపు కాపీని కొలంబియా విశ్వవిద్యాలయం నుండి సంపాదించి ఈ రచయితకు అందజేశారు.

మీద ఒక సెమినారు ఏర్పాటుచేశారు. దీనిలో 'Castes in India - Their Mechanism Genises and Development' మీద రాసిన వ్యాసాన్ని డా. అంబేద్కరు కేవలం మూడు సంవత్సరాల కాలంలో అమెరికాలో చేసిన కృషి, ఆయన విద్వత్తు, జ్ఞాన సముపార్జనలో సాధించిన మహత్తరమైన ప్రగతి పట్ల తమకున్న శ్రద్ధా భావాన్ని గౌరవాన్ని తెలియచేయడానికి గాను విశ్వవిద్యాలయం కళా విభాగపు ప్రొఫెసర్లు, విద్యార్థులు ఆయనని సత్కరించారు. 1917 వరకూ సంపాదించిన డిగ్రీలను, వాటితో పాటు సముపార్జించిన అపారమైన జ్ఞానాన్ని తన సొత్తుగా తనతో పాటు తెచ్చుకుని ఆయన దేశానికి వచ్చారు.[1]

# మూడు

పి.హెచ్.డి. డిగ్రీ కోసం తాను రాసిన పరిశోధనా గ్రంథాన్ని భీమరావు గారు బరోడా రాజు, సర్ సయాజీరావు గాయక్‌వాడ్ గారికి అత్యంత గౌరవ భావంతో ఈ మాటల్తో అంకితం ఇచ్చారు - "నా విద్యార్జన కోసం మీరు చేసిన సహాయానికి కృతజ్ఞతాపూర్వకంగా". ఈ పుస్తకం ముందుమాటలో తన లెక్చెరరు శ్రీ ఎడ్విన్, ఆర్.ఎ. సెలింగ్మన్‌లకు - 'పబ్లిక్ ఫైనాన్సు లోని ప్రాథమిక పాఠాన్ని బోధించినందుకు గాను ఆయన తమ హృదయ పూర్వక కృతజ్ఞతలను తెలియచేశారు. సెలింగ్మన్ కూడా ఈ పుస్తకం 'ముందు మాట'లో ఈ విధంగా రాశారు - "ఈ విషయ వస్తువుకు సంబంధించిన మూలభూతమైన అంశాల గురించిన వివేచన ఇంత విస్తృతమైనది ఇంకెక్కడైనా లభిస్తుందా అని యోచిస్తే నా దృష్టికి ఎక్కడా మరొకటి అనటం లేదు". ఈ పుస్తకాన్ని రాస్తున్న సమయంలో అంబేద్కరు మాంట్‌ఫోర్డు సంస్కరణలను కూడా దీనిలో చేర్చి తమ వ్యాస పరిధిని మరింత విస్తృతపరిచారు. "బ్రిటిషు పరిపాలనలోని పారిశ్రామికవేత్తల లాభాల కోసం ఈ బ్యూరోక్రసీ ఇక్కడి ఆర్థిక వ్యవస్థని పీల్చి పిప్పి చేస్తోంది". ఈ విధంగా అంబేద్కరు పరిపాలన మీద ఓ విసురు మాట అనకుండా ఊరుకోలేదు.

1. బ్లేకు క్లర్క్ : రీడర్సు డైజెస్టు, మార్చి 1950

ఆ రోజుల్లో కేంద్ర విధానసభ సభ్యులకు బడ్జెటును చర్చించటానికి రిఫరెన్సు పుస్తకంగా, 'భారతీయ ఆర్థిక వ్యవస్థ' మీద రాసిన ఆ పుస్తకం అనివార్యమైనదిగా పరిగణించబడేది.[1] ఆ పుస్తకానికి ఉపసంహారం రాస్తూ తమకు అత్యంత ప్రీతికరమైన ప్రశ్నను లేవనెత్తారు. 'రాజకీయ స్వాతంత్ర్యం సంపాదించడానికి రెండు మార్గాలు ఉన్నాయి. ఒకటి సైనిక శక్తి ద్వారా సంపాదించేది. రెండవది నైతిక బలం ద్వారా సాధించేది. సైనిక బలం లేని దేశం తన నైతిక బలాన్ని పెంపొందించుకోవాలి. భారతదేశపు రాజకీయ సమస్య సంపూర్ణంగా సాంఘిక సమస్య. అది గంభీరమైనదీ, జటిలమైనదీను. సాంఘిక సమస్య గురించి ముందు విచారణ చేయడం అన్నది ప్రజాభిప్రాయ బలంతో స్వతంత్ర ప్రభుత్వం స్థాపించబడే వరకూ రాజకీయ సమస్య పరిష్కరించబడటం కుదిరేది కాదు అనేదాన్నే విశదపరుస్తోంది.[2]

న్యూయార్కులో ఉంటున్న రోజుల్లో అంబేద్కరు తన తీరుబడి సమయంలో పాత పుస్తకాల దుకాణానికి వెళ్ళి చాలా పుస్తకాలు కొన్నారు. ఇంచుమించు రెండువేల పుస్తకాలను భారతదేశానికి తిరిగి వెళ్లే ఒక మిత్రునికి అప్పచెప్పి ఆయన లండనుకి బయల్దేరారు. అయితే కొంతకాలం తర్వాత భారతదేశానికి తిరిగి వచ్చాక ఆ పుస్తకాల్లో చాలా కొంచెం పుస్తకాలు మాత్రమే ఆయన చేతివరకూ వచ్చాయి.

డా॥ అంబేద్కరుకి తమ తరుణ వయస్సు నుంచే పుస్తకాలంటే చాలా మక్కువ, ప్రేమా ఉండేవి. ఆయనకి ఉన్న ఈ మక్కువ బొంబే క్రానికల్‌కి రాసిన ఒక ఉత్తరంలో వ్యక్తం అయింది. భారతదేశపు స్వతంత్ర ఆందోళనలోని మొదటి తరం స్వతంత్ర సేనాని సర్ ఫిరోజ్‌షా మెహతా 1915లో చనిపోయారు. ఈ వార్త చాలాకాలం అయిన తర్వాత గాని అమెరికాకి చేరలేదు. భారతదేశం గురించి శ్రద్ధగా భోగట్టాలు తెలుసుకునే అంబేద్కరుకి మెహతా స్మారకార్థం ఒక విగ్రహాన్ని ప్రతిష్టించబోతున్నారని

1. జనత : ప్రత్యేక సంచిక 1942 - ప్రి.యమ్.బి. దోదె రాసిన "సాహిత్యకారుడు డా॥ అంబేద్కరు."
2. అంబేద్కరు. బి.ఆర్.: **The Evolution of Provisional Finance in British India, 1925 పే. 280**

తెలిసింది. క్రానికల్‌కి ఆయన తమ అభిప్రాయాన్ని తెలియచేస్తూ ఓ ఉత్తరం రాశారు.[1] "మెహతా స్మారకార్థం విగ్రహాన్ని మాత్రమే ప్రతిష్ఠించ కుండా ఆయన స్మృతికి ఒక సార్వజనిక గ్రంథాలయానికి స్కీము వేసుకుని అది అమలు జరిగేటట్టు చెయ్యాలి. ఏ దేశం అయినా బౌద్ధికంగా, సామా జికంగా అభివృద్ధి చెందాలి అంటే దానికి గ్రంథాలయం ఒక పెద్ద ఆధారం. ఇటువంటి స్మారక ప్రతిష్ఠాపన ప్రయోజనవంతం అవుతుంది. దాంతో పాటు ఆయన స్మృతిని కూడా శాశ్వతంగా నిలిపి ఉంచుతుంది."

ఆయన అమెరికాలో ఉన్న కాలంలోనే లాలాలజపతిరాయ్ ఆయనని భారత స్వాతంత్ర్య సమరంలో పాల్గొనేటట్టు చేయడానికి గాను ఎంతో ప్రయత్నం చేశారు. అయితే తాము అధ్యయనం చెయ్యవలసిన అవసరం ఉన్న కారణం చేత అంబేద్కరు తమ అనంగీకారాన్ని ఎంతో వినయంగా తెలియచేశారు.

లండను విశ్వవిద్యాలయంలో ప్రవేశం దొరికిన తర్వాత డా|| అంబేద్కరు 1916 జూన్‌లో అమెరికాకి వీడ్కోలు చెప్పారు. ఆ రోజుల్లో లాలా హరదయాళ్ గారి 'గదర్ పార్టీ' అమెరికాలో ఒక విప్లవాత్మకమైన సంస్థగా రూపుదిద్దుకుంటోంది. డా|| అంబేద్కరు సంఘానికి (ఆర్గనైజేషన్) కూడా ఈ పార్టీతో సంబంధం ఉండడానికి ఆస్కారం ఉంది అన్న అనుమాన కారణంగా లండన్ విమానాశ్రయంలో ఆయనని నిశితంగా తనిఖీ చేసి చూశారు.

1916 అక్టోబరులో న్యాయ శాస్త్రం చదవడానికి "గ్రేజ్ ఇన్స్" లోనూ, అర్థ శాస్త్రం అధ్యయనం చెయ్యడానికి "లండన్ స్కూల్ ఆఫ్ ఎకానమిక్సు అండ్ పొలిటికల్ సైన్సు" లోనూ అయనకి ప్రవేశం లభించింది. ఆయన తమ వ్యాసం రాయడం మొదలుపెట్టారో లేదో ఇంతలో బరోడా సంస్థానం దివాను గారు అంబేద్కరు గారి స్కాలర్‌షిప్పుని ఆపు చేసేసారనీ, ఆయన బొంబాయి తిరిగి వచ్చేయవలసిందనీ తెలియచేశారు. ఆ కారణంగా తమ చదువుని సగంలో ఆపేసుకుని తిరిగి రావడం ఆయనకి తప్పనిసరి అయింది. తమ ఈ నిస్సహాయత్వంలో, తాము పనిచేయలేని స్థితిలో, ఆయన తమ లెక్చెరరు ప్రొ. ఎడ్విన్ గారి సహాయమూ, సిఫారిసులతో నాలుగు

1. బొంబే క్రానికల్; 25 మార్చి 1916

సంవత్సరాల లోగా తిరిగి చదువుకోవడానికి గాను లండను విశ్వవిద్యాలయం నుంచి అనుమతిని పొందారు.

ఈ అనుమతి 1917 నుంచి దొరికింది. తమ పెట్టే-బేడా సర్దుకుని మొత్తం సామాను నంతటినీ థామస్ అండ్ సన్ కంపెనీకి అప్పగించి, దానిని బొంబాయి పంపవలసినదిగా కోరారు. తాము స్వయంగా మార్సెలిస్ రేవు వరకూ మోటారులో వెళ్లారు. అక్కడ నుంచి కైసరేహింద్ ఓడలో భారతదేశానికి తిరుగు ప్రయాణం కట్టారు. ఆ రోజుల్లోనే మొదటి ప్రపంచ యుద్ధం ప్రారంభం అయింది. భూమధ్య సాగరంలో మందుపాతర పేలడం వల్ల ఓ ఓడ మునిగిపోయింది అన్న వార్త పొక్కింది. అంబేద్కరు ఎక్కడ ఈ ప్రమాదానికి గురి అయిపోయి ఉంటారేమోనన్న భయంతో అందరి గుండెలు పీచుపీచుమన్నాయి. అయితే ఆ ఓడమీద అంబేద్కరు సామానంతా ఉంది. అంతే కాని ఆయన లేరు అన్న సంగతి తెలుసుకుని అందరూ అమ్మయ్య అని ఊపిరి తీసుకున్నారు. డా॥ అంబేద్కరు 1917 ఆగస్టు 21ని కొలొంబో మీదుగా బొంబాయి చేరారు.

# నాలుగు

మొదటి ప్రపంచయుద్ధం బ్రిటిషు ప్రభుత్వాన్ని ముప్పుతిప్పలు పెట్టింది. భారతదేశంలో స్వాతంత్ర్యం కావాలన్న డిమాండు బాగా వేళ్లూనింది. భారతదేశానికి వారసత్వపు ప్రభుత్వాన్ని ఇవ్వడానికి, క్రమంగా పరిపాలనా ధికారాలను బదలాయింపు చేసే పనిని త్వరలో ప్రారంభించాలని బ్రిటిషు సామ్రాజ్యం అభిలషిస్తోందని 20.8.1917న ప్రకటించడం జరిగింది. బ్రిటిష్ సెక్రటరీ ఆఫ్ స్టేట్ శ్రీ మాంటేగ్ భారతదేశపు రాజకీయ పరిస్థితిని అధ్యయనం చెయ్యటానికి గాను భారతదేశ పర్యటనకి వచ్చారు. భారతదేశ చరిత్రలో మొట్టమొదటిసారి అస్పృశ్య సమాజానికి చెందిన వేరువేరు సంస్థలు తమతమ డిమాండ్లను, దరఖాస్తులను సమర్పించాయి.

అంబేద్కరు భారతదేశానికి రాగానే సంభాజీ భాషమారె, ఆయనతో పాటు పనిచేసేవారూ కలిసి డా॥ అంబేద్కరును అభినందిస్తూ స్వాగతం

చెప్పాలని నిర్ణయించారు. అయితే అంబేద్కరు - "నేను ఇంకా ఏమీ చెయ్యలేదు. అలాంటప్పుడు నాకు అభినందన సన్మానం ఎందుకు చెయ్యాలి ?" అంటూ వారు అలా చెయ్యడం తమకి అంగీకారం కాదని తెలియచేశారు.

బరోడా ప్రభుత్వంతో చేసుకున్న ఒప్పందం ప్రకారం అంబేద్కరు బరోడా చేరుకోవలసి ఉంది. అది అవసరం. అయితే ఆయన దగ్గర తంతే దమ్మిడీ లేదు. ఆ సమయానికి థామస్ మేన్ కంపెనీ ఆయన సామాన్లు సముద్రంలో మునిగిపోయినందుకు గాను నష్టపరిహారం రూపంలో కొంత మొత్తాన్ని అందచేసింది. అతిగడ్డురోజుల్లో ఆ మొత్తం అందిందేమో అంబేద్కరుకి ఆకాశాన్నందుకున్నంత ఆనందం కలిగింది. ఇంటి ఖర్చులకు గాను కొంత డబ్బుని తమ భార్యకి ఇచ్చి సెప్టెంబరు నెలలో ఆయన బరోడాకి బయల్దేరారు.

తాము ఇచ్చిన మాట ప్రకారం అంబేద్కరు సంస్థానంలో పదేళ్లపాటు పనిచెయ్యవలసి ఉంది. సంస్థానపు అధికారి పెద్దవాడు ఎవరన్నా వచ్చినప్పుడు ఆయనకి స్వాగతం చెప్పడానికి నిజానికి దర్బారు నుండి చాలామంది వస్తారు. అయితే అంబేద్కరు మహర్ జాతికి చెందిన వారవడం చేత ఆయనకి స్వాగతం చెప్పడానికి గాను స్టేషనుకి ఎవరూ రాలేదు. అంబేద్కరు తమ సోదరుడితో పాటు ఏదన్నా హోటల్లోనన్నా లేదా ఏ ఇంట్లోనైనా ఉండడానికి గాను పట్నమంతా తిరిగారు. అయితే జాతి ఏమిటో చెప్పగానే ఏ ఒక్కరూ వారితో కనీసం తిన్నగా మాట్లాడనైనా మాట్లాడలేదు. అక్కడ ఉండడానికి వీల్లేదని పంపించి వేశారు. చివరకు ఆయన ఒక పార్సీ హోటలులో తమ జాతి ఏమిటో చెప్పకుండా ఉన్నారు. అయితే కొద్దిరోజులకే వారి జాతి ఏమిటో అందరికీ తెలిసిపోయింది. పార్సీ వాళ్లు చేపాటి కర్రలు పట్టుకుని ఆ హోటలులో అంబేద్కరుని కొట్టడానికి వచ్చి పడ్డారు. వాళ్లు అంబేద్కరుని ఆయన జాతి ఏమిటో చెప్పమని అడిగారు. వెంటనే హోటలు ఖాళీ చెయ్యమని హెచ్చరించారు.

తమ సంస్థానపు ఆర్థిక మంత్రిగా అంబేద్కరుని చెయ్యాలన్నది బరోడా రాజుగారి గట్టి కోరిక. అన్యశాఖల్లోనూ పరిపాలనాదక్షతా, అనుభవం వారికి కలగాలని ఆయన అంబేద్కరుని మిలటరీ మంత్రిగా చేశారు. ఇంత పెద్ద హోదాగల ఆఫీసరు ఎదటని అక్కడున్న క్లర్కులు, గుమాస్తాలు ఆఖరికి

బంట్రోతు కూడా అంత దూరాన్ని నిల్చుని ఫైలు విసిరి ఇచ్చేవారు. ఆయన తమ కుర్చీలోంచి లేచి వెళ్లగానే ఆ కింద ఉన్న తివాసీని కడిగేవారు. ఆఫీసులో తాగడానికి మంచినీళ్లు కూడా ఆయనకి దొరికేవి కావు. అంచేత ఆయన తీరుబడి క్షణాల్లో లైబ్రరీకి వెళ్లి కూచుని కాలక్షేపం చేసేవారు.

ఈ విధంగా అవమానాల్ని దిగమింగుకుంటూ ఆయన పనిచేస్తూ ఉన్నారు. అలాంటి సమయంలో పార్సీ హోటలు వాళ్లు ఉండడానికి వీల్లేదని బైటికి గెంటి వేశారు. ఏ హిందువూ, ఏ ముస్లిమూ ఆయనకి ఉండడానికి గాను ఇల్లు ఇవ్వడానికి ఒప్పుకోలేదు. ఈ సంగతిని ఆయన బరోడా రాజు గారికి ఉత్తరం ద్వారా తెలియచేశారు. మహారాజు గారు అంబేద్కరు ఉండడానికి వసతి ఏర్పాటు చేయవలసినదని తమ మంత్రికి చెప్పారు. అయితే మంత్రి తమ నిస్సహాయతని చెప్పుకున్నారు. ఆకలిదప్పులతో తిరిగి తిరిగి అంబేద్కరు ఓ చెట్టు నీడకి వెళ్లి కూర్చున్నారు. ఆయన కళ్లంట ఏకధారగా కన్నీరు వర్షించింది. గోలు గోలుమని ఏడ్చారు. హిందూ సమాజంలో అస్పృశ్యుడి స్థితి ఎలాంటిదో కదా !! ఎంత పెద్ద చదువు చదువుకుని రానీ, అన్యజాతుల కన్నా హీనాతిహీనమైన వ్యక్తి కన్నా కూడా కనిష్ఠంగా పరిగణించబడతాడు !

దుఃఖంతో, బరువెక్కిన మనస్సుతో నైరాశ్యంలో పూర్తిగా మునిగి డా॥ అంబేద్కరు 1917 నవంబరు నెలలో బొంబాయికి తిరిగి వచ్చారు. ఆయన తమ వృత్తాంతమంతా కేలూస్కర్ గురూజీ ద్వారా సయాజీరావు మహారాజు గారికి రాయించారు. కేలూస్కర్ గురూజీ మిత్రులొకరు బరోడాలో ఉన్నారు. ఆయన తాను అంబేద్కరు ఉండడానికి గాను ఇల్లు ఇవ్వడానికి సిద్ధంగా ఉన్నానంటూ గురూజీకి ఉత్తరం రాశారు. అంబేద్కరు వారింట్లో ఒక పేయింగు గెస్టుగా ఉండవచ్చును. దాంతో అంబేద్కరు మళ్లీ బరోడా వెళ్లారు. అయితే స్టేషనులోనే ఆ ప్రొఫెసరు గారి ఉత్తరాన్ని తీసుకుని వచ్చి ఎవరో అందచేశారు. ఆ ఉత్తరంలో "నా భార్య మీరు ఉండడానికి ఒప్పుకోలేదు" అని రాసి ఉంది. స్టేషను నుంచే బరోడా సంస్థానానికి వీడ్కోలు చెప్పి అంబేద్కరు బొంబాయికి తిరుగు ప్రయాణం కట్టారు.

1917లో స్పృశ్య సమాజం అస్పృశ్యుల పరిషత్తులను రెండింటిని ఏర్పాటు చేసింది. అయితే స్పృశ్యుల ద్వారా ఏర్పాటు చేసిన ఏ

పరిషత్తులోనూ అంబేద్కరు చేరలేదు. ఆయన ఆర్థిక పరిస్థితి ఏమీ బాగాలేదు. తమ కాళ్ల మీద తాము నిలబడే ప్రయత్నం చెయ్యడం అతి అవసరం. మొదటి కర్తవ్యం. అంచేత ఏ మాత్రం ఆసరా దొరికినా మంచిదే అన్న ఉద్దేశంతో ఒక పార్సీ పెద్ద మనిషి ద్వారా ఇద్దరు విద్యార్థులకు పాఠం చెప్పడానికి ట్యూషను మాస్టరుగా కుదిరారు. దాంతోపాటు షేరు బజారులో బ్రోకర్లకి సలహాలిచ్చే కంపెనీని ఒకదానిని తెరిచారు. అయితే ఈ కంపెనీ యజమాని అస్పృశ్యుడు అని తెలిసీ తెలియగానే జనం ఆ వేపులకి రావడం మానేశారు. కొద్దిరోజులపాటు అంబేద్కరు పార్సీ పెద్దమనిషి లెక్కల రాతకోతలు రాయడం, ఎకౌంట్లు సరిగా ఉన్నవీ లేనిదీ చూడ్డం కూడా చేశారు.

ఆ రోజుల్లోనే అంబేద్కరు బెట్రండు రస్సల్ పుస్తకం 'రీ కన్‌స్ట్రక్షన్ ఆఫ్ సొసైటీ' ని వివేచనాత్మక దృష్టితో పరిశీలన చేసి ఓ వ్యాసాన్ని ఇండియన్ ఎకానమిక్ సొసైటీ మాసపత్రికలో అచ్చు వేశారు.[1]

ఆయన వ్యాసం "కాస్ట్ ఇన్ ఇండియా" రెండోసారి అచ్చయింది. ఈ వ్యాసం చాలా మౌలికమైనదిగా అంగీకరించడం జరిగింది. The American Journal of Sociology సంపాదకుడు ఈ వ్యాసంలోని చాలా భాగాన్ని World's Best Literature of the Month అనే మాసపత్రికలో ఉటంకించాడు.[2]

వ్యవసాయ సమీకరణకు ముందు పారిశ్రామీకరణ ఎంత అవసరం ? ఎందుచేత ? అన్న విషయాన్ని వివేచిస్తూ ఆయన రాసిన వ్యాసం Small Holdings in India and Their Remedies. ఈ రోజుల్లోనే అచ్చయింది.[3]

ఇదే సమయంలో బొంబాయి సిడెన్ హామ్ కాలేజీలో ఒక లెక్చరరు ఉద్యోగానికి ఖాళీ ఏర్పడ్డాది. అంబేద్కరు ఆర్థిక పరిస్థితి ఇప్పటికీ ఏ మాత్రం

1. బాబాసాహబు అంబేద్కరు : Writings and Speeches, భాగం - 1, 1979, పేజి 481-492
2. జి.ఎమ్. బిందోద్ : సాహిత్యవేత్త డా॥ అంబేద్కరు - జనత ప్రత్యేక సంచిక 1942
3. డా॥ బాబాసాహబు అంబేద్కరు : రైటింగ్ అండ్ స్పీచెస్ ; భాగం - 1 , పే.453-479

బాగుపడలేదు. అంచేత ఆయన ఆ ఉద్యోగం కోసం తే. 5-12-1917న తమ దరఖాస్తును పంపారు.

ఆ ఉద్యోగం కోసం పదకొండుమంది అభ్యర్థులు వచ్చారు. ప్రిన్స్‌పాల్ అన్నెటీ అభిప్రాయం ప్రకారం వచ్చిన వారిలో ఆర్.ఎన్. జోషికి ఆ ఉద్యోగం ఇవ్వాలి. అయినా ఆయన ఇంగ్లాండులోని ప్రొ. ఎడ్విన్ కేనన్ అభిప్రాయాన్ని అడిగారు. "విద్యార్థులు ఉత్తీర్ణులవడానికి తమ జ్ఞానాన్నం తటినీ అంబేద్కరు వారికి ధారపోస్తారు" అని కేనన్ అన్నారు.[1] అధికారులు కూడా ఆయన దరఖాస్తు మీద ఈ విధంగా వ్యాఖ్యానించారు. - "మహార్ అయినప్పటికీ ఆయన సముపార్జించిన అపారమైన జ్ఞానం, పేరు ప్రతిష్టలు, ఆయన అసాధారణుడు, గుణసంపన్నుడూ అని చెప్పక చెపుతున్నాయి. ఆయన వ్యవహరించు తీరు ఎంతో నాగరికంగానూ ఆయన వ్యక్తిత్వం ఆహ్లాదకరంగానూ ఉన్నాయి.[2]

సిడన్‌హెమ్ కాలేజీలో పొలిటికల్ ఎకానమీ బోధించటానికి గాను డా|| అంబేద్కరును లెక్చరరుగా ఎంపిక చేశారు.

ప్రభుత్వం 1918 నవంబరు నుండి నెలకి 450 రూపాయల జీతం మీద డా|| అంబేద్కరును తాత్కాలికంగా వేసుకుంది.[3]

అంబేద్కరు అంటరానివాడు అని తెలియగానే మొదట మొదట ఆయన క్లాసంటే విద్యార్థులు పెద్ద ఆసక్తి చూపించేవారు కాదు. అయితే నెమ్మది నెమ్మదిగా ఆయన బోధనాశైలికి మెప్పు రావడంతో ఆయన క్లాసులో విద్యార్థులు హాజరవడం ఎక్కువ అయింది. గంభీరమైన అధ్యయనం, సమగ్రమూ, సంపూర్ణమూ అయిన వివేచన, భావ స్పష్టీకరణలు విద్యార్థులను క్లాసుకి కట్టిపెట్టి ఉంచేవి. ఇదెంత వరకూ వెళ్లింది అంటే తదితర కాలేజీ విద్యార్థులు కూడా అంబేద్కరు అనుమతి తీసుకుని ఆయన ఉపన్యాసాన్ని వినడానికి ఆయన క్లాసుకి సంతోషంతో హాజరయేవారు. ఆయన బోధనా విధానం వలన విద్యార్థి లోకంలో ఆయన ఎంతగానో

1. మహారాష్ట్ర ప్రభుత్వ పురాతత్వ రికార్డుల విభాగం, రికార్డుల విద్యా విభాగం, సెక్షను 651 - 1918, పే. 237, పార్టు - 1, ఎడ్విన్ కేనన్ ఉత్తరం - తే. 25.4.1918
2. ఫైలులో రాసిన వ్యాఖ్యానం - తే. 18.4.1918 ; పే. 238
3. వాల్యూము 65/1918, ఆర్డరు క్రమసంఖ్య 2559 ; తే. 1.10.1918

జనప్రియులయ్యారు. విద్యార్థుల మీద ఆయన పట్టూ, గౌరవ భావం చాలా గట్టిగా ఉండేవి.[1] వీటి కారణంచేత ఆయనని వెక్కిరించటానికి గాని ఆటపట్టించడానికి గాని వాళ్లకి ధైర్యం చాలేది కాదు.

డా॥ అంబేద్కరు దృష్టిలో ఆనాటి విద్యా విధానం ఉచితమైనది కాదు. క్లాసులో విద్యార్థి ఏం నేర్చుకుంటున్నాడో అన్నదానిమీద అతని మార్కుల విలువని నిర్ధారించాలి. రాసే పరీక్షల కన్నా మౌఖిక పరీక్షలకు ఎక్కువ ప్రాముఖ్యం ఇవ్వాలి. డా॥ అంబేద్కరు జీవిత చరిత్రని రాసిన రచయిత రామచంద్ బనోధా, అంబేద్కరు పరీక్ష పత్రాలు దిద్దే పనిలో ఉన్నప్పుడు ఆయనతో ఈ విషయం గురించి పరిశోధనాత్మక దృష్టితో మంచీ చెడ్డా చర్చించారు.[2] డా॥ అంబేద్కరు అప్పుడు ఇలా అన్నారు - 'సమాధాన పత్రాలు దిద్దేటప్పుడు నావి అయిన స్టాండర్సు గీటురాళ్లు కొన్ని నాకు ఉన్నాయి. 50% మార్కులు జవాబులో ఉన్న విషయ జ్ఞానానికి కేటాయిస్తాను. 50% మార్కులు జవాబు ఇచ్చిన పద్ధతికి, శైలికి కేటాయిస్తాను. పద్ధతిలో భాష, రాసిన శైలి, విషయ వస్తువుని ప్రతిపాదన చేసే విధానం వస్తాయి. సాధ్యమైనంత వరకూ విద్యార్థుల్ని ఉత్తీర్ణుల్ని చెయ్యడానికే నేను ప్రయత్నిస్తాను. అంటే 33% వరకూ ఎక్కువ కెక్కువ ఆన్సరు పేపర్లకు రావాలి అన్నదే నా ప్రయత్నం. ఆ తర్వాత బాగా ఉన్న పేపర్లకి 45% మార్కులు ఇయ్యడం చేస్తాను. అయితే అంతకన్నా ఎక్కువ మార్కులు ఇయ్యాలీ అంటే దిద్దడం మరింత ఎక్కువ కఠినం చేస్తాను.

60% మార్కులు వచ్చే విద్యార్థులు చాలా తక్కువ మంది ఉంటారు. ఎంచేతా అంటే వారి ఆన్సరు పేపర్లను చాలా కఠినంగా దిద్దడం జరుగుతుంది.

"మీరు ఎవరికీ 60% కన్నా ఎక్కువ మార్కులు ఇవ్వనే లేదా ?" అని బనోధా అడిగారు. దాంతో అంబేద్కరుకి ఓ పాత సంగతి జ్ఞాపకం వచ్చింది. ఆయన గంభీరులయ్యారు - ఇలా చెప్పారు - '60% మార్కులు తెచ్చుకునే అర్హత ఉన్న విద్యార్థులకి నేను 60% కన్నా ఎక్కువ మార్కులు ఇచ్చాను. ఓసారి నేను ఓ విద్యార్థికి 150 మార్కులకి 144 మార్కులు ఇచ్చాను. ఆ విద్యార్థి ప్రశ్నలకు ఎంతో నైపుణ్యంతో జవాబులు రాశాడు.

1. బనోధా : పే. 31
2. బనోధా : పే. 32-34

అంచేత 150 కి 150 ఇచ్చేయాలని చాలాసార్లు అనిపించింది. అయితే అది లెక్కలు లాంటి విషయం కాదు కాబట్టి అతని పేపరుకి నేను ఆరు మార్కులు తగ్గించి ఇచ్చాను.

ఆ ఆన్సరు పేపర్ని డిగ్రీ ప్రధానం చేసే కాలేజీ అధికారులకి తిప్పి పంపించాను. ఆ విద్యార్థి మరో కాలేజీ విద్యార్థి. అతనికే ప్రథమస్థానం వచ్చేటట్టు ఉంది అని ఆ కాలేజీ అధికారులకు అనిపించింది. దాంతో వాళ్లు ఆ ఆన్సరు పేపర్ని మరోసారి పరీక్షించి చూడవలసినదని నాకు పంపించారు. ఆ పేపరును ఎలా ఉన్నదాన్ని అల్లాగ్గానే నేను తిరిగి పంపాను. దానితోపాటు 'ఇదే నా ఆఖరి నిర్ణయం' అనికూడా రాసి పంపాను. వాళ్లు ఆ పేపరుని తదితరులకి దిద్దడానికి పంపారు. ఒకరు 144 కన్నా కొంచెం ఎక్కువ వేస్తే మరొకరు ఒకటి రెండు మార్కులు తక్కువ వేశారు. చివరకి అధికారులకి నా నిర్ణయాన్నే అంగీకరించవలసి వచ్చింది.

"ఎప్పుడూ ఎవరూ మీ దగ్గరికి సిఫార్సు కోసం రాలేదా ?"

"ఓసారి ఓ అస్పృశ్య విద్యార్థి చుట్టానికి నేను బొంబాయి విశ్వవిద్యాలయం పరీక్ష పేపర్లు దిద్దుతున్నానని తెలిసింది. ఆయన నా దగ్గరికి వచ్చి ఆ విద్యార్థిని పాస్ చెయ్యమని కోరాడు. విద్యార్థి అస్పృశ్యుడు అయిన కారణంచేత ఆయన మాటని నేను అంగీకరించి తప్పకుండా సాయం చేస్తానని ఆయనకి అనిపించింది. కాని నా దృష్టికి అది సాధ్యం కాదు. నేను కావాలని అనుకుంటేనే ఇది సాధ్యం అవుతుంది. కాని అది నా గౌరవానికి భంగకరం. అదీగాక, ఇలాగ ఎవరికోసమైన సిఫారసు చెయ్యడం అన్నదే నాకు అసహ్యకరం అనిపిస్తుంది. తెలివితేటల్లోనూ, యోగ్యత దృష్ట్యాను ఇతర విద్యార్థుల కన్నా తాను ఏ రకం గానూ తక్కువ వాడినని చెప్పుకునే పద్ధతిలో ఏ అస్పృశ్య విద్యార్థీ ప్రవర్తించకూడదు. ఇది నా అభిప్రాయం. ఇతర విద్యార్థులతో పోల్చినప్పుడు ఓ ఆదర్శ విద్యార్థిగా అతడు తన అస్తిత్వాన్ని నిరూపించుకోవాలి అనే నేను అనుకుంటాను. ఆయనకి అతి స్పష్టంగా ఈ విషయం చెప్పాను. నాయీ జవాబు విని ఆ పెద్దమనిషి మారుమాట లేకుండా వెళ్లిపోయాడు."[1]

పరీక్షాధికారిగా అంబేద్కరు అంత నిష్పాపరులు.

1. ఖనోధా : పే. 32-34

# ఐదు

1919 జనవరి 27వ తేదీన బాబాసాహబు అంబేద్కరు ఓటు హక్కు మీద అభిప్రాయ సేకరణ చేస్తున్న 'సౌవుతబరీ కమిటీ' కి తమ వివరణ యిచ్చారు. ఈ కమిటీకి ఆయన తమ రిపోర్టును కూడా సమర్పించారు.[1]

"ప్రజా ప్రతినిధుల ప్రభుత్వం వాస్తవంగా సరియైన విధంగా ఏర్పరచాలీ అంటే అస్పృశ్య సమాజానికి దాని జనసంఖ్యకి తగినట్టు ప్రాతినిధ్యం ఇవ్వడం ఎంతైనా అవసరం" అని ఆయన ఆ రిపోర్టులో విపులంగా విమర్శనాత్మకంగా వివేచించి చెప్పారు. అస్పృశ్యులకి స్థానం కల్పించాలని ఆయన డిమాండు చేశారు.

1919 ప్రాంతాల్లో డా॥ అంబేద్కరుకి కోల్హాపూర్ మహారాజు గారితో సంబంధం ఏర్పడ్డాది. కోల్హాపూర్ వాస్తవ్యులు దత్తోబాపనార్ ద్వారా ఈ సంబంధం కలిగింది. 'మూకనాయక్' అనే పక్ష పత్రిక ప్రారంభించాలన్న వాంఛతో ఆయన మహారాజా వారిని ఆర్థిక సాయం చేయమని అర్థించారు. ఈ పక్ష పత్రిక 'మూకనాయక్' దళితోద్యమానికి ప్రచార సాధనంగా ప్రారంభించడం జరిగింది. అయితే డా॥ అంబేద్కరు ప్రభుత్వ కళాశాలలో లెక్చెరరు అయిన కారణంచేత ఆ పత్రికకు సంపాదకులు అవలేదు. దళిత సమాజం అంటే సవర్ణుల మనస్సులో ఎంతో అసహ్యం గూడుకట్టుకుని ఉంది. 'మూకనాయక్' పత్రిక విజ్ఞాపనని అచ్చువేయటానికి లోకమాన్య తిలక్ పత్రిక 'కేసరి' నిరాకరించింది. అప్పటికి లోకమాన్య తిలక్ జీవించే ఉన్నారు.

'మూకనాయక్' పత్రిక ప్రారంభ సంచికలు కొన్నింటికి అంబేద్కరు ప్రధానమైన వ్యాసాలు రాశారు. ముఖ్యమైన ఒక వ్యాసంలో ఆయన - "భారతీయులకు బ్రిటిషు పరిపాలన నుండి విముక్తి కావాలంటే తమదైన స్వరాజ్యం వారికి కావాలంటే మొట్టమొదట వారు అస్పృశ్యులను విముక్తులను చెయ్యాలి" అని రాశారు. ఈ పక్ష పత్రిక అతి తక్కువ రోజులు క్రమేణా నడిచి ఆ తర్వాత పూర్తిగా ఆగిపోయింది.

1. **Report of the Reformity (Franchise) ; vol. 2, 1919**

1926 మార్చి 21ని కోల్హాపూర్ సంస్థానానికి చెందిన మానగావ్‌లో అస్పృశ్యుల పరిషత్తు ఏర్పాటు చేశారు. ఈ పరిషత్తుకి కోల్హాపూర్ ఛత్రపతి శ్రీ శాహూజీ మహారాజు స్వయంగా హాజరయ్యారు. "మీకు అంబేద్కరు రూపంలో మిమ్మల్ని ఉద్ధరించే వ్యక్తి దొరికాడు. మీ సంకెళ్లని ఆయన తెక్కొడతాడు. నాకు పూర్తిగా ఈ విషయంలో నమ్మకం ఉన్నాది. అంతేకాదు భారతదేశపు మహానాయకుల్లో ఈయనకి విశిష్టమైన స్థానం ఉంటుంది" అని మహారాజు తన ఉపన్యాసంలో చెప్పారు. ఈ పరిషత్తులో మహారాజావారి సమక్షాన అన్ని జాతుల వారిని ఏకపంక్తిలో కూచోపెట్టి భోజనం వడ్డించారు. ఈ విందులో సర్దార్లు అనేకమందితో పాటు అంబేద్కరు మొదలైన మహార్ జాతి నాయకులు కూడా ఉన్నారు.

1920 మే నెలలో అఖిల భారతీయ బహిష్కృతుల పరిషత్తు నాగపూర్‌లో జరిగింది. ఈ పరిషత్తుకు ఛత్రపతి శ్రీ శాహూ మహారాజు అధ్యక్షత వహించారు. ఈ పరిషత్తులో ఛత్రపతి శాహూ మహారాజు వేంచేసి అస్పృశ్యులతో పాటు కూచుని భోజనం చేస్తారు. తామూ ఆ పంక్తిలో కూచోవలసి వస్తుంది అన్న భయం నాగపూర్ రాజు రఘూజీ భోంస్లేకి పట్టుకుంది. అంచేత ఆయన తమ కుటుంబంతో పాటు ఆ సమయానికి నాగపూర్‌లో ఉండకుండా ఇంకొకచోటికి వెళ్లిపోయారు. అంటరాని వారి ప్రతినిధులు అంటరాని వారి ఓట్ల ద్వారా ఎన్నుకోబడి కౌన్సిలుకి వెళ్లాలి అన్న ప్రతిపాదనని ఈ పరిషత్తులో ఆమోదించడం జరిగింది. డా॥ అంబేద్కరు గారి వల్ల అస్పృశ్య సమాజం కళ్లు తెరిచింది. ఇహ హిందూ ప్రధానమైన సంస్థ మీద ఆధారపడి ఆశపడ్డం శ్రేయస్కరం కాదు అన్న విషయం వారి అనుభవంలోకి వచ్చింది. అంబేద్కరు మహార్ జాతికి చెందిన 12 ఉపజాతుల వారినందరినీ ఏకపంక్తిలో కూచోపెట్టి వారి మధ్యనున్న పంక్తి భేదాన్ని మొట్టమొదటిసారిగా ఈ పరిషత్తులోనే పోగొట్టారు. లెక్చరరుగా తమకు నెలనెలా దొరికే జీతంతో జీవితాన్ని గడపడానికి అతిజాగ్రత్తగా ఆయనకి ఖర్చు చేయవలసి వచ్చేది. భార్య రమాభాయికి ఇంటి ఖర్చులకు గాను కొంత మొత్తాన్ని ఇచ్చి మిగిలినదాన్ని జమ ఖాతాలో వేసేవారు.[1] రమాబాయి స్వభావరీత్యా మితభాషి. దృఢ

1. ఖనోధా : పే. 34 – "ప్రతి నెలా 50 రూపాయలు వేసేవారు."

సంకల్పంతో పనిచేసే ప్రవృత్తి స్వాభిమానం ఉన్న మహిళ. పెళ్ళికాక ముందు ఆవిడ చాలా గడ్డుస్థితిని, కష్టాలను ఎదురుకుంది. ఇప్పటి ఈ కష్టస్థితిలోనూ తాను శాంతంగా ఉండడమే కాక ఇంట్లోనూ శాంతిగా ఉండేటట్టు చూసింది. భర్త విదేశాల్లో ఉన్న రోజుల్లో తన విధవరాలైన ఒదిన గారిని ఆవిడ కొడుకునీ ఆవిడ తన దగ్గరే ఉంచుకుంది. ఇక్కట్టుల్లోనూ, కష్టదశలోనూ ధైర్యం పోగొట్టుకోలేదు. ఉస్సురని చలించ లేదు. ఎవరినీ పల్లెత్తుమాట పరుషంగా మాట్లాడలేదు. అంబేద్కరు అమెరికా వెళ్ళిన సమయానికి ఆవిడ గర్భవతి. ఆవిడ కడుపున పుట్టిన బిడ్డకు గంగాధర్ అని పేరు పెట్టారు. అయితే ఆ బిడ్డ ఎక్కువ రోజులు బతకలేదు. లోకాన్ని వదిలి వెళ్ళిపోయాడు. ఇహ ఇప్పుడు ఆవిడకి ఉన్న సంతానం ఒక్క కొడుకే - యశవంత్ ఒక్కడే. తన కొడుకు ఆరోగ్యం గురించిన చింత ఆవిణ్ణి ఎప్పుడూ బాధిస్తూ ఉండేది. ఆవిడ ఎంతో కష్టపడి చదవడం, రాయడం నేర్చుకుంది. తన భర్త అధ్యయనానికి ఏ విధంగానూ ఏ అడ్డంకీ రాకుండా ఉండాలి అనే ధ్యాస ఆవిడకి ఉండేది.

# ఆరు

తన స్నేహితుడు నవల్ భదేనా అప్పు రూపేణా ఇచ్చిన ఐదువేల రూపాయలు, కోల్హాపూర్ రాజుగారు ఇచ్చే ఆర్థిక సహాయం, తమ నెల జీతంలో మిగుల్చుకున్న మొత్తం అన్నిటినీ కలుపుకుని డా॥ అంబేద్కరు లండను వెళ్ళడానికి ఏర్పాట్లు చేసుకున్నారు. 1920 జూలై నెల ఆఖరి వారానికి ఆయన లండను చేరారు.

ఆయన సెప్టెంబరు నుంచి లండనులో తమ అధ్యయనాన్ని ప్రారంభించారు. ఆయన దృష్టి లండను లైబ్రరీ మీద పడ్డాది. ప్రపంచంలో సులువుగా దొరకని అనేక గ్రంథాలు ఆ గ్రంథాలయంలో పదిలపరిచి ఉంచారు. చాలామంది కేవలం ఓసారి చూద్దామన్న వాంఛతో ఆ గ్రంథాలయానికి వస్తూ ఉంటారు. ఈ గొప్ప గ్రంథాలయంలో

డా॥ అంబేద్కరు ఉదయం 8 గంటల నుంచి సాయంత్రం 8 గంటల వరకూ కూచునేవారు. ఆయన ఒక ప్రైవేటు హోటలులో ఉండేవారు. ఆ హోటలు యజమానురాలు స్వభావరీత్యా కాస్త కర్కోటకరాలు. అంబేద్కరుకి ఉదయం ఇచ్చే అల్పాహారంలో ఒక కప్పు టీ, బ్రెడ్డు ముక్క ఒకటీ, ఓ చేప ముక్కా మాత్రమే పెట్టేది. దాన్నే తిని ఆయన గ్రంథాల యానికి వెళ్లేవారు. అందరికన్నా ముందస్తుగా ఆయనే చేరుకునేవారు. విశ్రాంతి అన్నది లేనేలేకుండా నిర్విరామంగా పుస్తక పఠనంలో మునిగి పోయేవారు. తమ సమయం ఏ మాత్రమూ వృధా కాకూడదన్న భావంతో మధ్యాహ్న భోజనాన్ని సాయంత్రపు అల్పాహారాన్ని, టీని అన్నిటినీ వదులుకునేవారు. తమ చదువులో ఏకాగ్రతతో పూర్తిగా మునిగిపోయి ఉండడం చేత గ్రంథాలయం కాపలాదారు ఆయన దగ్గరకి వెళ్లి "అయ్యా! గ్రంథాలయం మూసివేసే సమయం అయింది" అని చెప్పి గ్రంథాలయాన్ని మూసేవాడు. అలిసిపోవడమైతే ఆయన అలిసిపోయేవారు. కాని ఆయన జేబులు అక్కడ కూచుని ఆయన రాసుకున్న కాగితాలతో నిండిపోయేవి. ఈ గ్రంథాలయమే కాకుండా, ఇండియా ఆఫీసు లైబ్రరీ, లండన్ యూనివర్సల్ లైబ్రరీ, తదితర ప్రముఖ గ్రంథాలయాల్లోని పుస్తకాలను కూడా ఆయన నిర్విరామంగా ఉపయోగించుకునేవారు. సాయంత్రం అక్కడ నుంచి బైటపడేసరికి ఆకలికి ఆయన తలతిరుగుతూ ఉండేది. ఏదో ఒక చవక హోటలుకు వెళ్లి ఏదో ఒక పేయాన్ని ఓ కప్పుడు తాగేవారు. దాంతోపాటు ఓ రెండు రొట్టె ముక్కలు తినేవారు. ఇంటికి తిరిగి వచ్చేక కడుపునిండా రాత్రివేళ తినేవారు.[1] ఓ గుజరాతీ మిత్రుడు ఆయనకి కాసిన్ని అప్పడాలు ఇచ్చాడు. మధ్యరాత్రప్పుడు ఆయన రెండు అప్పడాలు కాల్చుకుని తినేవారు. ఓ కప్పు పాలు తాగేవారు. తెల్లారేవరకూ తమ చదువు సాగించేవారు. బైట ప్రపంచంతో ఆయనకేమీ సంబంధం లేదు. ఆ రోజుల్లో ఆయన గదిలో బొంబాయి వాస్తవ్యులు అస్నోడకర్ ఉంటూ ఉండేవారు. వీరిని నిద్రపొమ్మని వారు ఎన్నిసార్లు బలవంతపెట్టినా ఈయన ఎప్పుడూ ఒకటే జవాబు ఇచ్చేవారు. "నా దగ్గర తిండికి డబ్బు లేదు. నిద్రకి సమయం లేదు. ఎంత తొందరలో అయితే అంత తొందరగా నేను

1. గురువర్యులు కృ.అ. కేలూస్కర్ః (డా॥ భీమరావు రామ్‌జీ అంబేద్కరు), జనత, ప్రత్యేక సంచిక 1933

నా చదువుని పూర్తి చేసుకోవాలి."[1] డా॥ అంబేద్కరు జ్ఞానోపార్జన ఈ విధంగా అఖండంగా జరుగుతూ ఉండేది.

డాక్టరు అంబేద్కరు విదేశాల్లో అధ్యయనం చేస్తున్నప్పటికీ భారత దేశంలోని తమ సహచరులకి ఎప్పుడూ సలహా ఇస్తూ ఉండేవారు. హరిజనోద్ధరణ అంశం మీద ఆయన చాలా ఎక్కువ ధ్యాసతో ఉండేవారు. అంతేకాదు, శివవర్‌కర్‌కి ఉత్తరాలు రాస్తూ ఉండేవారు. తమ కొడుకు, మేనల్లుళ్ల చదువుసంధ్యల మీద పూర్తిగా ధ్యాస ఉంచమంటూ ఎప్పుడూ సూచించేవారు. ఆయన రాసిన ప్రతి ఉత్తరంలోనూ అస్పృశ్యుల ఉద్ధరణ విషయంలో ఆయన పదునైన ఆలోచనలు వ్యక్తం అవుతూ ఉండేవి. తమ సహచరుల ఆరోగ్యం గురించి కూడా ఆయన తమ ఉత్తరాల్లో ఎంతో ఆసక్తితో పరామర్శిస్తూ ఉండేవారు.

డాక్టరు అంబేద్కరు పరిశోధన చాలావరకు పూర్తి అయింది. "ప్రావెన్షియల్ డిసెంట్రలైజేషను ఆఫ్ ఇంపీరియల్ ఫైనాన్సు ఇన్ బ్రిటిష్ ఇండియా" అన్న విషయానికి 1921లో ఆయనకి ఎమ్మెస్సి డిగ్రీ లభించింది. ఆ తర్వాత ఒక్క ఏడాదికే 1922 అక్టోబరులో 'ది ప్రోబ్లమ్ ఆఫ్ ది రుపీ' అన్న విషయంమీద రాసి, డిఎస్సి డిగ్రీ కోసం గాను సమర్పించారు. ఈ విధంగా రెండున్నర సంవత్సరాల కాలంలో ఎమ్మెస్సి, డిఎస్సి - రెండు డిగ్రీలను ఆయన సంపాదించారు. ఆ రోజుల్లో బారిస్టరు పరీక్ష కూడా ఇచ్చేయాలని ఆయన అనుకున్నారు. అయితే ఆయన ఆ సంవత్సరం ఆ పరీక్ష ఇవ్వలేదు. ఏప్రిలు, మే నెలల్లో ఆయన జర్మనీకి వెళ్లి వచ్చారు. ఓసారి బోన్ విశ్వవిద్యాలయానికి వెళ్లి ఆయన మూడు నెలల పాటు సంస్కృత భాషని అభ్యసించారు.[2] 1923లో ఆయన ప్రొఫెసరు ఎడ్విన్ కేనన్ గారు ఆయనని వెనక్కి పిలిపించారు. పరీక్షాధికారులకి ఆయన వ్యాసంలో కొన్ని భాగాలు అభ్యంతరకరంగా అనిపించాయి. అంచేత తమ భావాలను మార్చకుండా ఆ భాగాన్ని సౌమ్యమైన భాషలో తిరగరాసి ఆ వ్యాసాన్ని రెండవసారి సమర్పించ వలసినదిగా ప్రొ. కేనన్ ఆయనకి చెప్పారు. ఇంతకు పూర్వమే విద్యార్థుల సంస్థ ఒకటి ఏర్పాటు

1. కీ ర (మ) : పే. 50
2. బనోదా : పే. 36. బనోదా ప్రకారం బాబా సాహబు జర్మన్, సంస్కృత భాషలు జర్మన్ విశ్వవిద్యాలయంలోని వారికి నేర్పేవారు.

చేసిన సభలో అంబేద్కరు "రెస్పాన్సిబిలిటీస్ ఆఫ్ ఎ రెస్పాన్సిబుల్ గవర్నమెంట్ ఇన్ ఇండియా" అన్న విషయం మీద తమ ఉత్తేజకరమైన వ్యాసాన్ని చదివి ఉన్నారు. ప్రపంచ రాజకీయ శాస్త్ర తత్వవేత్త శ్రీ హెరాల్డు జె. లాస్కి ఈ వ్యాసం గురించి తమ అభిప్రాయాన్ని ఈ విధంగా తెలియచేశారు – "ఈ వ్యాసంలో అంబేద్కరు వ్యక్తం చేసిన భావాలు విప్లవాత్మకమైనవి."

డా॥ అంబేద్కరు దగ్గర చాలా తక్కువ డబ్బు మిగిలి ఉంది. ఆ డబ్బుతో ఆయన పుస్తకాలు కొనుక్కున్నారు. ఇంటి పరిస్థితి బాగా దిగజారిపోయి ఉంది. అలాంటి స్థితిలో ఆయన స్వదేశం తిరిగి రావడానికి నిశ్చయించారు. 1923 ఏప్రిలులో ఆయన బొంబాయి చేరారు. తమ వ్యాసాన్ని రెండవసారి పంపించారు. పరీక్షాధికారులు ఆయనకి డాక్టర్ ఆఫ్ సైన్సు డిగ్రీని ఇచ్చి గౌరవించారు. ఈ వ్యాసాన్ని పి.ఎస్. కింగ్ కంపెనీ 1923 డిసెంబరులో అచ్చు వేసింది. డా॥ అంబేద్కరు ఈ గ్రంథాన్ని తమ తల్లిదండ్రులకు – వారు అత్యధికంగా చేసిన త్యాగానికి, కొడుకు చదువు పట్ల వారికున్న గట్టి ఆకాంక్షకి, హృదయపూర్వకమైన కృతజ్ఞతలతో అంకితం ఇచ్చారు.[1] ప్రపంచమంతటా ఈ పుస్తకం గుర్తింపు పొందింది. డా॥ అంబేద్కరు, ప్రొఫెసర్ ఎడ్విన్ కేనన్ కూడా తమ 'ప్రస్తావన'లో తమ శిష్యుడి తర్కంతో విభేదిస్తూ ఆ గ్రంథంలో వ్యక్తం అయిన భావాలను, తర్కంలో అభివ్యక్తం అయిన బుద్ధి కుశలతనూ ప్రశంసించారు. డా॥ అంబేద్కరు అమెరికా పి.హెచ్.డి.ని, లండను డి.ఎస్సి. బారిస్టరు డిగ్రీలను పుచ్చుకోవడం అయింది. ఆయన ఇప్పుడు ఆర్థిక శాస్త్రం, సాంఘిక శాస్త్రం, న్యాయ శాస్త్రంలో పారంగతులు. ఎలాంటి సుడిగాలినైనా, తుఫానునైనా ఎదురుకోవడానికి కావల్సిన శక్తియుక్తులు ఉన్నవాడు.

1. బ్లేకుక్లార్కు : రీడర్స్ డైజెస్టు ; మార్చి 1950, పే 109 ; ది విక్టరీ ఆఫ్ ఎన్ అన్‌టచబుల్

# ఏడు

డా॥ అంబేద్కరు పెళ్లి 1908లో జరిగింది. అప్పటికి ఆయన వయస్సు 17 సంవత్సరాలు. అయితే ఆయన కుటుంబ జీవితం వాస్తవానికి ఇప్పుడు ప్రారంభం అయింది. రెండవసారి ఆయన ఇంగ్లండుకు వెళ్లినప్పుడు భార్య రమాబాయికి ఇంటి ఖర్చులకు గాను ఇచ్చిన సొమ్ము అతి తొందరలోనే ఖర్చు అయిపోయింది. రమాబాయి చుట్టం శంకరరావు, చెల్లెలు మీరాబాయి - ఇద్దరూ చిన్నా చితకా కూలిపనులు చేసి సుమారుగా ఎనిమిది అణాలో పది అణాలో (50, 60 పైసలు) రోజుకి తెచ్చేవారు. ఆ డబ్బుల్తో రమాబాయి బజారు నుంచి కిరాణా సామాన్లు కొని తెచ్చేది. వంట వండిపెట్టి అందరినీ పోషించేది. ఇక్కట్టులలో, ఆర్థికమైన ఇబ్బందులలో ఆవిడ ఆ రోజులని గడిపింది. ఒక్కొసారి ఆ కుటుంబానికి సగం తినీ తినకా ఉండవలసి వచ్చేది. రమాబాయి ఈ స్థితిని గురించి డా॥ అంబేద్కరుకి తన ఉత్తరంలో తెలియచేసింది. ఆ రోజుల్లో ఆయనా ఆర్థికంగా ఇబ్బందులను ఎదురుకుంటున్నారు. తమ ఉత్తరంలో ఆయన అదే రాశారు - "నేనూ అగచాట్లు పడుతున్నాను. తిండికోసం మొహం వాచి ఉన్నాను. నీకు పంపించడానికి నా దగ్గర కొంచమైనా పైకం లేదు. అయినా నీ కోసం గాను ఏర్పాటు చేస్తున్నాను. ఆ ఏర్పాటు చేయడంలో ఆలస్యం గాని అయితే, నీ చేతిలో అస్సలు డబ్బన్నది ఆడకపోతే నీ నగల్ని అమ్మివెయ్యి. నేను తిరిగి వచ్చాక నీకు మళ్లీ నగలు చేయిస్తాను." ఈ ఉత్తరంలో ఆయన యశవంతుడు, ముకుందుడు చదువుల గురించి రమాబాయికి రాశారు. అస్పృశ్య సంఘ సేవకులు రమాబాయికి ఆ గడ్డు రోజుల్లో సాయం చేద్దామని అనుకున్నారు కాని రమాబాయి సహాయం తీసుకోవడానికి అంగీకరించలేదు.

సాయంత్రం వేళల్లో జనం తమతమ నల్లకంబళ్లు పరుచుకుని కూచునేవారు. బాబాసాహెబుతో అవీ ఇవీ మాట్లాడేవారు. ఆయన కూడా ఆ కార్యకర్తల మాటలని ఎంతో శ్రద్ధగా వినేవారు. సంఘంలో అలజడి అయితే పుట్టింది కాని అది పూర్తిగా ఇంకా సంఘటితం కాలేదు.

విదేశం నుంచి తిరిగి వచ్చిన తర్వాత అంబేద్కరుకు ఆయన సహచరులు అభినందన పత్రాన్ని, పర్సుని ఇవ్వడానికి ఏర్పాటు చేద్దామని అనుకున్నారు. అయితే బాబాసాహబు సన్మాన పత్రాన్ని స్వీకరించటానికి నిరాకరించారు.

పొట్టపోసుకోవడానికి గాను వకీలు వృత్తి చేపట్టాలని ఆయన అనుకున్నారు. డా॥ అంబేద్కరు 1927 జూలై నెలలో వకీలు వృత్తిలో ప్రవేశించారు. బొంబాయి హైకోర్టులో పనిచెయ్యడం మొదలుపెట్టాడు. ఆయనకి జాతి కారణంగా సొలిసిటర్ల తరపు నుండి అందవలసినంత సహకారం అందలేదు. అంచేత జిల్లా కచ్చేరీలలో కూడా ప్లీడరీ చేస్తూ ఉండేవారు. నెమ్మది నెమ్మదిగా తమ వృత్తిలో నిలదొక్కుకున్నారు. ఉన్నత విద్య ఆర్జించిన తర్వాత కూడా దాదాపు ఏడాదిన్నరపాటు నిరుద్యోగిగా ఆయన కష్టాలు పడాల్సి వచ్చింది.

అర్థశాస్త్రంలో ఆయనకి మంచి అధికారం ఉన్నాది. అందులో ఆయనకి గాఢమైన అభినివేశం ఉన్నాది. ఆ రోజుల్లో ఆయన తమ మనస్సుకి నచ్చిన అనేక అంశాల మీద ఎన్నో పుస్తకాలు రాయడానికి పథకం కూడా వేసుకున్నారు. "స్టడీజ్ ఇన్ హిస్టరీ, ఎకానమిక్సు అండ్ పబ్లిక్ లా" శీర్షికతో ఒక పుస్తకం టైపు చేసిన కాపీని ఓ కంపెనీకి అచ్చు వేయడానికి గాను ఇచ్చారు. కాని ఈ పుస్తకం అచ్చు కాలేదు.[1]

భారతదేశపు కరెన్సీ విధానంలో అవసరమైన సంస్కరణలు చేయటానికి గాను 'రాయల్ కమీషన్ ఆన్ ఇండియన్ కరెన్సీ అండ్ ఫైనాన్సు' స్థాపించ బడ్డాది. ఎడ్వర్డ్ హిల్టన్ యంగ్ ఈ కమీషనుకు అధ్యక్షుడు. నలభైమంది దగ్గర ఈ కమీషన్ వివరణ తీసుకున్నాది. అందులో డా॥ అంబేద్కరు కూడా ఒకరు. 1925 డిసెంబరు 15న డా॥ అంబేద్కరుని తమ వివరణ ఇవ్వడానికి గాను పిలిచారు. ఆ రోజున ప్రతి సభ్యుడి చేతిలోనూ డాక్టరు అంబేద్కరు రాసిన 'ఇవల్యూషన్ ఆఫ్ ప్రావెన్షియల్ ఫైనాన్సు ఇన్ బ్రిటిషు ఇండియా' గ్రంథం కాపీ ఉన్నాది !

రూపాయి విలువ పౌండ్ లెక్కని 1 షి. 4 పె. పెట్టాలా లేకపోతే 1 షి. 6 పె. పెట్టాలా అన్న అంశం యావద్దేశంలో చర్చనీయాంశం

1. ఖేర్ మోడె : భాగం - 2, పే. 95

అయింది.[1] ఈ సందర్భంలో డా॥ అంబేద్కరు రెండు వ్యాసాలు రాసి తన అభిప్రాయాల్ని ప్రకటించారు.[2] ఆయన రూపాయి విలువ 1 షి. 4 పె. పెట్టడమే దేశానికి హితకరం అని అందులో సలహా ఇచ్చారు. హెచ్.ఎల్. భాబలానీ పుస్తకం "ఇండియన్ కరెన్సీ అండ్ ఎక్సేంజి" మీద ఆయన విమర్శ కూడా రాశారు.[3]

ప్రభుత్వపు కరెన్సీ పాలసీలోని సందిగ్దస్థితి వల్లే ధరలు ఎక్కువగా పెరగటం తరగటం జరుగుతూ ఉంది. దాని ఫలితాన్ని బీదవాళ్లు అనుభవించవలసి వస్తోంది అని డా॥ అంబేద్కరు కమీషను ముందు తాము ఇచ్చిన వివరణలో ఖచ్చితంగా స్పష్టం చేసి చెప్పారు.

మధ్యస్థ విధానసభలోని తాత్కాలిక సభ్యుడు శ్రీ న.చి. కేల్కర్‌కి కూడా డా॥ అంబేద్కరు ఒక ఉత్తరం రాశారు. దాంతోపాటు మధ్యస్థ విధాన సభలో బేసిల్ బ్లేకంట్ ద్వారా సమర్పించిన కరెన్సీ పథకంలో సంస్కరణలను సూచిస్తూ తాము తయారుచేసిన ప్రోజక్టును కూడా పంపారు. విధానసభలో దానిని సమర్పించవలసినదిగా ఆయన కోరారు.

# ఎనిమిది

తమ కుటుంబ స్థితిలో కొంచెం స్థిరత్వం వచ్చింది ఫర్వాలేదు అని అనిపించగానే అంబేద్కరు సాంఘిక జీవితంలోనూ, సార్వజనీక జీవితం లోనూ అడుగుపెట్టడానికి నిశ్చయించారు. అస్పృశ్య జనం నిమిత్తం ఒక ఉద్యమాన్ని సర్వత్రా వ్యాపించేటట్టు చేయడానికి గాను సంపూర్ణంగా ఆ బరువు బాధ్యతలను ఎత్తగల సంస్థనొకదాన్ని స్థాపించాలి. దాని ద్వారా వివిధ ఉద్యమాల కార్యక్రమాలను రూపొందించే పథకాలను వేయాలి. వాటిని కార్యరూపంలో పెట్టాలి అని ఆయన గట్టిగా నిశ్చయించుకున్నారు.

1. కృ.అ. కేలూస్కర్ : జనత – ప్రత్యేక సంచిక 1933
2. సర్వెంట్ ఆఫ్ ఇండియా: తే. 9, 16 ఏప్రిలు 1925
3. అదే: తే. 25.6.1925

1924 జూలై 20 తేదీన 'బహిష్కృత హితకారిణి సభ' స్థాపించినట్టు ప్రకటించడం జరిగింది.[1] స్పృశ్య హిందూ గృహస్థులు ముగ్గురు ఈ సంస్థకి ఉపాధ్యక్షులుగా నియమించబడ్డారు. పేరు మోసిన వకీలు డా॥ సర్ చిమన్ లాల్ సీతల్‌వాద్ ఈ సంస్థకి అధ్యక్షునిగా నిర్దేశించబడ్డారు. కార్యనిర్వాహక వర్గం అధ్యక్షుడు డా॥ అంబేద్కరు. కార్యదర్శిగా మాదిగ సమాజానికి చెందిన నామదేవ్ శివతరకర్‌ని ఎన్నుకున్నారు. మిగిలిన పదహారు మంది దళిత కార్యకర్తలను ఈ సంస్థకు ధర్మకర్తలు (ట్రస్టీలు) గా నియమించడం జరిగింది.

సంస్థ తరఫున ఒక దరఖాస్తు పత్రాన్ని ప్రచురించారు.[2] ఆ రోజుల్లో దళితులకు సేవ చేస్తున్న ఇతర సంస్థల పని సంపూర్ణమైనది ఏ విధంగా కాదో, దళితులకు తమది అయిన ప్రత్యేకమైన సంస్థ స్థాపించుకోవడం ఎంత అవసరమో విపులంగా విశదీకరించి హిందూ సంఘంలో కూడా స్పృశ్యులకి అస్పృశ్యులకి మధ్య పెరిగిపోతున్న అగాధాన్ని, వైమనస్యాన్ని రూపుమాపడానికి పూర్తి పట్టుదలతో చేతనైనంత ప్రయత్నం చెయ్యవలసిందని సూచించారు. లేనట్లయితే మన రాజకీయ గమ్యాన్ని పొందడం మిక్కిలి కష్టతరం అవుతుంది. దేశంలోని ఇంత పెద్ద జన సమూహం దైన్యస్థితిలో హీనంగా కుంటుపడి ఉన్నంతవరకూ ఈ మొత్తం దేశం అంతా దీన హీనస్థితిలోనే ఉంటుంది. అన్నీ ఓ హెచ్చరిక కూడా చివరని ఉంది. అందరూ తమ సమాజం వారు, తదితర సమాజాల వారూ ఈ దళిత సంఘం ఔన్నత్యం కోసం శాయశక్తులా ప్రయత్నించాలి. అప్పుడే ఈ దేశపు దౌర్భాగ్యం సమసిపోవడం జరుగుతుంది. సమాప్తం కాగలుగుతుంది.

ఈ పత్రాలని మహారాష్ట్రలోని వివిధ స్థలాల్లో పంచారు. ఆ తరవాత సోలాపూర్ జిల్లాకి చెందిన బారశీ పట్టణంలో "బొంబాయి రాష్ట్ర బహిష్కృత పరిషత్తు" సభ జరిగింది. ఈ సభకి అంబేద్కరు స్వయంగా

1. ఖేర మోడె: భాగం - 2. పే. 107
2. ఖేర్ మోడె: భాగం - 2. పే. 107-11

విదేశాల్లో బానిసలను ఉంచుకునే ఆచారంతో అస్పృశ్యతని పోలుస్తూ డా॥ అంబేద్కరు రాసిన వ్యాసాలు ఇప్పటికీ అముద్రితాలే. డా॥ బాబా సాహబు అంబేద్కరు - "రైటింగ్సు అండ్ స్పీచెస్" ఐదవ భాగంలో "పేరలల్ క్రైసిస్" పేరుతో ఈ వ్యాసాలను సమీకరించడం జరుగుతోంది.

హాజరయ్యారు. 1924 మే 17వ తేదీన ఈ సభలో అధ్యక్షోపన్యాసం దాదాపు రెండు గంటలపాటు ఇచ్చారు. దేశపు బానిసత్వాన్ని అస్పృశ్యుల బానిసత్వాన్ని పోల్చి చూపెడుతూ దేశపు బానిసత్వం కన్నా అస్పృశ్య సంఘపు బానిసత్వ స్థితి ఎక్కువ వ్యధాభరితం అని ఆయన ఋజువు చేశారు. దీనిని రూపుమాపాలంటే అస్పృశ్యతను రూపుమాపాలి. లేకపోతే దేశాంతరం పోవాలి. అదే మరో ప్రత్యామ్నాయం అని సూచించారు. ఆయన తన ఉపన్యాసంలో వ్యవస్థీకరణ యొక్క గొప్పతనాన్ని అంగీకరింప చేయడానికి ప్రయత్నిస్తూ 'సిద్ధాంతాలని కేవలం ప్రతిపాదించడం కన్నా వాటిని అమలుపరచడం అన్నది ఎక్కువ ఫలితాలను ఇస్తుంది. దానికి అలాంటి సంస్థని స్థాపించవలసిన అవసరం ఎంతో ఉన్నాది' అని చెప్పారు. 1936లో ఆయన 'ఏ మార్గాన్ని వెళ్లడం సుఖతరం ?' అన్న శీర్షికతో మతం మార్పిడి మీద చేసిన ఉపన్యాసానికి ఈ ఉపన్యాసం క్లుప్తమైన స్కెచ్ అని చెప్పడంలో ఏం పొరపాటు లేదు.

ఆ తర్వాత ప్రతి జిల్లాలోనూ బహిష్కృత హితకారిణి సభ తరఫున బహిష్కృత పరిషత్తులను ఏర్పాటు చెయ్యడం మొదలయింది. అయితే బొంబాయి నగరంలో బాబాసాహబు ఏర్పాటు చేసిన మొదటి సభ ఉత్సాహ వర్ధకంగా జరగలేదు. ఈ సభకి ఐదారుగురు కార్యకర్తలు మాత్రమే హాజరయ్యారు. తదితరులు తమ తమ ఇళ్ల ద్వార గుమ్మాల్లోనూ, అరుగుల మీదా, వరండాల్లోనూ, చీడీల మీద కూచుని దూరం నుంచి దాని సంగతి ఏమిటో చూస్తూ వినోదం చిత్తగించారు. వెక్కిరిస్తూ కూచున్నారు. బాతాఖానీ కొడుతూ ఉండిపోయారు. అయితే ఈ సమావేశాలు తరుచూ జరుగుతూ ఉండడంతో జనం తమంతతాము రావడం మొదలుపెట్టారు. సభలో పాల్గొనడం ప్రారంభించారు. బొంబాయి రాష్ట్రపు ప్రాంతీయ బహిష్కృత పరిషత్తు మూడవ సమావేశం 1925 ఏప్రిలు 10, 11 తారీఖుల్లో బెల్గాం జిల్లా నిపాణీ ఊళ్లో జరిగింది. ఈ సమావేశంలో డా॥ అంబేద్కరు సుదీర్ఘంగా ఉపన్యాసించారు. "మహాత్మాగాంధీ హిందూ ముస్లిముల ఐక్యతకి, ఖాదీ ప్రచారానికి ఎంతగా ప్రాముఖ్యం ఇస్తున్నారో అంతగా హరిజనోద్ధరణకి యివ్వడం లేదు" అని ఆయన తమ ఉపన్యాసంలో అన్నారు. మహాత్మాగాంధీ వైకోమ్ సత్యాగ్రహ సమయంలో హరిజనుల పక్షాన మూడు సూచనలు చేశారు. ఆ సూచనలని వైకోమ్‌లోని

మత పెద్దలు ఎలా వెక్కిరించారో బాబాసాహబు చెప్తూ ఇలా అన్నారు "అస్పృశ్యతని సమర్థించే ఈ శాస్త్రాలన్నీ మొత్తం ప్రజానీకాన్నే అగౌరవ పరుస్తున్నాయి. ఈ శాస్త్రాలను ఇంతకు పూర్వమే ప్రభుత్వం నిషేధించి ఉండవలసింది." తమ భావాలను వ్యక్తీకరుస్తూ ఫ్రాన్సు, అమెరికా దేశాల్లో బానిస ఆచారానికి వ్యతిరేకంగా జరుగుతున్న ప్రజా ఆందోళనని దృష్టాం తంగా చెప్పారు.

"అక్కడ వేలాది జనం తమ ప్రాణాల్ని అర్పించారు. ఇప్పటి కొత్త తరం వారి త్యాగాల తీయని ఫలితాన్ని అనుభవిస్తోంది. ఇప్పుడు మనం త్యాగం చేస్తే దాని ఫలితం రాబోయే తరానికి లభ్యం అవుతుంది. తల్లిదండ్రులు కేవలం తమ పిల్లలకి పెళ్లిళ్ల మాత్రం చేస్తారు. కాని వారి కొడుకు తన కాళ్ల మీద తాను నిల్చున్నాడా లేదా అన్నది ఏనాడూ యోచించరు. అలాంటి తల్లిదండ్రులే తమ సంతానపు సర్వనాశనానికి కారకులు అవుతారు." ఈ విధంగా అతి స్పష్టంగా, ఖరాఖండీగా, ఉన్నది ఉన్నట్లూ వాస్తవమైన రాజకీయ, సాంఘిక సంస్కరణలకు సంబంధించిన భావాలను జంకూ గొంకూ లేకుండా సభ ముందుపెట్టి ప్రజల్లో ఆలోచననని, అవగాహనని పెంచారు. ప్రతి పాత విషయం నిఖార్సైన బంగారం అని, తాత తండ్రులు చేస్తూ వచ్చినదాన్ని సంతానం కూడా చేసి తీరాలి అని అంటే కుదరదు. ఇదిగో, ఈ ఆలోచనా విధానం సరియైనది కాదు. పాతకాలం మీదే ఆధారపడి బతకడం మంచిది కాదు. పరిస్థితులు మారగానే భావాలు కూడా మారాలి. అదీ కావలిసింది." ఈ విధంగా ఆగర్‌కర్ లాగ సాంఘిక విప్లవ భావాలను ప్రతిపాదిస్తూ ఆయన మొట్టమొదట విద్యార్థుల కోసం ఒక వసతి గృహాన్ని ప్రారంభించడానికి పథకాన్ని సమర్పించారు. ఈ హాస్టలు ఏర్పాటుని నిర్వహించే పనిని శ్రీ న.హ. బరాలే స్వీకరించారు. తర్వాత ఈ హాస్టలుని ధార్వాడకి మార్చారు.

నిపాణీ సమావేశం అయిన వెంటనే ఆయన రత్నగిరి జిల్లాలోని మాలవణ పట్టణపు అస్పృశ్యుల పరిషత్తుకి మార్గాన్ని నిర్దేశించారు. ఆ పిమ్మట ఆయన తమ కార్యకర్త శివతరకర్‌తో పాటు గోవా మీదుగా బొంబాయికి తిరిగి వెళ్లారు.

బొంబాయి విశ్వవిద్యాలయంలోని కొన్ని సమస్యలను అధ్యయనం చేసి

వాటిని పరిష్కరించడానికి గాను బొంబాయి ప్రభుత్వం 'యూనివర్శిటీ రిఫార్మ్స్ కమిటీ' నొకదానిని నియమించింది.

సర్ చిమన్‌లాల్ సీతల్‌వాద్ ఈ కమిటీకి అధ్యక్షుడు. ఈ కమిటీ అందులో ఉన్న 329 సభ్యులకు ఒక ప్రశ్న పత్రాన్ని పంపించింది. బాబా సాహబు 1924 ఆగస్టు 5వ తారీఖున ఆ 14 ప్రశ్నలకు కొన్ని ప్రశ్నలకు జవాబు పంపారు. తమ అభిప్రాయాలను వెల్లడించారు.[1]

1925 డిసెంబరు 15న 'రాయల్ కమీషను ఆన్ ఇండియన్ కరెన్సీ అండ్ ఫైనాన్సు' కి వివరణ సమర్పించారు.[2]

తర్వాత కొద్ది రోజులకే జలగాం, పనవెల్, అహమ్మదాబాదుల్లో బహిష్కృత హితకారిణీ సభ హాస్టళ్లని పెట్టింది.[3] ఈ సభ 'సరస్వతీ విలాస్' అనే మాసపత్రికని కూడా నడిపింది. అస్పృశ్య సమాజానికి చెందిన యువకుల్లో ఉన్న జూదపు దురలవాటును మాన్పించడానికి గాను మహార్ హాకీ క్లబ్‌ని ఒకదానిని కూడా ఈ సభ ప్రారంభించింది.

బొంబాయి ప్రాంతపు మా.కా. జాధవ్‌కి కలక్టరు పోస్టు ఇవ్వడానికి ఉపేక్షించడం జరిగింది. దాంతో అంబేద్కరు అభ్యర్థి తరపున ప్రభుత్వంతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపారు. వార్తాపత్రికల్లో దీనిని గురించిన చర్చని లేవనెత్తారు. ఆ ఉద్యోగాన్ని అతనికి ఇవ్వక తప్పని పరిస్థితికి ప్రభుత్వం వచ్చేలాట్టు చేశారు.

1925 మే నెలలో డా॥ సాహబు కోల్హాపూర్ వెళ్లారు. అక్కడ దర్బారులో ఆయనకి కావలిసినంత పరపతి ఉంది. డా॥ అంబేద్కరు దివానుగిరీ చేపడితే బాగుణ్ణన్న కోరిక అక్కడ దర్బారులోని సభ్యులలో చాలామందికి ఉన్నది. అయితే దివానుగా ఉండడం తనకి ఇష్టం లేదు అనే విషయాన్ని ఆయన సభ్యులకి స్పష్టంగా చెప్పారు.[4] కోల్హాపూర్ నుంచి తిరిగి వచ్చేటప్పుడు ఆయన తమ మిత్రులు దత్తోబా పవార్, గణేశాచార్య పట్టుబట్టడంతో ఓ నాటకాన్ని చూశారు. ఆ మర్నాడు వాళ్లు ముగ్గురూ మిరజ్ స్టేషన్‌లో బండి

1. రిపోర్ట్ ఆఫ్ ది కమిటీ ఆన్ యూనివర్శిటీ రిఫార్మ్స్, పు. 226-31, 1925-26
2. రిపోర్ట్ ఆఫ్ రాయల్ కమీషన్ ఆన్ ఇండియన్ కరెన్సీ అండ్ ఫైనాన్సు, వాల్యూము-2, పే. 235
3. ఖైర మోడె: భాగం - 2, పే. 122
4. అదే: పే. 128

కోసం ఎదురు చూస్తున్నారు. అక్కడున్న కొంతమంది మహార్‌లు ఆయనని గుర్తుపట్టారు. రైలు రావడానికి ఇంకా చాలా సమయం ఉన్నదని తెలుసుకుని వాళ్లు మాంసం వండించి తీసుకు వచ్చారు. ఒకే కంచంలో వడ్డించారు. డా|| సాహబు సరదాగా హాస్యంగా కబుర్లు చెపుతూ దత్తోబా పవార్, గణేశాచార్య, మహారాష్ట్రకు చెందిన మాండా అనే అంటరాని కులానికి చెందిన తక్కువవాడు - ఈ ముగ్గుర్నీ తమతో పాటు ఒకే కంచంలో తినడానికి ఒప్పించారు. ఇలాంటి సందర్భాల్లో, తనతో పాటు పనిచేసే కార్యకర్తల మనస్సుల్లో పాతుకుని ఉన్న జాతి సంబంధమైన భేదభావాల్ని పోగొట్టడానికి అంబేద్కరు ఎప్పుడూ కావాలని పనికట్టుకుని ప్రయత్నిస్తూ ఉండేవారు.

పూనా వెళ్లే రైలు రాగానే దత్తోబా పవార్, బాబా సాహబుతో పాటు పూనాకి వెళ్లారు. గణేశాచార్య వాళ్లని బండి ఎక్కించి వెళ్లారు. కరహాడ స్టేషనుకి వెళ్లేసరికి దుర్ఘటన సంభవించింది. పవార్ చెయ్యి రైలుబండి తలుపు మధ్య పడిపోవడంతో రక్తసిక్తమయింది. బాబాసాహబు సతారా స్టేషనులో ఆయనతో పాటు దిగి దెబ్బతగిలిన వేళ్లకి చికిత్స చేయించారు. తిరిగి వచ్చేటప్పుడు సతారా కాంపుకి దగ్గర టాంగా దిగి పవార్‌ని కూడా తీసుకుని కాలినడకని తమ తల్లి సమాధి ఉన్న మైదానానికి వెళ్లారు. సమాధిని చూసినప్పుడు ఆయన కళ్లంట ఏకధారగా కన్నీళ్లు పారలి పారలి వచ్చాయి.[1] తల్లి సమాధి దగ్గర అశ్రుతర్పణం చేసి పవార్‌తో పాటు టాంగాలో సతారా రోడ్డు స్టేషన్‌కి వెళ్లారు.

ఆ రోజుల్లో డాక్టరు సాహబు బొంబాయిలోని పరేల్ ప్రాంతంలో ఇంప్రూవ్‌మెంట్ ట్రస్టుకి చెందిన రెండు గదుల్లో ఉంటూ ఉండేవారు. చుట్టూరా కూలీవాళ్ల బస్తీ ఉండేది. అంచేత కాయకష్టం చేసే కూలీవాళ్ల కష్ట సుఖాలను ఆయన చాలా బాగా అర్థం చేసుకోగలిగేవారు. అంబేద్కరు ప్లీడరీ ఆఫీసు సోషల్ సర్వీస్ లీగు భవనంలోని ఓ చిన్నగదిలో ఉండేది. ఆయన ఈ గదిలో ఓ లుంగీ చుట్టబెట్టుకుని పనిచేసుకుంటూ ఉండేవారు. పెద్దపెద్ద నాయకులు ఆయనని చూడ్డానికి వస్తూ ఉండేవారు. ఓసారి కోల్హాపూర్ రాజు గారు, శ్రీమంత్ శాహూ మహారాజ్, మరోసారి ముస్లిం

1. ఖైర మోడె: భాగం - 2, పే. 129

నాయకుడు - బాగా ఒడ్డూ, పొడుగూ ఉండి చూడ్డానికి భీకరంగా కనిపించే శౌకత్ అలీ కూడా ఆయనని కలుసుకోవడానికి ఇక్కడికే వచ్చారు. ఆ సమయంలో సిడన్ హమ్ కాలేజీలో ప్రిన్స్‌పాల్ పదవికి ఖాళీ ఏర్పడ్డాది. అప్పటి విద్యామంత్రి పరాంజపేని కేలూస్కర్ గారు మహాబలేశ్వరంలో కలిశారు. డా॥ అంబేద్కరుకి ఆ ఉద్యోగం యివ్వాల్సిందిగా ఎంతో పట్టుగా చెప్పారు.[1] అయితే విద్యామంత్రి ఆ ఉద్యోగాన్ని అస్పృశ్యులయిన కారణం చేత అంబేద్కరుకి యివ్వలేకపోయారు. ఎల్ఫిన్‌స్టన్ కాలేజీలో లెక్చెరరుగా వెయ్యడానికి అంగీకారాన్ని తెలియచేశారు. అయితే అంబేద్కరు ఈ ఉద్యోగాన్ని స్వీకరించడానికి నిరాకరిస్తూ కేలూస్కర్ గారికి రాశారు - "నాకు ఇలాంటి ఉద్యోగాలు అంటే ఆసక్తి లేదు. నా సంఘాన్ని ఉద్ధరించడం కోసమే జీవితాంతం గడపాలన్నది నా తిరుగులేని నిర్ణయం." ఆయనకి ఉద్యోగం అంటే లక్ష్యం లేదు. అయినా, 'బాటలీ బాయ్ అకౌంటెన్సీ ట్రైనింగు ఇనిస్టిట్యూట్ అనే సంస్థలో జూన్ 25 నుంచి మార్చి 28 వరకు టీచరుగా ఆయన పనిచేశారు.

సామాన్యుడి జీవితానికి సంబంధించిన ప్రతి చిన్న అంశం మీదా డా॥ అంబేద్కరు దృష్టి ప్రసరించేది. 1925లో రైతుల భూమి పన్ను గురించిన ప్రశ్న తలెత్తింది. ఈ భూమి పన్నుని రైతు పండించిన పంట మీద నిర్ధారించాలా ? లేక అతని పొలం వైశాల్యాన్ని బట్టి నిర్ధారించాలా అన్న అంశం ఎక్కువగా చర్చకు వచ్చింది. ఈ విధానం గురించి మరొకసారి యోచించటానికి గాను ప్రభుత్వం లాండ్ రెవెన్యూ కమిటీని ఏర్పరిచింది. 1925 జూలై 28వ తేదీ సంచికలో కేసరి వార్తాపత్రిక 'వ్యవసాయం మీద ఎంత భూమి పన్ను ఇవ్వాలి' అన్న శీర్షికతో సంపాదకీయం రాసింది.[2] డాక్టర్ అంబేద్కరు 'రైతుల సమస్య' శీర్షికతో 18.8.1925 పత్రికలో ఓ వ్యాసం అచ్చు వేయించారు. రైతుల బాగోగుల దృష్ట్యా పైన చెప్పిన రచయిత అభిప్రాయాలు ఎంత అనుచితమైనవో తమ వ్యాసంలో ఎత్తి చూపించారు. భూమి పన్నును ఆదాయ పన్ను చట్టం కింద తీసుకు రావాలి అనికూడా ఆయన తన వ్యాసంలో సూచించారు. డా॥ సాహెబు కమిటీలోని ఒక సభ్యుడికి ఆ అభిప్రాయాలను బాగా

1. కేలూస్కర్, కృ.అ. : జనత, ప్రత్యేక అంకం, 1933
2. కేసరి : తేదీ. 10.8.1925

బోధపరిచి వాటిని కమిటీ ముందు పెట్టవలసినదిగా కోరారు. ఆ సభ్యుడు ఆయన చెప్పినవన్నీ విని - 'మిమ్మల్ని వివరణ ఇవ్వడానికి గాను కమిటీకి ఆహ్వానిస్తాం' అని చెప్పాడు. కాని ఆ కమిటీ డా॥ అంబేద్కరుని తమ వివరణ ఇవ్వడానికి పిలిపించనూలేదు. ఆయన అభిప్రాయాల గురించిన యోచన చేసి చర్చించనూ లేదు.

1926 మే నెలలో సతారా జిల్లాకి చెందిన కోరెగావ్ తహసీలులోని రహిమత్‌పుర్ గ్రామంలో సాతారా జిల్లా మహార్ పరిషత్తు సభ జరిగింది. బాబాసాహబు బొంబాయి నుంచి అక్కడికి వచ్చారు. రహిమత్‌పుర్‌లోని మహార్ వాడాలో మకాం వేశారు.[1]

మధ్యాహ్నం సమావేశం ప్రారంభం అయింది. అంబేద్కరు తమ ఉపన్యాసంలో ఇలా అన్నారు - "అస్పృశ్యులకు హక్కులు లభించిన కొలదీ వారి ఆర్థిక పరిస్థితి మెరుగుపడుతుంది. వారి ప్రగతి కూడా అధికంగా జరుగుతుంది. జె.పి. లేదూ గవర్నమెంటు ఆఫీసరు అవడం అన్నది ప్రగతిని కలగచేసే నిమిత్త కారణమూ, సాధనమూ అవుతుంది. గవర్నమెంటు ఆఫీసరు ఉద్యోగం మంజూరు చెయ్యవద్దు అనేవాళ్లు మీలో న్యూనతని కలిగిస్తున్నారు." అస్పృశ్యుల, బ్రాహ్మణేతరుల ప్రగతిని గురించి మాట్లాడుతూ ఆయన ఇలా అన్నారు - "ఈ ఉభయులూ కలిసికట్టుగా తమ ప్రగతిగాను ఉద్యమం లేవదీస్తే ఉన్నత వర్గం వారి బానిసత్వం నుండి తొందరలో బైటపడగలుగుతారు. నా మటుకు నేను మానసికంగానూ, బౌద్ధికంగానూ ఈ బ్రాహ్మణుల బానిసత్వం నుండి బైటపడ్డాను. అజ్ఞానంతో గుడ్డిగా ఉన్న నా జనానికి నేను చేతికర్రని. నా ఆధారంతో నడిచే జనం ప్రగతి మార్గంలో ముందడుగు వెయ్యగలిగితే మనల్ని విడదీసి తప్పుదారి పట్టించే శక్తులు తీసే గోతుల్లో పడమన్నా పడరు.[2]

1926లో కొడుకు రాజరత్నం చనిపోవడం అంబేద్కరుకి పెద్ద దెబ్బ. పుత్ర శోకాన్ని భరించడం ఆయనకి దుర్భరం అయింది. 1929 ఆగష్టు 16 తేదీన ఆయన దత్తోబా పవార్‌కి ఓ ఉత్తరం రాశారు. ముగ్గురు కొడుకులూ, కూతురూ చనిపోవడంతో తన బతుకు నిస్సారంగా అయిపోయిందని ఆయన అందులో తెలియచేశారు. జీవితం రుచించటం

1. ఖైర మోడె : భాగం - 2, పే. 145
2. ఖైర్ మోడె : భాగం - 2, పే. 149

మానేసింది. ఆయన కలం నిండా దుఃఖమే ! 'ఈ వ్యధ బతుకు నిస్సారమైనదన్న సత్యాన్ని అంగీకరించేటట్టుగా చేసింది"[1] అని ఆయన రాశారు.

1926 అక్టోబరులో ముగ్గురు బ్రాహ్మణేతర నాయకుల మీద పూనా వాస్తవ్యులైన బ్రాహ్మణులు పరువు నష్టం దావా వేశారు. ఆ నాయకులు - బాగడే, జేధే, జవల్కర్. బాగడే, జేధే కలిసి ఒక పుస్తకం రాశారు. "దేశ శత్రువులు" అన్న ఈ పుస్తకంలో బ్రాహ్మణ సంఘం భారతదేశాన్ని సర్వనాశనం చేసింది అని వారు ప్రతిపాదించారు. వాదుల తరఫున పేరు పొందిన ప్లీడరు ఎల్.ఎన్. బోపట్కర్ వకాల్తా పుచ్చుకున్నారు. డా|| అంబేద్కరు బ్రాహ్మణేతర నాయకుల తరఫున వాదించడానికి వకాల్తా తీసుకున్నారు. తిరుగులేని వాదంతో వారిని అపీలు కోర్టులో గెలిపించారు.

బహిష్కృత హితకారిణీ సభ ద్వారా ఆయన చేసిన సాంఘిక సేవా కార్యాల వైనం నలుగురి నోటాపడి సర్వత్రా వ్యాపించింది. బొంబాయి ప్రాంతపు గవర్నరు మాలెస్లీ విల్సను చెవిని కూడా ఈ సంస్థ కార్యకలాపాల ప్రశంసలు పడ్డాయి. ఆయన ఈ పనులను మనసారా సమర్థించారు. గవర్నరు తన తరఫు నుండి రూ. 250 చెక్కు పంపించి సహాయం కూడా చేశారు.[2] ఈ బహుమానం గురించి డా|| అంబేద్కరు 'బహిష్కృత భారత'లో ఓ వ్యాఖ్యానం రాశారు. బహిష్కృత హితకారిణి పట్ల ఆదరాభిమానాలు ప్రభుత్వానికి, పరిపాలకులకి అస్పృశ్యులకి ఉండాలి. తదితరులకి కూడా సంపూర్ణ ప్రేమాభిమానాలు కలగాలి. ఇది మాత్రమే డా|| అంబేద్కరు లక్ష్యం కాదు. వారందరూ ఈ కార్యకలాపాలతో ముడిపడి ఉంటే మరింత మేలు జరగకలదు అని ఆయన ఆశించారు.

# తొమ్మిది

1927 ప్రారంభంలోనే డా|| అంబేద్కర్ని విధానమండలి సభ్యుడిగా నియమించారు. 1927 ఫిబ్రవరి 18వ తారీఖున ఆయన ప్రమాణ స్వీకారం చేశారు. ఆయనతోపాటు మేఘవాల్ సమాజానికి చెందిన డా|| సోలంకి

1. మొటె. హో.వి: విశ్వరుద్ధ శాఖ. భాగం - 1. పత్రం క్రమసంఖ్య 217. పే. 430
2. బహిష్కృత భారత: 12.2.1927

కూడా అస్పృశ్యుల ప్రతినిధిగా నియమించబడ్డారు. 1927 ఫిబ్రవరి 24న డా॥ సాహబు బొంబాయి విధానమండలిలో తమ మొదటి ఉపన్యాసాన్ని ఇచ్చారు. అదీ బడ్జెటు మీద. ఆదాయ వ్యయాల గురించి విమర్శిస్తూ ఆ బడ్జెటు పన్నుకట్టే వారి దృష్ట్యా ఎంత అన్యాయమైనదో, ఎంత సమర్థనీయమైనది కాదో తేటతెల్లం చేశారు. ముందుచూపుతో వ్యవసాయం మీద పన్ను వెయ్యాలి అని ఆయన అన్నారు. ప్రభుత్వం నిర్బంధ విద్యని, వైద్య సదుపాయాలను కలగచేస్తుందనీ, ప్రజల అత్యవసర డిమాండ్లను పూర్తి చేస్తుందనీ, చెడు అలవాట్ల నుంచి తప్పించడానికి అవసరమైన చర్య తీసుకోవడానికి ప్రయత్నిస్తుందనీ, వీటి వలన సంస్కరణ జరగగలదని ఆశిస్తున్నానని ఆయన చివరని తెలియచేశారు. ఆయన ఇచ్చిన ఈ మొట్టమొదటి ఉపన్యాసం చాలా గొప్పగా ఉంది. ఆయన పాండిత్యం, వక్తృత్వ కౌశలం, వాదనాపటిమ, నైపుణ్యం సభ్యులందరికీ బాగా తెలిసాయి. డా॥ సాహబు మొట్టమొదటి ఉపన్యాసం విని దేహలనీ సాహబు ఎంతో ముగ్ధులయ్యారు. అభినందిస్తూ ఉత్తరం రాసి తమ యింటికి ఆల్పాహారానికి ఆహ్వానించి సత్కరించారు.

ప్రభుత్వపు మద్యపాన నిషేధ విధానాన్ని విమర్శిస్తూ ఆయన 1927 మార్చి 10వ తేదీన ఇలా అన్నారు - "దేశంలో నాటు సారా తయారుచేసే బట్టీలు అధికంగా పెరుగుతున్నాయి. కార్ఖానాలు వృద్ధి చెందుతున్నాయి. దీనికి ముఖ్యకారణం మరేం కాదు. మద్యం మీద ప్రభుత్వం విధించిన అధిక పన్నే. దేశ ఆర్థిక వ్యవస్థ గురించి యోచించేటప్పుడు, మద్యపాన నిషేధ కారణంగా సంభవించే నష్టాన్ని ఏ విధంగా పూరించగలమో, మద్యపాన నిషేధ విధానం ఏ విధంగా విజయవంతం కాగలదో అన్న అంశాలను కూడా ఆయన ఎత్తి చూపించారు.

తమ బడ్జెటు ఉపన్యాసంలో ఆయన ప్రతి మనిషికీ విద్యా సౌకర్యం కలగాలి అన్న దానికి ఎక్కువగా ప్రాధాన్యత ఇచ్చారు. దానిని బోధపరిచి చెప్తూ ఆయన ఒక గంభీరమైన విషయాన్ని ప్రతిపాదించారు. సంఘంలోని అన్ని జాతుల వారిని ఒకే స్థాయికి తీసుకు రావాలన్న సంకల్పం ఉంటే, సమానత్వం అన్నదానిని పదేపదే ప్రతిపాదించడానికి బదులు, వెనకపడ్డ వర్గం వారికి ఆర్థిక సౌకర్యాలను అందచెయ్యాలి. ఉన్నత వర్గం వారి సౌకర్యాలను తగ్గించాలి. ఈ విధమైన అత్యంత కఠినమైన పద్ధతిని

స్వీకరించాలని ఆయన తమ అభిప్రాయాన్ని వ్యక్తం చేశారు. విద్యలాంటి పవిత్రమైన జాతీయ కార్యక్రమపు భారాన్ని ముందుగానే పక్షపాత ధోరణి కల జాతివాదులైన అధ్యాపకులకు ససేమిరా అప్పగించ కూడదు. ఇదీ ఆయన అభిప్రాయం.

ఆ రోజుల్లోనే మహారాష్ట్రలో ఛత్రపతి శివాజీ మహారాజు తృతీయ శతాబ్దపు జన్మదినోత్సవం అనగా మూడవందల సంవత్సరాల పుట్టిన రోజు పండగ సంబరం జరిగింది. బదలాపూర్‌లో ఈ ఉత్సవంలో పాల్గొనడానికి గాను డా|| అంబేద్కరుకి ఆహ్వానం వచ్చింది. అక్కడ ప్రఖ్యాత సంస్కృత విద్వాంసులు పాలయే శాస్త్రి ఆయనకి స్వాగతం చెప్పారు. ఉపన్యసించ వలసినదిగా కోరారు. తమ ఉపన్యాసంలో డా|| అంబేద్కరు శివాజీ మహారాజుని యధోచితరీతిని గౌరవించి మాట్లాడిన తర్వాత "తన వీరత్వం, పరాక్రమంతో సంపాదించుకున్న స్వరాజ్యాన్ని మహారాష్ట్ర ఎందుకు పోగొట్టుకుంది ? అని ప్రశ్నిస్తూ దానికి మూలకారణాలు జాతి వైషమ్యమం, పీష్వా పట్ల ద్వేషం" అని నొక్కి వక్కాణించారు.

1927 మే 11వ తేదీన పూనాలో శ్రీ ధోరాత్ అధ్యక్షతని అస్పృశ్య సమాజపు సభ ఒకటి జరిగింది. ఈ సభలో డా|| అంబేద్కరు, శ్రీధర్ పంత్ తిలక్ గొప్పగా ఉపన్యసించారు. లోకమాన్య తిలక్ పుత్రులు శ్రీధర్ పంత్ మహారాష్ట్ర ప్రాంత పరిషత్తులో అస్పృశ్య సమస్య గురించి ఎత్తుకోక పోవడానికి బాధ్యులు న.చి. కేల్‌కర్, బోపట్‌కర్ అని తేల్చి చెప్పారు. అదే రోజు రాత్రి లోకమాన్య తిలక్ గారి గాయక్‌వాడ్ భవంతిలో సమాజ్ సమతాసంఘ్ తరపున సహపంక్తి భోజనం ఏర్పాటు చేశారు.

బొంబాయి ఠాకుర్‌ద్వారా ప్రాంతంలో కొత్తగా కట్టిన దేవాలయాన్ని అస్పృశ్యులకి తెరిచి ఉంచుతారు - అన్న ఈ ప్రకటనని 1929 జూన్‌లో వేశారు. డా|| అంబేద్కరు దేవాలయపు వ్యవస్థాపక సమితి కార్యదర్శికి ఫోను చేసి మాట్లాడారు. ఆయనను కలుసుకోవడానికి సమయం అడిగారు. శివతరకర్‌ని కూడా తీసుకుని దేవాలయానికి వెళ్లారు. చుట్టుపక్కల వారు డా|| అంబేద్కరుని గుర్తు పట్టారు. వాళ్లందరూ కలిసి ఆయన మీద విరుచుకు పడ్డారు. పరిస్థితిని చూసి తమ వ్యవహారజ్ఞానంతో, చాతుర్యంతో వాళ్లకి బోధపరిచి చెప్పారు. దేవాలయపు కార్యదర్శి పిలిస్తేనే తాను అక్కడికి వచ్చానని అన్నారు. చాలాసేపు మాటామాటా అనుకోవడం,

దెబ్బలాడుకోవడం జరిగింది. ఈ కొట్లాట తర్వాత అంబేద్కరు శివతరకర్ తిరిగి వచ్చారు. డా॥ సాహెబు గారి సమయస్ఫూర్తి, వ్యవహార దక్షత, నైపుణ్యం వల్ల ప్రాణాల మీదకి వచ్చిన ఆపద తప్పింది.

1927 జూలై మూడవ వారంలో అంబేద్కరు పూనాలోని మాంగ్‌వాడీలో ఎంతో విశిష్టమైన ఉపన్యాసం యిచ్చారు. ఈ సభలో దీనబంధు వార్తాపత్రిక సంపాదకులు శ్రీ నవలే, పా.నా. రాజభోజ్, సూబేదారు ధాడగే, సత్యశోధక్ సమాజ్ బరార్ శాఖ నాయకులు ఆనంద స్వామి మొదలైన ప్రముఖులు, ప్రసిద్ధులు ఉన్నారు. "నేను కేవలం మహార్ జాతి కోసమే పనిచేస్తానని కొందరు ఆరోపిస్తున్నారు. బొంబాయి కార్పొరేషనులో పి.బాజు అనే మాదిగ జాతి ఆటగాడికి ప్రవేశం యిప్పించడానికి గాను నేను స్వయంగా వెళ్లి ప్రయత్నించాను. నా ఇంట్లో మాంగ్ జాతి కుర్రవాణ్ణి అట్టేపెట్టుకుని పోషించాను. మా నాసిక్, జలగాం హాస్టళ్లలో అన్ని జాతులకు చెందిన అస్పృశ్య విద్యార్థులు ఉన్నారు. నా మీద వచ్చిన ఆరోపణకి సమాధానంగా వీటి గురించి చెప్పాను. ఇంతైనా ఒకవేళ మాదిగ జాతి వారు ఎవరైనా యోగ్యులైన నాయకులు ముందుకు గాని వస్తే నా నాయకత్వాన్ని వదిలెయ్యడానికి సిద్ధంగానే ఉన్నాను" అని తమ ఉపన్యాసంలో అంబేద్కరు చెప్పారు. తమ మీద తప్పుడు ఆరోపణలు చేసే వారిమీద ఎదురు దెబ్బకొట్టారు. అస్పృశ్య సమాజం యావత్తూ ఐకమత్యంతో, తన మాటల ద్వారా, చేతల ద్వారా, ఆలోచనల ద్వారా అన్యాయాన్ని ఎదురుకోవడానికి, అన్యాయాలని వ్యతిరేకించి పోరాడ్డానికి, అన్యాయాలని అడ్డుకోవడానికి ముందుకు రావాలి అని ఆయన పిలుపునిచ్చారు. డా॥ అంబేద్కరు జూలై నెలాఖరులో బొంబాయి విద్యాపీఠ్ చట్టంలో సంస్కరణ తేవడానికి గాను సమర్పించిన బిల్లు మీద చర్చలో పాల్గొని విద్యార్థులూ, కాలేజీ వారూ పరస్పరం సహకరించు కోవలసిన అవసరం ఉందని ప్రతిపాదించారు. గ్రాడ్యుయేటు, పోస్టు గ్రాడ్యుయేటు (స్నాతక, స్నాతకోత్తర) పాఠ్యక్రమాల్లో విద్యార్థుల సాంస్కృతిక వికాసం కోసం ఉభయులూ పూర్తి దీక్షతో ప్రయత్నించాలి. ఇలాంటి పారస్పరిక సహకారం ఎంతో అవసరం అని ఆయన తన ఉపన్యాసంలో నొక్కి వక్కాణించారు. విద్యాపీఠ్ సెనెటులో అస్పృశ్యుల ప్రతినిధి కూడా ఉండాలన్న తమ డిమాండును కూడా పెట్టారు.

విధానమండలి కార్యకలాపాల్లోని అతి చిన్న విషయాల గురించి ఆయన ఎంత ధ్యాసతో ఉండేవారో అంతగానూ దళిత సమాజపు సమస్యలన్నిటి మీదా ఉండేవారు. సదా అప్రమత్తంగా ఉండేవారు. ఒకసారి ఆయన దేశీయ వ్యవహారాల మంత్రిని "పోలీసు విభాగంలో అస్పృశ్యులని చేర్చుకోవడం నిషిద్ధమా ఏం ?" అని అడిగారు. హాటసన్ అనే ఆ మంత్రి 'నిషిద్ధం ఏం లేదు' అని చెప్పారు. వెంటనే అంబేద్కరు పోలీసు విభాగంలో చేర్చుకునే టప్పుడు అస్పృశ్యులని బొంబాయి పోలీసు కమీషనర్ ద్వారా కాదన్నారని ఋజువుతో సహా మంత్రి ఎదుట యదార్థాన్ని పెట్టి ఆయనని ఇబ్బందికి గురి అయ్యేటట్టు చేశారు.

## పది

ఇప్పటివరకూ డా॥ అంబేద్కరు అస్పృశ్య సమాజంలో ఆత్మాభిమానాన్ని, వ్యక్తిత్వాన్ని మేలుకొలపడానికి ప్రయత్నం చేస్తూ వచ్చారు. ఆత్మగౌరవం కలిగేటట్టు చూశారు. మానసికంగా అస్పృశ్య సమాజం ఎంత ముందుకు వెళ్లిందో అంచనా వేసుకున్నారు. అస్పృశ్యుల గుండెల్లో ఆత్మాభిమానాన్ని ఆత్మగౌరవాన్ని నాటడం అయితే జరిగింది. కాని వస్తాదుకి అఖాడాలో దిగేంతవరకూ తన శక్తి మీద తనకి నమ్మకం కుదరదు. రణరంగంలోకి దూకి ఆక్రమణ చేయనంతవరకూ మన సైనిక బలాన్ని శత్రు సైనిక బలంతో పోల్చి అంచనా వెయ్యడం కుదరదు. అల్లాగ్గానే ప్రయత్న పూర్వకంగా పోరాటంలోకి దిగిన తర్వాతే అస్పృశ్య సమాజానికి ఉన్న శక్తి ఎంతటిది అన్నదానిని పరీక్షించటానికి వీలు కలుగుతుంది. బాబా సాహబుకి ఇదే భావం కలిగింది.

సాంఘికంగా, మతపరంగా, రాజకీయంగా, మూడు దిశలగా ఎదురుకుని పోరాడ్డానికి బాబా సాహబు మహాడ్ సత్యాగ్రహానికి మూహుర్తాన్ని నిశ్చయించారు. 1923 ఆగష్టు 4వ తారీఖున శ్రీ ఎస్.కె. బోలె ఓ ముఖ్యమైన ప్రతిపాదనని చేశారు. దీని ప్రకారం మంచినీరు లభించే నదులు, చెరువులు, నూతులు, హౌజులు మొదలైన సార్వజనిక స్థలాలన్నిటిలోనూ స్కూళ్లు,

ఆస్పత్రులు, విద్యాసంస్థలు, కోర్టులు - లాంటి సార్వజనిక సంస్థల్లోనూ అస్పృశ్యుల ప్రవేశానికి ఎలాంటి నిషేధం ఉండకూడదు. బొంబాయి ప్రభుత్వం ఈ ప్రతిపాదనని తన విభాగాలన్నిటిలో అమలుపరచాలని ఆదేశించింది. కాని సరియైన తీరులో ఇది అమలు జరగటం లేదు. సాంఘిక ఆచరణలో అస్పృశ్యులని సార్వజనిక స్థలాలకి రానివ్వడం లేదు. నీళ్లు తాగే హక్కు మానవత్వపు విలువ అనీ, దానికి ఇప్పుడు చట్టం అండ ఉన్నాదని ఋజువు చేయడానికి గాను డా॥ అంబేద్కరు మహాడ్ సార్వజనిక 'చవదార్' చెరువు దగ్గర తమ మానవ హక్కుని పొంధాలని, దాంతో జనానికి చట్టపు అర్థం సరిగ్గా అవగతం కాగలదని అనుకున్నారు.

మహాడ్‌లో ఆయన ఎరగని మేర ఏదీలేదు. సైనిక ఉద్యోగాల నుంచి పెన్షను పుచ్చుకున్న మహార్ జాతికి చెందిన జనం మహాడ్‌లోనే నివాసాలు ఏర్పరచుకున్నారు. ఇక్కడ నివసిస్తున్న వారిలో చాలామందికి సాంఘిక కార్యకలాపాల గురించిన అవగాహన ఉన్నాది. ఆ చైతన్యం ఉన్నాది. దీక్షా పట్టుదలా ఉన్నాయి. ఇక్కడ తన తండ్రిగారితో కలిసి సాంఘిక సేవా కార్యక్రమాల్లో నిమగ్నులయి ఉన్న కార్యకర్తలను కూడా ఆయన బాగా ఎరుగుదురు. సైన్యంలో భర్తీ చేసుకోవడం ఆపేసిన తర్వాత మహార్ జాతికి చెందిన వారిలో చాలామంది ప్రభుత్వ సహాయానికి దరఖాస్తులు పెట్టుకున్నారు. వీళ్లందరూ అవసరం వచ్చినపుడు తమ ప్రాణాలని సైతం పణంగా పెట్టడానికి సిద్ధపడతారు అనే నమ్మకం బాబా సాహెబుకి ఉన్నాది. అంతేకాక, వాళ్లందరూ సైన్యం నుంచి రిటైరై వచ్చిన వాళ్లవడం చేత క్రమశిక్షణ వాళ్ల రక్తంలోనే ఉన్నాది. తమ నాయకుడు, అధవా తమమీద నున్న పెద్దవారు ఇచ్చిన ఆదేశాలను అవునూ-కాదూ అనకుండా తు.చ. తప్పకుండా పాటిస్తారు. ఇది ఎంతో ముఖ్యమైన అంశం. దీనినికూడా బాబా సాహెబు తమ పరిగణనలోకి తీసుకున్నారు.

మహాడ్ చెరువు విషయంలో మరొక ముఖ్యమైన అంశం ఉన్నాది. మహాడ్ మునిసిపాలిటీ ఒక తీర్మానం చేసింది - "ఈ చెరువు సార్వజనిక మైనది. దీని నీటిని అస్పృశ్యులతో పాటు జనం యావన్మందీ వాడుకో వచ్చును" - ఇదీ ఆ తీర్మానం. అంచేత ఈ ఎత్తుగడతో బాబా సాహెబుకు పోరాడ్డానికి వీలు అయింది. ఆయన ఉద్యమం చట్టాన్ని ఉల్లంఘించడానికి కాదు, చట్టాన్ని సరిగ్గా అమలు జరిపించడానికి ! స్వంత చెరువు మీద

అస్పృశ్యుల హక్కు గురించి తెలపడం సంభవమైన సంగతి కాదు. కాని మునిసిపాలిటీ పరిధిలో ఉన్న సార్వజనిక జలాశయం మీద, అదీ మునిసిపాలిటీలో ప్రతిపాదన స్వీకరించడం జరిగిన తర్వాతే, ఒక పౌరుడిగా, మనిషిగా మా హక్కుని గురించి మేం చెపుతున్నాం - ఇదీ బాబా సాహెబు గారు చేబట్టిన గట్టి పాత్ర.

1927 మార్చి 19వ తేదీన మహాడ్‌లో ఈ పరిషత్తుని ప్రారంభించడానికి నిర్ణయించారు. దీనిలో పాల్గొనడానికి గుజరాతుకి, మహారాష్ట్రకి చెందిన పల్లెపట్టుల నుంచి సుమారు ఐదువేల మంది జనం వచ్చారు. ఆ సమయానికి నీటిలో లోటు లేకుండా మొదటే స్పృశ్యుల దగ్గర నుండి 40 రూపాయల నీరు కొన్నారు. సాయంత్రం పరిషత్తు ప్రారంభం అయింది. విషయాన్ని పరిచయం చేస్తూ యిచ్చిన ఉపన్యాసంలో బాబా సాహెబు మూడు సూత్రాలను చేపట్టమని చెప్పారు. (1) చనిపోయిన జంతువుల మాంసాన్ని తినడం మానెయ్యండి. (2) ఎంగిలి భోజనాన్ని స్వీకరించకండి (3) పెద్దా చిన్నా అన్న ఊహని మనస్సులోంచి తీసిపారేసి, ఉన్నత వర్గం వారి జీవన సరళిని స్వీకరించండి. అస్పృశ్య వర్గం వారికి 'వ్యవసాయాన్ని కూడా వృత్తిగా చేపట్టండి' అని సలహా ఇచ్చారు. ఆత్మ గౌరవాన్ని మేలుకొలిపేటట్టుగా ఆయన ఉపన్యసించారు. ఆ ఉపన్యాసం ఆయన కోరుకున్న ప్రభావాన్ని జనంలో కలిగించింది.

రెండవ రోజు ఉదయం తొమ్మిది గంటలకే సమావేశం మొదలయింది. ముందస్తుగా ఈ తీర్మానాన్ని ఆమోదించారు. బహిష్కృత సమాజం చవ్‌దార్ చెరువు నుండి నీరు తెచ్చుకోవచ్చని మహాడ్ మునిసిపాలిటీ చేసిన నిర్ణయాన్ని అమలులో పెట్టాలి. ఈ లక్ష్యంతో బాబా సాహెబు ముందు నడవగా ఐదువేల మంది జనం ఊరేగింపుగా చవ్‌దార్ చెరువు గట్టుకి చేరుకున్నారు. బాబా సాహెబు, ఆ తర్వాత జనం యావన్మందీ చెరువులోని తియ్యగా రుచిగా ఉన్న మంచినీటిని తాగి తమ హక్కుని ఋజువు చేశారు. తిరిగి అందరూ సభాస్థలికి వచ్చారు. వారందరి మొహాల్లోనూ వింతైన ఉత్సాహమూ, సంతోషమూ తాండవించాయి.

ఆ తర్వాత జనం నాలుగైదు జట్టులుగా విడిపోయి ఊళ్లో తిరిగారు. అటు సనాతనులు అస్పృశ్యుల మీద ఎదురుదెబ్బ తియ్యడానికి రహస్య మంతనాలు మొదలుపెట్టారు. మతం విపత్తులో పడ్డాదని సర్వత్రా ప్రచారం

జరిగింది. దీనిగురించి అస్పృశ్యులు ఎంత మాత్రం ఊహించుకోలేక పోయారు. ఈ ఎత్తు చడీ-చప్పుడూ లేకుండా వెయ్యడం జరుగుతోంది. సనాతనుల గూండాలు ఉన్నట్టుండి అకస్మాత్తుగా భోజన మండపం మీద దాడి చేశారు. దాదాపు ఓ యాభై అరవైమంది భోజనాలు చేసేసి తమతమ ఊళ్లకి తిరిగి వెళ్లడానికి సిద్ధంగా ఉన్నారు. పంక్తి భోజనం జరుగుతోంది. ఇంతలో అకస్మాత్తుగా ఈ సనాతనుల గూండాలు దండెత్తి వచ్చి వాళ్లమీద లాఠీ వర్షం కురిపించారు. లాఠీ దెబ్బలు తిని అక్కడిక్కడ వాళ్లు స్పృహ తప్పి పడిపోయారు. గూండాలు ఊళ్లోకి వెళ్లారు. ఊళ్లో తిరుగుతూ కనిపించిన ఒకరిద్దరు ప్రతినిధులను కొట్టడం మొదలుపెట్టారు.

ఈ కొట్లాట సంగతి తెలిసీ తెలియగానే అస్పృశ్యుల ప్రతినిధులకు చిర్రెత్తుకు వచ్చింది. కోపం తారస్థాయి నందుకుంది. వాళ్లు చేసిన దానికి ప్రతీకారంగా తామూ తిరగబడి దాడిచెయ్యడానికి సన్నాహాలు మొదలు పెట్టారు. బాబా సాహబు నెత్తురు కూడా ఉడుకెత్తింది. స్పృహ తప్పి పడిపోయిన జనాన్ని, దెబ్బల బాధని సహించలేక గిలగిల కొట్టుకుంటున్న ప్రతినిధులని చూసి ఆయనకి ఒళ్లు మండింది. అయినా వివేకపు కళ్లెంతో తమ కోపాన్ని ఆయన అదుపులోకి తెచ్చుకున్నారు. తమ సహచరులను సంబోధించి ఎంతో గాంభీర్యంతో ఈ విధంగా చెప్పారు - "ఈ తరుణంలో మీరు కోపంతో ఉద్రిక్తులు కావద్దు. చెయ్యి చేసుకోవద్దు. మీరు మీ కోపాన్ని దిగమింగుకోండి. మనస్సుని అదుపులోకి తెచ్చుకుని శాంతంగా ఉండండి. మనం ఎదురుదెబ్బకి ఒడికొట్టకూడదు. వారి దెబ్బల్ని మనం సహించాలి. ఈ సనాతనులకి అహింస మహత్తు ఎంతో చూపించాలి." ఆ ఆదేశాన్ని విని పదివేల అస్పృశ్యులు శాంతం వహించి ఆ ఇక్కట్టుని ఎదురుకోవడానికి గాను సంసిద్ధులయ్యారు.

ఆఫ్ఘను యుద్ధంలోనూ, తదితర యుద్ధాల్లోనూ తమ పరాక్రమాన్ని, వీరత్వాన్ని ప్రదర్శించి విజయ పతాకం ఎగరేసి వచ్చిన సైనికులు, సేనాతుల ఎంతమందో ఈ జనంలో ఉన్నారు. వాళ్లేగాని ఎదురు దెబ్బతియ్యాలని సంకల్పించుకొని ఉండి ఉంటే, దాడిచేసి ఉండి ఉంటే, సనాతుల మీద విరుచుకుపడి ఉంటే సనాతనులని ప్రాణాలను కాపాడుకోవటానికి గాను వెన్ను చూపి పారిపోయేటట్టు చేయగలిగేవారు. ఎదర పక్షంవారు కురిపించిన రాళ్ల వానకి దెబ్బలు తగిలి ఒకరి తర్వాత

ఒకరు నేలవాలిపోయినప్పటికీ అస్పృశ్యులు తిప్పి దెబ్బకొట్టలేదు. తమ నాయకుడి ఆదేశాన్ని శిరసావహించారు. ఆయన మాటని గౌరవించడానికి గాను తమ ప్రాణాల్ని కూడా లక్ష్యపెట్టలేదు. అందరూ ఎంతో శాంతంగా సహనంతో ప్రవర్తించారు. విరోధుల మీద ఎదురుదాడి చేసి ఏ పనిని చెయ్యడం సంభవం కాదో ఆ పనిని బాబాసాహబు తమ వ్యవహార దక్షతతో శాంతికి భంగం కాకుండా చేసి చూపెట్టారు.

కొట్లాట జరిగిపోయాక పోలీసులు పోలీసులు, జిల్లా కలెక్టరు ఘటనా స్థలానికి వచ్చారు. దెబ్బలు తిన్నవారిని బాబా సాహబు స్వయంగా ఆస్పత్రిలో చేర్చారు. వైద్యం మొదలయింది. ఆ తర్వాత గూండాల మీద పోలీసులు కేసు పెట్టారు. డా॥ అంబేద్కరు పోలీసు స్టేషనులో కూచుని కొట్లాట గురించిన విచారణ జరిపించారు. 23వ తారీఖున బొంబాయి తిరిగి వచ్చారు. ఇంట్లో అంతా బెంగపెట్టుకుని ఉన్నారు. రమాబాయి అయితే రెండు రోజులబట్టి పచ్చి మంచినీళ్లైనా తాగలేదు.

అక్కడ విష్ణు కోవిలలో బ్రాహ్మణ సమాజం సభ చేసింది. ఆ సభలో 'చవదార్' చెరువుని శుద్ధి చెయ్యాలని నిర్ణయించారు. ఆ నిర్ణయ ప్రకారం 'చవదార్' చెరువులోంచి 108 బిందెల నీళ్లు తీయించారు. ఇంటింటి నుంచీ పేడ, గోమూత్రం పోగుచేసి పాలు, పెరుగు బిందెల్లో కలిపారు. మొత్తం వాటినన్నిటినీ 'చవదార్' చెరువులో పోశారు. మన దేశంలో మత పరాయణులైన వారి 'శుద్ధి' చేసే ఊహే చిత్రమైనది. మనిషి స్పర్శతో పోలిస్తే పేడా, గోమూత్రం అధిక పరిశుద్ధమైనవిగా పరిగణించబడతాయి. నాలుగు రోజుల వరకూ చెరువుకి ఎవరూ వెళ్లలేదు. ఆ తర్వాత ఊళ్లో జనం నీళ్లు తెచ్చుకోవడం మొదలుపెట్టారు. ఈ జనంలో తురక వాళ్లు ఆడా-మగా కూడా ఉన్నారు. అయితే వాళ్ల వల్ల చెరువు అపవిత్రం కాలేదు !

గూండాల మీద కేసులు నడిచాయి. 1927 జూన్ 6వ తేదీన తొమ్మిది మంది నేరస్థుల్లో ఐదుగురికి కఠిన కారాగార శిక్ష పడ్డాది. "ఈ కొట్లాట తరుణంలో హిందూయేతర అధికారులు ఉండి ఉండకపోతే విచారణ పక్షపాత రహితంగా జరగం కష్టం అయ్యేది" అని అంబేద్కరు అన్నారు.

ఈ పరిషత్తు సభ మాత్రమే కాదు. ఇది దళితుల విప్లవానికి శుభారంభం. ఈ పరిషత్తు భారతదేశపు జాతీయ జీవితంలోనూ, సాంఘిక జీవితంలోనూ

ఒక కొత్త అధ్యాయాన్ని తెరిచింది. దళిత సమాజం మొట్టమొదటిసారిగా వాస్తవమైన ఆందోళనలో పాల్గొన్నాది. అక్కడ ప్రేరణ పొందిన ప్రతినిధులు అందరూ, హాజరైన జనం అందరూ తమతమ ఊళ్లకి తిరిగి వెళ్లారు. శపథం చేసి మరీ వెళ్లారు. వాళ్లు చచ్చిన జంతువుల మాంసాన్ని తినడం మానేశారు. అడుక్కోవడమూ మానేశారు. మొట్టమొదటిసారిగా మానసిక బానిసత్వపు బేడీలు తెగిపడ్డాయి.

ఆ తర్వాత ఊరూరా పల్లెపల్లెలో అస్పృశ్యుల మీద హిందువులు చేసే అత్యాచారాలను, బహిష్కారాలను వారు ఎదురుకోవలసి వచ్చింది. యావత్ భారతదేశంలో అక్కడా అక్కడా దీనికి ప్రతిస్పందన కనిపించింది. సావర్కర్ లాంటి సంఘ సంస్కర్తలు డా॥ అంబేద్కరుని మనస్ఫూర్తిగా సమర్థించారు. మహాడ్ గ్రామంలో కూడా ధాపూరావ్ జోషి, టిప్పణీస్ కుటుంబం వారూ ఉద్యమంలో దళితుల పక్షాన పోరాటం సాగించారు.

# పదకొండు

ఆ రోజుల్లో దేశంలో వెలువడే పత్రికలు అంబేద్కరుకి వ్యతిరేకంగా ఉండేవి. తనమీద అవిచేసే వ్యాఖ్యానాలకి జవాబు ఇవ్వటానికి, తన ఉద్యమాన్ని సమాజంలో ప్రచారం చెయ్యడానికి దాని గురించిన జ్ఞానాన్ని, అవగాహనని కలగచెయ్యడానికి, జనంలో జాగృతి కలిగేటట్టు చెయ్యడానికి, ప్రేరణ కలగచెయ్యడానికి, మార్గ నిర్దేశం చెయ్యడానికి, ఇలాంటి తదితర విషయాలన్నిటికి - తనది అయిన ఒక పత్రిక నడపవలసిన అవసరం ఎక్కువగా ఉన్నది అని అంబేద్కరుకి తోచింది. అదీకాక, ఇంగ్లీషు వారి చేతినుండి పరిపాలనాధికారం భారతీయుల చేతికి వస్తే, ఆ రాజ్యంలో బహిష్కృత సమాజానికి తప్పకుండా న్యాయం జరుగుతుందన్న నమ్మకం ఆయనకి లేదు. అంచేత 'బహిష్కృత భారత' పేరుతో ఒక పక్ష పత్రికను ఆయన ప్రారంభించారు. ప్రవాసం వెళ్లడానికి పక్షులకు రెక్కలు అవసరం అయినట్టే తన ఆలోచనలను జనం వరకూ తీసుకుని వెళ్లడానికి పత్రిక అవసరం అనే నమ్మకం ఆయనకి పూర్తిగా ఏర్పడ్డాది. దాంతో ఆయన

పాత్రికేయుడిగా కలం పట్టారు. ఆయనే ఆ పత్రిక సంపాదకులు. ఈ పక్ష పత్రిక మొదటి సంచిక 1927 ఏప్రిల్ 13వ తేదీన వెలువడింది. 1929 నవంబరు 15 వరకూ 'బహిష్కృత భారత' అచ్చు అవుతూ వచ్చింది. సంచికలను వెలువరించ లేకపోయినప్పుడు కొన్నిటిని సంయుక్త సంచికలుగా కూడా అచ్చు వేశారు. తన యావత్తు కార్య భారాన్ని వహిస్తూ, ఈ పత్రికలో అధికాధిక భాగం డా॥ అంబేద్కరు స్వయంగా రాసేవారు. ఒంటిచేతిని 24-24 కాలములు ఆయనే రాయవలసి వచ్చేది.[1] ఇతర పత్రికల సంపాదకీయాలకన్నా 'బహిష్కృత భారత' సంపాదకీయం వైశిష్ట్యతతో చిత్రంగా ఉండేది. డబ్బు ఆర్జించడానికి చేపట్టిన వృత్తి కాదు. జనాన్ని జాగృతం చేయటానికి గాను ఇది తమకు తాము స్వయంగా తీసుకున్న దీక్ష. అంచేత సమాజానికి తాము తీర్చవలసిన ప్రాపంచిక ఋణాన్ని తీర్చడానికి గాను, నిష్టతో సంపూర్ణమైన కర్తవ్య దీక్షతో - ప్రతికూల పరిస్థితుల మధ్య మూడు సంవత్సరాల వరకూ బాబా సాహబు ఈ వార్తా పత్రిక జంఝాటంలో పడ్డారు. పత్రికను నడిపారు.

'చవదార్' చెరువుని పరిశుద్ధం చేశారు అన్న వార్త విన్నప్పుడు ఆయనకి అరికాలిమంట నెత్తికెక్కింది. ఈ జబ్బు మామూలు చికిత్సకు నయం అవదు అన్న సంగతి ఆయనకి బోధపడ్డాది. దాంతో గట్టి చికిత్సా సాధనాన్ని చూడాలని నిశ్చయించుకున్నారు. అందుకు కావలిసిన ఏర్పాటు చేయడం మొదలుపెట్టారు.

ఆ రోజుల్లోనే మహారాష్ట్రకి చెందిన బ్రాహ్మణేతర సమాజానికి నాయకులు జేధే, జవలకర్ ఇరువురూ డా॥ అంబేద్కరుని కలిశారు. "మీరు ఈ ఉద్యమంలో బ్రాహ్మణులను చేరనివ్వకపోయినట్లైతే బ్రాహ్మణేతరు లందరూ మీ ఉద్యమంలో వచ్చి చేరతారు" అని వారు చెప్పారు. "నా ఉద్యమం బ్రాహ్మణులకు వ్యతిరేకంగా చేస్తున్నది కాదు. బ్రాహ్మణ వాదానికి వ్యతిరేకంగా నడుపుతున్న ఉద్యమం. అందరు బ్రాహ్మణులూ దళితులకు వ్యతిరేకులు అని అనలేం. బ్రాహ్మణేతరులతోనూ పెద్దా చిన్నా, ఉన్నతులూ - నీచులూ అన్న వ్యత్యాసాన్ని పాటిస్తున్న వాళ్లు ఉన్నారు. ఆ సంగతిని మరిచిపోకండి" అని చెప్పి బాబా సాహబు వారి సలహాను తిరస్కరించారు.

1. పానదాపణి - పాత్రికేయులు డా॥ బాబా సాహబు అంబేద్కరు, పే. 64

"మన సమాజానికి పట్టిన అస్పృశ్యత అనే కళంకాన్ని కడిగి వెయ్యాలని తీవ్రంగా వాంచిస్తున్న వాళ్లందరూ సత్యాగ్రహంలో పాల్గొనడానికి "బహిష్కృత సమాజపు" ఆఫీసులో తమతమ పేర్లని నమోదు చేయించుకోండి" అని బహిష్కృత భారత 1927 జూన్ 26వ సంచికలో ఆయన పిలుపునిచ్చారు. "మతం మనిషి కోసమా ? లేక మనిషి మతం కోసమా ? మనం హిందూమతంలో ఒక భాగం అన్నది అవునా ? కాదా ? దీని తుది నిర్ణయం మనం తీసుకోవాలి" అని ఆయన తన వ్యాసంలో ప్రశ్నించారు.

ఆగష్టు 4వ తేదీన మహాడ్ మునిసిపాలిటీ ఒక కొత్త తీర్మానాన్ని ఆమోదించి, మొదట చేసిన నిర్ణయాన్ని - 'చవదార్ చెరువులోని నీరు సార్వజనికమైనదని ప్రకటించడం అయింది' అన్నదానిని రద్దు చేసింది. సెప్టెంబరు 11వ తేదీన డా|| అంబేద్కరు బొంబాయిలోని దామోదరు హాలులో ఒక సాధారణ సభని ఏర్పాటు చేశారు. భవిష్యత్తు కార్యక్రమాన్ని నిర్ణయించడానికిగాను ఒక కొత్త సమితిని ఏర్పరిచారు. ఈ సమితి డిసెంబరు 25, 26 తేదీల్లో సత్యాగ్రహం చెయ్యాలని నిర్ణయం తీసుకుంది.

1927 నవంబరు నెలలో బ్రిటిషు పార్లమెంటు లేబరు పార్టీ సభ్యుడు గార్డీ జోన్సు బొంబాయి వచ్చారు. బహిష్కృతహితకారిణీ సభ భారతీయ అస్పృశ్యులకోసం ఏం పని చేస్తున్నదీ తెలియచేయడానికిగాను జోన్సును 1927 నవంబరు నాలుగవ తేదీన డా|| అంబేద్కరు తమ ఆఫీసుకు ఆహ్వానించి తేయాకు పార్టీ ఇచ్చారు. ఆ తర్వాత బహిష్కృత హితకారిణీ సభ తరఫున దామోదర హాలులో ఆయనకి సన్మానం కూడా చేశారు.

ఈ సత్యాగ్రహం ఎలా న్యాయోచితమో చెపుతూ తమ సత్యాగ్రహ ఉద్దేశాన్ని 'బహిష్కృత భారత' నవంబరు 25వ సంచికలో డా|| అంబేద్కరు స్పష్టీకరించారు. "ఏ కార్యం ద్వారా జనం సంఘటితం అవుతారో ఆ కార్యం మంచి కార్యం. దానికోసం వ్యక్తం చేసే ఆగ్రహమే సత్యాగ్రహం. అంచేత సత్యాగ్రహం అంటే సత్కార్యం కోసం జనాన్ని కూడదీయడం అని అర్థం. 'అస్పృశ్యత' అనే అగాధం లోంచి అస్పృశ్యులు బైటికి వస్తే వారి ఆత్మకు స్వేచ్ఛ, ఆనందం లభిస్తాయి. తత్ఫలితంగా వారు తమ బుద్ధి బలంతో, శక్తియుక్తులతో పరిశ్రమల ద్వారా దేశోన్నతికి చేయూతనివ్వ గలుగుతారు.

ఆత్మరక్షణార్థం హింసని ప్రయోగించడం నిషిద్ధం కాదు అని ఆయన అనడం అనేవారు. కాని ఆయన తమ సత్యాగ్రహం కోసం అహింసా పద్ధతినే ఎన్నుకున్నారు. ఈ అంశాన్ని పరిగణనకి తీసుకోవలసిన అవసరం ఉన్నాది.

1927 అక్టోబరు 2వ తారీఖున డా॥ అంబేద్కరు పూనాలోని అస్పృశ్య విద్యార్థి పరిషత్తుకు అధ్యక్షత వహించి ప్రసగించారు. విద్యార్థులకు హితబోధ చేశారు. సమాజపు మంచి కోసం వారు పూర్తి దీక్షతో పనిచేయాలి. ఎందుకంటే వారిమీదే సమాజపు భవిష్యత్తు ఆధారపడి ఉంది.

ఆ రోజుల్లోనే లోకమాన్య బాలగంగాధర తిలక్ పుత్రులు శ్రీధర పంత్‌తో బాబా సాహబుకి మైత్రి ఏర్పడింది. ఆయన అభ్యుదయభావాలు కలవాడు. తిలక్‌వాడ్‌లో అస్పృశ్య జాతికి చెందిన అబ్బాయిల పాటల కార్యక్రమాన్ని ఆయన కేసరి ట్రస్టీల కోరికని వ్యతిరేకించి మరీ ఏర్పాటు చేశారు.

ఆ తర్వాత శ్రీధర్ పంత్ ఇచ్చిన టీ పార్టీకి బాబాసాహబు వెళ్లారు. ఇది జరిగాక సుమారు రెండు నెలల తర్వాత శ్రీధర్ పంత్ ఆత్మహత్య చేసుకున్నారు. ఆత్మహత్య చేసుకోవడానికి ముందు ఆయన బాబా సాహబుకు ఓ ఉత్తరం రాసి ఉంచారు.

పూనాలోని అహల్యాశ్రమంలో శివరామ జానబాకాబలే గారు డా॥ హెరాల్డు మేన్ రిటైరైన సందర్భంలో వీడ్కోలు సభను ఏర్పాటు చేశారు. వ్యవసాయ శాఖ సంచాలకులు. సమాజ శాస్త్రాన్ని నిశితంగా లోతుగానూ పరిశోధించి ఆయన అస్పృశ్యుల మీద వ్యాసాలు రాశారు. ఈ సభలో బాబాసాహబు ఉపన్యసించారు. “మేన్ గారు నాకు ఎన్నోవిధాల సాయం చేశారు” అని కృతజ్ఞతలు తెలియచేశారు.

ఆయన శ్రీ శి.జా. కాంబలేతో పాటు సాతారా జిల్లా కోరెగాం వెళ్లారు. అక్కడ నిర్మించబడిన “జయస్థంభానికి” కానుక ఇచ్చారు. వీరమరణం చెందిన మహార్ సైనికులకి తమ శ్రద్ధాంజలి ఘటించారు.

డా॥ పంజాబ్‌రావ్ దేశ్‌ముఖ్ బాబాసాహబు గవయీ గార్లు అమరావతీ పట్టణంలో దేవాలయ ప్రవేశపు సత్యాగ్రహం చెయ్యడానికి నిశ్చయించారు. 1927 నవంబరు 13వ తేదీన దేవాలయ ప్రవేశకమిటీ ద్వారా ఇంద్రభవన్ థియేటరులో ఒక పరిషత్తుని ఏర్పాటు చేశారు. ఈ పరిషత్తుకి బాబాసాహబు

అంబేద్కరు అధ్యక్షత వహించారు. "ఏ దేవుడూ అస్పృశ్యుల కారణంగా అపవిత్రుడు అవడు. అంచేత అస్పృశ్యుల కోసం ప్రత్యేకంగా, వేరుగా దేవాలయాలు కట్టాలన్న అభిప్రాయాన్ని మేం వ్యతిరేకిస్తున్నాం. హిందుత్వం హిందువుల కోసం అయితే అది స్పృశ్యులు అస్పృశ్యులు ఇరువురి కోసం అవుతుంది. హిందుత్వపు వికాసం కోసం మహర్షి వాల్మీకి, రోహితదాసు, చోఖామెలా మొదలైన సత్పురుషులు, సిదవాక్ లాంటి మహర్ భక్తులు చేసిన దోహదం కూడా తక్కువది కాదు." అని ఆయన తమ ఉపన్యాసంలో చెప్పారు. రెండవ రోజు సమావేశంలో పేరుమోసిన బరార్ నాయకులు జి.ఎస్. ఖాపడే సలహానుసరించి సత్యాగ్రహం తారీఖుని మూడు నెలలు ముందుకు జరిపారు. ఈ సభ జరుగుతున్న తరుణంలోనే బాబా సాహబు మిత్రులు బాలారామ్ స్వర్గస్థులయ్యారు అన్న టెలిగ్రాం అందింది. అంచేత ఆయన స్మృతికి రెండు నిమిషాలు మౌనం పాటించి బాలారామ్ గారి ఆత్మకు సభ శ్రద్ధాంజలి ఘటించింది. బొంబాయి తిరిగి రావడానికి ముందు 'మహారాష్ట్ర కేసరి' సంపాదకుడు శ్రీ చౌహాను బాబాసాహబు గౌరవార్థం టీపార్టీ యిచ్చారు.

# పన్నెండు

మహాడ్‌కి చెందిన సనాతనులు నవంబరు 17వ తేదీన వీరేశ్వర్ కోవిలలో సభచేసి సత్యాగ్రహాన్ని ఎలాగా నిరోధించాలి, వ్యతిరేకించాలి అన్న విషయాన్ని చర్చించారు. పూనాకి చెందిన శ్రీ గోఖలే, శ్రీ కరందీకర్ మొదలైన హిందూ నాయకులు 1927 నవంబరు 30వ తారీఖున సనాతనులు ఆవిధంగా చెయ్యకుండా వారిని ఆపాలని ప్రయత్నించారు. కాని ఆ ప్రయత్నం ఫలించలేదు. 1927 డిసెంబరు 12వ తేదీన సనాతనులు మహాడ్ సివిలు కోర్టులో అంబేద్కరు, శివతారకర్ మొదలైన వారిమీద నిషేధాజ్ఞలు పొందడానికిగాను దరఖాస్తు పెట్టారు. కోర్టు డిసెంబరు 14వ తారీఖున నిషేధాజ్ఞలు జారీచేస్తూ అంబేద్కరు మొదలైన వారికి నోటీసు పంపింది.

ఇటు పరిషత్తు ఏర్పాట్లు ముమ్మరంగా జరుగుతున్నాయి. ఓ ముస్లిము పెద్దమనిషికి చెందిన పొలాలు పరిషత్తు నిమిత్తం లభ్యం అయ్యాయి. అస్పృశ్యులకు ధాన్యం, కిరానా సరుకులు ఇవ్వడానికి గ్రామస్థులు నిరాకరించడంతో సత్యాగ్రహ సమితి వారికి పదిరోజుల పాటు సరిపడే బియ్యాన్ని కిరానా సామాన్లని ఇతర గ్రామాల నుంచి తేవలసివచ్చింది. డిసెంబరు 19వ తేదీకల్లా అధికారులందరూ అక్కడకి హాజరయిపోయారు. 'చవదార్' చెరువు నాలుగు వేపులా పోలీసు పారా పెట్టారు. పరిషత్తు నాయకులు, స్వయం సేవకులు, జనం సమూహాలుగా 21వ తారీఖు నుండీ రావడం మొదలుపెట్టారు.

బొంబాయి కార్యకర్తలని తీసుకుని బాబాసాహబు 'అంబాచోటు' నుండి బయల్దేరారు.[1] ఆ స్టీమరు అలీబాగ్, రేవ్ దండా, హబసాణ - రేవుల్లో ఆగుతూ సాయంత్రానికి హరేశ్వర్ రేవుకి చేరుకుంది. డా|| అంబేద్కరు ఖాదీచొక్కా దానిమీద ఓ కండువా వేసుకున్నారు. ఈ ప్రయాణంలో మధ్యమధ్య ప్రవాసులైన స్పృశ్యులు అనేకమంది ఆయనని కలుసుకోవడానికి వచ్చారు. రకరకాలుగా ప్రశ్నలు వేశారు. హరేశ్వర్‌రేవుకి స్టీమరు చేరగానే, రేవు ఒడ్డున గుమిగూడిన జనం ఆకాశం చిల్లులు పడేటట్టు జేజేలు పలికారు. అక్కడ కోల్‌మాండలా గ్రామం వారు బాబాసాహబును సన్మానించారు. రేవుకి సుమారు ఓ మైలు దూరంలో సత్యాగ్రహుల కోసం భోజనం అల్పాహారం ఏర్పాటు చేశారు.

డిసెంబరు 25వ తారీఖు ఉదయం బాబాసాహబు గారు యిచ్చిన ఉపన్యాసం ఎంతో బాగుంది. శ్రోతల మీద దాని ప్రభావం గట్టిగా పడింది. వారి మనస్సుని కదిపింది. "నాక్కావల్సింది మీ మనస్సు. ఈ పువ్వుల దండలు, ప్రీతికరమైన భోజనానికి చేసిన ఈ బ్రహ్మాండమైన ఏర్పాట్లు అన్నీ వ్యర్థమైనవే" అని ఆయన అన్నారు.

ఉదయం 8 గంటలకి తిరిగి స్టీమరు బయల్దేరింది. బందరీ మహాజాన్, బరటీ రేవుల దగ్గరకూడా ఆగి మధ్యాహ్నం 12.30 గంటలకి దాసగాం చేరుకుంది.

డా|| సాహబు 12.30 కి స్టీమరు దిగి ఘాట్‌కి చేరుకునే సమయానికి ఆ మధ్యాహ్నపు మండుటెండ వేళలోనూ మూడువేలమంది ఆయనకి స్వాగతం

1. జ్ఞానప్రకాష్ : 22-1-1928

చెప్పడానికి వచ్చి ఉన్నారు. జిల్లా మెజిస్ట్రేటు గారి ఉత్తరం అప్పుడే ఆయనకి అందింది. "మీరు మహాడ్‌లో తక్షణం కలవండి" అని ఆ ఉత్తరంలో ఉన్నాది. దాంతో డాక్టరు అంబేద్కరు, తమ మిత్రుడు సహస్రబుద్దేతో పాటు మెజిస్ట్రేటును కలవడానికి గాను మహాడ్‌కి వెంటనే బయల్దేరారు. "మీరు మీ ఆందోళన తారీఖుని ముందుకు జరపండి" అని మేజిస్ట్రేటు ఎంతో వినయంగా చెప్పారు. "నా సహచరులతో చర్చించిన తర్వాత ఏ నిర్ణయం చేసినదీ మీకు తెలియచేస్తాను," అని డాక్టరు సాహెబు ఆయనకి చెప్పారు.

దాసగాం నుంచి జనం ఊరేగింపుగా బయల్దేరి శివాజీ మహారాజ్‌కి జేజేలు పలుకుతూ మధ్యాహ్నం సుమారు రెండున్నర గంటలకి మహాడ్ చేరుకున్నారు. వారందరితో కలిసి అంబేద్కర్ పంక్తి భోజనం చేశారు. సాయంత్రం నాలుగున్నర గంటలకు పరిషత్తు కార్యకలాపాలు మొదలయ్యాయి. ఎన్నోమైళ్ల దూరం నుంచి కాలినడకని మహాడ్‌కి వచ్చిన పేద జనం, యించుమించు ఐదువేల మంది ఉంటారు. బాబాసాహెబు తన కంచు కంఠంతో ఆ జనసమూహాన్ని సంబోధించారు. అతి స్పష్టమైన మాటల్లో ఇలా చెప్పారు - "చవదార్ చెరువు నీళ్లు తాగకపోతే మన ప్రాణాలు ఏమీపోవు. అయితే తతిమ్మా జనంలాగ మనమూ మనుషులమే అని వారందరికీ చెప్పాలని మనం వాంఛిస్తున్నాం. సమానత్వానికి శ్రీకారం చుట్టడానికి ఈ సభ ఏర్పాటు చెయ్యబడ్డాది. మనం ఈ ఆందోళనకి ఇక్కడ ముహూర్తపు రాతిని పాతాలని అనుకుంటున్నాం." 1789 మే 5వతేదీన ఫ్రాన్సులోని బర్సాయ దగ్గర జరిగిన జాతీయసభతో ఈ సభని సరిపోలుస్తూ డా॥ అంబేద్కరు ఈ విధంగా చెప్పారు - "ఫ్రెంచి విప్లవం కోసం వారు ఎల్లాగ్గా సంఘటితం కావల్సివచ్చిందో అల్లాగ్గానే మనం కూడా సంఘటితం కావాల్సి ఉంది. ఆ సభలో నిర్దేశించబడిన మార్గమే హిందూ సమాజపు అభ్యుదయానికి కావలసిన అత్యవసరమైన మార్గం."

"రెండింటిని ప్రధానంగా తీసుకుని హిందూసమాజపు పునర్నిర్మాణం చెయ్యాలి. ఆ రెండూ - సమానత్వం, జాతిరహిత సమాజం అన్నవి" అని ఆయన చెప్పారు. ఆయన ఉపన్యాసంలోని తుదిభాగం ఈ రెండు విశిష్టమైన అంశాల గురించే సాగింది.

ఆయన ప్రవేశపెట్టిన మొదటి తీర్మానపు ఆశయం - "పుట్టుకరీత్యా

మనుష్యులు అందరూ సమానంగా పుడతారు. వారు చనిపోయేదాకా సమానంగానే ఉండాలి." దీనిని అస్పృశ్య మహిళ గంగూబాయి సామంత సమర్థించారు. "మనుస్మృతి" ని దగ్ధం చెయ్యాలన్న రెండవ తీర్మానం ఆమోదించబడ్డాది. 'మనుస్మృతి' ని వర్జించటానికి ఇదొక అడుగు. ఈ తీర్మానం మీద వక్తలందరూ ఎంతో గట్టిగా ఉపన్యసించారు. పరిషత్తు నాలుగు తీర్మానాలు చేసింది. ఈ తీర్మానాలని మహార్, మాంగ్‌లతో పాటు మహిళా వక్తలు సమర్థించారు. తమ అంగీకారాన్ని తెలియచేశారు. పరిషత్తు జరిగిన స్థలంలో అంతకుముందే నిర్మించిన వేదిక మీద "మనుస్మృతి" ని పెట్టి రాత్రి సుమారు తొమ్మిది గంటలకి అస్పృశ్య సమాజానికి చెందిన సాధువులు కొంతమంది యథావిధిగా దానికి దహనసంస్కారం చేశారు.[1] 'మనుస్మృతి' దహనసంస్కారం జరిగిన తర్వాత, "ఇప్పుడు భారతదేశంలో ఇహ అసమానత్వపు చట్టం చెల్లదు అని లోకం తెలుసుకోవాలి" అని అంబేద్కరు ప్రకటించారు.

ఈ ఘటన శంకరాచార్యులని కలవరపెట్టినట్టుగానే బ్రాహ్మణేతరుల నాయకులు భాస్కరరావ్ జాదవ్‌ని కూడా కలవరపెట్టింది. వారికిది గట్టి దెబ్బ. మరొక తీర్మానం ద్వారా ఈ డిమాండును కూడా నిర్ణయించారు – "అన్ని జాతులవారూ పౌరోహిత్య కార్యాన్ని నిర్వహించవచ్చును."

మర్నాడు తిరిగి పరిషత్తు కార్యకలాపాలు ప్రారంభం అయ్యాయి. డా॥ అంబేద్కరు సత్యాగ్రహులందరినీ హెచ్చరించారు – యావన్మందీ శాంతిగా సత్యాగ్రహం చెయ్యాలి. ఎంత కష్టమైనా సహించాలి. ఎలాంటి పరిస్థితి ఎదురైనా క్షమాపణ చెప్పుకుని వెనుతిరగకూడదు. మధ్యాహ్నం అయిన తర్వాత సత్యాగ్రహం చేసేవారి పేర్లు రాయడం మొదలయింది. సుమారుగా 4000 మంది తమ పేర్లు ఇచ్చారు. అందరిదీ తిరుగులేని నిర్ణయం. రోజంతా చర్చలతో గడిచింది. చర్చల మధ్యలోనే జిల్లా మెజిస్ట్రేట్ గారు

1. 'మనుస్మృతి' ని దహనం చేసే వేదికని నిర్మించడానికి ఆరుగురు కూలీలు రెండు రోజులు శ్రమపడ్డారు. ఒకటిన్నర చదరంలో ఆరు అంగుళాల లోతు గుండాన్ని చేసి దానిని మంచిగంధం కట్టెలతో నింపారు. గుండం నాలుగుమూలలా నాలుగు అడుగుల ఎత్తుని నాలుగు రాటలు పాతారు. వాటికి పువ్వులదండలు, జెండాలు కట్టి అలంకరించారు.

వచ్చారు. కోర్టులో వేసిన దావాగురించి ఆయన అందరికీ చెప్పారు. చట్టాన్ని అతిక్రమిస్తే శిక్షపడుతుందని బోధపరిచారు.

డిసెంబరు 27వ తేదీనాటికి తహతహ పరాకాష్ఠకి చేరుకుంది. "ఈ ఆందోళన హిందూసమాజంతో జరుపుతున్న ఆందోళనీ, ప్రభుత్వానికి వ్యతిరేకంగా మనశక్తిని మనం అనవసరంగా వ్యర్థం చేసుకోకూడదు" అని డా॥ సాహెబు తమ అనుయాయులకి బోధపరిచారు. "మనం మన ఆందోళనని వాయిదా వేస్తున్నాం అంటే దానర్థం మనం మన ఆందోళనని పూర్తిగా వదిలేసాం అనికాదు. మన సంఘర్షణ జరుగుతూనే ఉంటుంది." కొద్ది క్షణాలు నిశ్శబ్దం ఆవరించింది. ఆ తరువాత అందరూ లేచి నిల్చున్నారు. నలుగురు చొప్పున వరుస కట్టించి, ఆ ఊరేగింపును ఆయనే నడిపారు. చెరువు చుట్టూరా తిరిగి దాదాపు 12 గం ॥ లకు తిరిగివచ్చారు. అంతకు పూర్వం అక్కడ అస్పృశ్య మహిళల సభ ఒకటి జరిగింది. అంబేద్కరు ఆ సభని సంబోధించారు. ఆయన మహిళలకు ఇలా చెప్పారు – "మీరు పరిశుభ్రంగా ఉండండి. చదువుకున్న ఉన్నతవర్గాల మహిళలతో సమానంగా వస్త్రధారణ చెయ్యండి. భర్తగాని పుత్రుడు గాని మద్యం తాగి వస్తే ఇంటి తలుపులు మూసెయ్యండి. ఇంట్లోకి అడుగుపెట్టనివ్వకండి. మీ కొడుకు లకూ కూతుళ్లకూ సరియైన జ్ఞానాన్ని కలగచెయ్యండి." డా॥ సాహెబు గారి ఉపన్యాస ప్రభావం మహిళల మీద చాలా గట్టిగా పడింది. ఆ మర్నాటి నుంచి అనేకమంది మహిళలు ఉన్నతవర్గాలకు చెందిన మహిళలలాగ పరిశుభ్రమైన చీరలు కట్టుకుని సభాస్థలికి వచ్చారు. ఈ మహిళలందరికీ టిపణీసు, చిన్నె సహస్రబుద్దె కుటుంబాలకు చెందిన మహిళలకు చీరలు కట్టుకోవడం, శుభ్రంగా తయారయే పద్ధతిని నేర్పించారు.

సాయంత్రం అక్కడున్న మాదిగ బస్తీలో సభ ఏర్పాటు చేశారు. డా॥ అంబేద్కరు ఉపన్యాసం ఇచ్చారు. ఉపదేశించారు. రాత్రి సుమారు 10 గంటలకు ఈ సభ సమాప్తమయింది.

సత్యాగ్రహ పరిషత్తు సమాప్తం అయిన తర్వాత డా॥ అంబేద్కరు రాయగడ్ కోటని చూడాలన్న తమవాంఛను వ్యక్తం చేశారు. 28వ తేదీన భోజనాలయిన తర్వాత డా॥ అంబేద్కరు సహస్రబుద్దె, చిన్నె, ఘాటగే మొదలైనవారితో కలిసి నాతేగాం వరకూ మోటారులోవెళ్లారు. అక్కడ

నుంచి అంతమందీ కాలినడకని పాచాడ్ గ్రామం వరకూ ప్రయాణం చేశారు. రాయగడ్ కొండచరియ ప్రాంతానికి చేరుకున్నారు. అప్పుడు రాత్రి 9-30 గం॥లయింది. మర్నాడు ఉదయం అల్పాహారం తీసుకున్నాక బయల్దేరారు. 9 గం॥ లకు కోటకి చేరుకున్నారు. స్నానాలు అక్కడే చేసి పాచాడ్ గ్రామం నుంచి తెప్పించుకున్న భోజనాన్ని చేశారు. కోటలో చూడతగిన స్థలాన్ని చూసి అంతమందీ తిరిగి వచ్చారు. భోజనం చేసి రాత్రి విశ్రాంతి తీసుకున్నారు. ఉదయం డా॥ సాహెబు కొండ కిందకు దిగడానికి బయల్దేరారు. మెట్ల అంచుల వెంబడిని అక్కడా అక్కడా జట్లు జట్లుగా లారీలు పట్టుకుని వందకు పైగా జనం నిల్చుని ఉన్నారు. ఏమిటి సంగతి ? అని అంబేద్కరు అడిగారు. రాయ్‌గడ్‌కి దిగువన ఉన్న గ్రామం నుంచి సాయంత్రం మరాఠా సమాజానికి చెందిన జనం ఆయుధాలు తీసుకుని ఇళ్లదగ్గర్నుంచి బయల్దేరారు. దాంతో మహర్ జనానికి అనుమానం వేసింది. బాబాసాహబు ప్రాణాలకి ముప్పుగాని వస్తుందేమోనన్న శంక పట్టుకుంది. దాంతో వాళ్లు చుట్టుపక్కల ఊళ్లకు కబురుపెట్టారు. తమ నాయకుడి ప్రాణాలకు ముప్పురాకుండా కాపాడుకోవడానికి గాను ఊరూరునుంచీ జనం గుంపులుగా ఎంతో భక్తిభావంతో ఇక్కడికి వచ్చారు. అయితే ఆ మరాఠా జనం దుర్గానికి రానేలేదు. వాళ్లని ఇక్కడికి వెళ్లవద్దని బహుశా ఎవరో వాళ్లకి చెప్పి ఉంటారు. ఈ సంఘటన బాబాసాహబును కదిల్చివేసింది. తమ అనుయాయుల దీక్షను చూసి తమ బతుకు వ్యర్థమైనది కాదు అనే నమ్మకం ఆయనకు కలిగింది.

దుర్గం కిందకి దిగినతర్వాత రాయగడ్ ఘాటీకి చెందిన మహర్, మోచీ (మాదిగ) కుటుంబాల మహిళలు ఆయన స్వాగతార్థం హారతి పళ్లాలతో నిల్చుని ఉండడాన్ని అంబేద్కరు చూశారు. ఆ మహిళల కట్టూబొట్టూ జీవనవిధానంలో మార్పు కొట్టొచ్చినట్టు కనపడుతోంది. బాబాసాహబుకు ఆరతి ఇచ్చి మహిళలు తమ గ్రామాలకు తిరిగివెళ్లారు. డా॥ సాహెబు పాచాడ్‌కి తిరిగి వచ్చారు.[1] అక్కడ నుంచి నాతేగాం మీదుగా మోటారు కారులో బొంబాయి చేరుకున్నారు.

ఈ ప్రయాణంలో డాక్టరు సాహెబు మహాడ్‌కి దగ్గరగా ఓ చిన్న కొండలో ఉన్న బౌద్ధ గుహలని చూశారు. ఆయన తన మిత్రులకు

1. డా॥ అంబేద్కరుతో గడిపిన కొన్ని గుర్తు ఉంచుకోదగిన సందర్భాలు - సో.నా. శివతరకర్

ఈ శిధిలాల గొప్పతనం గురించి బోధపరిచారు. అక్కడ ఉన్న రాతి ధర్మాసనాల మీద ఆయన ఎవరినీ కూచోనివ్వలేదు. వాటిమీద బౌద్ధ భిక్షువులు కూచునేవారని ఆయన వారికి చెప్పారు. బౌద్ధకాలపు భిక్షువుల పవిత్ర శీలం, స్వభావం, వారి సాదాసీదా జీవితం, సాంఘిక సేవపట్ల వారిదీక్ష – అన్నిటినీ ప్రశంసిస్తూ ఆయన తమను తాము మరిచిపోయారు. వారి కళ్లనిండా నీళ్లు నిండుకు వచ్చాయి.[1]

# పదమూడు

1928 జనవరి ఒకటవ తేదీన అంబేద్కరు మహాడ్ మ్యునిసిపల్ చైర్మనుతో పాటు 'చవదార్' (మంచి రుచైన నీరుగల) చెరువుని చుట్టి వచ్చారు. ఆ చెరువుకి ఆగ్నేయ దిశని ఒక రాయి పాతి ఉన్నట్టు చూశారు. దానిమీద మహాడ్ మ్యునిసిపాలిటీ 1899 అని చెక్కి ఉంది. చెరువుకి నైరుతి భాగంలో కూడా ఓ రాయి పాతి ఉంది. అయితే దానిమీద చెక్కి ఉన్న అక్షరాలు ఈ మధ్యకాలంలోనే ఎవరో ఉలితో గోకేసినట్టుగా ఉన్నాయి.[2]

డా॥ అంబేద్కరు మహాడ్ సబ్‌జడ్జీ ఎదుట "విధించిన నిషేదాజ్ఞలకు" వ్యతిరేకంగా తిరుగులేని వాదన చేశారు. ఆయన వాదాన్ని ఖండించడం అసంభవం అయింది. ఫిబ్రవరి 23వ తేదీన జడ్జి ఆ ఆదేశాన్ని రద్దు చేశారు. మహాడ్‌లో జరిగిన విప్లవం గురించి డా॥ అంబేద్కరు ఇలా అన్నారు – "నోరూవాకీ లేని పీడిత ప్రజలు, చెప్పుకోదగిన ఏ అఘాయిత్యం జరగకుండా, అతి తక్కువ సమయంలో, సమాన హక్కులను పొందడం అన్నది ప్రపంచ చరిత్రలోనే ఎప్పుడూ జరగని, అనుకోని, ఆశించని విప్లవం" (**Fluke Revolution**).[3]

1. సంఘరచిత్ : పే. 58 ; దాంతోపాటు సహస్రబుద్దె. డా.నీ. – ఆమచే అంబేద్కర్. జనత, 1933.
2. సంఘరచిత : సహస్రబుద్దె – ఆమచే అంబేద్కర్. జనత, 1933
3. అనంతరావ్ ఉర్ఫ్ భాయీ చిత్రె : జనత ప్రత్యేక సంచిక. 1933

1928 ఫిబ్రవరి 2 వ తేదీన ఆయన బొంబాయి అసెంబ్లీలో పాల్గొన్నారు. ప్రభుత్వపు విధానాన్ని విమర్శించారు. మహిళా ఉద్యోగులకు వారి ప్రసవకాలంలో సెలవలు ఇప్పించడం గురించిన బిల్లు సమర్పించడం జరిగింది. ఆ బిల్లుని ఆయన గట్టిగా సమర్థించారు. 'దేశంలోని ఈ తల్లులకు మాతృత్వ సమయంలో నిశ్చయించబడిన ఓ గడువు కాలం విశ్రాంతి ఉండ వలసినదే" అని ఆయన అన్నారు. "ప్రభుత్వము లేదా యజమానులు ఈ మహిళల ఖర్చును భరించాలి" అనికూడా ఆయన చెప్పారు.

ఇందోర్ రాజు తుకోజీరావు హెూల్కర్ 'ధనగర్' సమాజానికి చెందినవారు. ఆయన మిస్. మిలర్ అనే ఓ క్రైస్తవ కన్యని వివాహం చేసుకోవాలని నిశ్చయించుకున్నారు. ధనగర్(పశువులను మేపుకునేవారు) సమాజం వారు ఈ వివాహాన్ని వ్యతిరేకించడానికి గాను 4-3-1928 న పరిషత్తు సమావేశం ఏర్పాటు చేశారు. డా॥ అంబేద్కరు ఆ సమావేశానికి స్వయంగా హాజరయ్యారు. పరిషత్తు సభ్యుల మనస్సుని మార్చి, ఈ వివాహానికి అనుకూలమైన తీర్మానాన్ని ఆమోదించేటట్టుగా ఆయన తన ఉపన్యాసం వల్ల చేయగలిగారు. ఆ రాత్రికి అక్కణ్ణించి ఆయన 'బారామతి' వెళ్లారు. అక్కడ అస్పృశ్యుల సభలో ఉపన్యాసం యిచ్చారు.

1928 మార్చి 19వ తేదీన ఆయన బొంబాయి విధానమండలిలో మహార్ వంశపారంపర్య కార్యభారపు చట్టంలో సంస్కరణలను సూచిస్తూ బిల్లును ప్రవేశపెట్టారు. తాతతండ్రుల నుండి వారసత్వంగా సంక్రమించిన ఈ పనిపాటులవల్ల మహార్‌జాతికి ఘటించిన దయనీయమైన స్థితినుంచి, బానిసత్వం నుంచి వారిని విముక్తుల్ని చెయ్యడానికిగాను, ప్రజలకు పూర్తిగా నేపథ్యాన్ని బోధపర్చడానికిగాను, ఓ సంవత్సరం పాటు ఆయన ఊరూరా తిరిగి సభల్లో, సమావేశాల్లో ఉపన్యాసాలు ఇచ్చారు. కరపత్రాలు పంచారు. పుస్తకాలు రాసి పంచిపెట్టారు. 'బహిస్కృతభారత' పత్రికలో మరాఠీభాషలో వ్యాసాలు కూడా అచ్చువేసారు. ఆయన తాము రాసిన ఓ వ్యాసంలో 'ములగ చెట్టు' పుక్కిట పురాణ కథని గురించి చెప్పారు

"ఒక మహార్ కుటుంబపు ఇంటి వాకిలి ముందు ఓ ములగ చెట్టు ఉంది. ఆ చెట్టు కాసిన ములగ కాడలు అమ్ముకుని ఆ వచ్చిన కొద్దిపాటి సొమ్ముతో ఆ కుటుంబం రోజు గడుకునేది. గుడిసె వదిలి ఎక్కడికీ పని చెయ్యడానికి వెళ్లేదికాదు. చాలీచాలని అర్ధాకలి భోజనంతోనే కాలం గడిపేది.

ఓసారి వాళ్లింటికి ఓ అతిధి వచ్చాడు. ఆ స్థితిని చూసి ఆ అతిధి ఆ ముంగచెట్టుని నరికి పారేశాడు. అప్పుడిక ఆ కుటుంబంలోని వారికి ఆ మర్నాడే పనికోసం వెళ్లవలసి వచ్చింది. ఈ కథ ఉద్దేశాన్ని బోధపరుస్తూ అంబేద్కరు ఇలా చెప్పారు - అదేవిధంగా తాతతండ్రులనాటి నుండి వచ్చే ఈ వృత్తి ఒక ఉచ్చు. మహార్‌జాతి ఆ ఉచ్చులో పడి బాగా బిగుసుకు పోయి ఉంది. ఆ కారణంగానే మహారుల్లో అభివృద్ధి అన్నది జరగటం లేదు. అంచేత ఈ వంశ పారంపర్య వృత్తిని వదిలేసి వాళ్లు ఉద్యోగాలు చెయ్యాలి. నెలనెలా జీతాలు వచ్చే పనులు చెయ్యాలి. ఇలాగా తాతతండ్రుల నుండి సంక్రమించిన వృత్తి నుండి వాళ్లని తప్పించి పనిలో పెట్టాలి. పనిచెయ్యడానికి వారికి ఇయ్యబడిన భూమిమీద కూడా వాళ్లకి యాజ మాన్యపు హక్కుని స్థిరపరచాలి. ఈ డిమాండును ఎత్తి ఆయన గట్టిగా నొక్కి మరీ అడిగారు.

1928 ఆగస్టు 3వ తేదీన ఆయన బొంబాయి విధానమండలిలో ఈ బిల్లుమీద రెండు గంటల సేపు మరాఠీ భాషలో ధారాప్రవాహంగా ఉపన్యసించారు. ప్రాథమిక చర్చ తర్వాత ఈ బిల్లుని సెలక్ట్ కమిటీకి (పరిశీలక సంఘం) పంపారు. బిల్లు అక్కణ్ణుంచి తిరిగి వచ్చింది. దాంట్లో ఎన్నో సవరణలు సూచించబడ్డాయి. దానిమీద తిరిగి పెద్ద చర్చ జరిగింది. ఆ కారణంగా 1929 జూలై 24వ తేదీన ఇహగత్యంతరం లేక తన బిల్లుని అంబేద్కరు ఉపసంహరించుకున్నారు.

ఏ రాజకీయ సంస్కరణలు చేసినా ముందు వాటిని పరిశీలించి దాని ప్రకారం నూతన సంస్కరణలు చేయాలి అనే చట్టాన్ని 1919 లో బ్రిటిషు ప్రభుత్వం చేసింది. దీని నిమిత్తం ఇంగ్లండు నుంచి ఇండియన్ స్టేట్యూటరీ కమీషను ఇండియాకి బయల్దేరింది. బ్రిటిషు పార్లమెంటులో వ్యవహారదక్షుడైన సభ్యుడు సర్ జాన్ సైమను ఈ కమీషనుకు అధ్యక్షుడు. ఆరుగురు సభ్యులున్న ఈ కమీషనులో ఒక్క సభ్యుడైనా భారతీయుడు లేడు. ఆ కారణంచేత భారతీయ కాంగ్రెసుతో పాటు తదితర రాజకీయ పక్షాలు అధికాధికంగా ఈ కమీషనుని బహిష్కరించాలని నిర్ణయించాయి.

1928 ఫిబ్రవరి మూడవ తారీఖున సైమను కమీషను భారతదేశానికి భారతదేశానికి వచ్చింది. అన్నిచోట్లా నల్ల జెండాలు పట్టుకుని, "సైమను కమీషను తిరిగి పో" అనే నినాదాలు మిన్నుముట్టేటట్టుగా చేసి కమీషనుకు

స్వాగతం పలికారు. అలాంటి వ్యతిరేక ప్రదర్శనలోనే లాహోరులో పోలీసు లాఠీ దెబ్బలకి పంజాబు కేసరి, దేశభక్తుడు లాలా లజపతరాయి గాయపడ్డారు. కొద్దిరోజులు అనారోగ్యంతో బాధపడి అమరవీరులయ్యారు. డా॥ అంబేద్కరుకి లాలాలజపత్‌రాయ్ పట్ల అపారమైన గౌరవం ఉంది. బొంబాయిలో ఆయన వెంటనే ఒక శోకసభని ఏర్పాటుచేశారు. ఆ మహాత్ముని ఆత్మకి శ్రద్ధాంజలి ఘటించారు.

దాదాపుగా ఈ రోజుల్లోనే ఫిబ్రవరి నెలలో అఖిలపక్ష సమావేశం జరిగింది. దానికి ముస్లిములు, క్రిష్టియన్లు, పార్శీలుతో పాటు బ్రాహ్మణేతరులను కూడా ఆహ్వానించారు. కాని డా॥ అంబేద్కరుకి గాని మరే యితర దళిత వర్గపు పార్టీకి గాని ఆహ్వానం రాలేదు. రాజ్యాంగపు డ్రాఫ్టుని సిద్ధం చేయడానికి గాను పండిత మోతీలాల్ నెహ్రూ అధ్యక్షతని ఒక కమిటీని ఏర్పరిచింది. ఈ కమిటీ నిర్మాణం మీద 'బహిష్కృత భారత' పత్రికలో అంబేద్కరు తన అభిప్రాయాలను ఈ విధంగా వ్యక్తం చేశారు - "దీనిలో దళిత సమాజం కోసం ఏ విధమైన ఏర్పాటూ చేయడం జరగలేదు. ఇందుకు భిన్నంగా ముస్లిములకు అవసరానికి మించినన్ని సౌకర్యాలు ఇయ్యబడ్డాయి." నెహ్రూ రిపోర్టు మీద ఆయన ఓ వ్యాసాన్ని చాలా తీక్షంగా రాశారు. "ఉన్నది ఉన్నట్టూ జంకూగొంకూ లేకుండా చెప్పే నా ధోరణికి ముస్లిము సమాజం వారికి నాపట్ల రోషం పెరుగుతుందని నాకు తెలుసు. అయినా దేశానికి అమంగళం జరిగినప్పుడు మా సమాజానికి కూడా అమంగళమే జరుగుతుంది అన్న భావనవల్లే ఈ ప్రమాదాన్ని నెత్తికి తెచ్చుకుంటున్నా" అని ఆయన స్పష్టంగా చెప్పారు.[1]

ఆ రోజుల్లో డా॥ అంబేద్కరు దూరదృష్టితో చెప్పిన మాటలని ఎవరూ చెవిని పెట్టుకోలేదు. ఆయన మాటలు వాస్తవం అని చివరకి తేలింది. ఈ కారణం చేతే ముస్లింలీగు బొంబాయి ప్రాంతం నుంచి సింధు ప్రాంతాన్ని వేరు చెయ్యడంలో సఫలమయింది అన్నది తేటతెల్లమయింది.

1928 మే 19వ తేదీన దాపోలీ గ్రామంలో అస్పృశ్యుల సభ చాలా పెద్దది జరిగింది. సుమారు 15 వేలమంది అస్పృశ్య సభ్యులు సభకి హాజరయ్యారు.

1928 మే 20వ తేదీన దాపోలీలో అస్పృశ్యుల ఉపనయన సంస్కారం జరిగింది. దాదాపుగా 600 మంది మహార్‌లకి యజ్ఞోపవీతాన్ని వేశారు. ఆ

1. బహిష్కృత భారత్ః 18-2-1929. పే 2

తర్వాత దాదాపు 200 మంది కునబీ సమాజానికి చెందిన జనం బాలాజీ గుణాజీ బేడ్కే నాయకత్వంతో అంబేద్కర్‌ని కలిశారు. 'ఖోతి' కి వ్యతిరేకంగా వారు లేవనెత్తిన ప్రశ్నలని ప్రభుత్వం దృష్టికి వచ్చేటట్టు చేస్తాను. దీని గురించి ఓ బిల్లుని కూడా సమర్పిస్తాను" అని వారికి అంబేద్కరు చెప్పారు. డా|| అంబేద్కరు నాయకత్వంతో ఒక ప్రతినిధి మండలిని గవర్నరును కలవడానికి పంపించాలని కూడా ఆ మీటింగులో నిర్ణయించారు.

1928 జూన్ నుంచి అంబేద్కరుకి ప్రభుత్వ లా కాలేజీలోని బదలీ స్థానంలో నియామకం వచ్చింది. ప్రతి ప్రాంతపు విధానసభా సైమనుతో పాటు పనిచేయడానికి గాను తమ తమ కమిటీలను వేసింది. బొంబాయి ప్రభుత్వపు కమిటీకి గాను డా|| అంబేద్కరుని 1928 ఆగష్టు 3వ తారీఖున ఎన్నుకోవడం జరిగింది.

యావత్‌దేశంలో సైమను కమీషను నిరసన జరుగుతోంది. సహజంగానే దాని ప్రతిస్పందన కాలేజీలో ఉండడం అన్నది తప్పనిసరియైన సంగతి. డా|| అంబేద్కరుకి ఉదయం క్లాసులో అడుగు పెడుతూనే క్లాసులోని విద్యార్థులందరూ తరగతిని బహిష్కరించారని తెలిసింది. తరగతులను బహిష్కరించి దేశపు సమస్యలు పరిష్కరించడం జరగదు అన్నది అంబేద్కరు అభిప్రాయం.

సైమను కమీషను ముందు దళిత సమాజానికి చెందిన 18 సంస్థలు తమ వివరణని సమర్పించాయి. వాటిలో 16 సంస్థలు దళిత సమాజానికి ప్రత్యేక నియోజకవర్గం ఉండాలని వాదించారు. అంబేద్కరు సంయుక్త నియోజక వర్గం కోసం, ప్రత్యేక సీట్ల (రిజర్వ్‌డ్) కోసం డిమాండు చేశారు.

బహిష్కృత హితకారిణి సభ తరపున డా|| అంబేద్కరు 1928 మే 29వ తేదీన కమీషనుకు రెండు రిపోర్టులు సమర్పించారు. ఒక రిపోర్టులో అస్పృశ్యుల విద్య నిమిత్తం బొంబాయి రాష్ట్రంలో అప్పుడున్న ప్రభుత్వం ఏఏ పనులు చేసిందో, ఏ అభివృద్ధి జరిగిందో సమీక్షిస్తూ విద్యారంగంలో సంస్కరణలకు తమ సూచనలను ఇచ్చారు.

రెండవ రిపోర్టులో విధానమండలిలోని 140 సీట్లలో 22 సీట్లు అస్పృశ్యుల కోసం కేటాయించాలని డిమాండు చేశారు.

దాంతోపాటు మంత్రిమండలిలో దళితులకు ప్రాతినిధ్యాన్ని, రాష్ట్రపు ఆదాయంలో దళితవర్గపువారి విద్యకోసం ఖర్చు చేసే అధికారం,

సైన్యంలోనూ, జలసేనలోను, యుద్ధనౌకల్లోనూ దళితులకు ఉద్యోగాలు ఇవ్వాలి అనే డిమండ్లను చేశారు.

డా|| అంబేద్కరు సైమను కమీషనుకు సహకరించి, దానివల్ల తదితర రాజకీయ నాయకుల క్రోధానికి గురి అయ్యారు. వాళ్ల క్రోధాన్ని లక్ష్యపెట్టకుండా దేశహితం కోసం తమ పనులను కొనసాగించారు. సైమను రిపోర్టు సిద్ధమయాక డా|| అంబేద్కరు దానిమీద తమ సంతకం పెట్టడమే కాక దానికి దాదాపు 60 అచ్చు పేజీల అభిప్రాయపత్రాన్ని కూడా 1929 మే 17వ తారీఖున జోడించారు.[1] ఈ పత్రాన్ని తయారుచెయ్యటంలో బి.వి. ప్రధాన్ ఆయనకి సహకరించారు. ఈ విషయం గురించి ప్రధాన్ ఈ విధంగా రాశారు - "డా|| సాహబు మూడు నెలలపాటు ఎంతగానో శ్రమించారు. తిండీ నిద్రా కూడా పట్టించుకోలేదు. ఆ రోజుల్లో రోజుకి 14, 15 గంటలు ఆయన క్రమం తప్పకుండా పనిచేస్తూ వచ్చారు. అప్పుడప్పుడు రాత్రిపూట ఓ క్షణం సేపైనా విశ్రాంతి తీసుకోకుండా రాత్రి రాత్రంతా పనిచేస్తూ ఉండేవారు."[2]

ఈ మినిట్ ఆఫ్ డిసెంట్ని (భిన్నాభిప్రాయ ప్రకటన) వ్యాఖ్యాతలు పరిశీలించినప్పుడు అందరికందరూ చెప్పరానంతగా ఆనందించారు. దానిలో వెలిబుచ్చిన భావాలు, సూచనలు జాతీయతకు, పాండిత్యానికి చక్కగా అద్దం పడుతున్నాయి. హార్నిమన్ లాంటి గండకత్తెర వ్యాఖ్యాత కూడా డా|| సాహబుని నోరారా ప్రశంసించాడు. ఇంత ప్రభావవంతమైన అధ్యయనంతో అభిప్రాయ పత్రాన్ని రాసినందుకుగాను తన హృదయపూర్వక అభినందనలు తెలిపి ధన్యవాదాలు సమర్పించారు.[3] అప్పటి సంపాదక వర్గం కూడా ఇలా రాసింది - "డా|| అంబేద్కరు వ్యక్తపరచిన అభిప్రాయాలు ఏ జాతీయ నాయకుడి హుందానైనా కోటి రెట్లు పెంచేవిగా ఉన్నాయి" ఈ విధంగా ఈ పత్రం కారణంగా నిపుణుడైన రాజకీయవేత్తగా, దేశభక్తుడిగా డా|| అంబేద్కరు పరిగణించబడ్డారు. 'వివిధ వృత్త' అనే వార్తాపత్రిక తన వ్యాసంలో ఆయనని మట్టిలో మాణిక్యంగా అభివర్ణించింది.

1. డా || బాబాసాహబు అంబేద్కరు : రైటింగ్సు అండ్ స్పీచెస్, భాగము - 2 : పే. 313-406
2. భా.వి. ప్రధాన్ : డా || అంబేద్కరు కే యశ్ కా రహస్య : జనత ప్రత్యేక సంచిక, 1933
3. అదే



1929 జూన్ 29వ తారీఖున మహర్ జాతి వారు ఒక వధువు-వరునికి వైదిక పద్ధతి ద్వారా వివాహం ఏర్పాటు చేయబడిన సందర్భంలో డాక్టరు బాబాసాహబు అంబేద్కరు



డాక్టరు బాబాసాహబు అంబెద్కరు, ఆయిన సతీమణి రమాబాయి మరియు కుటుంబసభ్యులు.



డాక్టరు బాబాసాహబు అంబేద్కరు, శ్రీ వి. శివరాజు మరియు శ్రీమతి మీరాబాయి శివరాజు 1942 లో సమతా సైనిక్ దళ్ సమ్మేళనంలో (సభలో)



1944లో డాక్టరు బాబాసాహబు అంబేద్కరు, పెరియార్ రామస్వామి

# పద్నాలుగు

'బహిష్కృత భారత' వార్తాపత్రిక నడపడానికి ఆర్థికపరమైన ఇబ్బందులు ఎక్కువయ్యాయి. ప్రజల దగ్గరనుండి చందాలు అర్థించారు. అయితే సహాయపడ్డానికి ఎవరూ ముందుకురాలేదు. 1928 జూన్ 29వ తేదీన అంబేద్కరు పర్యవేక్షణలో 'సమత' పేరుతో పక్షపత్రికను ప్రారంభించారు. 'బహిష్కృత భారత' రెండవ సంవత్సరపు మొదటి సంచిక 1928 నవంబరు 19వ తేదీన వెలువడింది. ఆ తర్వాత దగ్గరనుండి ఒక శుక్రవారం 'సమత' సంచిక వెలువడితే, తర్వాత శుక్రవారం 'బహిష్కృత భారత' అచ్చయేది. ఈ ప్రయోగం కొన్ని నెలలపాటు సాగింది. 'బహిష్కృత భారత' చివరి సంచిక 1929 నవంబరు 15వ తారీఖున అచ్చయింది. ఆ తర్వాత ఆ పత్రికను పూర్తిగా ఆపివెయ్యవలసివచ్చింది. 1928 జూలై 14వ తారీఖు నాడు 'బహిష్కృత హితకారిణి సభ' కార్యవర్గ సమితి సమావేశం జరిగింది. ఈ సంస్థను వదిలివేసి దీనికి బదులుగా 'భారతీయ భహిష్కృత సమాజ శిక్షాప్రసారక్ మండల్' (భారతీయ బహిష్కృత సమాజపు విద్యా వికాస మండలి) అనే సంస్థను ప్రారంభించాలని నిర్ణయం చేశారు. ఈ సంస్థ ద్వారా అస్పృశ్య సమాజానికి చెందిన విద్యార్థులకు విద్యార్థి వసతి గృహాలను ఏర్పరచాలన్న స్కీమును చేపట్టాలని నిర్ణయించారు. దీని నిమిత్తం ప్రభుత్వ సహాయాన్ని అర్థించారు. ఈ సంస్థ ప్రధాన సంచాలకులు డాక్టరు అంబేద్కరే! 'భారతీయ బహిష్కృత సమాజ్ సేవా సమితి' కి కూడా ఆయనే ప్రధాన సంచాలకులు. ఈ సమితికి మాదిగ సమాజానికి చెందిన శివతర్‌కర్ సెక్రటరీ. అస్పృశ్య సమాజం వారిపట్ల జరిగే సాంఘిక అన్యాయాల్ని మతపరమైన అన్యాయాల్ని నివారించడానికి ఈ సంస్థ కృషి చేస్తూ ఉండేది. ఈ పనిని సంవత్సరాల తరబడి ఈ సంస్థ చేసింది.

1928 సంవత్సరంలో బొంబాయి నగరం దాదర్ ప్రాంతంలో సార్వజనికంగా జరుపుకునే గణపతి ఉత్సవంలో స్పృశ్యులతో సమానంగా అస్పృశ్యులకు కూడా దైవదర్శనం చేసుకోవడానికి గణపతి పూజ చేసుకోవడానికి హక్కు ఉండాలని డిమాండు లేవనెత్తారు. అయితే ఉత్సవ సంచాలకులు దీనిని అంగీకరించలేదు. దాంతో ఈ ఉత్సవానికి అస్పృశ్యులని

రానివ్వకుండా చూడడానికి గాను గూండాలని నియమించారు. ఈ విషయంలో అస్పృశ్యులకి సహాయం చెయ్యడానికి పోలీసులు నిరాకరించారు. అప్పుడు గురువర్యులు కేలూస్కర్, డా॥ అంబేద్కరు అక్కడికి వెళ్లి ఆ ఉత్సవపు మండపంలోనే సభ చేశారు. సనాతనుల ధోరణిని ఖండించారు. చివరకు సాయంత్రం నాలుగు గంటలకు ఇరువర్గాల మధ్య సంధి కుదిరింది. డా॥ అంబేద్కరు కేలూస్కర్‌ని వారి ఇంటికి దిగపెట్టారు.[1]

1929వ సంవత్సరములో గత సంవత్సరపు నిర్ణయాన్ని రద్దు చేసినట్టు మండలి సెక్రటరీ తెలియచేశాడు. దాంతో అక్కడికి అంబేద్కరు, బోలె, ప్రబోధన్‌కార్ ఠాకరే వెళ్లారు. తిరిగి సంభాషణలు సాగాయి. మధ్యాహ్నం మూడుగంటల తర్వాత అస్పృశ్యులకు దేవాలయంలోకి వెళ్లడానికి ప్రవేశం లభించింది. హిందువులు అనే యోగ్యతతో అస్పృశ్యులకి గుర్తింపు దొరకాలి – అందుకుగాను ఈ ప్రయత్నాలు ఆ రోజుల్లో జరుగుతున్నాయి.

1929 ఫిబ్రవరి మొదటివారంలో బొంబాయిలోని బాలాపార్‌ఖాడి ప్రాంతంలో 'ఓ' పెద్ద సభకి డా॥ అంబేద్కరు అధ్యక్షత వహించారు. జూన్ నెలవరకూ ఆయన ఎన్నో పరిషత్తుల్లో స్వయంగా హాజరై వాటికి మార్గాన్ని సూచించారు. 1929 ఏప్రిలు 13, 14 తేదీల్లో రత్నగిరి జిల్లాకు చెందిన బహిష్కృత సమాజపు పరిషత్తు చిపలూన్ పట్టణంలో డా॥ అంబేద్కరు అధ్యక్షతన జరిగింది. దాదాపు తొమ్మిదివేల మంది సభకి హాజరయ్యారు.

"బెదిరింపులని లక్ష్యపెట్టకండి. అత్యాచారాలని ఖాతరు చెయ్యకండి. రాజ్యాంగ బద్ధమైన పద్ధతులతో ధర్మబద్ధమైన విప్లవమార్గాన్ని నడవండి" అని బాబాసాహెబు స్ఫూర్తిని కలిగించే తన ఉపన్యాసంలో చెప్పారు. మరుచటి రోజు ఉదయం అస్పృశ్యులందరికి ఉపనయన సంస్కారము చేసి యజ్ఞోపవితం వెయ్యాలని నిర్ణయించారు. యజ్ఞోపవీతధారణకి గల ఆధిభౌతిక మహిమని, ఆధ్యాత్మిక గొప్పతనాన్ని ఈ సందర్భంలో డా॥ అంబేద్కరు జనానికి బోధపరిచారు. వేదోక్తమైన హక్కులను వారు తిరిగి పొందినందుకు గాను ఆయన అస్పృశ్య సమాజాన్ని అభినందించారు.

1. జనత – ప్రత్యేక సంచిక : 1933 ; సి.కె. బోలె – డా॥ అంబేద్కరు గారి విశిష్ట సేవాకార్యాలు

ఆ తర్వాత అక్కడ ఉన్న 6471 మందికి ఉపనయన సంస్కారము జరిగాక దేవరావ్ నాయిక్ గాయత్రీ మంత్రాన్ని ఉపదేశించారు.[1] మధ్యాహ్నానంతరం అక్కడ రైతు సభ జరిగింది. 'ఖోతి" పద్ధతి వలన పొలాలకి సంబంధించిన ప్రత్యేకమైన హక్కులు ఎంత అన్యాయమైనవో, ఎంత క్రూరమైనవో డా॥ అంబేద్కరు వారికి బోధపరిచి చెప్పారు. ఈ పద్ధతిని తీసివెయ్యడానికి గాను తాము కౌన్సిలులో ఒక బిల్లు తేబోతున్నామని ఆ పద్ధతి బాగోగులను విమర్శిస్తూ తెలియచేశారు. రైతులందరూ సంఘీభావముతో వ్యవస్థీకరించ బడాలని ఆయన రైతులకు పిలుపునిచ్చారు.

మూడవ రోజున అనగా 15-4-1929 ఉదయం ధర్యేనకీలు గారు స్పృశ్యులు, అస్పృశ్యులు యావన్మందికీ, అక్కడ హాజరైన వారందరికీ, చాలా గొప్ప విందు చేశారు. ఆ తర్వాత డా॥ అంబేద్కరు బొంబాయి తిరిగివచ్చారు.

1928-29 ల్లో బొంబాయి బట్టల మిల్లుల్లో మిల్లు కార్మికుల మహాసభ చాలా గట్టి సమ్మె చేయించింది. సుమారుగా లక్షా యాభైవేల మంది మిల్లు కార్మికులు ఆరు నెలలవరకూ సమ్మె చేశారు. దళిత సమాజానికి చెందిన కార్మికుల స్థితి మరీ దిగజారిపోయి దయనీయంగా తయారయింది. బోలేతో పాటు బాబాసాహెబు కార్మికుల వాడలో, తన ప్రాణాలకు ముప్పు కలిగే స్థితి ఉన్నా, దేన్నీ లక్ష్యపెట్టకుండా తిరుగుతూ అస్పృశ్య కార్మికులని పనిలోకి వెళ్లమని సలహా యిచ్చారు. మిల్లు కార్మికుల సంఘం తిరిగి రెండవసారి 26.4.1929 న సమ్మెకి పిలుపు యివ్వడంతో బాబాసాహెబుకి ఎంతో విచారం వేసింది. "రోగి స్థితిని మరింత దిగజారేటట్టు చేయకూడదు. రోగం పోయేటట్టు చెయ్యడం అవసరం" అని ఆయన అన్నారు. కామ్రేడు పరూలేకర్, బాఖలే, మరో ఇద్దరు కార్మిక నాయకులతో ఆయన ఒక సభని ఏర్పాటు చేశారు. ఆ కార్మికసభల్లో సమ్మె విరమించవలసినదిగా వారికి చెప్పారు.

దాదాపు ఈ రోజుల్లోనే నాసిక్ జిల్లాకు చెందిన తిగావ్ అన్న స్థలంలో అస్పృశ్యులు జరుపుకున్న ఒక పెద్ద సభలో ఆయన మాట్లాడుతూ 'మీరు మానవత్వం కోసం పోరాడాలి' అని ఉపదేశించారు. 'మతం మార్పిడి ఏమీ

1. జ్ఞాన ప్రకాశ్ః 28-4-1929

చెడు చేష్ట కాదు" అని జలగాం చేరిన తర్వాత ఆయన అస్పృశ్యులకి చెప్పారు. 1929 మే 29 ని ఆయన ఆకోలా వెళ్లి అక్కడ కూడా ఉపన్యాసం యిచ్చి బొంబాయికి తిరిగి వచ్చారు.

'మేము హిందూమతంలో అవిభాజ్యమైన భాగం' అని ఋజువు చెయ్యడానికి ఆయన చాలాసార్లు ప్రయత్నించారు. 1929 జూన్ 29న తన సహచరుడు తోటి కార్యకర్త ఆడరేకర్ కొడుకు పెళ్లిని వైదిక పద్ధతిని చేయించారు. ఈ శుభకార్యానికి శ్రీ వైదే అనే బ్రాహ్మణుడు పౌరోహిత్యం వహించాడు. ప్రసిద్ధ నాటకకర్త ఆచార్య పి.కె. అత్రె, గోదూతాయీముంగీని వివాహం చేసుకున్నప్పుడు డా|| అంబేద్కరు తమ 'బహిష్కృత భారత' పత్రికలో ఆయనని అభినందిస్తూ వ్రాశారు. ఆయన ఇలాగా ఎప్పుడూ ముందడుగు వేసే ఆలోచనా విధానాన్ని సమర్థిస్తూ ఉండేవారు. అభ్యుదయ కరమైన ఏ సంఘటనలకైనా సరే ఆయన ఎల్లప్పుడూ స్వాగతం పలకడానికి సిద్ధంగా ఉండేవారు.

1929 ఆగష్టు నెలలో డిస్ట్రిక్టు సెషన్సు కోర్టులో దావా వాదించటానికి గాను అంబేద్కరు రత్నగిరి పట్టణానికి వెళ్లవలసివచ్చింది. అక్కడ చాకలి ఆయన అస్పృశ్యులైన కారణంచేత ఆయన సూటుని ఉతకడానికి నిరాకరించాడు. అయితే అక్కడ శ్రీ వి.గో. శేట్యే గారి ఇంట్లో ఆయనకి స్వాగతం పలకడానికి సభ ఏర్పాటు చేశారు. అందులో ఆయన పాల్గొని బొంబాయికి తిరిగివచ్చారు.

ఆ తర్వాత 'స్టార్ట్ కమిటీ' తోపాటు డా|| అంబేద్కరు బెల్గాం, ఖాన్‌దేశ్, నాసిక్ జిల్లాలలో పర్యటించడానికి వెళ్లారు. తన కొడుకుని స్కూలులో తరగతి బైట కూర్చోపెడుతున్నారని ఒక అస్పృశ్యుడు చేసిన ఫిర్యాదు విని, దాన్నిగురించి కనుక్కోవడానికి డా|| అంబేద్కరు వెళ్లారు. అక్కడ స్కూలు ప్రధానోపాధ్యాయుడు అంబేద్కరుని స్కూల్లోకి రానివ్వలేదు. ఇలాంటి చేదు అనుభవాల కారణంగానే డా|| అంబేద్కరుకి హిందూమతం పట్ల విరక్తి కలిగి ఆయన మనస్సు విరిగిపోతూ వచ్చింది.

'చాలీస్‌గాం' లోని అస్పృశ్యులు డా|| సాహెబుకు హృదయపూర్వకంగా స్వాగతం పలికారు. తమ బస్తీకి తీసుకువెళ్లడానికి టాంగాని తెప్పించారు. అయితే ఏ టాంగావాడూ ఆయనని తీసుకువెళ్లడానికి ముందుకు రాలేదు. చివరకి ఒక అస్పృశ్యుడు టాంగా తోలడానికి సిద్ధపడ్డాడు. అంబేద్కరు టాంగాలో కూచున్నారు. అయితే గుర్రం వశం తప్పింది. డాక్టరు సాహెబు

రాయిమీద పడిపోయారు. ఆ పడిపోవటం హఠాత్తుగా పడిపోయేరేమో ఆయన కుడికాలు విరిగిపోయింది. గట్టి దెబ్బతగలడం వల్ల రెండునెలల పాటు ఆయన మంచం ఎక్కారు. ఈ ఆపద 23-10-1929 న కలిగింది. డిసెంబరు 1929 వరకూ ఆయన అనారోగ్యంగానే ఉండవలసి వచ్చింది.[1]

'బాంబే క్రానికల్' లో పార్సీ పురోహితులమీద వ్యంగ్యాత్మకమైన వ్యాసం అచ్చయింది. డా॥ అంబేద్కరు 8-12-29 బాంబే క్రానికల్‌లో **'Wanted an Anti-priest Crapt Association'** అన్న శీర్షికతో ఓ వ్యాసం రాశారు. హిందూ సమాజంలో కూడా పురోహితవర్గం ఎంత బలవత్తర మైనదో, మహత్తరమైనదో, పుట్టిన లగాయితు కన్ను మూసేటంతవరకూ ఆ వర్గం ఎల్లాగ్గా నెత్తెక్కి స్వారీ చేస్తుందో వివరిస్తూ విశిష్టమైన వివేచన చేశారు. అన్నివర్గాల వారికి పురోహిత వ్యవస్థ అవసరం ఎలా ఉంటుందో ప్రతిపాదించారు.

దేవాలయ ప్రవేశ సత్యాగ్రహాన్ని పెద్ద ఎత్తున అన్నిచోట్లా మొదలుపెట్టి అస్పృశ్యులని హిందూ సమాజంలో కలిసిపోయేటట్టు చేయవచ్చు. ఈ ఉద్దేశంతో ప్రేరితులై డా॥ అంబెద్కరు ఉద్యమాన్ని ప్రారంభించారు. ఈ ఉద్యమంలో సుమారు ఓ లక్షమంది పాల్గొంటారన్నది ఆయన అంచనా. ఆయన అదే ఆశని వ్యక్తం చేశారు.[2] ఎంపికచేసిన కొన్ని స్థానాల్లో ఈ సత్యాగ్రహం చెయ్యాలి అని తన ఇంటర్వ్యూలో ఆయన చెప్పారు. "స్పృశ్య సమాజం అత్యాచారం చేస్తే మేమూ అదే మార్గాన్ని చూపడతాం. లేకపోతే సామరస్యాన్ని వదిలేసి ఎలాంటివారైతే అలాంటి ప్రవర్తన - అనే పంథాని అనుసరిస్తాం." ఈ సత్యాగ్రహానికి స్పృశ్యులు, అస్పృశ్యులు అని వేరువేరు జట్లులను ఏర్పరచడానికి నిశ్చయించారు.

ఆ రోజుల్లోనే బాయీ పట్టణపు ప్రఖ్యాత పండితుడు మహాదేవ శాస్త్రి దివేకర్ బొంబాయిలో డా॥ అంబేద్కరుని కలిశారు. 'నిజమైన హిందువులం మేమే. మత సంబంధమైన రహస్యాలు మాకే ఎక్కువగా అర్థం అవుతాయి. మేం స్వతంత్ర జాతీయులం"[3] అని దివేకర్ శాస్త్రి ప్రశ్నలకు సమాధానం

1. కీర్: 143
2. జ్ఞాన ప్రకాశ్: 27-11-1929
3. జ్ఞాన ప్రకాశ్: 1 - 12 - 1929

చెపుతూ డా॥ అంబేద్కరు అన్నారు. "మీరు అంటున్నదానికి అర్థం ఏమిటి ?" అని దివేకర్ ప్రశ్నించారు. "రాజకీయ దృష్టితో ప్రత్యేకనియోజక వర్గం, ప్రత్యేక సదుపాయాలు, సౌకర్యాలు - యిల్లాగ్గా 'ప్రత్యేక' శబ్దాన్ని నేను ఉపయోగించాను. హిందూ సమాజంలో సహపంక్తి భోజనాలు, ఒకరితో ఒకరి వివాహాలు, అంటే పరస్పర వైవాహిక సంబంధాలు, భోజన సంబంధాలు ఉండాలి. ఆలయప్రవేశం అస్పృశ్యతా నివారణకి మొదటిమెట్టు. సత్యాగ్రహం ఆలోచనల్లో మార్పు తేవడానికి మేం వేసిన మొదటి అడుగు అన్నిటా సమానత్వాన్ని స్థాపించాలి. నేను ప్రజాస్వామ్యవాదిని. కాని ఒక సమాజం రెండో సమాజం మీద అత్యాచారం చేస్తే నేను దానిని గట్టిగా వ్యతిరేకిస్తాను" అని డా॥ అంబేద్కరు వెంటనే జవాబు ఇచ్చారు.

# పదిహేను

ధార్వాడ్‌లో 28-12-29 నాడు ధార్వాడ్ జిల్లా బహిష్కృత సమాజపు మొదటి సభ జరిగింది.[1] ఈ సభకి మహర్, చమార్ (మాదిగ), మాంగ్, చం ‌ ల్, భంగీ, ఢోర్, తదితర అస్పృశ్య జాతులవారు వేలసంఖ్యలో హాజరయ్యారు. వారితోపాటు అక్కడ ఉన్న స్పృశ్య సమాజం జనం కూడా చెప్పుకోదగినంత అధికంగా హాజరయ్యారు.

"విద్యాంసుడైన వాడుకూడా అబద్ధాల కోరు, కపటి, జోక్యం చేసుకునేవాడూ, లొడబిడలవాడు, దుర్గుణాల పుట్టా అవొచ్చు" అంటూ విద్యాంసులుగా చెలామణీ అయేవాళ్లని వర్ణిస్తూ ఈ సభలో ఉపన్యసిస్తూ డా॥ అంబేద్కరు చెప్పారు. ఆయన దృష్టిలో అస్పృశ్యతా నివారణకి మహత్తరమైన మార్గం రాజకీయ పరిపాలనా శక్తిని చేతుల్లోకి తెచ్చుకోవడమే. "జీవనవిధానపు స్థాయిని సంస్కరించడం లాంటి విషయాలు మనజాతికి రాజకీయ పాలన రావడం మీద ఆధారపడినవి" అని ఆయన అన్నారు.

1. జ్ఞాన ప్రకాశ్ : 1 - 1 - 1930

"బట్టలు కట్టుకునే పద్ధతి లేదా వేషభాషలు మాత్రమే వృద్ధి చెందితే సంస్కరణ జరగదు. నిజమైన అభ్యుదయం రాజకీయ అధికారం చేతికి వచ్చినప్పుడే సంభవం అవుతుంది. బ్రిటిషు పాలనలో సాంఘిక బహిష్కారాలను రూపుమాపగలిగే చట్టమేలేదు. అలాంటి చట్టం చేయనూ బడదు. అంచేత మనమందరం స్వరాజ్యవాదులం అవాలి. నేను బ్రిటిషు ప్రభుత్వాన్ని నమ్మను. స్వయంగా మనల్ని మనం ఉద్ధరించుకోవాలి. బ్రిటిషు ప్రభుత్వం పూర్తిగా ఆచరణ శీలమైనది. మొదట మనం స్వరాజ్యానికి యోగ్యులుగా తయారవాలి. దానికోసం అవసరమైన జ్ఞానాన్ని మనం ఆర్జించాలి." - హెచ్చరిస్తూ ఈ విషయాల్ని వివరించి డా॥ అంబేద్కరు 'బహిష్కృత హితకారిణి సభ' తరపున నడుపుతున్న విద్యార్థుల హాస్టలుకి సామూహికంగా సహాయం చెయ్యమంటూ పిలుపునిచ్చారు.

బొంబాయిలో 30-1-1930 తేదీన లోవర్ పరేల్ ప్రాంతంలో బహిష్కృత సమాజం వారిది గొప్ప సభ జరిగింది. ఈ సభకి తొమ్మిది - లేదా పదివేల మంది జనం వచ్చారు. "ఊరూరా ఎలా అయితే మహారుల గూడెం, మాంగుల గూడెం చండాలుల గూడెం అని జాతుల ప్రకారం ప్రత్యేకంగా వేరువేరు గూడేలు ఉన్నాయో అల్లాగ్గానే బొంబాయి నగరంలోనూ వేరువేరు బస్తీలు ఉన్నాయి. ఈ వేర్పాటువాదాన్ని చిన్నాభిన్నం చెయ్యాలి." అని డా॥ సాహబు భిన్న భిన్న జాతుల అస్పృశ్యులను సంబోధిస్తూ చెప్పారు. బహిష్కృత సమాజపు నవ యువకులు ఈ దిశలో పనిచేస్తున్నట్టు తెలుసుకుని ఆయన సంతోషాన్ని వెలిబుచ్చారు.

బొంబాయిలో 1930 ఫిబ్రవరి 23వ తేదీన కోల్హాపూర్ రాజు గారి బంగళాలో అఖిల భారతీయ బ్రాహ్మణేతర పక్షపు సభ ఏర్పాటు చేయబడింది.[1] ఈ పక్షం తరపున 15 మంది ప్రతినిధులను రౌండ్ టేబిలు సమావేశానికి పంపించాలని ఈ సభలో తీర్మానాన్ని ఆమోదించారు. డా॥ అంబేద్కరు ఈ మీటింగుకు హాజరయ్యారు.

ఈ సభ అయిన వెంటనే డా॥ అంబేద్కరు అదేరోజున నాసిక్ జిల్లాకు చెందిన సిన్నర్ గ్రామంలో జరిగిన అస్పృశ్యుల సభకి వెళ్లారు.

పూనాకి చెందిన "డిప్రెస్డ్ క్లాసు మిషను సొసైటీ" సభ్యులు శ్రీ పాతాడే,

1. జ్ఞాన ప్రకాశ్ : 25-2-1930

ఆయన అస్పృశ్య మిత్రులు కొంత మంది కలిసి 'ఇండియన్ నేషనల్ ఏంటీ రివల్యూషనరీ పక్షాన్ని స్థాపించారు.[1] ఈ కార్యకర్తలు మహాత్మాగాంధీ సత్యాగ్రహానికి వ్యతిరేకంగా పూనాలో ప్రతి-సత్యాగ్రహం చేస్తున్నామని ప్రకటించారు. డా॥ సాహబు కూడా ఈ ఆందోళనలో ఉన్నారని ప్రచారం చేశారు. ఈ తప్పుడు సమాచారానికి వ్యతిరేకిస్తూ వెంటనే డా॥ అంబేద్కరు 1930 ఏప్రిలు 8వ తేదీన జ్ఞాన ప్రకాశ్ వార్తాపత్రికా విలేఖరికి మహాడ్‌లో ఇంటర్వ్యూ ఇచ్చారు.

"ఈ ప్రతి - సత్యాగ్రహానికి నాకు గాని నా మిత్రులకి గాని కొంచెం కూడా సంబంధం లేదు. అంతేకాదు ఈ ప్రతి-సత్యాగ్రహాన్ని నేను గట్టిగా వ్యతిరేకిస్తున్నాను. ఇది పొరపాటు అని దానివల్ల తెలుస్తుంది.[2] ఆయన ఆందోళన అస్పృశ్యులను బానిసత్వపు బంధనాలలో పట్టి ఉంచినదానికి వ్యతిరేకంగా చేస్తున్న ఆందోళన అని డా॥ అంబేద్కరు పదేపదే ప్రకటించారని దీనివల్ల స్పష్టమవుతోంది. అంతేకాదు, మహాత్మాగాంధీ ద్వారా నడిచిన జాతీయ స్వాతంత్ర్యోద్యమానికి వ్యతిరేకంగా ఆయన ఏ పనీ చేయలేదు. ఈ విషయంలో ఎప్పుడూ తన అభిప్రాయభేదాలను ఎంతో నిజాయితీతో ప్రజలముందు ఆయన పెట్టారు.

డా॥ అంబేద్కరు బొంబాయిలో ఆలయప్రవేశపు సత్యాగ్రహాన్ని ప్రారంభించకపోయి ఉండొచ్చు కాని నాసిక్‌లో ఆయన 1930 మార్చి 2వ తారీఖున ఆలయ ప్రవేశ సత్యాగ్రహపు యుద్ధ భేరీ మ్రోగించారు. పరిషత్తు సమావేశం ఉదయం 10 గంటలకి అయింది. దీనిలో సత్యాగ్రహపు కార్యాచరణ విధానం గురించి చర్చించారు. నిశ్చయించుకున్న ప్రకారం మూడుగంటలకి సుమారు 15000 మంది సత్యాగ్రహుల ఊరేగింపు ఒక మైలు పొడుగున్నది. ఎంతో క్రమశిక్షణతో, శాంతంగా రామమందిరం వేపు సాగింది. ముందు ఆర్మీ బేండు లాంటి బేండు ఉన్నాది. రామమందిరం తలుపులు అన్నీ మూసేసారు. ఆ బ్రహ్మాండమైన ఊరేగింపు గోదావరి ఒడ్డున ఓ గొప్ప సభగా మారిపోయింది.

రాత్రి పదకొండు గంటలకి కార్యకర్తల సమావేశం జరిగింది. మార్చి మూడవ తారీఖునుంచి సత్యాగ్రహం ప్రారంభించాలని నిశ్చయించారు.

1. అదే : 29-2-1930
2. జ్ఞాన ప్రకాష్ : 8 ఏప్రిలు 1930.

మొదటి రోజు 125 మంది పురుషులు 25 గురు మహిళలు సత్యాగ్రహం చేశారు. శిబిరంలో ఎనిమిది వేలమంది సత్యాగ్రహులు ఉన్నారు. వారంతా తమ ఒంతు కోసం ఆతృతతో ఎదురుచూస్తున్నారు. సుమారుగా 8వేల మంది దళితులు ఈ దృశ్యాన్ని చూస్తున్నారు. జిల్లా కలెక్టరు స్వయంగా శాంతిభద్రతలు కాపాడడానికి అక్కడ హాజరై ఉన్నారు. కాని రామమందిరం మూసేసే ఉంచారు.

రాత్రి కుర్తకోటి శంకరాచార్యులు బహిరంగసభని సంభోధించారు. అయితే సనాతనులు రాళ్ల వర్గంతో సభని భగ్నం చేశారు. ఏప్రిలు 9వ తారీఖున రామనవమి ఉత్సవం. ఆ రోజు శ్రీరామచంద్రుడి రథయాత్ర జరగాలి. స్పృశ్యుల నాయకులు అస్పృశ్యుల నాయకులు కలిసి సమావేశం అయ్యారు. ఇరుపక్షాల నుండి బలిష్ఠులైన యువకులు ఈ రథాన్ని లాగుతారని సంధిచేసుకున్నారు. కాని సనాతనుల మనస్సుల్లో రహస్య నిర్ణయం మరోరకంగా ఉంది. మందిరం నుంచి రథం దూరంగా వెళ్లగానే వాళ్లు డా॥ అంబేద్కరు తదితర సత్యాగ్రహుల మీద విరుచుకు పడదామని అనుకున్నారు. ఈ సంగతి తెలియగానే సత్యాగ్రహుల నాయకులు దాదాసాహబు గాయక్వాడ్, రణఖాంబే, తదితరులు బాబాసాహబును మహర్‌వాడిలోని సురక్షిత స్థలానికి వెళ్లి పొమ్మని ప్రార్థించారు. కాని "ఇక్కడ ఉండి చచ్చిపోవడం ఎక్కువ శ్రేయస్కరం. ఇక్కడకొచ్చిన ప్రతి సత్యాగ్రహి ప్రాణం నా ప్రాణం కన్నా తక్కువది కాదు. నేనిక్కడనుంచి చచ్చినా కదలను" అని సైనికుడి పద్ధతిలో బాబాసాహబు స్పష్టంగా చెప్పారు. ఆయనా ఊరేగింపులో పాల్గొన్నారు. రథం కాస్తదూరం వెళ్లిందో లేదో, సనాతనులు రథం లాగుతున్న అస్పృశ్యులని ముట్టడించారు. వాళ్లని కొట్టడం మొదలుపెట్టారు. ఇరుకుదారి. దానికి రెండువేపులా ఇనపతీగ ముళ్లది కట్టారు. డా॥ అంబేద్కరు ఆయన మిత్రులూ చక్రవ్యూహంలో చిక్కుకున్నట్లు అయింది. పక్కనున్న పొలాల్లోంచి వాళ్లమీదకి రాళ్లు విసిరారు. డా॥ అంబేద్కరు మిత్రులు ఆయనని కాపాడ్డానికి గాను ఆయనను చుట్టేముట్టి నిల్చున్నారు. కొంతమంది ఆయనకి గొడుగు పట్టి నిల్చున్నారు. ఒక గొడుగు విరిగిపోతే రెండవ గొడుగు విప్పడం - ఇల్లాగ్గా ఆయనని రక్షించడానికి గాను ఆ రాళ్ల దెబ్బలను అనేకమంది సహచరులు తాము భరించారు. బాబాసాహబుకి దెబ్బలు తగలకూడదని చూశారు. కాని

ఆయనకి చాలాచోట్ల దెబ్బలు తగిలాయి. ఆయన మిత్రులు భాస్కరరావు కంద్రేకర్ తలకి చాలా గట్టి దెబ్బలు తగిలాయి. ఎంతోమంది సత్యాగ్రహులు చాలా ఎక్కువగా గాయపడ్డారు.

పోలీసుల ప్రవేశంతో అంతటా శాంతి నెలకొన్నాది. అప్పుడు అందరిని అస్పత్రిలో చేర్చే పని మొదలయింది. బాబాసాహబు స్వయంగా అన్నిటినీ చూసుకున్నారు. తర్వాత దెబ్బలు తిన్న సత్యాగ్రహుల్ని చూడ్డానికి ఆయన ఆస్పత్రికి వెళ్లారు.

ఈ ఆలయ ప్రవేశ ఆందోళన కారణంగా ఊరూరా అస్పృశ్యులకి అత్యాచారాలని, బహిష్కారాలని సహించవలసి వచ్చింది. అయినా ఈ నాసిక్ సత్యాగ్రహం సాగుతూనే వచ్చింది. డా॥ ముంజే, కుర్తకోటి శంకరాచార్యులు డా॥ అంబేద్కరుని బొంబాయిలో కలిశారు. "మేం సనాతనుల మనస్సు మార్చడానికి ప్రయత్నిస్తాం" అని వారు ఆయనకి చెప్పారు. నాసిక్‌లోని కాలారామ్ ఆలయం సత్యాగ్రహం దాదా సాహబు గాయిక్‌వాడ్ అమృతరావ్ రణఖాంబే 1935 అక్టోబరు 13వ తారీఖునుండి సాగించారు.

మహాడ్ చెరువు సత్యాగ్రహానికి సంబంధించిన కేసులను నడపడం, దానికోసం సాక్ష్యుల్ని, అన్ని ఋజువులని పరీక్షించడం, దాంతోపాటుగా నాసిక్ సత్యాగ్రహానికి స్వయంగానూ, ఉత్తరాల ద్వారానూ మార్గాన్ని నిర్దేశించడం - ఈ పనులన్నిటిలో తలమునకలై ఉండడం చేత డా॥ బాబా సాహబు అంబేద్కర్ విధానమండలి త్రైమాసిక సమావేశం మొదటి దానికి ఎక్కువగా హాజరు కాలేకపోయారు.

మే నెలలో పెట్రో కమిటీ మీటింగు బొంబాయిలో జరిగింది. దానిక ఆయన హాజరయ్యారు. ఆ తర్వాత జూలై - ఆగష్టులో జరిగిన విధాన మండలి సమావేశానికి ఆయన వెళ్లారు.

## పదహారు

నాగపూర్‌లో 1930 ఆగష్టు 8వ తారీఖున అఖిల భారతీయ బహిష్కృత పరిషత్తు సమావేశం జరిగింది. దళిత సమాజానికి చెందిన వివిధ సంస్థలను ఈ సమావేశానికి హాజరుకావలసినదిగా భారతదేశం మొత్తాన్ని ఆహ్వానించారు.

బ్రిటిషు ప్రభుత్వం భారతదేశానికి స్వాతంత్ర్యం యివ్వాలన్న ఆసక్తితో ఉంది. ఈ స్వాతంత్ర్యపు డ్రాఫ్టుని తయారు చెయ్యటానికిగాను రౌండ్ టేబిలు సమావేశాన్ని ఏర్పాటు చేసారు అని డా॥ అంబేద్కరు అభిప్రాయ పడ్డారు. అంచేత ఆయనకూడా ఆ ఉద్దేశంతోనే ఈ సమావేశాన్ని ఏర్పాటు చేసారు. భారతదేశపు స్వరాజ్యానికి సంబంధించిన డ్రాఫ్టులో అస్పృశ్యుల స్థానం ఏమిటో, దాని పద్ధతిని నిర్ధారించవచ్చునని ఆయన ఉద్దేశపడ్డారు. డా॥ అంబేద్కరు ఈ సభలో సుమారు ఒకటిన్నర గంటల సేపు ఉపన్యాసం ఇచ్చారు.[1]

ఈ సమావేశంలో నాసిక్, పూనా, సాతారా మొదలైన అనేక జిల్లాల ప్రతినిధులు పాల్గొన్నారు. మద్రాసు, ఉత్తరప్రదేశ్, బీహారు, ఒరిస్సా మొదలైన దూరదూర ప్రాంతాలకి చెందిన అస్పృశ్యుల నాయకులు కూడా హాజరయ్యారు. మద్రాసు నుంచి రావ్‌సాహెబుపిల్లై, నాసిక్ నుంచి దాదాసాహబు గాయక్‌వాడ్, పూనానుంచి సుబేదార్ ఘాటగే, పా.నా. రాజభోజ్, బొంబాయి నుంచి శివతరకర్ మొదలైన కార్యకర్తలు, బీహారు నుంచి రామచరిత ప్రసాద్, ఉత్తరప్రదేశ్ నుంచి ఏడ్వకేటు చౌరసియా, స్వామి బౌద్ధానంద్, బెంగాలు నుంచి శ్రీ బిశ్వాస్, మధ్యప్రదేశ్ నుంచి శ్రీలక్ష్మణరావ్ ఓగ్లే, కాళీచరణ్ బందాగవలీ, దశరథ పాటీల్ మొదలైనవారు చాలామంది ఈ సభకి హాజరయ్యారు. చాలామంధి స్పృశ్యుల నాయకులూ వచ్చారు.

డా॥ అంబేద్కరు తమ ఉపన్యాసాన్ని ఇంగ్లీషులో తయారుచేసు కున్నారు. కాని జనసామాన్యానికి ఇచ్చిన ఉపన్యాసం మరాఠీలో ఇచ్చారు. 18 బహిష్కృతజాతులికి యూరపులోని భిన్నభిన్న వంశాలకి భిన్న భిన్న భాషలకి ఉన్న స్థితే ఉన్నదని ప్రతిపాదిస్తూ భారతదేశానికి స్వాతంత్ర్యం లభించి తీరాలి అని, దానిని కాదని తోసిపుచ్చడానికి వీలులేదనీ డా॥ అంబేద్కరు తమ సుదీర్ఘమైన ఉపన్యాసంలో చెప్పారు. విభిన్న సమాజాలకి సమానంగా మేలు జరగడానికి మధ్యస్థ ప్రభుత్వాన్ని స్థాపించడం అవసరం అని ఆయన బోధపరిచి చెప్పారు. బ్రిటిషువారి ఏకతంత్ర పరిపాలన కారణంగానే హిందూస్థానీ ఏకతంత్ర దేశం అయినదనే విషయాన్ని మరిచిపోకూడదు. భిన్నభిన్న జాతులు, ఆచారవ్యవహారాల్లోని

1. జ్ఞాన ప్రకాశ్ : 9 ఆగష్టు 1930.

భిన్నత్వం, చారిత్రిక దృష్ట్యా, రాజకీయా దృష్ట్యా స్వరాజ్య మార్గానికి అవరోధాలు కాకూడదు అని ఆయన స్పష్టం చేసి చెప్పారు. భిన్న భిన్న సామాజిక వర్గాల హితాన్ని, వాటి మధ్య సౌభాతృత్వాన్ని కలిగించే లక్ష్యాన్ని దృష్టిలో ఉంచుకుని మరీ స్వరాజ్యపు రాజ్యాంగాన్ని నిర్మించుకోవాలి. ఏ వర్గం చేతికో పరిపాలనాధికారాన్ని ఏ నియంత్రణా లేకుండా ఇవ్వడం హంతకుడి చేతికి కత్తి యిచ్చినదానితో సమానం అవుతుంది.

"అల్ప సంఖ్యాకుల సమస్యా పరిష్కారము అభిప్రాయ భేదాలను పోగొట్టేదిగా ఉండాలి. దేశరాజ్యాంగంలోనే వారి హక్కులను కాపాడే వ్యవస్థని పొందుపరచాలి. ఈ హక్కులను కాపాడుకోవటానికి విధానసభలో అస్పృశ్యులకు పూర్తి ప్రాతినిధ్యం లభించాలి. అదీ వారి జనసంఖ్య కన్నా కూడా ఎక్కువ ఉండాలి. వారికోసం ప్రత్యేక సీట్లు కేటాయింపుకి సరియైన వ్యవస్థ ఉన్నట్లయితే సంయుక్త నియోజకవర్గాన్ని అంగీకరించడానికి ఏ అభ్యంతరమూ ఉండదు. ప్రభుత్వోద్యోగాలలో కూడా ఉచిత పరిమాణంలో నిర్ధారణ జరగాలి.

"మనం సైమను కమీషనును పూర్తిగా సహకరించాం. కాని వారు మనకు సరియైన న్యాయాన్ని చేయలేదు. మన జనసంఖ్య 20% ఉన్నప్పటికీ వారు మనకు కేవలం 8% ప్రాతినిధ్యానికే సిఫారిసు చేశారు. అంచేత ఇప్పుడు మనం ఇంగ్లీషువారి మీద ఆధారపడకూడదు. వలసరాజ్యం, అస్పృశ్య సమాజపు సంపూర్ణ స్వరాజ్యం కన్నా ఎక్కువ కీడు కలిగించేది అవుతుంది."

"అల్పసంఖ్యాకుల సమస్యా పరిష్కారము లభిప్రాయభేదాలను పోగొట్టేదిగా ఉండాలి. దేశ రాజ్యాంగంలోనే వారి హక్కులను కాపాడే వ్యవస్థని పొందుపరచాలి. ఈ హక్కులను కాపాడుకోవటానికి విధానసభలో అస్పృశ్యులకు పూర్తి ప్రాతినిధ్యం లభించాలి. అదీ వారి జనసంఖ్య కన్నా కూడా ఎక్కువ ఉండాలి. వారికోసం ప్రత్యేక సీట్లు కేటాయింపుకి సరియైన వ్యవస్థ ఉన్నట్లయితే సంయుక్త నియోజకవర్గాన్ని అంగీకరించడానికి ఏ అభ్యంతరమూ ఉండదు. ప్రభుత్వోద్యోగాలలో కూడా ఉచిత పరిమాణంలో నిర్ధారణ జరగాలి.

"మనం సైమను కమీషనును పూర్తిగా సహకపించాం. కాని వారు మనకు సరియైన న్యాయాన్ని చేయలేదు. మన జనసంఖ్య 20% ఉన్నప్పటికీ

వారు మనకు కేవలం 8% ప్రాతినిధ్యానికే సిఫారిసు చేశారు. అంచేత ఇప్పుడు మనం ఇంగ్లీషు వారిమీద ఆధారపడకూడదు. వలసరాజ్యం, అస్పృశ్య సమాజపు సంపూర్ణ స్వరాజ్యం కన్నా ఎక్కువ కీడు కలిగించేది అవుతుంది."

"ఇలువంటి విప్లవం ఏ దిశా లేనిదవుతుంది. దీనివల్ల ఏదో ఒక వర్గం చేతిలోకి ప్రభుత్వం అధికారం పోయే భయం ఉంటుంది. ఈ శాసనోల్లంఘన ఆందోళన వల్ల లభించే స్వాతంత్ర్యంలో అస్పృశ్యులకు ఉచిత పరిమాణంలో హక్కులు దొరుకుతాయన్న నమ్మకం లేదు" అని ఆయన మహాత్మాగాంధీ శాసనోల్లంఘన ఆందోళనని వ్యతిరేకిస్తూ చెప్పారు. "కాంగ్రెసు ఈ రౌండ్ టేబిలు సమావేశాన్ని అంగీకరించాలి - తన శాసనోల్లంఘన ఆందోళనని విరమించుకోవాలి" అనికూడా ఆయన తన ఉపన్యాసంలో సూచించారు.

ఈ పరిషత్తులో 12 తీర్మానాలు ఆమోదించబడ్డాయి. వీటిలో డా|| అంబేద్కరు ఉపన్యాసంలోని సూచించిన డిమాండ్లను పునరావృత్తం చేశారు.

"మన హిందూ నాయకులు డా|| అంబేద్కరుని అనుసరించాలి" అని జ్ఞాన ప్రకాశ్ లాంటి పత్రికలు డా|| అంబేద్కరు ఉపన్యాసం మీద తమ అభిప్రాయాలను ప్రకటిస్తూ రాశాయి.[1]

మొదటి రౌండ్ టేబిలు సమావేశానికి డా|| అంబేద్కరుని అస్పృశ్యుల ప్రతినిధిగా ఎన్నుకున్నారు. 1930 సెప్టెంబరు 26వ తేదీన ఆయన బొంబాయి నగరం టవును హాలులో రౌండ్ టేబిలు సమావేశపు ప్రాముఖ్యాన్ని గురించి ఉపన్యాసం ఇచ్చారు. కాంగ్రెసు ఈ రౌండు టేబిలు సమావేశాన్ని బహిష్కరించిన కారణంగా దేశంలోని పాత్రికేయులందరూ డా|| అంబేద్కరునే తమ వ్యాఖ్యానానికి ఆధారంగా చేసుకున్నారు. ఆ రోజుల్లో కాంగ్రెసు ఏం చెపితే అదే విధాన నిర్ణయం అవుతోంది. అది ఏం చెపితే అదే సరియైన పద్ధతి అని స్వీకరించడం జరుగుతోంది. అదీ దేశపు పరిస్థితి.

పరేలులో డా||అంబేద్కరుకు సన్మానపత్రం సమర్పించటానికి, వీడ్కోలు యివ్వటానికి అస్పృశ్య సమాజం తరపున 1930 అక్టోబరు 2

1. జ్ఞాన ప్రకాశ్ : 16-8-1930

గురువారంనాడు ఓ సభని ఏర్పాటు చేశారు. ఈ సభకి సుమారు పదివేల మంది[1] జనం హాజరయ్యారు. "స్వరాజ్యం అస్పృశ్యులకీ కావాలి. కాని భవిష్యత్తులో వచ్చే రాజ్యాంగంలో అస్పృశ్యులకి కూడా స్వతంత్రం లభించే వ్యవస్థని ముందుగానే పొందుపరచటం అవసరం. హిందూస్థాన్‌లోని పోలీసు విభాగంలోనూ, సైన్యంలోనూ అస్పృశ్యులకు పూర్తి ప్రాతినిధ్యం యిప్పించటానికి శాయశక్తులా ప్రయత్నిస్తాను." అని డా॥ అంబేద్కరు తన ఉపన్యాసంలో చెప్పారు. ఈ సందర్భంలో ఆయనకి 5వేల రూపాయల పర్సు యిచ్చారు. దీనిలోని కొంత మొత్తాన్ని దళిత కాంగ్రెసు కార్యకలాపాలకు, తతిమా మొత్తాన్ని కొత్తగా ప్రచురించబడే వార్తాపత్రిక 'జనతా' కు యిస్తానని ప్రకటించారు.

# పదిహేడు

'వైస్రాయి ఆఫ్ ఇండియా' అనే ఓడలో 1930, అక్టోబరు 4వ తేదీన బొంబాయి నుంచి డా॥ అంబేద్కరు రౌండ్ టేబిలు సమావేశంలో పాల్గొనడానికి బయల్దేరారు. హిందూసభ తరపున డా॥ ముంజె, ముసల్మానుల తరపున మౌలానా అహమద్ ఆలీ, బారిస్టరు జిన్నా, బారిస్టరు జయకర్ మొదలైన తదితర విద్వాంసులు, ప్రఖ్యాత నాయకులు కూడా ఇందులో పాల్గొనడానికి వెళ్తున్నారు.

లండను చేరడానికి 15-20 రోజులు పడుతుంది. ఆ కారణంగా తీరుబడి ఉన్న రోజులలో గ్రంథ పఠనానికి వీలు కలుగుతుంది. అంచేత డా॥ అంబేద్కరు తనతోపాటు పుస్తకాలతో నిండిపోయిన పెట్టెలను నాలుగింటిని పట్టుకున్నారు. కాని పెట్టెల తాళం చెవులు బొంబాయిలోనే ఉండిపోయిన కారణంచేత ఇహ గత్యంతరం లేక ఆయనకి విశ్రాంతి తీసుకోవలసివచ్చింది. 1930 అక్టోబరు 11వ తారీఖున దాదాపు మూడు గంటలకు ఆయన ఈజిప్టు దేశపు కైరో రేవుకి చేరుకున్నారు. తన

1. అదే : 4-10-1930

సమయాన్ని వెచ్చించటానికి గాను ఆయన పిరమిడ్లు చూద్దామని నిశ్చయించుకున్నారు. మొదట ఒంటె మీద స్వారీ చేసి వెళ్దామని బయల్దేరారు. అయితే అది తనకు పడకపోవడంతో కాలినడకనే చుట్టి వచ్చారు.

రౌండ్ టేబిలు సమావేశానికి గాను ప్రయాణం[1] చేస్తున్న వివిధ పార్టీలకు చెందిన సభ్యులు తమ తమ రాజకీయ దృక్పథంతో హిందూస్థాన్‌కి ఎలాంటి రాజకీయాధికారం లభించాలో చర్చ సాగిస్తూ ఉండేవారు. ఈ పరస్పర చర్చలో డా॥ అంబేద్కరు కూడా పాల్గొనేవారు. ప్రతినిధులు యావన్మంది ఆయన పాండిత్యాన్ని, వివేచనా విధానాన్ని చూసి విస్తుపోయేవారు. వాళ్లందరి మాటలు విన్నప్పుడు అస్పృశ్యుల సమస్యపట్ల వీరందరూ సానుభూతితోనే వ్యవహరిస్తారని ఆయనకి అనిపించింది.

అక్టోబరు 18వ తారీఖున డా॥ అంబేద్కరు లండను చేరుకున్నారు. అక్కడికి వెళ్లిన ఎనిమిది – పది రోజుల్లోనే ఆయన సర్ ఫిలిప్ చెట్ వుడ్ ని కలుసుకున్నారు. హిందూస్థానీ సైన్యంలో ప్రముఖ సేనాధిపతి పదవిలో ఆయనకి ఆ మధ్యనే నియామకం జరిగింది. హిందూస్థానీ సైన్యంలో అస్పృశ్యులను ఎలా చేర్చుకోవడానికి వీలు కలుగుతుందన్న విషయం గురించి ఆయనతో విపులంగా చర్చించారు. భారతీయ వ్యవహారాల మంత్రి, ఉపమంత్రి, లేబరు పార్టీ నాయకుడు శ్రీ లాన్స్‌బెరిని కూడా కలిసారు. వీరందరితో చర్చించినప్పుడు మొదటి కలయికలోనే అస్పృశ్యుల పట్ల వారి సానుభూతిని పొందడంలో ఆయన కృతార్థులయ్యారు. లేబరుపార్టీ నాయకుడు శ్రీ లాన్స్‌బెరి ఆయనని భోజనానికి ఆహ్వానించాడు. అస్పృశ్యుల రాజకీయ హక్కుల మీద అందరి దృష్టి ప్రసరించేటట్టు చేయడం వల్ల ఆయనకి ఖ్యాతి వచ్చింది. దానికి ఆయన చాలా సంతోషించారు.

అస్పృశ్యుల రాజకీయ హక్కులకు సంబంధించిన ఒక విజ్ఞప్తిని రాయడమైంది. ఓ పక్క లండన్ చేరగానే ప్రముఖ వ్యక్తులను కలుసుకోవడమూ చేశారు. దాంతోపాటు సైన్యంలో చేర్చుకునే విషయం గురించి కూడా ఓ వివరణ పత్రం తయారుచేశారు. ఈ కవరును తయారు చేయడానికి

1. గణదీక్ రత్నాకర్ : విలాయత్‌సే (విదేశం నుండి) డా॥ బాబాసాహబ్ ఖైఖత్ (ఉత్తరం) పే : 30-31

ఇంగ్లండులోని మాజీసైనిక అధికారుల నుంచి అవసరమైన వివరాలు ఆయనకి లభ్యమయ్యాయి. 'The Problems of India's Defence' అన్న పుస్తకాన్ని కూడా తన వ్యాసాన్ని తయారుచేస్తున్నప్పుడే రాశారు. అయితే ఈ పుస్తకం ఇప్పటికీ అచ్చుకాలేదు.[1] ఈ పుస్తకం ఏమయిందో కూడా వివరాలు తెలీవు.[2] అస్పృశ్యుల రాజకీయ హక్కుల గురించిన విజ్ఞప్తిని ఆయన 1930 డిసెంబరులో అచ్చువేయించారు. దాని కాపీలను రౌండ్ టేబిలు సమావేశపు సభ్యులకు పంచిపెట్టారు. ఈ సమయంలోనే ఆయన లేబరు పార్టీ పార్లమెంటరీ సభ్యుల ముందు తమ కైఫియతులు సమర్పించారు.

రాజకీయ హక్కులను ఉద్దేశించిన జాబితాలో పెద్ద కవరులో డా॥ అంబేద్కరు అస్పృశ్య సమాజానికి సమానహక్కులు, పౌరసత్వపు మానవ హక్కులు, కులపరంగా వారిపట్ల పక్షపాతంతో ప్రవర్తించే పద్ధతి నుండి కాపాడుట, విధానసభలోనూ, ప్రభుత్వోద్యోగాలలోనూ వారికి ప్రాతినిధ్యం, ఆచారగత అభిప్రాయాల కారణంగా అస్పృశ్యుల పట్ల వ్యవహరించే తీరునుండి వారికి భద్రత కలిగించుట, కేంద్ర ప్రభుత్వంలో అస్పృశ్యుల హితాన్ని చూసే శాఖలోనూ, గవర్నరు జనరలు ద్వారా ఏర్పరచబడే మంత్రిమండలిలోనూ వారికి ప్రాతినిధ్యం - ఈ డిమాండ్లు నన్నిటినీ ప్రతిపాదించారు.

సమావేశపు సాధారణ సభలో నవంబరు 17 నుండి 21వ తారీఖు వరకూ సప్రూ, జయకర్ డా॥ ముంజె, బా. జిన్నా, బికనీరు మహారాజు, డా॥అంబేద్కరు ఉపన్యాసాలు తమ ప్రభావాన్ని ప్రసరింపచేశాయి. అస్పృశ్యుల దృష్టిలో స్వరాజ్యం ఎల్లాగ్గా అవసరమో డా॥ అంబేద్కరు స్ఫూర్తిని కలిగించే తమ ఉపన్యాసంలో నొక్కి చెప్పారు. ఇంగ్లీషువారు అస్పృశ్యులకి ఎలా నమ్మకద్రోహం చేశారో ఆయన వివరించి చెప్పారు. తదితర విచారణీ యాంశాలను గురించి చాలా చక్కగా వివరించి చెప్పడంతో బ్రిటిషు ప్రధానమంత్రి మీద దాని ప్రభావం గట్టిగా పడింది. "ఈ ఉపన్యాసం, సమావేశంలో ఇచ్చిన ఉపన్యాసాలన్నిటిలో సర్వోత్తమమైన ఉపన్యాసానికి

1. ఖైరమోడే : భాగం 4 పే. 97.
2. Proceedings of Minorities Sub - Committee., Vol. III (Minorities) Apendix 2. పే. 168-79



డాక్టరు బాబాసాహబు అంబేద్కరు, అధ్యక్షులు, భారతీయ రాజ్యాంగ నిర్మాణ సమితి మరియు ఇతర సభ్యులు



డాక్టరు బి.ఆర్. అంబేద్కరు, న్యాయశాఖ మంత్రిగా ప్రమాణ స్వీకారం చేస్తున్నప్పుడు



బొంబాయిలోని సిడిన్‌హామ్ కాలేజిలో డాక్టరు అంబేద్కరు ప్రొఫెసరుగా ఉన్నప్పుడు



డాక్టరు బాబాసాహబు అంబేద్కరు

ఉదాహరణం" అని అక్కడి 'ఇండియన్ మేల్' వార్తాపత్రిక డా|| అంబేద్కరు ఉపన్యాసం గురించి రాసింది. డా|| అంబేద్కరును భారత దేశపు జాతీయ నాయకుడిగా స్పెక్టేటరు వార్తాపత్రిక గుర్తించింది. అనేకమంది బ్రిటిషు నాయకులు డా|| అంబేద్కరు విప్లవ పార్టీ నాయకుడు కాని కాదుకదా ? అని శ్రీ. లర్త్విని అడిగారు.[1]

డా|| అంబేద్కరు 1930 డిసెంబరు 31వ తారీఖున అల్పసంఖ్యాకుల కమిటీలో ఇచ్చిన తమ ఉపన్యాసాలలో బ్రిటిషు ప్రభుత్వం మీద గట్టిగా దాడిచేశారు. "బ్రిటిషు ప్రభుత్వాన్ని స్థాపించుకోటానికి ఏ అస్పృశ్యులని వినియోగించుకున్నారో ఆ అస్పృశ్యుల స్థితిని మార్చడం వేపు బ్రిటిషు వారు బొత్తిగా దృష్టి పెట్టలేదు. హిందూ సమాజం అస్పృశ్యులమీద అత్యాచారాలు జరుపుతున్నమాట వాస్తవమే అయినా స్వాతంత్ర్యం లభించిన తర్వాతే వాళ్లు దేశంలో తమని తాము ఉద్ధరించుకోవడానికి వీలు కలుగుతుంది" అని ఆయన చెప్పారు. "అస్పృశ్యులకు ప్రత్యేక నియోజకవర్గం, నామినేషన్ పద్ధతి అంగీకారం కావు కాని వయోజన ఓటుహక్కు దొరికితే సంయుక్త నియోజకవర్గం మాకు అంగీకారమే. ఒకవేళ ఈ హక్కు మాకు దొరక్కపోతే మాకు ప్రత్యేకమైన రిజర్వుడు సీట్లు కావాలి"[2] అని ఆయన అన్నారు. సైనిక సబ్‌కమిటీలో మాట్లాడుతూ సైన్యంలో చేరటానికి అస్పృశ్యులని నిరాకరించకూడదు అన్న డిమాండును పెట్టారు.[3] డా. ముంజె, సప్రూ కూడా ఈ డిమాండును సమర్థించారు. సమాపన సభలో వయోజన ఓటుహక్కు గురించి తమ అభిప్రాయాలను తిరిగి ప్రతిపాదిస్తూ ఆయన ఇలా హెచ్చరించారు - వయోజన ఓటుహక్కు లేకుండా స్వరాజ్యం యివ్వడం - అధిక సంఖ్యాక సమాజం మీద ధనవంతుల పరిపాలనను స్థాపించడంతో సమానం అవుతుంది.

పార్లమెంటులోని లేబర్ పార్టీ లిబరల్ పార్టీ, కన్సర్‌వేటివ్ పార్టీల సభ్యుల ముందు ఉపన్యసించి తమ డిమాండ్లకు వారి సానుభూతిని సంపాదించారు. లండనులోని కొంతమంది ప్రెస్ ఫోటోగ్రాఫర్లు ఆయన ఫోటోలు చక్కగా

1. ఖైర మోడే: భాగం 4 - పే. 97
2. జ్ఞాన ప్రకాశ్: 3-1-1931
3. 1892 నుంచి అస్పృశ్యులు సైన్యంలో చేరటానికి ఆంక్ష పెట్టబడ్డాది.

తీసారు. వాటిని ఆయన తమ సహచరులు భావురావు గాయక్‌వాడ్‌కి పంపించారు.[1] అమెరికాలో ఉపన్యాసాలు ఇచ్చి అక్కడి ప్రజలకు కూడా తమ దృక్పథాన్ని తెలిపి అంగీకరింప చెయ్యాలన్న కోరిక డా॥ అంబేద్కరుకు ఉంది. అందుకని ఆయన అమెరికాలోని 'అంతర్జాతీయ విద్యాసంస్థని అధికారులకి రెనిస్మిత్ అనే మహిళా ఆఫీసరు ద్వారా ఉత్తరం కూడా పంపించారు. అక్కడ డాక్టరు సాహబు ఉపన్యాసాలు ఏర్పాటు చేయవల సిందిగా అందులో అభ్యర్థించారు. కాని రెండవ రౌండ్ టేబిలు సమావేశం ఆరంభం అయ్యే సమయం దగ్గర పడటంతో డా॥ సాహబు అమెరికా వెళ్లే తమ ఆలోచనను విరమించుకున్నారు.[2] ఆయన రష్యను నాయకుల్లను కూడా కొందరిని కలుసుకుందామని నిశ్చయించుకున్నారు.

మొదటి రౌండ్ టేబిలు సమావేశంలో డా॥ అంబేద్కరు ఇచ్చిన పాండిత్య ప్రకర్షతో నిండిన ఉపన్యాసాలను విని బరోడా రాజుగారు సర్ సయాజీరావు గాయక్‌వాడ్ (ఆయనా సమావేశానికి హాజరయ్యారు) చాలా ఆనందించారు. అంచేత ఆయన బాబాసాహబును టీపార్టీకి ఆహ్వానించారు.[3] ఈ టీపార్టీ సందర్భంలో అక్కడకి అనేకమంది హిందూ సంస్థానాల పరిపాలకులు హాజరయ్యారు. బరోడా రాజు బాబాసాహబుగారిని పొగుడుతూ వారి గొప్పతనాన్ని ఉగ్గడించారు. ఆయన చెప్పినది విని అనేకమంది రాజులకు, మహారాజులకు డా॥ అంబేద్కరు అంటే గౌరవభావం కలిగింది. ఈ సందర్భాన్ని వినియోగించుకుని బాబాసాహబు సంస్థానాధీశులందరికి అచ్చువేసిన కరపత్రం పంపించి తమ కార్యకలాపాల నిమిత్తం ఆర్థిక సాయం చేయవలసినదిగా మనవి చేశారు.

సర్ సయాజీరావు గాయక్‌వాడ్ పట్ల బాబాసాహబు గారికి ఎప్పుడూ చాలా గౌరవభావం ఉంది. తే. 6-2-1939 న సయాజీరావు స్వర్గస్థు అయ్యారు. "మహారాజు గారు స్వర్గస్థులవడం నాకు వ్యక్తిగతమైన దెబ్బ. ఆయన నాకు చేసిన ఉపకారాలను నేనెప్పటికీ మరిచిపోలేను. జాతీయ భావరీత్యా ఆయన గొప్ప దేశ భక్తులు. ఆయన మరణంతో అస్పృశ్యులకి

1. ఖైరమోడె : భాగం - 4, పే. 120
2. అదే : పే. 122
3. అదే, పే. 123

పెద్ద అండ పోయింది. సంస్థానాధీశుల్లో దివ్యదృష్టి గల పురుషుడు లేకుండా పోయాడు." అని బాబాసాహబు అన్నారు.

మహాడ్ గ్రామంలోని 'చవదార్ చెరువు' కేసులో సనాతనుల మీద గెలిచినట్టు వచ్చిన తీర్పు గురించి ఆయనకి లండనులోనే తెలిసింది. బొంబాయి విధానసభకు ఆయనకు నియామకం ఇచ్చారన్న వార్తా అక్కడే తెలిసింది. నాఈక్, కద్రేకర్‌లు 'జనత' వార్తాపత్రికను ప్రచురించడం ప్రారంభించారన్న మూడవ శుభవార్తా ఆయనకు చేరింది.

ఎలాగో సమయం చిక్కించుకుని డా॥ అంబేద్కరు అక్కడున్న పాత వస్తువుల బజారుకి వెళ్లి పుస్తకాలు కొనుక్కున్నారు. మూడు పెట్టెల పుస్తకాలని వి.ఎమ్. పవార్ ద్వారా బొంబాయికి పంపించారు. ఒక పెట్టె పుస్తకాలు రా.బ. శ్రీనివాసన్‌తో కూడా పంపారు.

మొట్టమొదటిసారిగా అస్పృశ్యుల పిర్యాదులు ఈ సమావేశం ద్వారా యావత్ ప్రపంచానికి తెలిసాయి. 1931 ఫిబ్రవరి 22వ తేదీనాడు డా॥ అంబేద్కరు లండను నుంచి బొంబాయికి వచ్చారు.

లండను నుంచి తిరిగివచ్చాక బొంబాయి బేలార్డ్ పియర్‌లో ఆయనకి ఘనంగా స్వాగతం యిచ్చారు. "ఈ రౌండ్ టేబిలు సమావేశం గొప్ప రాజకీయ విజయం. కాని నాకు ఎన్నికల వ్యవహారంలో పరిమిత హక్కు ఇష్టం లేదు. ప్రతి వయోజనుడికీ ఓటుహక్కు ఉండాలి. అస్పృశ్యుల సమస్యా పరిష్కారం అయ్యేటంతవరకూ రాజకీయ పరిపాలన చేతులు మారదు. రాబోయే రాజ్యాంగంలో అస్పృశ్యుల హక్కులు భద్రంగా ఉంటాయి." అని ఆయన పాత్రికేయులతో సంభాషిస్తూ చెప్పారు.

భారతదేశంలో రాజకీయ కార్యకలాపాల వ్యవహారం అతివేగంగా నడుస్తోంది. 1931 జనవరి 26వ తారీఖున కాంగ్రెసు నాయకులనందరినీ విడుదల చేశారు. 1931 మార్చి ఐదవ తేదీన మహాత్మాగాంధీ వైస్రాయి లార్డు ఇర్వినుతో ఒక సంధి చేసుకున్నారు. సహాయనిరాకరణోద్యమాన్ని విరమించుకున్నారు. మహాత్మాగాంధీ రెండవ రౌండ్‌టేబిలు సమావేశంలో పాల్గొనడానికి తన అంగీకారాన్ని తెలియచేశారు. డా॥ అంబేద్కరు మూడు నాలుగు రోజులు ఇంటర్వ్యూలతోనూ వీరిని వారినీ కలుసుకోవడంలోనూ గడిపారు. అస్పృశ్యులు ఏమిటేమిటి పొందాలో డా. అంబేద్కరు

బొంబాయిలోని పరేలు ప్రాంతంలో ఏర్పాటుచేసిన బ్రహ్మాండమైన సభలో వివరించి చెప్పారు. ఆ తరువాత 1931 మార్చి వరకూ విధానసభ కార్యకలాపాల్లో మునిగిపోయారు.

# పద్దెనిమిది

ఆ రోజుల్లోనే భావురావు గాయక్‌వాడ్, తదితర మిత్రులు డా. ముంజె దిలాసామీద సత్యాగ్రహాన్ని వాయిదా వేశారు. దానిని తిరిగి ప్రారంభించాలని నిర్ణయం తీసుకున్నారు. మార్చి 14వ తారీఖున డా॥ అంబేద్కరు నాసిక్ చేరుకున్నారు. "మీరు మీ ఆందోళనని క్రమశిక్షణతో చేయండి. ఏవిధమైన హింసకీ తావు ఇవ్వకుండా జాగ్రత్త పడండి" అని మహార్ బస్తీలో మార్చి 14వ తారీఖున ఏర్పాటు అయిన బ్రహ్మాండమైన సభలో ఆయన ఉపన్యసిస్తూ చెప్పారు. అక్కడనుంచి బొంబాయికి తిరిగివచ్చారు. మార్చి 16వ తారీఖున చిరనేర్‌లో కేసుని వాదించటానికి ఠాణే వెళ్లారు.

ఠానా జిల్లాలో జగల్ సత్యాగ్రహం జరిపినప్పుడు 1930 సెప్టెంబరు 25వ తారీఖున చిరనేర్ ఊళ్లో ఆందోళన చేస్తున్న గుంపుమీద పోలీసులకి కాల్పులు కాల్చవలసి వచ్చింది. ఈ తిరుగుబాటులో అక్కడ ఉన్న తహసిల్దారు, కొంతమంది జనం చనిపోయారు. ప్రభుత్వం 47 గురి మీద కేసుపెట్టింది. అందులో నలుగురు నేరస్థుల తరపున డా॥ అంబేద్కరు వాదించడానికి వకాల్తా పుచుకున్నారు. ప్రభుత్వం రౌండ్ టేబిలు సమావేశంలో పాల్గొనడానికి ఆయనను నియమించినప్పటికీ డా॥ అంబేద్కరు ప్రజాహితం కోసం ఇంగ్లీషు ప్రభుత్వానికి వ్యతిరేకంగా కోర్టులో వాదనకి నిల్చున్నారు. 1931 జూన్ 20వ తేదీన ఆయన తమ వాదాన్ని మొదలు పెట్టారు. వరసగా రెండు రోజులపాటు ఆయన వాదన సాగింది. నేరస్థులు ఎలా నిర్దోషులో ఋజువు చెయ్యడానికి ఆయన సుమారు పదిగంటల సేపు తాము చేసిన వాదన ద్వారా ప్రయత్నించారు.[1] "స్వతంత్ర, ప్రజల హక్కులు

1. జ్ఞాన ప్రకాశ్ : 26-6-1931

ప్రభుత్వపు స్థిరత్వం కన్నా ఎక్కువ విలువైనవి అన్న అంశాన్ని దృష్టిలో ఉంచుకోవాలి" అని ఆయన వాదిస్తూ చెప్పారు. ఈ కేసు తీర్పు 1931 జూలై 2వ తారీఖున జరిగింది. 21 మంది నేరస్థులకి జైలు శిక్ష వేశారు. తతిమ్మా వారిని నిర్దోషులని నిర్ధారించి విడుదల చేశారు.

1931 ఏప్రిలు 2వ తారీఖున 'సేవాదళ్' మీటింగు దాదర్‌లోని దామోదర్ హాల్లో జరిగింది. దానికి అధ్యక్షులు డా|| అంబేద్కరే. ఈ సంస్థ పేరు మార్చి 'సమత సమాజ్‌దళ్'[1] అని పెట్టారు. ఈ దళ్ మహాడ్ సత్యాగ్రహం సమయంలో స్థాపించబడింది.

1931 ఏప్రిలు 19వ తేదీన బొంబాయిలోని పరేలు ప్రాంతంలో డా|| అంబేద్కరు దళిత నాయకుల పరిషత్తుని ఏర్పాటు చేశారు. బెంగాలు, మధ్యప్రదేశ్, మద్రాసు, మహారాష్ట్ర ప్రాంతాల నుంచి ప్రముఖ నాయకు లందరూ ఈ పరిషత్తులో పాల్గొన్నారు. ఎన్. శివరాజ్ అధ్యక్షత వహించారు. డా|| అంబేద్కరు రౌండ్ టేబిలు సమావేశంలో తాను జరిపిన కార్య కలాపాల వివరణని సమర్పించారు. ప్రతినిధులు దానిని ఆమోదించారు. ఫెడరల్ స్ట్రక్చరు కమిటీలో అస్పృశ్యుల ప్రతినిధిని కూడా తీసుకోవాలని ప్రభుత్వాన్ని అభ్యర్థిస్తూ ఒక తీర్మానాన్ని ఈ పరిషత్తులో పెట్టారు. ఆ విధంగానే రెండవ రౌండ్ టేబిలు సమావేశానికి కూడా అస్పృశ్యుల ప్రతినిధిని నియమించాలి. రాష్ట్రాల్లో మంత్రిమండలులు ఏర్పరిచినప్పుడు వాటిలో అస్పృశ్య సభ్యులను కూడా చేర్చుకోవాలని సూచిస్తూ మరో తీర్మానాన్ని కూడా ఆమోదించారు. దాంతోపాటు ఇంకొక తీర్మానంలో దళిత సమాజాన్ని సమర్థిస్తూ ఉపన్యాసాలిస్తూ వారి పక్షాన్ని సమర్థిస్తున్న లార్డ్ రీడింగు, తేజ్ బహాదుర్ సప్రూ, లార్డ్ పీక, ఐజాక్ ఫుట్‌లకు కృతజ్ఞతలు తెలియచేశారు.[2] ఆ రోజుల్లోనే డా|| ఎమ్.ఎన్. రాయ్ మారువేషంలో డా|| మహమ్మద్ పేరుతో భారతీయ నాయకులను కలుసు కుంటూ ఉండేవారు. ఆయన డి.వి. ప్రధాన్‌తో కలిసి డా|| అంబేద్కర్ దగ్గరకు వచ్చారు. అతను అస్పృశ్యుల సమస్యను లోతుగా పరిశీలించి ఆలోచించలేదు అన్న విషయం ఆయనతో మాట్లాడుతున్న సమయంలో డా|| అంబేద్కరుకు అర్థమయింది. "ఈ మనిషి వాస్తవంగా ఉత్తరప్రదేశ్‌కి

1. అదే : 15-4-1931
2. జ్ఞాన ప్రకాశ్ : 19-6-1931

చెందిన ముస్లిము నాయకుడుగా నాకు తోచటం లేదు. అలా ఆయన చెప్పుకోవడం అయితే చెప్పుకున్నాడు. బెంగాల్ నాయకుడెవడో అయి ఉంటాడని నాకు అనిపిస్తోంది" అని ఆయన వెళ్లిపోయిన తర్వాత ప్రధాన్‌తో మాట్లాడుతూ డా॥ అంబేద్కరు చెప్పారు. ఈ కలయిక అయిన తర్వాత మరి పదిహేను రోజులకే రాయ్‌ని అరెస్టు చేశారు.

అహమ్మదాబాదులో కొత్త విద్యార్థుల హాస్టలు ప్రారంభించడానికి డా॥ అంబేద్కరు అక్కడకి వెళ్లారు. కాంగ్రెసు కార్యకర్తలు స్టేషనులో ఆయనకు నల్లజెండాలు చూపించారు. జూలై నెల మూడవవారంలో రౌండ్ టేబిలు సమావేంలో పాల్గొనే సభ్యుల పేర్లు ప్రకటించారు. మహాత్మాగాంధీ, జిన్నా సాహబు, బారిస్టరు సప్రూ మొదలైన సభ్యులతో పాటు డా॥ అంబేద్కరుని కూడా ఆహ్వానించారు. ఈ పర్యాయం ఆయనని 'ఫెడరల్ స్ట్రక్చర్ కమిటీ', సభ్యుడిగా చేర్చారు. భారతీయ రాజ్యాంగపు డ్రాఫ్టును తయారుచేసే పని ఈ కమిటీకి అప్పగించారు.

డా॥ అంబేద్కరు నియామకం గురించిన వార్త అన్నిచోట్లా తెలియగానే దేశం నుంచీ, విదేశం నుంచి ఆయనకి అభినందనలు వరసగా అందసాగాయి. డా॥ అంబేద్కరుకి వ్యతిరేకమైన వార్తాపత్రిక 'కులాబా సమాచార్' కూడా ఆయన వాదించిన చిరనేర్ కేసునీ, సైమను కమీషను లోనూ రౌండు టేబిలు సమావేంలోనూ ఆయన వ్యక్తం చేసిన జాతీయ భావాన్నీ ప్రశంసించింది. 'ఇండియన్ డెయిలీ మెయిలు', 'సండే క్రానికల్', 'కేసరి' వార్తాపత్రికలు కూడా ఆయన నియామకాన్ని హర్షించాయి.

రెండవ రౌండ్ టేబిలు సమావేశంలో మహాత్మగాంధీ పాల్గొనడం అన్నది నిశ్చితం కాలేదు. డా॥ అంబేద్కరు డిమాండు వాటి నేపథ్యాన్ని అర్థం చేసుకోవడానికిగాను మహాత్మగాంధీ స్వయంగా అంబేద్కరుని కలుసుకోవాలన్న వాంఛని తెలియచేస్తూ 6.8.1931 న వారిని కలుసుకోవడానికి నిశ్చయించుకున్నారు. డా॥ అంబేద్కరు ఈ ఉత్తరాన్ని ఆశించేలేదు. ఆయన ఆ రోజునే సాంగలీ నుంచి తిరిగివచ్చారు. జ్వరంతో ఒళ్లు కాలిపోతోంది. అయినా 'రాత్రి 8 గంటలకు నేనే మిమ్మల్ని కలుసుకోవడానికి వస్తున్నాను' అని జవాబు పంపారు. సాయంత్రానికి జ్వరం 106 డిగ్రీలకి పెరిగిపోయింది. ఇహ మరో గత్యంతరం లేక "జ్వరం తగ్గాకే

మిమ్మల్ని కలుసుకోవడానికి వస్తాను" అని కబురు చేశారు. 14-8-31 న డా॥ అంబేద్కరు మహాత్మాగాంధీని కలుసుకోవడానికి మధ్యాహ్నసమయంలో బొంబాయిలోని మణిభవన్‌కి వెళ్లారు.

రెండు గంటలకి వారు కలుసుకున్నారు. 'అస్పృశ్యుల సమస్య హిందూ ముస్లిముల సమస్యకన్నా కూడా తమకు ఎక్కువ ముఖ్యమైనది' అని మహాత్మాగాంధీ డా॥ అంబేద్కరుతో అన్నారు. అస్పృశ్యుల పట్ల తమకు ఇంత ఆత్మీయతాభావం ఉన్నప్పటికీ డా॥ అంబేద్కరు తమకు అస్పృశ్యుల నాయకత్వం ఇవ్వడానికి సంసిద్ధత ఎందుకు చూపెట్టటం లేదో తమకు ఆశ్చర్యంగా ఉందని గాంధీజీ అన్నారు. అస్పృశ్యతా నివారణకి ఆయన 20 లక్షల రూపాయిలు ఖర్చు చేశారు. "ఈ రోజు వరకూ ఈ సంగతులు నాకు తెలియవు" అని గాంధీగారి మాటలు వింటునే డా॥ అంబేద్కరు అన్నారు. తన అభిప్రాయాలను చెప్తూ - "కాంగ్రెసు ప్రయత్నాలు అన్నీ పండగ - పబ్బాల్లో కొత్త బట్టలు కుట్టించుకున్న విధంగా ఉన్నాయి. నాసిక్ సత్యాగ్రహాన్ని వ్యతిరేకించేవారి నాయకత్వాన్ని నాసిక్ జిల్లా కాంగ్రెసు కమిటీ అధ్యక్షులు వహించారు" అని అన్నారు. "మీరూ ఆ సత్యాగ్రహం పట్ల తమ వ్యతిరేకతనే ప్రకటించారు" అని ఆయన గాంధీజీ దృష్టికి ఆ విషయాన్ని తెచ్చారు. మొదటి రౌండ్ టేబిలు సమావేశంలో అంబేద్కరు చేసిన పనులను ప్రశంసించి ఆయనను శాంతపరచటానికి ప్రయత్నించడం మొదలుపెట్టేసరికి డా॥ అంబేద్కరు భావావేశానికిలోనై కోపగించుకున్నారు. "మీరు ఇది నా మాతృభూమి అని అంటున్నారు. కాని నేను మరోసారి చెప్తున్నాను. ఇది నా మాతృభూమి కాదు. ఏ అస్పృశ్య వ్యక్తైనా, కాస్తన్నా స్వాభిమానం ఉన్నవాడైతే, మానవత్వం అతనిలో మేల్కొని ఉంటే, కుక్కలూ, పిల్లుల్లాగైనా బతికే అదృష్టం, దేశంలో లేనప్పుడు, మరో మాటల్లో జంతువుల పట్ల చూపించే పాటి జాలీ, సానుభూతి అయినా దొరకనప్పుడు ఈ దేశాన్ని 'ఇది నాదేశం' అని ఎప్పుడూ అనడు. 'బార్డోలీ లో ఏ రైతుల కోసం ఆకాశపాతాళాలని ఏకం చేస్తున్నారో ఆ రైతులు అస్పృశ్యుల పట్ల ఎన్ని అత్యాచారాలు చేస్తున్నారో మీరు ఎప్పుడన్నా దృష్టిపెట్టి ఆలోచించారా ? మా బాధలు ఏడ్పులూ అరుపులూ విని మీకు చీమ కుట్టినట్టైనా లేదు. జాతీయ వార్తాపత్రికలుగా

చెలామణీ అయ్యే మీ పత్రికల్లో మా వార్తలు ప్రచురించడానికి కావలసిన బైపులే లేవు!" అనికూడా ఆయన గాంధీజీతో అన్నారు.[1]

గాంధీజీ గారి వింతైన భావాలను కొన్నిటిని విని డా॥ అంబేద్కరు వ్యాకులపడ్డారు. ఆయన దగ్గర సెలవు తీసుకున్నారు. గాంధీజీతో జరగబోయే యుద్ధానికి ఈ సెలవు తీసుకోవడం నాంది, భేరీనాదం లాగ తోచింది. లండనుకు బయల్దేరే సమయం వరకూ డా॥ అంబేద్కరు అస్పృశ్యుల హితవు కోసం ప్రాణాలొడ్డి పోరాడుతున్న ఏ బ్రాహ్మణ పెద్దమనిషో అని గాంధీజీ భావించారు.

"మీ బానిసత్వాన్ని రూపుమాపడానికిగాను మీరు గట్టిగా నిర్ణయించుకుని, పోరాడ్డానికి నడుం కట్టి, నిలబడితే మేం పడ్డ శ్రమఫలితం అంతా మీకే దక్కుతుంది." అని తన మనస్సులోని ఆవేదనని మాటలరూపంలో, బొంబాయిలోని కావసజీ జహంగీరు హాలులో దళిత మహిళల ద్వారా ఆగష్టు 14 వ తారీఖున ఏర్పాటు చేసిన వీడ్కోలు సమావేశంలో ఆయన వ్యక్తంచేశారు. "మీ అందరి ప్రేమాభిమానాలు నాకు ఎప్పుడూ ప్రేరణని ఇస్తున్నాయి. ఈ రౌండు టేబిలు సమావేశంలో 125 సభ్యులలో మనసంఖ్య కేవలం రెండు. కాని మీ హక్కుల కోసం ఆకాశ పాతాళాలని మేం ఏకం చేస్తాం. ఘర్షణ పడకుండా అధికారం లభ్యం కాదు. ప్రతిష్ఠ దొరకదు." అని అక్కడే పురుషుల సభని సంభోధిస్తూ డా॥ బాబాసాహబు అన్నారు.

ఆ మర్నాడు ఆగష్టు 15వ తారీఖున 'సమతాదళ్' స్వయం సేవకులు 2000 మంది అంబేద్కరుకి బేలార్డు పియర్ హార్బరులో వీడ్కోలు చెప్పారు. "అంబేద్కర్ - జిందాబాద్ ! నినాదాలతో, జేజేలతో ఆకాశం మారుమోగింది. డా॥ అంబేద్కరుతో పాటు అనేకమంది సభ్యులు కూడా 'ఎస్.ఎస్. ముల్తాను' స్టీమరులోనే బయల్దేరారు. ఆ సమయానికి సముద్రంలో బ్రహ్మాండమైన తుఫాను లేచింది. దాంతో ఓడలో ప్రయాణిస్తున్న వారిలో చాలామందికి కడుపులో తిప్పు మొదలయింది. కాని డా॥ అంబేద్కరు, ఎన్.ఎమ్. జోషి, మౌలానా శౌకత్ ఆలీ మాత్రం ఈ తిప్పు లేకుండా ఉన్నారు.

1. పంజానా : పే. 240-41

డా॥ అంబేద్కరు చాలా సంతోషంగా ఉన్నారు. గతదినం మనస్సుని ఆవరించిన విషాదం స్థానంలో ఉల్లాసం చోటు చేసుకుంది. తన గడిచిన జీవితాన్ని ఆయన సింహావలోకనం చేసుకున్నారు. "నా ప్రజలను ఉద్ధరించటానికి గాను భగవంతుడు నన్ను నిమిత్త సాధనంగా చేసి ఈ అవకాశాన్ని యిచ్చాడు. నన్ను తన మాధ్యమంగా చేసుకున్నాడు. ఇది నా గట్టి నమ్మకం, భావం. ఈ పనుల వల్ల లభించే సంతృప్తి చాలా దుర్లభమైనది. ఎక్కడో అదృష్టవంతులకి మాత్రమే ఇది దక్కుతుంది" అని అప్పటి తన అనుభూతిని తన పత్రిక 'జనత' రాసిన ఉత్తరంలో ఆయన వ్యక్తం చేశారు.

ఈ స్టీమరులో డా॥ అంబేద్కరు బొంబాయి పోలీసు కమీషనరు మిస్టర్ విల్సనుని కలుసుకున్నారు. ఆయన 'సమత సైనికదళ్' నవయువకుల క్రమశిక్షణని చాలా మెచ్చుకున్నారు. అదివిని అలాంటప్పుడు మీ పోలీసుశాఖ వారు ఈ యువకులను ఎందుకు ఉపేక్షిస్తున్నారు ? "అని డా॥ అంబేద్కరు అడిగారు. తెలివితక్కువతనమే అనుకోండి. నేనైతే దీనిని వెర్రితనం అంటాను. వాళ్లలో కొంతమంది యువకులని నేను స్వయంగా పోలీసుశాఖలో చేర్పించాలని యోచిస్తున్నాను." అని విల్సను జవాబు చెప్పారు. పోలీసు కమీషనరు ఇచ్చిన ఈ హామీ ఉత్సాహాన్ని కలిగించేది. 'సమత సైనిక్ దళ్' క్రమశిక్షణ గురించి డా॥ ముంజె, డా॥ జయకర్ లాంటి హిందూ నాయకులు కూడా చాలా ప్రశంసించారు.[1]

ఈ పర్యాయం డా॥ సాహెబు తోటి ప్రయాణీకుల ప్రవర్తనలో చాలా తేడా కనిపించింది. గత పర్యాయం మొదటి సమావేశానికి ప్రయాణమై వెళ్లినప్పుడు మనం అంతమందిమీ కలిసి ఒకే లక్ష్యంతో ఇంగ్లీషు వారిని ఎదురుకోవాలి అనే భావం ప్రతినిధులందరిలో కనిపించింది. ఈసారి అలాంటి మొగ్గు లేదు. ఈసారి రాజులు మహారాజుల గ్రూపు వేరు. అందు లోనూ ముస్లీము సంస్థానాలది ప్రత్యేకమైన దళం. గొప్ప వంశాలకు చెందిన వారూ, 'ధనికులూ అయిన ముస్లీముల తెగ వేరు, సామాన్యుల గ్రూపు వేరు. జమీందార్లు వేరు. సంస్థానాధీశ్వరులు వేరు. ప్రతినిధులందరూ వేరువేరు జట్టులుగా విడిపోయినట్టుగా డా॥ అంబేద్కరుకి కనిపించారు.

1. **జనత :** 14-9-1931.

మొదటి రౌండ్ టేబిలు సమావేశంలో డా॥ అంబేద్కరుని 'ఫెడరల్ స్ట్రక్చర్ కమిటీ' కి తీసుకోలేదు. కాని ఈసారి న్యాయశాస్త్రం - చట్టాల గురించి ఆయనకున్న లోతైన జ్ఞానాన్నీ, అధ్యయనాన్నీ దృష్టిలో ఉంచుకుని ఆయనని కమిటీలోకి తీసుకున్నారు.

ఆగష్టు 20వ తేదీన ఉదయం సుమారు ఆరుగంటలకు డా॥ అంబేద్కరు 'ఏడన్' చేరుకున్నారు. అక్కడ ఏడన్ వాస్తవ్యుడైన గొప్ప ధనిక వ్యాపారి ప్రతినిధులందరినీ విందుకు ఆహ్వానించాడు. ఇష్టం లేకపోయినా డా॥ అంబేద్కరుకు ఈ ఆహ్వానాన్ని స్వీకరించవలసి వచ్చింది.

విందు తర్వాత ఓ బ్రిటిషు మహిళ పట్టు పట్టి కోరగా ఆయన ఏడన్, అక్కడికి సమీపంలో ఉన్న పురాతన సరోవరాన్ని చూడ్డానికి వెళ్లారు. 'జనత' వార్తాపత్రికకి రాసిన తన ఉత్తరంలో డా॥ అంబేద్కరు ఈ ప్రయాణాన్ని ఎంతో సరదాగా వర్ణించారు.[1]

"మహాత్మాగాంధీ ఈ రౌండ్ టేబిలు సమావేశానికి హాజరయేటట్టు ప్రయత్నించండి' అని ఆ ఓడలో ప్రయాణం చేస్తున్న ప్రతినిధులందరూ వైస్రాయి మహాశయులకి ఓ తంతిని పంపించారు. డా॥ అంబేద్కరు కూడా ఈ అభ్యర్థన పత్రంలో తమ సంతకం పెట్టారు. మహాత్మాగాంధీ కూడా ఈ పరిషత్తుకి దూరంగా ఉండేకన్నా ఇందులో పాల్గొనడమే ఎక్కువ ఉచితంగా ఉంటుందని డా॥ అంబేద్కరుకి కూడా అనిపించింది.

ఆగష్టు 29 తేదీన లండను చేరగానే డా॥ అంబేద్కరుకి ఇన్ఫ్లుయంజా వచ్చింది. ఆయనకి విరోచనాలు వాంతులూ అవడం మొదలెట్టాయి. సెప్టెంబరు 7వ తేదీ నాటికి కొద్దిగా ఆరోగ్యం చిక్కింది. కానీ నీరసం తగ్గలేదు. ఇంట్లో ఈ జబ్బు గురించి తెలియనియ్యవద్దని ఆయన శ్రీ శివతరకర్కి రాసిన ఉత్తరంలో సూచించారు.

మహాత్మాగాంధీ ఈ రోజుల్లోనే 1931 ఆగష్టు 29 తేదీన బయల్దేరి సెప్టెంబరు 12వ తేదీకి సమావేశంలో పాల్గొనడానికి లండను చేరుకున్నారు. రెండవరౌండ్టేబిలు సమావేశం ప్రారంభం అయింది. దానికి మహాత్మాగాంధీ ఆయన సహచరులు పండిత మదన మోహన్ మాలవ్యా, సరోజినీనాయుడు మొదలైనకాంగ్రెసుప్రతినిధులు హాజరయ్యారు. బ్రిటనులో లేబరు పార్టీ ప్రభుత్వానికి బదులు ఇప్పుడు అక్కడ జాతీయ మంత్రిమండలి

1. జనత : 14-9-1931

స్థాపించబడింది. బ్రిటిషు ప్రధానమంత్రి మెక్‌డోనాల్డుకి అస్పృశ్యుల పట్ల సానుభూతి ఉన్నది. కాని చర్చిల్‌కి అధికార మార్పిడి అంగీకారం కాదు.

మహాత్మాగాంధీ 1931 సెప్టెంబరు 31వ తేదీన 'ఫెడరల్ స్ట్రక్చరు కమిటీ' లో తన మొదటి ఉపన్యాసాన్ని ఇచ్చారు. కాంగ్రెస్ దేశంలోని హిందువులు ముస్లిములు, అస్పృశ్యులు, సంస్థానాల్లోని ప్రజానీకం మొదలైన వారి అందరికీ ప్రాతినిధ్యం వహిస్తుంది. ఆయన కాంగ్రెసు ప్రతినిధిగా వచ్చిన కారణంచేత అన్నివర్గాల వారి ప్రాతినిధ్యం వహిస్తున్నారు; అని ఆయన తన ఉపన్యాసంలో చెప్పారు. డా॥ అంబేద్కరు, గాంధీగారి ఉపన్యాసపు ఇంగితాన్ని వెంటనే పసికట్టేశారు. ఈ సంస్థానాల వాళ్ల డిమాండ్లను మేం అంగీకరించం. సర్వసామాన్య ప్రజానీకం నాగరికంగా, సభ్యతతో సంస్కార వంతమైన జీవితాన్ని జీవించడానికి కావలసిన అవసరాలనన్నిటినీ తీరుస్తా మని ఈ సంస్థానాలను పాలించే పాలకులందరూ హామీ ఇవ్వాలి. దాంతో పాటు, సంస్థానాల్లో ఎన్నికల ద్వారా ప్రజల ప్రతినిధులకు స్థానం ఇవ్వాలి. నియమించే పద్ధతి బాధ్యతాయుతమైన ప్రభుత్వ సిద్ధాంతాలకు వ్యతిరేకమై నది" అని అదే రోజు మధ్యాహ్నం ఉపన్యసిస్తూ అంబేద్కరు హెచ్చరిం చారు. డా॥అంబేద్కరుగారు స్పష్టంగా చెప్పిన దానికి రాజులు మహారాజులు నవాబులు విస్తుపోయారు. వాళ్ల మొహాలు నల్లగా మాడిపోయాయి.

ఈ రౌండ్ టేబిలు సమావేశపు 'ఫెడరల్ స్ట్రక్చర్ కమిటీ' లో సంస్థానాల ప్రజల తరఫున చాలా స్పష్టమైన ధోరణిని డా॥ అంబేద్కరు అవలంబించారు. తన ఈ నిర్ధారించబడిన రీతిని కార్యరూపంలో పెట్టడానికి గాను ఆయన కొంతమంది ప్రతినిధి సభ్యుల సంతకాలతో ఒక పత్రాన్ని ఇంగ్లండు ప్రధానమంత్రికి పంపించారు. సంస్థానాల్లో, సంస్థల్లో ప్రతినిధులు ప్రజలద్వారా ఎన్నుకున్న వక్తులే ఉండాలి అన్న అంశాన్ని దృఢంగా సూచించారు. అనేకమంది భారతీయ నాయకులు బ్రిటిషు నాయకులు ప్రముఖులైనవారు ఈ పత్రాన్ని వెనక్కి తిరిగి తీసేసుకోవలసినదిగా డా॥ అంబేద్కరుని కోరారు. డా॥ అంబేద్కరు నిరాకరించారు. బ్రిటిషు పరిపాలనలోని భారతదేశపు కొందరి నాయకుల యుక్తి కారణంగా ఆయన ప్రయత్నాల వల్ల ఏ ప్రయోజనమూ సిద్ధించలేదు.[1]

1. మాఝ్యా విలాయతచ్యా ఆఠవణీ - అణ్ణా సాహబు లట్టే : ప్రకాశకులు : జి.ఆర్. తెందూల్కర్, తరుణ భారత ప్రెస్సు, బెల్గాం - 1936

రెండవ రోజున, సంస్థానాల్లో ఏం చెయ్యాలో ఏం చెయ్యక్కర్లేదో చెప్పడానికి మనకి హక్కు లేదు అని మహాత్మాగాంధీ తమ ఉపన్యాసంలో అన్నారు. ఆయన ఈ వాక్కులు, సంస్థానాల ప్రజల హితానికి విరుద్ధంగా ఉన్నాయన్న ఊహే ఆయనకి లేదు. 'కాంగ్రెసు అంటరానివారి హితం కోసం అన్నీ చేస్తోంది. అంచేత అంటరానివారికి ప్రత్యేకంగా ప్రాతినిధ్యం యిచ్చే పథకాన్ని ఆయన గట్టిగా వ్యతిరేకిస్తారు' అని వేరువేరు సముదాయాల ప్రాతినిధ్యం గురించి మాట్లాడుతూ మహాత్మాగాంధీ చెప్పారు. సెప్టెంబరు 18వ తేదీన అంబేద్కరు, సెప్టెంబరు 16వ తేదీన గాంధీగారు చెప్పిన భావాలు ఆయన స్వంత భావాలా లేక కాంగ్రెసు భావాలా ? అని గాంధీగారిని ప్రశ్నించారు. దీంతో సభ్యుల్లో తత్తరపాటు కలిగింది. కమిటీ ప్రతి సమావేశంలోనూ డా॥ అంబేద్కరు పాండిత్యం, రాజ్యాంగ విషయాల్లోని విద్వత్తు, వాక్పటిమ, ప్రతిభ అందరినీ ఆకట్టుకుంటూనే ఉంది.

వయోజన వోటు హక్కును పొందడానికిగాను రౌండు టేబిలు సమావేశంలో డా॥ అంబేద్కరుకి ఎంతో దెబ్బలాడవలసి వచ్చింది. కాంగ్రెస్సు కూడా వయోజన వోటు హక్కుని డిమాండు చేస్తోంది. కాని రౌండు టేబిలు సమావేశంలో సామాన్య ప్రజల హక్కుల కోసం డా॥ అంబేద్కరు ఉపన్యాసాలతో చేసిన ముట్టడి చూసి తీరవలసినదే. విని ఆనందించవలసినదే. "కొంతమంది విశిష్ట వ్యక్తులకే ఓటు హక్కు ఇస్తే ఆ ఏర్పడే ప్రభుత్వం అల్ప సంఖ్యాకుల ప్రభుత్వం అవుతుంది. అధిక సంఖ్యాకుల బాగోగుల కళ్లెం అల్పసంఖ్యాకుల చేతికి వస్తుంది. ఇదీ దాని పరిణామం" అని ఆయన చెప్పారు.

"నా అభిప్రాయంలో ఈ రౌండు టేబిలు సమావేశంలో రెండంటే రెండు సమస్యల మీద ఆలోచించవలసిన అవసరం ఉన్నాది. భారత దేశానికి బాధ్యతాయుతమైన పరిపాలనా వ్యవస్థని యివ్వాలా ? ఇచ్చినట్లయితే పరిపాలన ఎవరికి జవాబుదారీగా ఉండాలి ? ఎవరిపట్ల బాధ్యత వహించాలి ? బాధ్యతాయుత ప్రభుత్వపు హక్కును అడిగేవారిలో కొంతమంది భారతీయులు యావన్మందికీ ఓటుహక్కు ఇవ్వడానికి సిద్ధంగా లేరు. ఇది నాకు విస్మయాన్ని కలిగిస్తోంది[1] అని ఓటుహక్కుల సబ్ కమిటీలో ఉపన్యాసం ఇస్తూ డా॥ అంబేద్కరు అన్నారు. డబ్బూ - ఆస్తి, చదువూ -

1. డా॥ అంబేద్కరు, పయనీర్ ఆఫ్ హ్యూమన్ రైట్స్, పే. 141

సంధ్యా లేని కారణంగా ప్రభుత్వాన్ని ఎన్నుకునే హక్కు లేకుండా చేయడానికి వీలు లేదు. ప్రతి భారతీయుడికీ ఆ హక్కు ఉండాలి. అన్నదే ఆయన ఖచ్చితమైన అభిప్రాయం. ఒకవేళ వయోజన ఓటుహక్కు గాని లభ్యం కాకుండా ఉంటే భారతీయ ప్రతినిధులందరూ వలసదేశ స్వరాజ్యాన్ని కూడా డిమాండు చేయవద్దు. పరిషత్తు మీటింగు నుండి నిష్క్రమించండి అని ఆయన ప్రతినిధులందరికీ పిలుపునిచ్చారు.

ఓటు హక్కు అంటే అర్థం వ్యక్తి తన జీవితాన్ని, ఆస్థిని స్వాతంత్ర్యాన్ని భద్రపరుచుకునే హక్కు అని ఆయన చెప్తూ ఉండేవారు. రెండవ రౌండ్ టేబిలు సమావేశంలో మహాత్మా గాంధీ, తదితర కాంగ్రెసు ప్రతినిధులు కూడా వయోజన ఓటుహక్కుని డిమాండు చేశారు.

ఆస్థి - సంపద, విద్య లేక ఇతర ఏ కారణం చేతనైనా ఏ వయోజన భారతీయుడూ ఓటుహక్కు లేకుండా ఉండకూడదు. "మనిషి చదువు కోనివాడు అయినా వివేకం కలవాడు అవుతాడు. తన హితం ఏదో చక్కగా తెలుసుకోగలుగుతాడు. బీదరికం కారణంగా ఎవరైనా తమ రాజ్య ప్రతినిధిని ఎన్నుకోలేకపోతే అది ఘోర అన్యాయం అవుతుంది.[1]

సంస్థానాల సార్వభౌమిక పరిపాలన విషయంలో సామాన్య ప్రజల హక్కుల పట్ల అప్రమత్తంగా ఉండాలన్నదే డా॥ అంబేద్కరు వాదం. వలసదేశ స్వరాజ్యం లభ్యం అయితే సంస్థానాలు బ్రిటిషు చక్రవర్తి అధీనంలో ఉంటాయి. భారతదేశానికి సంపూర్ణ స్వాతంత్ర్యం లభిస్తే సంస్థానాలు భారత ప్రభుత్వపు అధీనంలో ఉంటాయి. వాటికి ఇంకే విదేశీ ప్రభుత్వంతో ఒప్పందాలు చేసుకునే హక్కు ఏదీ ఉండదు. ఇదీ ఆయన స్పష్టమైన అభిప్రాయం.[2] అంచేతే 'స్టేట్స్ అండ్ మైనారిటీస్' అనే విషయం మీద రాజాంగ కమిటీకి తాను ఇచ్చిన రిపోర్టులో స్వతంత్ర్య భారతదేశంలో భారతీయ సంస్థానాల స్థానం ఏమిటి అనేదాన్ని గురించి విపులంగానే నమూనా స్కెచ్‌ని పొందుపరచారు.

సెప్టెంబరు 28వ తేదీన అల్ప సంఖ్యాకుల కమిటీ మీటింగు నిర్ధారించారు. దానికి ముందే దేవదాసు గాంధీ ద్వారా డా॥ అంబేద్కరుకి

1. ఇండియన్ స్టేట్యుటరీ కమీషను, వాల్యూము 3, పే 113
2. ఇండియన్ కానిస్టిట్యూషనల్ డాక్యుమెంట్స్, వాల్యూమ్ - 4, ఎ. ముఖర్జీ అండ్ కం. పె. లి. 1963, పేజి. 347-48

మహాత్మాగాంధీని కలవవలసినదిగా ఆహ్వానం అందింది. సరోజినీనాయుడి ఇంట్లో రాత్రి తొమ్మిది గంటల నుంచి 12 గంటల వరకూ చర్చ సాగింది. కాని గాంధీ తన అభిప్రాయం ఏదీ ప్రకటించలేదు. సెప్టెంబరు 28వ తేదీన అల్పసంఖ్యాకుల కమిటీలో 'మహాత్మాగాంధీ ముస్లిం ప్రతినిధులతో కలవనున్నారు. అంచేత ఈ మీటింగుని వాయిదా వెయ్యాలి" అని ఆగాఖాను సూచించారు. గాంధీజీ, ముస్లిము ప్రతినిధుల మధ్య రహస్య మంతనాలు జరుగుతున్నాయన్న సంగతి డా|| అంబేద్కరుకి తెలిసిపోయింది. అస్పృశ్యుల హక్కుల గురించి గాంధీ గారి అభిప్రాయం ఏమిటో కూడా ఆయనకి తెలిసింది. అంచేత 'గాంధీజీ' కాంగ్రెసు కానీ, మరి దేనికి కాని ప్రాతినిధ్యం వహించనీ, ఆయన ద్వారా చేయబడిన ఏ ఒప్పందం మాకు అంటే అస్పృశ్యులకు అంగీకారము కాదు. మా ఒంతులోని ఏ భాగాన్నీ ఎవరికీ ఇవ్వడానికి వీలులేదు. మేం ఏ ఒప్పందపు బంధనాల్లోకి రాము" అని ఆయన వెంటనే గట్టిగా చెప్పారు. డా|| అంబేద్కరు స్పష్టీకరణ తర్వాత ప్రధానమంత్రి ద్వారా మీటింగు వాయిదా వెయ్యబడ్డాది.

గాంధీజీ అక్టోబరు ఒకటవ తేదీన మళ్లీ సమయం అడిగారు. "ఈ ఒప్పందం సంభాషణలో అస్పృశ్యులకి ఏదన్నా స్థానం ఉందా లేదా ?" అని డా|| అంబేద్కరు నిలదీసి అడిగారు. గాంధీగారు దానికి అంగీకారం తెలపగానే అంబేద్కరు స్పష్టమైన మాటల్లో ఇలా చెప్పారు - "ఇప్పటి వరకూ గాంధీగారితో జరిపిన చర్చలవల్లా, ఆయన వెలిబుచ్చిన అభిప్రా యాలవల్లా ఆయన అస్పృశ్యులని, యాంగ్లో ఇండియన్‌లని, ఇండియన్ క్రిష్టియన్లని అల్పసంఖ్యాకులుగా అంగీకరించడానికి సిద్ధంగాలేరని తేటతెల్ల మవుతోంది. భవిష్యత్తులోని భారతీయ రాజ్యాంగంలో అస్పృశ్యులకు స్థానం లభ్యం కాకపోతే మేం ఏ కమిటీలో కాని ఏ చర్చలో కాని పాల్గొన డానికి సుతరామూ ఇష్టపడము."

దీని తర్వాత దాదాపు ఒక వారంపాటు గాంధీజీ ముస్లిము ప్రతినిధులతో చర్చ సాగించారు. ఆయన వారు పెట్టిన 14 షరతులను కూడా అంగీకరించారు. అయినా సిక్కులు, ముస్లిముల సమస్య గురించిన సంభాషణలు విజయవంతం కాలేదు. ఈ సంభాషణలు విజయవంతం కాకపోవడానికి బాధ్యతని భారతదేశపు ఇతర ప్రతినిధుల నెత్తిని రుద్ది గాంధీజీ అక్టోబరు ఎనిమిదివ తారీఖున ఇచ్చిన ఉపన్యాసంలో ఆ ప్రతినిధులు

ప్రజాప్రతినిధులు కారని ఆరోపించారు. గాంధీగారి ఈ ఆరోపణని తీవ్రంగా విమర్శిస్తూ తాము అస్పృశ్యులకు ఎలా వాస్తవంగా ప్రాతినిధ్యం వహిస్తున్నదీ గాంధీజీ మాటలకి ప్రతిస్పందించి చెప్పారు. అస్పృశ్యులకి కాంగ్రెసు మీద బొత్తిగా నమ్మకం లేదు అనికూడా ప్రమాణాలు చూపెడుతూ ఆయన ఋజువు చేశారు. డా॥ అంబేద్కరు ఇంతటితో శాంతించలేదు. అక్టోబరు 2వ తారీఖున ఆయన 'టైమ్సు ఆఫ్ ఇండియాకి' ఒక ఉత్తరం రాశారు. ఎల్లాగా గాంధీజీ ముస్లిముల డిమాండ్ల కోసంగాను అస్పృశ్యులకి బేరం పెట్టారో పూర్తి వివరణని ఆయన ఆ లేఖలో ఇచ్చారు. గాంధీజీ వాస్తవానికి అస్పృశ్యుల శత్రువు కూడా కారు అనికూడా ఆయన దానిలో చెప్పారు.

లండనులోని రౌండ్ టేబిలు సమావేశపు వార్తలు భారతదేశం అంతటికీ అందాయి. అస్పృశ్యులు అనేక చోట్ల వేలకొద్దీ సభలు చేసి డా॥ అంబేద్కరే తమ వాస్తవమైన ప్రతినిధి అని తీర్మానాలు చేశారు. ఈ తీర్మానాలని తంతిద్వారా ప్రభుత్వానికి పంపారు. నాసిక్ సత్యాగ్రహంలో కూడా డా॥ అంబేద్కరు వాదాన్ని బలపరచటానికి సహకరించారు.

తన లండను యాత్రలో అక్కడ ఉంటూ కూడా అనేక రకాలైన రిపోర్టులని, వివరణలని అంబేద్కరు సమర్పించారు. గాంధీగారి అభిప్రాయాలు ఎంత కృత్రిమమైనవో, ఎంత ఆడంబర పూర్ణమైనవో ఆయన 'ఇనిస్టిట్యూట్ ఆఫ్ ఇంటర్‌నేషనల్ అఫైర్సు' అనే సంస్థ ఏర్పాటు చేసిన సభలో ఇచ్చిన ఉపన్యాసంలో తేటతెల్లం చేశారు. గాంధీ లండనులో మ్యూరియల్ లెస్టర్ ఇంట్లో దిగారు. ఈ మహిళ కూడా అంబేద్కరు వాదనని అర్థం చేసుకోవడానికి ప్రయత్నించింది. గాంధీగారి మీద తీక్షణమైన వ్యాఖ్యానాలు తీవ్రమైన విమర్శలు చేసిన కారణంగా భారతదేశపు వార్తాపత్రికలు డా॥ అంబేద్కరుని గట్టిగా దుయ్యబెట్టాయి. ఆయనని దేశద్రోహి అనికూడా ప్రకటించాయి.

అల్పసంఖ్యాకుల సమస్యకి సర్వాంగీకార పరిష్కారం కుదిరేటట్టుగా కనిపించకపోగానే బ్రిటను ప్రధానమంత్రి మెక్‌డొనాల్డు ప్రధానమంత్రి మధ్యవర్తిత్వంతో ప్రభుత్వం ఏ నిర్ణయం చేస్తే ఆ నిర్ణయాన్ని అందరమూ అంగీకరిస్తాం అని అంతమంది ప్రతినిధులు వ్రాతమూలకంగా హామీ యివ్వాలని సూచించారు. ఆయన సూచనని ప్రతినిధులు అందరూ అంగీకరించారు. ఈ విజ్ఞప్తి మీద మహాత్మాగాంధీ సైతం సంతకం పెట్టారు.

దీనిమీద సంతకం పెట్టడానికి ముందు సర్ మీర్జా ఇస్మాయిలు నివాసంలో గాంధీ అంబేద్కరు కలుసుకున్నారు. అయితే గాంధీగారి సూచనలు అంబేద్కరుకి అసంభవంగాను, విచిత్రంగాను, అనుచితంగాను, ఆచరణకి అయోగ్యమైనవిగాను తోచాయి. దాంతో ఆయన అక్కణ్ణించి బయటికి వచ్చేశారు. "భారతదేశపు నాయకుల్లో గాంధీగారి మహత్తరమైన కరిష్మా ఏమాత్రం పడని ఒకే ఒక్క నాయకుడు డా॥ అంబేద్కరే."[1] డిసెంబరు ఒకటవ తారీఖున బ్రిటను ప్రధానమంత్రి పరిషత్తుని ముగించారు. 1931 నవంబరు ఐదవ తారీఖున ఇంగ్లండు చక్రవర్తి రౌండ్ టేబిలు సమావేశానికి హాజరైన ప్రతినిధులకు విందుకు ఆహ్వానించారు. ఆ విందులో అంబేద్కరు నోట భారతదేశపు దళితుల కథ విని చక్రవర్తిగారి మనస్సు కరిగిపోయింది.

డా॥ అంబేద్కరు విదేశంలో ఉన్న రోజుల్లో బొంబాయి ప్రభుత్వం ఆయనని "జస్టిస్ ఆఫ్ పీస్" గా నియమించింది. పరిషత్తు పూర్తయిన తర్వాత పుస్తకాలతో నిండిపోయి ఉన్న పెట్టెలు సుమారు ముప్పై రెండింటిని ఆయన శ్రీ శ్రీనివాసన్‌తో పాటు భారతదేశానికి పంపారు. ఓ నెల రోజులు విశ్రాంతి తీసుకోవడానికి ఆయన అమెరికా వెళ్లారు. అమెరికా నుంచి 1932 జనవరి 4వ తేదీన ఆయన తిరిగి లండను వచ్చారు. తరువాత భారతదేశానికి బయల్దేరారు. జనవరి 29వ తారీఖు ఉదయం 8 గంటలకి ఆయన ఓడ బొంబాయి హార్బరుకి చేరింది. ఆయనకి స్వాగతం చెప్పడానికి గాను వేలసంఖ్యలో దళితులు అక్కడకి వచ్చి ఉన్నారు. అదే సమయంలో ముస్లిము నాయకుడు మౌలానా శౌకత్ ఆలీకి స్వాగతం చెప్పడానికి ముస్లిములు కూడా హార్బరుకి వచ్చి ఉన్నారు. అంచేత రెండు సముదాయాల వారూ ఇద్దరు నాయకులని ఏకంగా ఓ ఊరేగింపులో తీసుకువెళ్లారు. ఊరేగింపు భాయఖలా మీదుగా పరేలు వరకూ వెళ్లింది.

ఆ రోజునే 114 సంస్థల తరపున డా॥ అంబేద్కరుకి సన్మానపత్రం సమర్పించారు. ఈ సందర్భంలో డా॥ అంబేద్కరు పులకితులయ్యారు. ఆయన తన విజయాలన్నిటికీ ప్రజలే కారణమని చెప్పారు. "నేను నా దేశం కోసం సరియైన మంచి పని చేశాను అని హిందూ సమాజపు రాబోయే తరం తీర్పు ఇస్తుంది" అని అన్నారు. "మీరు నన్ను దేవుణ్ణి చెయ్యకండి" అనికూడా ఆయన చెప్పారు.

1. సత్యాగ్రహి, గ్రహ ఆణీతారె, దేశముఖగ్రాణి కంపెనీ, 191 శనివార్‌పేఠ్, పూనా - 2

ఓటుహక్కు, ఎలక్షన్ల సీట్లను నిర్ధారించటానికి 'లోథియన్ కమిటీ' ఏర్పడింది. ఆ కమిటీ కార్యకలాపాల్లో పాల్గొనడానికిగాను డా॥ అంబేద్కరు ఢిల్లీకి బయల్దేరారు. ఈ ప్రయాణంలో ప్రతి పెద్ద స్టేషనులోనూ ఆయనని సన్మానించారు. 1932 ఫిబ్రవరిలో అంబేద్కరు ఈ కమిటీతో పాటు బీహారు వెళ్లారు. ఈ సందర్భంలో అక్కడి అస్పృశ్యులు చెప్పరానంత ఉత్సాహంతో ఆయనకి స్వాగతం పలికారు.

కేంద్ర విధానమండలిలో రాయబహదూర్ ఎమ్. సి. రాజా ఒక్కరే అస్పృశ్య సభ్యులు. ఆయన 'డిప్రెస్‌డ్ క్లాసెస్ పరిషత్' ని ఏర్పాటు చేశారు. ఈ తీర్మానాన్ని ఆమోదించినట్టు ఆయన డా॥ అంబేద్కరుకు తెలియ చేశారు. ఆ ప్రకారం డా॥ అంబేద్కరు కూడా ప్రత్యేక నియజకవర్గానికి, రిజర్వుడ్ సీట్లకోసం తమ డిమాండ్లను సమర్పించారు. కాని 1932 ఫిబ్రవరి 3వ వారంలో శ్రీ రాజా తమ అభిప్రాయాన్ని మార్చుకుని డా॥ ముంజెతో ఒప్పందం చేసుకున్నారు. ప్రధానమంత్రికి అస్పృశ్యులకు సంయుక్త నియోజకవర్గం, రిజర్వుడు సీట్లు ఉండాలని తంతిద్వారా సూచించారు.

1932 ఫిబ్రవరి 28వ తారీఖున మద్రాసులో డా॥ అంబేద్కరుకు ఘనంగా స్వాగతం చెప్పారు. ఈ సభలో పదివేలమందికి మించి అస్పృశ్యులు, ఆది ద్రవిడులు, ఆది ఆంధ్రులు, కేరళ వాస్తవ్యులైన అస్పృశ్య ముస్లిములు, క్రైస్తవులు, బ్రాహ్మణేతరులు మొదలైన అన్ని సమాజాల తరుపున ఆయనకి సన్మాన పత్రాలు సమర్పించారు. శ్రీ రాజా ఎల్లాగా అస్పృశ్యులకి నమ్మకద్రోహం చేసిందీ ఆయన తన ఉపన్యాసంలో వివరించి చెప్పారు.

రాజా - ముంజెల ఒప్పందం గురించిన వార్త తెలుసుకుని బెంగాలు, అస్సాంలోని అస్పృశ్య నాయకులు డా॥ అంబేద్కరును సమర్థిస్తూ పేపరు అచ్చువేశారు. బెంగాలుకి చెందిన "నామశూద్ర ఎసోసియేషను" కలకత్తాలోని అల్బర్ట్ హాల్లో సభని ఏర్పాటుచేసి డా॥ అంబేద్కరుని సహకరిస్తున్నామని హామీ ఇచ్చారు. 'లోథియన్ కమిటీ' కార్యకలాపాలు 1932 మే ఒకటవ తేదీన ముగిసాయి. డా॥ అంబేద్కరు కమిటీతో చర్చించడానికి గాను మరో రెండు మూడు రోజులు సిమ్లాలో ఆగారు. అంబేద్కరు కోరిన స్పష్టీకరణ ప్రకారం కమిటీ డిప్రెస్డ్ క్లాసు అంటే అస్పృశ్య వర్గంగా అర్థం చెప్పాలన్న దానికి అంగీకారం తెలిపింది. ఇది డా॥అంబేద్కరు గెలుపు. కమిటీకి ఇచ్చిన రిపోర్టుకి తమ యోచనలతో కూడిన ఓ పత్రాన్ని వేరుగా జోడించారు.

# పంథొమ్మిది

## కుల మత నిర్ణయం

నాగపూర్ దగ్గర కామఠీ పట్టణంలో అఖిలభారతీయ డిప్రెస్డ్ క్లాసు వారి సభ రౌండ్ టేబిలు సమావేశం వల్ల కలిగిన లాభాలను, నష్టాలను చర్చించేందుకుగాను బేరీజు వేసి చూడ్డానికి గాను ఏర్పాటు చేయబడ్డాది. దీనికి అధ్యక్షత వహించడానికి డా॥ అంబేద్కరు 1932 మే 6వ తేదీన బొంబాయి నుంచి కామఠీకి బయల్దేరారు. త్రోవలో ప్రతి స్టేషన్లోనూ దళిత జనులు ఆయనకి స్వాగతం చెప్పారు. మరుచటిరోజు ఆయన నాగపూర్ చేరుకున్నారు. వేలాదిజనం ఆయనకి స్వాగతం పలకడానికి స్టేషన్కి వచ్చారు. ఈ స్వాగతోత్సవంలో వందలాది మహిళలు ఒక్కొక్క ఆరతి పళ్లెంలో ఐదేసి దీపాలు పెట్టి ఆయనకి ఆరతి ఇచ్చారు. ఈ స్వాగతోత్సవం తర్వాత డా॥ అంబేద్కరుని, శ్రీనివాసన్ని బ్రహ్మాండమైన ఊరేగింపుతో నాగపూర్ నుంచి కామఠీకి తీసుకువెళ్లారు.[1]

1932 మే 7వ తేదీ సాయంత్రం ఐదు గంటలకు దళిత కాంగ్రెసు సమావేశం కామఠీలో ప్రారంభం అయింది. స్వాగతాధ్యక్షుడు శ్రీ ఎల్.ఎల్. హర్దాస్ మొట్టమొదట ఉపన్యసించారు.

సమావేశం నామినేటెడ్ అధ్యక్షుడు మునిస్వామి పిల్లై ప్రత్యేక నియోజకవర్గాన్ని సమర్థిస్తూ రెండు గంటల సేపు ఉపన్యసించారు. రాజా-ముంజె ఒప్పందానికి వ్యతిరేకంగా అందరూ నిప్పులు చెరిగారు.

రెండవరోజు సమావేశంలో 12 తీర్మానాలను ఆమోదించారు. రాజా-ముంజె ఒప్పందం అస్పృశ్యుల హితానికి విరుద్ధమైనది అని స్పష్టంగా ప్రకటించారు. రౌండ్ టేబిలు సమావేశంలో డా॥ అంబేద్కరు శ్రీనివాసన్ చేసిన కృషిని ప్రశంసించారు. ఈ సమావేశానికి భారతదేశపు అన్ని రాష్ట్రాల నుండి వందలాది ప్రతినిధులు వచ్చారు. సభలో 15,000 కు మంచి జనం ఉన్నారు. చాలామంది బయట నిల్చుని ఉపన్యాసాలు విన్నారు.

1. హెచ్.ఎల్. కోసారె : విదర్భా తీల్ దళిత చా ఇతిహాస్, పే. 187

డా॥ అంబేద్కరే అస్పృశ్యుల ఏకైక నాయకుడు అన్న ముద్ర ఈ సమావేశంలో పడ్డది.

కామఠీ కాంగ్రెసు తర్వాత డా॥ అంబేద్కరు షోలాపూర్, నిపాణీ సభల్లో కూడా ప్రత్యేక నియోజకవర్గపు ప్రాముఖ్యాన్ని స్పష్టం చేశారు.

మే 21వ తారీఖున పూనాలో బ్రహ్మాండమైన ఊరేగింపు అంబేద్కరుది జరిగింది. "రాబోయే చరిత్రకారులు ఏ భావావేశానికి లోనుకాకుండా రౌండ్ టేబిలు సమావేశపు మొత్తం కార్యకలాపాల విశ్లేషణ చేసినప్పుడు నా జాతీయ సేవని తప్పకుండా ఉగ్గడిస్తారు. నా దళిత బాంధవులకు నా ఉద్దేశాలపట్ల గట్టి విశ్వాసం ఉన్నదన్న అంశానికి నేను ఎక్కువ ప్రాముఖ్యం ఇస్తాను. నిందలంటే నాకు లక్ష్యం లేదు. లేనిపోని నేరారోపణలను ఖాతరు చెయ్యను." అని డా॥ అంబేద్కరు అహిల్యాశ్రమంలో విధానసభ సభ్యులు గౌరవనీయులైన లర్తె అధ్యక్షతని ఏర్పాటు చేసిన సభలో ఉపన్యసిస్తూ చెప్పారు.

మే 26వ తారీఖున డా॥ అంబేద్కరు ఇంగ్లండుకి బయల్దేరారు. జూన్‌లో లండనుకు చేరారు. ఎమ్.సి. రాజా వ్యతిరేక పాత్ర నిర్వహించటం మొదలు పెట్టిన కారణంగా అంబేద్కరుకు తన వాదాన్ని బ్రిటిషు ప్రభుత్వం ముందు పెట్టడం తప్పనిసరి అయింది. అక్కడ జూన్ 14వ తారీఖు వరకూ బ్రిటిషు దౌత్యనీతివేత్తలను అధికారులను కలుసుకుని తన డిమాండ్లను వివరించి చెప్పటానికి ప్రయత్నించారు.

ఎమ్.సి. రాజాకు తంత్రం వల్ల డా॥ అంబేద్కరు ఎక్కువ మానసిక కష్టానికి గురి అయ్యారు. బొంబాయిలో రాజా ఒక సభ చేయాలని అనుకున్నారు. కాని డా॥ అంబేద్కరు అనుయాయులు ఆ సభని భగ్నం చేశారు.

"డా॥ అంబేద్కరు తమ రిపోర్టులో ఏ సూచనలను డిమాండ్లను సమర్పించారో వాటిని దేశ రాజ్యాంగంలో చేర్చకపోయినట్లైతే అస్పృశ్య సమాజం ఆ రాజ్యాంగాన్ని స్వీకరించదు." అనే అభిప్రాయం కలిగిన 56 టెలిగ్రాములు ప్రధానమంత్రి రేమ్సె మెక్‌డోనాల్డు పేర లండను పంపించారు.[1]

1. టిపణీస్. యో : మహాడ్ మాసపత్రిక, 1962

ఆగష్టు 17వ తారీఖున డా॥ అంబేద్కరు బొంబాయి తిరిగివచ్చారు. ఆయన రాకకు ముందే బ్రిటిషు ప్రధానమంత్రి తన నిర్ణయాన్ని ప్రకటించేశారు. అదే 'కులమత నిర్ణయం' పేరుతో ప్రసిద్ధమయింది. ఈ నిర్ణయ ప్రకారం అస్పృశ్యులకు ప్రత్యేక నియోజకవర్గం, రిజర్వుడు సీట్లు రెండు హక్కులూ ఇయ్యబడ్డాయి. దాంతోపాటు హిందూ ప్రతినిధుల ఎన్నికల్లోనూ ఓటుహక్కును వినియోగించుకోగలుగుతారు.

బొంబాయి చేరగానే ఆయన సర్ శామ్యూల్ హోర్‌కి వెంటనే ఉత్తరం రాశారు.

ఈ కులమత నిర్ణయంలో అనేకమైన అస్పష్టంగా ఉన్న అంశాలకు స్పష్టీకరణ కావాలని ఈ ఉత్తరం[1] లో ఆయన అడిగారు. తొమ్మిదో పేరా గురించిన ప్రశ్న దీనిలో ముఖ్యమైనది. "తదితర వెనుకపడ్డ వర్గాలతో పోలిస్తే అస్పృశ్యుల కోసం చెయ్యబడ్డ ఏర్పాటు ఎంతో పనికిరానిది. 20 ఏళ్ల తర్వాత వాళ్లకిచ్చిన ప్రత్యేక హక్కులను తొలగించే తరుణంలో ఏమీ తెలుసుకోవలసిన అవసరం లేదు. ఈ నిర్ణయం ఉన్న కారణంచేత అస్పృశ్యులు ఏం చెయ్యడానికి అవకాశమే ఉండదు" అని దాన్నిగురించి డా॥ సాహెబు స్పష్టంగా రాశారు. దీనివల్ల అస్పృశ్య సమాజంలో అసంతృప్తి చెలరేగుతుంది అనికూడా ఆయన ఈ నిర్ణయం గురించి రాసిన తన ఉత్తరం చివరని దానిని తీవ్రంగా విమర్శిస్తూ సూచించారు.

ఈ కులమత నిర్ణయం ప్రకారం ముస్లిములు, సిక్కులు, క్రైస్తవులు, - అందరికి ప్రత్యేకమైన నియోజకవర్గాలు స్వీకరించడం జరిగింది. ఈ కారణంగా హిందూ సమాజంలో అసంతృప్తి చెలరేగడం సహజమే.

# ఇరవై

బ్రిటిషు ప్రభుత్వం గాంధీని యరవాడ జైల్లో పెట్టింది. అస్పృశ్యులకు ప్రత్యేక నియోజకవర్గం ఇచ్చినట్లయితే తన ప్రాణాలను ఫణంగా పెడతానని

1. సర్ శామ్యూల్ హెూఅర్‌కి డా॥ అంబేద్కరు 21-8-1932 న రాసిన ఉత్తరం నుంచి (ఇండియా ఆఫీసు లైబ్రరీ అండ్ రికార్డ్సు, టెంపుల్ వుడ్ కలెక్షను)

ఆయన ప్రభుత్వాన్ని బెదిరించారు. అంతేకాదు ఈ నిర్ణయాన్ని రద్దు చెయ్యకపోతే తాను ఆమరణ నిరాహారదీక్ష చేపడతానని ప్రకటించారు.

గాంధీగారి ఈ నిర్ణయం యావత్తు దేశంలో అలజడిని రేకెత్తించింది. గాంధీ ప్రాణాలకే ముప్పు రాబోవడంతో హిందూ సమాజంలో గగ్గోలు పుట్టింది. అన్నివైపుల నుండి అటూఇటూ పరుగులాట ప్రయత్నాలు మొదలయ్యాయి. పండిత మదనమోహన మాలవ్య ఈ సమస్యను పరిష్కరించడానికిగాను ఒక అపీలు చేసి సెప్టెంబరు 19వ తారీఖున బొంబాయిలో ఓ సభ ఏర్పాటు చేశారు. డా॥ అంబేద్కరుని టెలిగ్రాం పంపి ఆహ్వానించారు. కులమత నిర్ణయం గురించి చర్చ జరిగి, దానిలో కొన్ని మార్పులను సూచించవలసివస్తే దానికి డా॥ అంబేద్కరు అంగీకారం ఉండాలి. డా॥ అంబేద్కరుకి అస్పృశ్యుల ప్రతినిధిగా గుర్తింపు వార్తాపత్రికలకు ఇవ్వక తప్పలేదు. 'అస్పృశ్య సమాజపు హక్కులను తగ్గించడానికి నేను ససేమిరా అంగీకరించను' అని డా॥ అంబేద్కరు బొంబాయిలో ఆ సభ జరగడానికి ముందు ఒక విజ్ఞప్తిలో చెప్పారు. అహమ్మదాబాదులోనూ అంబేద్కరు అదే తమ వాదం మీద నిలబడ్డారు. 'అంబేద్కరు ఇంగ్లీషు వాళ్ల ఏజెంటు', "దేశద్రోహి" అని దెప్పి పొడుస్తూ నాలుగు వేపులా ప్రచారం ఉవ్వెత్తుగా సాగింది.

డా॥ అంబేద్కరు తొణకకుండా శాంతంగా జరుగుతున్న వాటిని చూస్తున్నారు. ఆయన తన వివరణని అచ్చువేశారు. "ముస్లిములకు, సిక్కులకు, క్రైస్తవులకు ప్రత్యేక నియోజకవర్గం లభిస్తే దేశం విభజించబడదు అన్నప్పుడు అస్పృశ్యులకు లభిస్తే ఎలా విభజించుకుపోతుంది ?" అని ప్రశ్నించారు. "ఈ దేశంలో చాలామంది మహాత్ములు దేశ కళ్యాణం కోసం పుట్టారు. స్వర్గస్థులూ అయ్యారు. కాని అస్పృశ్య సమాజం ఎలా ఉన్నది అలాగే ఉన్నాది." అని ఎంతో విలువైన విషయాన్ని కూడా చెప్పారు.

సెప్టెంబరు 19వ తారీఖున బొంబాయిలోని ఇండియన్ మర్చెంటు చాంబరు హాల్లో సమావేశం జరిగింది. దానికి మదనమోహనమాలవ్యా అధ్యక్షత వహించారు. అంబేద్కరు కూడా సమీపంలోనే కూచున్నారు. ప్రఖ్యాత నాయకులు చాలా మంది అక్కడ ఉన్నారు. "అస్పృశ్యుల హితానికి వ్యతిరేకంగా గాంధీజీ ఉపవాసం చేస్తున్నారు. ఇది ఎంతో

విచారకరమైన సంగతి. గాంధీజీ స్వయంగా కులమత నిర్ణయం స్థానంలో మరో కొత్త పథకాన్ని సూచించాలి. కేవలం గాంధీజీ ప్రాణాలను కాపాడ్డం కోసం అస్పృశ్యుల హితానికి వ్యతిరేకంగా ఏదన్నా పథకాన్ని తయారుచేస్తే దానిలో భాగస్వామ్యం తీసుకోవడానికి నేను సిద్ధంగా లేను" అని ఆ సభలో డా|| అంబేద్కరు గంభీరంగా చెప్పారు.

మరుచటి రోజు గాంధీజీని కలిసివచ్చిన ప్రతినిధి వర్గం ద్వారా విషయాలను తెలుసుకోవడానికి గాను సమ్మేళనపు రెండవ సమావేశం జరిగింది. "గాంధీజీకి రిజర్వుడు సీట్ల పట్ల విముఖత ఏం లేదు" అని సర్ మన్నీలాల్ మెహతా అన్నారు. "నా అస్పృశ్య బాంధవులకు న్యాయం గానూ, నియమాల ప్రకారమూ లభించిన హక్కుల విషయంలో నేను వంచనకు పాల్పడను. ఏ హక్కులు వాళ్లకు ప్రమాణపత్రం ప్రకారం లభ్యమయ్యాయో వాటిని హోమం చెయ్యను. సమీపంలో ఉన్న దీపస్థంభానికి వేళ్లాడదీసి నన్ను మీరు ఉరితీసినా సరే నేను నా నిశ్చయాన్ని మార్చుకోను." అని డా|| అంబేద్కరు పరిషత్తులో తన అభిప్రాయాలను వ్యక్తం చేస్తూ అన్నారు. రాత్రి జరిగిన సమావేశంలో డా|| అంబేద్కరు తన పథకాన్ని సమర్పించారు. ఆయన దానిలో ప్రారంభపు ఎన్నికకు అంగీకరించారు. కాని దాంతోపాటు ఎక్కువ రిజర్వేషను స్థానాలని కల్పించాలని డిమాండు చేశారు. పరిషత్తు నాయకులు అంబేద్కరు డిమాండ్లను చెల్లేటట్టు చేశారు. జయకర్, సప్రూ, బిర్లా మొదలైన నాయకులు గాంధీజీని కలుసుకోవడానికి ఆ మర్నాడు పూనా వెళ్లారు. గాంధీతో చర్చించారు. గాంధీగారి సందేశం అందుకుని ఆయనని కలవడానికి డా|| అంబేద్కరు ఆ సాయంత్రం వెళ్లారు. ఆ రోజుల్లో గాంధీగారి ప్రభావం ప్రతి ఒక్కరిమీదా గట్టిగా ఉండేది. ఎంతటి నాయకుడైనా సరే ఆయన దగ్గరకు వెళ్తే ఆయన వ్యక్తిత్వం ముందు నీళ్లు కారిపోయేవాడు. అయితే అన్నివేపుల నుంచి గట్టి ఒత్తిడి ఏర్పడినప్పటికీ అంబేద్కరు శాంతంగానూ గంభీరంగానూ ఉన్నారు. ఆయన ఆలోచనల్లో కొంచెం కూడా మార్పు రాలేదు. ఆయన ఏమాత్రం చలించలేదు. మరోసారి గాంధీ అంబేద్కర్ల మధ్య పరస్పర చర్చ జరిగింది. "మీరు సూచించిన పేనలు ఏర్పాటును నేను పరిగణనకి తీసుకుంటాను" అని చివరకి గాంధీజీయే చెప్పారు. "మీరు పుట్టుక రీత్యా అస్పృశ్యులు. నేను

మనసా అస్పృశ్యుణ్ణి మనం అందరమూ ఒకటే. మనం అవిభాజ్యాలం విడదీయరానివాళ్లం. హిందూ సమాజం విచ్ఛిన్నం కాకుండా ఉండడానికి గాను నేను నా ప్రాణాల్ని అర్పించటానికి కృత సంకల్పంతో ఉన్నాను" అని గాంధీజీ ఎంతో భావుకత్వంతో చెప్పారు. గాంధీగారి సూచనని అంగీకరించారు. వారి మీటింగు ముగిసింది.

శుక్రవారం సాయంత్రం వరకూ ఒప్పందం డ్రాఫ్టు గురించి అవునూ కాదూ అంటూ చాలా ఎక్కువగానే గొడవపడ్డారు.... "గాంధీజీ పరిస్థితి ఆందోళనకరంగా ఉంది" అని గాంధీ పుత్రుడు దేవదాసు గాంధీ చెప్పారు. అయినా డా॥ అంబేద్కరు కొన్ని షరతుల కోసం చలించకుండా తన పట్టుమీదే నిలబడ్డారు. ఆ రాత్రి భయంకరమైన నిస్తబ్దత నెలకొన్నాది.

ఆదివారం ఉదయం సంభాషణలు ఆరంభం అయ్యాయి. మధ్యాహ్నం సుమారు 3 గంటలకు రాజగోపాలాచారి గాంధీ చేత అంబేద్కరు షరతులను మంజూరు చేయించారు. ఆ తర్వాత ఒప్పందం సర్వజనామోదం పొందింది. 1932 సెప్టెంబరు 24వ తారీఖున ఎంతో ఆనందంతో నిండిన వాతావరణంలో ఇరుపక్షాల నాయకులు ఒడంబడిక మీద సంతకాలు పెట్టారు. ఈ ఒడంబడిక పూనా పాక్టు (Poona Pact) పేరుతో ప్రసిద్ధి చెందింది. ఈ ఒడంబడిక మీద అస్పృశ్యుల తరపున డా॥ అంబేద్కరు సంతకం చేశారు. హిందువుల తరపున పండిత మదనమోహన మాలవ్యా సంతకం చేశారు. ఆ తర్వాత జయకర్, సప్రూ తదితర నాయకులు అనేకమంది సంతకాలు చేశారు. ఈ సందర్భంలో రాజగోపాలాచారికి చాలా ఆనందం కలిగింది. ఆయన తన కలాన్ని అంబేద్కరుకి ఇచ్చి అంబేద్కరు కలాన్ని తాను తీసుకున్నారు.

సెప్టెంబరు 24వ తేదీన నాయకులందరూ బొంబాయి తిరిగివచ్చారు. మధ్యాహ్నం రెండు గంటలకు ఇండియన్ మర్చెంటు చాంబరులో నాయకులందరూ ఉపన్యాసాలు ఇచ్చారు. పూనా ఒడంబడికని సమర్థిస్తూ తీర్మానాన్ని ప్రతిపాదించారు. సప్రూ అంబేద్కరుని తెగ ప్రశంసించారు. డా॥ అంబేద్కరు భవిష్యత్తులో గొప్ప తేజోవంతుడైన నాయకుడిగా ప్రఖ్యాతి పొందుతారు అని అన్నారు. నిజానికి ఇంతకు పూర్వమే అంబేద్కరు తమ నాయకత్వాన్ని ఖాయపరుచుకున్నారు. మారుమోగుతున్న చప్పట్ల మధ్య అంబేద్కరు తన ఉపన్యాసాల్ని ప్రారంభించారు. "గాంధీజీ, సప్రూ,

రాజగోపాలాచారి గార్ల సహకారంతోనే ఈ ఒడంబడిక సంభవం అయింది. రౌండ్ టేబిలు సమావేశంలోనే గాంధీజీ ఈ మనోప్రవృత్తిని గాని చూపించి ఉండి ఉంటే ఈ విపత్తు ఈ రకంగా వచ్చేదే కాదు." అని ఆయన తన ఉపన్యాసంలో చెప్పారు.

సెప్టెంబరు 26వ తేదీన ఈ ఒడంబడికని బ్రిటిషు మంత్రిమండలి పార్లమెంటులో పెట్టి ఆమోదింపచేశారు. ఈ ఒడంబడిక వల్ల డా॥ అంబేద్కర్ నాయకత్వం వన్నెకెక్కింది. నాయకత్వపు గీటురాయి మీద ఆయన మరోసారి నిఖార్సుగా ఋజువు అయ్యారు. ఈ పూనా ఒడంబడిక ప్రకారం అస్పృశ్యులకి 71 స్థానాలకు బదులు 148 స్థానాలు లభించాయి. అస్పృశ్యులు తమ జనసంఖ్య కన్నా అధిక ప్రాతినిధ్యాన్ని పొందారు. అయితే తమ ప్రతినిధులను, అల్లాగ్గానే హిందువుల ప్రతినిధులను ఎన్నుకునే హక్కులు వారికి లేకుండా పోయాయి.

# ఇరవై ఒకటి

పూనా ఒడంబడిక తర్వాత యావద్దేశంలోనూ దేవాలయ ప్రవేశాలు, సహపంక్తి భోజనాలు మొదలైన ఉద్యమాలు తీవ్రతరం అయ్యాయి. ఇహ డా॥ అంబేద్కరు రాజకీయ అధికారాన్ని చేజిక్కించుకునే విషయం మీద తమ దృష్టిని కేంద్రీకరించారు. "దేవాలయ ప్రవేశం మీకు దొరికితే మీరు ఉద్ధరించబడతారని కాదు. మనం మన రాజకీయ హక్కులను మన జీవితంలో సుఖసౌకర్యాలను పొందే విధంగా ఉపయోగించుకోవాలి" అని 1932 సెప్టెంబరు 28వ తారీఖున బొంబాయిలోని బరలీ ప్రాంతంలో ఉపన్యసిస్తూ చెప్పారు.

అక్టోబరు 19వ తారీఖున సావంతవాడి కోర్టులో కేసు ప్రారంభం అయింది. మూడు రోజుల పాటు దావా నడిచింది. తన ఈ ప్రవాసంలో ఆయన మరాఠీ బోర్డింగుని చూడ్డానికి వెళ్లారు. అక్కడ మహార్ల బస్తీలో ఉపన్యసించారు. 1932 అక్టోబరు 28వ తారీఖున బొంబాయిలో ఋషి సమాజం ఆయనకి సన్మానపత్రం సమర్పించింది. "అస్పృశ్యులు

తమలోనే ఉన్న పరస్పర జాతిభేదాల్ని సంపూర్ణంగా త్యజించాలి" అని ఆ సందర్భంలో ఆయన వారికి ఉపదేశించారు. 1932 నవంబరు 4వ తేదీన నాసిక్‌లో గుజరాతీ మేఘవార్ భంగీజాతికి చెందిన అస్పృశ్య సమాజం తరఫున ఆయనకి సన్మానపత్రం సమర్పించారు. "మనం మన సమాజంలోని ఆర్థిక బానిసత్వాన్ని రూపుమాపాలి" అని ఆ సందర్భంలో ఆయన చెప్పారు. మేఘవాల్ జాతి ఇచ్చిన విందులో ఇతర అస్పృశ్య సమాజాలవారు కూడా పాల్గొనేటట్టు చెయ్యడంలో అంబేద్కరు ప్రయత్నం సఫలం అయింది.[1] అదే రోజున బాల్‌వాడీలో కూడా ఆయన ఓ సభని సంబోధించారు.

"అంబేద్కరుకి చాలా విశాలమైన అస్పృశ్య సమాజపు మద్దత్తు ఉన్నాదని గాంధీజీకి ఇప్పుడు నమ్మకం కలిగింది" అని ఆయన ఆ సభలో చెప్పారు. "మనం ఐక్యతని కాపాడుకోవాలి" అనికూడా ఆయన ఉపదేశించారు.

1932 నవంబరు 7వ తారీఖున అంబేద్కరు ఇంగ్లండు ప్రయాణం అయ్యారు. వీడ్కోలుకు ముందు ఆయన పత్రికా ప్రతినిధులను ఉద్దేశించి మాట్లాడారు.

"గాంధీగారి సహాయ నిరాకరణోద్యమం వలన అధికార వ్యవస్థ ఏం దెబ్బ తినలేదు. అంచేత ఆ ఉద్యమం విప్లవం అనిపించుకోదు" అని అన్నారు. ఈ యాత్రలో ఆయన మనస్సు నిండా ఆహ్లాదం చోటు చేసుకుంది. ఆయన విక్టోరియా ఓడలో ప్రయాణం చేస్తున్నారు. ఓడ వేగం, ఓడని అలంకరించిన పద్ధతి, ఓడలో చేసిన ఏర్పాట్లు అన్నిటిని చూసి ఆయన ముగ్ధులయ్యారు. 1932 నవంబరు 14వ తేదీన పోర్టు సయీద్ నుంచి ఓ ఉత్తరం రాశారు.[2] ఆ ఉత్తరంలో తన భావాలను వ్యక్తం చేశారు – "కష్ట కాలం పోయింది. సుఖపు రోజులు వచ్చాయి అన్న మాట నా విషయంలో ఎప్పుడూ నిజం అవదు. నా జీవితంలో కోలాహలం జనం గుంపుల సందడి నా నొసట రాసి ఉన్నాయి. కర్తవ్య నిర్వహణ పట్ల నాకున్న తీవ్రమైన భావం నన్ను ఈవిధమైన పని ఒత్తిడికి తలొగ్గేటట్టు చేసింది." ఓడ ఎక్కేముందు ఆయన పేర మిన్నుముట్టేట్లుగా చేసిన జేజేలు ఆయనని కలవర పెట్టాయి. ఓడలోనూ పూనా ఒడంబడికను

1. గాయక్‌వాడ్ – భా.కృ: జనత ప్రత్యేక సంచిక, 1932

1. జనత : 1932 డిసెంబరు 10వ తారీఖు

గురించిన చర్చే! "ఈయనే ఆ యువ నాయకుడు! భారతదేశ చరిత్రలో కొత్త పుటలు రాస్తున్నాడు". అని ఈయన వేపు చూపెడ్తూ ఒక ప్రవాసి అన్నాడు. అంబేద్కరు వాస్తవంగానే చరిత్రను సృష్టిస్తున్నారు.

ఓడలో జరిగిన చర్చల ద్వారా కొంతమంది బ్రిటిషు అధికారులు, దౌత్యనీతివేత్తలు కలిసి కేంద్రవిధానమండలిలో అస్పృశ్యులకు స్థానం దొరకకుండా కుట్రపన్నారు అన్న విషయం చూచాయగా అంబేద్కరుకి తెలిసింది. అయితే పూనా ఒడంబడిక ద్వారా ఈ పెద్ద మనుషుల రహస్య పథకాన్ని కానివ్వకుండా చేసారు. ఆయనకి ఆ కారణంగా అంతులేని ఆనందం కలిగింది. తన ఓడ ప్రయాణంలో ఆయన రౌండు టేబిలు సమావేశపు రిపోర్టులు, స్లాన్సు రాసిన నెపోలియన్ శీలం, గాంధీ రాసిన వ్యాసాలు చదవటంలో లీనమయ్యారు.

అస్పృశ్యతా నివారణ కోసంగాను స్థాపించిన హరిజనసేవక్ సంఘపు ప్రధానసంచాలకుడు ఠక్కర్ బాప్పా ద్వారా ప్రచురించబడిన ఒక పత్రానికి ఆయన 1932 నవంబరు 14వ తేదీన చాలా పెద్ద ఉత్తరం అతి తీక్షణమైన జవాబు[1] గా రాసి తన అభిప్రాయాల్ని సూచించారు. 'హరిజన సేవక్‌సంఘ్‌కి అస్పృశ్యోద్ధరణకి గాను ఆయన ఎన్నో గట్టి పథకాలను ఆ ఉత్తరంలో ప్రతిపాదించారు. నవంబరు 18వ తారీఖున ఆయన లండను చేరుకున్నారు. లండను నుంచి ఆయన 'జనత' వార్తాపత్రికకి 1932 నవంబరు 24వ తారీఖున ఓ ఉత్తరం రాశారు. ఆ ఉత్తరంలో ఆయన వైజ్ఞానిక ప్రగతి గురించి జోస్యం చెప్పారు - "మనిషి మెదడుకి ఏ విషయమూ అసంభవమూ కాదు. అతి త్వరలోనే తుఫానులో కూడా చెక్కుచెదరకుండా నిలవగలిగే ఓడలు కూడా నిర్మించబడతాయి." తనను గురించి కూడా దానిలో రాశారు. "వ్యక్తుల పట్ల కన్నా పుస్తకాల పట్ల నాకు ఎక్కువ మక్కువ. వాటితోనే నాకు ఎక్కువ సంబంధం." ఈ ప్రవాస కాలంలో ఆయనకి జత సంస్థానపు మహారాజు గారితోనూ వారి ఆంతరంగిక కార్యదర్శి శ్రీ గోఖలేతోనూ మైత్రి ఏర్పడింది.

నవంబరు 17వ తారీఖున లండనులో సంయుక్త కమిటీ మీటింగు జరిగింది. ముస్లిముల డిమాండ్లు మంజూరు అయినా వారు వేరుగా ఓ ముఠాగా ఉన్నారు. ఇది అంబేద్కరుకు నచ్చలేదు. ముస్లిము నాయకులు

1. జనత : 3 డిసెంబరు, 1932

పాత భావాలు కలవారు. వారికి సంకుచిత మనస్తత్వం ఉన్నాది. ఆ కారణంగా వారిని నమ్మడం అన్నది అంబేద్కరుకి ప్రమాదకరంగా తోచింది.

రౌండ్ టేబిలు సమావేశపు మూడవ మీటింగు కార్యకలాపాలు నిర్ధారిత క్రమంలో జరిగాయి. డా॥ అంబేద్కరు వాణిజ్య పరిరక్షణ కమిటీలో పనిచేశారు. 1932 డిసెంబరు 24వ తారీఖున సమావేశ సభలు ముగిసాయి. ముస్లిము నాయకులకు భారతీయ సమస్యల మీద ఆసక్తి లేనట్టుగా అంబేద్కరుకు అనిపించింది. తిరుగు ప్రయాణానికి తొందరగానే సంసిద్ధమయ్యారు. 1933 జనవరి 23వ తేదీకి గంగ అనే ఓడలో బొంబాయి చేరుకున్నారు. టైమ్సుకి ఇచ్చిన తన ఇంటర్వ్యూలో బ్రిటిషు ప్రభుత్వం సంస్థానాధీశులను లక్ష్యపెట్టకుండా భారతదేశానికి బాధ్యతాయుతమైన పరిపాలన వ్యవస్థని ఇవ్వాలి అని ఆయన సలహా యిచ్చారు.

యరవాడ జైలుకి వచ్చి తనను కలవవలసినదిగా గాంధీజీ డా॥ అంబేద్కరును ఆహ్వానించారు. డా॥ అంబేద్కరు వైస్రాయిగారి మీటింగులో పాల్గొన్న తర్వాత ఫిబ్రవరి 4వ తేదీన తన మిత్రులతో పాటు యరవాడ జైలుకు వెళ్లి గాంధీజీని కలిశారు.

పూనా నుండి తిరిగివచ్చాక అంబేద్కరు విధానసభ సమావేశపు చర్చల్లో పాల్గొన్నారు. గ్రామపంచాయితీ బిల్లుమీద మాట్లాడారు. "విధానసభకి నా జాతి ప్రతినిధులను పంపించే అధికారం నాకు ఉండాలి. జాతుల ప్రాతినిధ్యం రాజ్యాంగపు శోభని ఇనుమడింపచేస్తుంది"[1] అని అన్నారు. "కోర్టు నిర్ణయాల్లో కూడా అనేక పర్యాయాలు జాతి ప్రవృత్తి కనపడుతోంది" అని తన ఉపన్యాసంలో ఆయన ఆరోపించారు.

1933 లో రంగ అయ్యరు మద్రాసు విధానసభలో అస్పృశ్యుల ఆలయ ప్రవేశ విషయంలో వచ్చే అడ్డంకులను తొలగించడానికి గాను ఒక బిల్లును ప్రవేశపెట్టారు. "ఆలయ ప్రవేశం లాంటి చిన్న విషయం కోసం అస్పృశ్యులు తమ శక్తిని వ్యర్థం చేసుకోకూడదు. ఉన్నత విద్యని, ఉన్నతోద్యోగాలని, తాము బతకడానికి గౌరవప్రదమైన మార్గాన్ని స్వీకరించినప్పుడు అస్పృశ్యుల అభివృద్ధి జరుగుతుంది. దానితోపాటు అస్పృశ్య సమాజాన్ని స్పృశ్యులు చూసే దృక్పథం మారుతుంది. ఆలయ ద్వారాలు తెరుచుకుంటాయో తెరుచుకోవో ఈ సొంతసమస్యకి మానవత్వానికివిలువ కట్టడం

1. డా॥ అంబేద్కరు, రైటింగ్సు అండ్ స్పీచెస్ : భాగం 2. పే. 113-115

తెలుసున్న వాడివైతే, ఆలయద్వారాలు తెరిపించి మానవత్వాన్ని ప్రదర్శించు." అని ఈ బిల్లును వ్యతిరేకిస్తూ డా॥ అంబేద్కరు అన్నారు. "చిన్నా పెద్దా అన్న భావానికి హిందూమతంలో ఎక్కడా స్థానం లేదు. అయినప్పటికీ వర్ణాశ్రమాలు హిందూమతానికి ప్రాణం అయిన కారణం చేత వాటిని రూపుమాపాలని నేను కోరను" అని ఒక ఇంటర్వ్యూలో గాంధీగారు డా॥ అంబేద్కరు వ్యాఖ్యానానికి జవాబుగా చెప్పారు.

డా॥ అంబేద్కరు ఆందోళనతో హిందూ సమాజం అంతటా అలజడి చెలరేగింది. హిందూ సంఘం త్రుళ్లిపాటుతో మేల్కొన్నది.

ఆలయ ప్రవేశపు బిల్లు గురించిన వ్యాఖ్యానాన్ని (Note) ని అచ్చువేసిన తర్వాత డా॥ అంబేద్కరు ఠాణా జిల్లాకి చెందిన కసారా పట్టణంలో ఓ సభని సంబోధించి మాట్లాడారు. "దైవపూజకన్నా ఉదరపూజ, అన్నార్జన ఎక్కువ అవసరం. ఇతరులందరూ తమ స్వార్థాన్ని చూసుకున్నారు. అందుకే మనకి దుస్థితి పట్టింది. భగవంతుడి మీద భారం వేసి బతకడం నేర్చుకోకండి. మీ రెక్కల బలం మీద మీ పని మీరు చేసుకోవడం నేర్చుకోండి." అని చెప్పారు. ఆ తరువాత 1933 ఫిబ్రవరి నెలలో మరుగాం ఊళ్లో ఉపన్యాసం ఇచ్చారు.

"తిలక్ లాగ మనకు కూడా పరాయివాళ్ల దూషణలూ, స్వజనుల భూషణలూ లభ్యమవుతాయి. చచ్చిన జంతువుల మాంసాన్ని తినకండి. గౌరవంగా ఉండడం నేర్చుకోండి. పోటీ పడ్డవాళ్లకే పేరూ ప్రతిష్ఠ దక్కుతాయి" అని చెప్పారు. కొద్ది రోజుల తర్వాత బొంబాయిలో ఆయనను సన్మానిస్తూ సభ చేశారు. "ఇంకొకరిని మీ దైవంగా తలచి మిమ్మల్ని ఉద్ధరించే భారం వారిమీద వేయడం అన్న భావం కర్తవ్య నిర్వహణలో విముఖత్వాన్ని కలగచేస్తుంది. పూజలు, ప్రార్థనలు జపతపాలు వీటన్నిటిమీద ఉన్నా మీ ధ్యాసని మరోవేపు మళ్లించండి. క్షీరాన్ని ఇచ్చే సిరాలు రాజకీయాలు. ఆ రాజకీయ సిరాలని పితకండి. అప్రమత్తతతో, జాగ్రత్తతో మంచి శిక్షణ కలిగి ఆత్మగౌరవంతో ఉన్న సమాజం యొక్క యోగ్యతా, శక్తీ వృద్ధి పొందుతాయి." అని ఆ సభలో తన సన్మానానికి సమాధానంగా మాట్లాడుతూ చెప్పారు.[1]

1. జనత : 11 మార్చి 1933

ఏప్రిలు నెల రెండవ వారంలో డా॥ అంబేద్కరు దసయీా తహసీలుకి చెందిన సోపారా ఊళ్లో ఏర్పాటుచేసిన అస్పృశ్యుల మీటింగుకి హాజరయ్యారు. ఏప్రిలు 12వ తారీఖున బొంబాయిలోని పరేలు ప్రాంతంలో ఆయనని సత్కరించారు. "జీవితాంతం విద్యార్థిగా ఉండాలన్నది నా కోరిక. కాని అస్పృశ్యుల ఆందోళనలో నాకు పాల్గొనవలసి వచ్చింది" అని ఆయన తన గురించి చెప్తూ అన్నారు.

విదేశానికి వెళ్లేముందు అంబేద్కరు గాంధీజీని కలుసుకోవడానికి వెళ్లారు. యరవాడ జైల్లో ఇద్దరూ కలుసుకున్నారు. "సనాతనులు నన్ను రక్షకుడు" అంటారు అని గాంధీజీ అన్నారు. అది విని, "వాళ్ల నుంచి మీరు ఇంకేమిటి ఆశిస్తున్నారు" అని నవ్వుతూ అంబేద్కరు అడిగారు. ఏప్రిలు 23వ తారీఖున పరేలులో అస్పృశ్యుల తరపున ఆయనకి సన్మానపత్రం సమర్పించారు. "ఏ బీదవాడూ తన వృత్తిని కాని కూలిని కాని వదులుకుని నన్ను సాగనంపడానికి రావొద్దు" అని ఆ సందర్భంలో ఆయన హెచ్చరించారు. ఏప్రిలు 24వ తారీఖున డా॥ అంబేద్కరు సంయుక్త కమిటీ పనిని చేయటానికి గాను లండను బయల్దేరారు. ఆ సమయానికి ఆయన కళ్లు నొప్పి పెడుతున్నాయి. మే 9వ తారీఖునాటికి ఆయన లండను చేరుకున్నారు.

లండనులో శ్రీ. గ. ఆ. గవయీా గారు డా॥ అంబేద్కరుని మూడునాలుగు సార్లు కలుసుకున్నారు. మత మార్పిడి గురించి ఆయనతో సంభాషించారు. భారతదేశం తిరిగి వచ్చాక "డా॥ అంబేద్కరు ముస్లిం మతాన్ని స్వీకరించబోతున్నారు" అన్న వార్తని గవయీా ప్రచారం చేశారు. "నేను హిందూమత అనుయాయుడిగా ఉండను. అలాగని ఇస్లాం మతాన్ని కూడా నేను స్వీకరించను ప్రస్తుతం నా మొగ్గు బౌద్ధమతం వేపు ఉన్నాది. అయితే నా సమాజానికి యోగ్యమైన వ్యవస్థని వ్యవస్థీకరించకుండా నేను దేనినీ చెయ్యను" అని డా॥ అంబేద్కరు వివరణ ఇచ్చారు.[1]

లండనులో సంయుక్త సమితి ప్రతినిధుల మీటింగు జరిగింది. దీనికి డా॥ ముంజె, హరిసింగు గౌడ్ మొదలైన నాయకులు హాజరయ్యారు. "స్పృశ్య హిందువుల ప్రవర్తనతో నిరాశచెంది నేను ప్రత్యేక నియోజక వర్గంకోసం డిమాండు పెట్టాను. హిందువులు తమ సమాజ వ్యవస్థని

1. మోటె, హ.వి.: విశ్రబ్ధ శారద, భాగం - 1 పే. 431

మార్చుకుని ఒకే నియోజక వర్గం ఏర్పరచాలని కోరితే దానికి మేం తప్పకుండా సహకరిస్తాం." అని ఈ మీటింగులో ఉపన్యసిస్తూ డా॥ అంబేద్కరు చెప్పారు.

సంయుక్త సమితి అక్టోబరు 3వ తారీఖు నుండి పని ప్రారంభించింది. అక్టోబరు 23-24 తారీఖుల్లో సర్ విన్‌స్టన్ చర్చిలుతో జరిపిన చర్చల్లో పార్లమెంటులో చర్చిలు ఇచ్చిన ఉపన్యాసానికి డా॥ అంబేద్కరు ఆయనని గట్టిగా విమర్శించారు. సెక్రటరీ ఆఫ్ స్టేట్‌తో జరిగిన చర్చలో డా॥ అంబేద్కరు శ్వేతపత్రం గురించి, రాజ్యాంగ వ్యవహారాల మీద, రాజ్యాంగ సూక్ష్మాంశాల గురించీ ఆయనమీద ప్రశ్నల వర్షం కురిపించి ఆ శ్వేతపత్రంలో ఉన్న అనేకమైన దోషాలను ఎత్తి చూపించారు. దీనికి ఆశ్చర్యపోయి డా॥ అంబేద్కరుది అద్భుతమైన సూక్ష్మ బుద్ధి. అందుకే శ్వేతపత్రంలోని ఈ దోషాలను పట్టుకోగలిగింది"[1] అని సెక్రటరీ ఆఫ్ స్టేటు అన్నారు. ఇదే సందర్భంలో డా॥ అంబేద్కరు నేర ప్రవృత్తిగల గిరిజనులకు రక్షణ కలిగించే దృక్పథంతో కొన్ని మార్గాలను కూడా డా॥ అంబేద్కరు సూచించారు.

జనవరి 8వ తారీఖున డా॥ అంబేద్కరు బొంబాయి తిరిగి వచ్చినప్పుడు ఆయన మొహంలో సంతోషం తాండవిస్తూ కనిపించింది. "లభించిన సంస్కరణలను స్వీకరించి ఇంకా అధికంగా పొందటానికి మనం పోరాడాలి" అని ఆయన పాత్రికేయులకు ఇచ్చిన ఇంటర్వ్యూలో చెప్పారు." ప్రస్తుతం నేను "ఆర్మీయింగు ఇండియా" అనే పుస్తకం రాయడంలో విలీనమై ఉన్నాను. నాకు రాజకీయాలంటే పెద్ద ఆసక్తి లేదు[2] అని ఆయన తన భవిష్యత్ కార్యక్రమం గురించి తెలుపుతూ అన్నారు.

1. డా॥ బాబాసాహెబు అంబేద్కరు : రైటింగ్సు అండ్ స్పీచెస్ , భాగం - 2 పే. 787

2. డా॥ అంబేద్కరు గారి ఈ పుస్తకం యిప్పటికీ అచ్చుకాలేదు. దీని మూలప్రతి ఎక్కడుందో కూడా వివరం తెలియలేదు.

# ఇరవై రెండు

యావత్ సమాజపు క్రోధాన్ని సహిస్తూ ర.ధొ. కర్వే సెక్సు విషయాలను ఆరోగ్యప్రదం గానూ, దోషరహితం గానూ ప్రచారం చెయ్యటానికి గాను "సమాజస్వాస్థ్య" అనే మాస పత్రికను ప్రారంభించారు. దాని గుజరాతీ ప్రచురణ 'సమాజ్ స్వాస్థ్య ప్రకాష్' యొక్క 19933 డిసెంబరు సంచికలో 'ఉత్తరాలు' శీర్షిక కింద ఇచ్చిన జవాబులు "ఓరియంటల్ ట్రాన్స్‌లేటర్" హోదాలో పనిచేస్తున్న ప్రభుత్వోద్యోగికి అశ్లీలంగా తోచాయి. ఆ కారణం చేత ప్రభుత్వం రఘునాధ్ రావు కర్వే మీద దావా వేసింది.

ఏ అభ్యుదయకరమైన కార్యానికైనా గట్టిగా చేయూత ఇవ్వడానికి డా॥ అంబేద్కరు ఎల్లప్పుడూ సిద్ధంగా ఉండేవారు. ఆయన రఘునాధ్ రావు కర్వే తరపున వకాల్తానామాని అంగీకరించారు. క్రాసు పరీక్ష చేస్తూ కర్వే తరపు నుండి ఆయన ఎన్నో చర్చనీయాంశాలను కోర్టు ముందు పెట్టారు. ప్రభుత్వానికి, కృష్ణ పురాణిక్‌కి మధ్య జరిగిన దావాలో న్యాయాధీశులు బైవరల్, రావులు వెలిబుచ్చిన అభిప్రాయాన్ని - "అశ్లీలత అర్థం మీద ఆధారపడదు. భాష మీద ఆధారపడి ఉంటుంది." - అనే దానిని కోర్టు దృష్టికి తీసుకువచ్చారు. అంచేత రఘునాధ్‌రావుని దోషరహితులుగా విడిచిపెట్టాలని ప్రతిపాదించారు. విశ్రాంతి తీసుకోకుండా, అడ్డూ ఆపూ లేకుండా, నిర్విరామంగా ఆ పనిలో డా॥ అంబేద్కరు నిమగ్నులయ్యారు. ఇహ ఇప్పుడు ఆయనకి విశ్రాంతి తీసుకోవలసిన అవసరం కనిపించింది. 1934 మార్చి నెల లగాయితు మే నెల వరకూ బోర్డీ, మహాబలేశ్వర్, పన్హాల్‌గఢ్ వంటి కొండప్రాంతాలకి వెళ్లి విశ్రాంతి తీసుకున్నారు. ఆయుర్వేద చికిత్స కూడా చేయించుకున్నారు. ఈ విశ్రాంతి తర్వాత ఆయన వకాల్తీ చెయ్యడం మొదలుపెట్టారు. బొంబాయి లా కాలేజీలో ఆయన కొంతకాలం బోధించారు.

డా॥ అంబేద్కరు కూడబెట్టిన గ్రంథాలు చాలా అధికం అవడంతో వాటిని క్రమబద్ధంగా పెట్టవలసిన అవసరం ఏర్పడ్డాది. ఆ రోజుల్లోనే

ఆయన దాదర్‌లో ఓ పెద్ద ఇల్లు కట్టించారు. ఈ ఇల్లు కట్టే సందర్భంలో ఆయన వాస్తు శాస్త్ర గ్రంథాలను ఎన్నిటినో అధ్యయనం చేశారు. కట్టిన కొన్ని భాగాల్ని మళ్లీ మళ్లీ పడగొట్టి మళ్లీ రెండోసారి కట్టించారు. అంబేద్కరు ఇల్లు ఓ పెద్ద లైబ్రరీలాగ కనిపిస్తుంది. తన ఇంటికి 'రాజగృహ' అని పేరు పెట్టారు. బుద్ధ భగవానుడి కాలంలో బింబిసారుని రాజధాని పేరుకూడా రాజగృహమే. బుద్ధుడు ఈ నగర హద్దులోనే తిరుగుతూ ఉండేవాడు. ఉపదేశిస్తూ నివసించేవాడు.

1934 సంవత్సరం మధ్యలో ప్రభుత్వం కాంగ్రెసు మీద పెట్టిన ఆంక్షని ఎత్తేసింది. గాంధీజీ పూనాలో జరిగిన ఒడంబడిక పట్ల తన పూర్తి విశ్వాసాన్ని ప్రకటించారు. "కాంగ్రెసు అంబేద్కరుకి వ్యతిరేకంగా తన అభ్యర్థిని నిలబెట్టాలి" అని శ్రీ గ.ఆ. గవయీ తన అభిప్రాయాన్ని వ్యక్తం చేశారు. కాని దానిని గాంధీజీ అంగీకరించలేదు. డా॥ అంబేద్కరు గాంధీగారి ఈ విధానానికి తన మద్దతు తెలిపారు.

సంయుక్త కమిటీ రిపోర్టు అచ్చు అయింది. దానిమీద డా॥ అంబేద్కరు తన ప్రతిస్పందనని తెలియచేశారు. "ఈ వివరణ చాలా అభ్యుదయ నిరోధకమైనది. దీనివల్ల భారతదేశపు ప్రగతికి పెద్ద అడ్డంకి ఏర్పడుతుంది" అని ఆయన అన్నారు. "విధానసభతో పాటు విధానపరిషత్తు పెట్టవలసిన అవసరం ఏమీలేదు" అనికూడా అన్నారు. ఆ రోజుల్లోనే బాబాసాహబు భార్య రమాబాయి ఆరోగ్యం బాగా పాడయింది. గత పది సంవత్సరాల బట్టి ఆవిడ ఆరోగ్యం వేపు దృష్టి పెట్టడానికి అంబేద్కరుకి తీరుబడే దొరకలేదు.

1935 మే 27వ తేదీన గుండెను మండించే దారుణమైన ఘటన జరిగింది. ఆయన భార్య రమాబాయి దాదర్‌లో చనిపోయింది. రమాబాయి అతిచిన్న వయస్సులోనే సంసారాన్ని నడిపే బాధ్యతని చేపట్టింది. ఎంతో నేర్పుతో, మరెంతో చాకచక్యంతో, తెలివి తేటలతో ఒడుదుడుకులు లేకుండా సంసారాన్ని నడిపింది. అంబేద్కరు తమ పనుల్లో ఎల్లవేళలా గెలవాలని, అందుకుగాను ఎటువంటి త్యాగం చెయ్యవలసివచ్చినా ఆవిడ ఎప్పుడూ సిద్ధంగా ఉండేది. ఆగంతకులతో ఎంత ఆదరంగా మాట్లాడేది. వారి యోగక్షేమాలను విచారించేది. ఉచితరీతిలో వారికి ఆతిథ్యం యిచ్చేది. అందరినీ గౌరవించేది. అందరికీ

సాయపడేది. ఎప్పుడూ పది పన్నెండుమంది విద్యార్థులకు ఆవిడ తన యింట్లో అన్నం పెట్టేది. 'పూనా ఒడంబడిక' సమయంలో ఆవిడ ధైర్యం ప్రశంసనీయం. అక్కడ డా|| అంబేద్కరు పూనాలో సవర్ణ నాయకులతో చర్చల్లో మునిగి ఉన్నారు. ఇక్కడ రమాబాయికి అనేకమంది గూండాల ఆగడాలని సహించవలసివచ్చేది. ఆవిడగాని ఎప్పుడైనా బజారుకి గాని, లేదా బయటికి గాని వచ్చిందా ఆవిడమీద దాడి చేయాలని అనేకమంది నిశ్చయించుకున్నారు. అలా అయినా ఆవిడ ఎంతో ధైర్యంతో అన్ని పనులనీ నిత్యం చేసుకునేలట్టుగానే చేసుకుంటూనే ఉంది. ఆవిడ ఆత్మగౌరవం ఉన్న వ్యక్తి. ఆవిడ ఇంట్లో ప్రతి వస్తువూ ఎక్కడ ఉండవలసినది అక్కడే క్రమబద్ధంగా ఉండేది. ప్రతి పనీ క్రమశిక్షణతో తీరుగా జరిగేది.

రమాబాయి మరణం డా|| అంబేద్కరుకు పెద్ద దెబ్బ. కొన్ని రోజుల పాటు ఆయన రాజకీయసన్యాసం పుచ్చుకోవాలని నిశ్చయించుకున్నారు. అంతేకాదు, సన్యాసిలాగ తల గొరిగించుకుని, కాషాయ వస్త్రాలు కట్టుకుని తిరగడం మొదలుపెట్టారు.

పదివేలకు మించి, గొప్పా బీదా, ఆడా - మగా, పిల్లా - పాపా, ముసలివాళ్లూ - పడుచువాళ్లూ - జనం తమ హృదయపూర్వక సంతాపాన్ని సానుభూతిని తెలియచెయ్యడానికి గాను రమాబాయి అంతిమయాత్రలో పాల్గొన్నారు. శ్మశానం నుంచి తిరిగివచ్చిన తర్వాత డా|| అంబేద్కరు తమ గదిలో తలుపులు వేసుకుని ఓ వారం రోజులు కూచున్నారు. బయటికి రానేలేదు. కుమిలి కుమిలి వెక్కి వెక్కి ఏడ్చేవారు. ఆ శోక సముద్రపు కెరటాల ఉధృతి కొంత తగ్గాక ఆయన సార్వజనిక కార్యకలాపాల్లో పాల్గొనగలిగారు.

లా కాలేజీలో ఆయన పాఠాలు చెప్పిన సమయంలో ఆయనను గురించి ఇల్లాగా చెప్పుకునేవారు - 'ఇక్కడ ఆయన ఇలా పాఠాలు చెప్తూ ఉన్నారంటే ఆయన ఆలోచనల ప్రభావంతో కాలేజీ విద్యార్థులు విప్లవకారులు అయిపోతారు. కాలేజీ పునాదులు కూలిపోతాయి' ఆ రోజుల్లో బొంబాయి హైకోర్టుకి సర్ జాన్ న్యూమాంట్ చీఫ్ జడ్జిగా ఉండేవారు. మొదట మొదట్లో అంబేద్కరంటే ఆయనకి వ్యతిరేకత ఉండేది. కాని క్రిమినలు అపీలు వ్యవహారాల్లో ఆయన పనిని చూసి చీఫ్

జడ్జికి ఆయనపట్ల పట్టరానంత ప్రసన్నత కలిగింది. ఆయన అంబేద్కరుని ఎంతో గౌరవించారు. మధ్యమధ్య టీకి కూడా ఆహ్వానిస్తూ ఉండేవారు. అంతేకాదు, ఆయనని లా కాలేజీ ప్రిన్స్‌పాల్ పదవిలో నియమించి జడ్జీగారు ఎంతో గర్వపడ్డారు.[1] చీఫ్ జడ్జీమీద అంబేద్కరు ప్రభావం అంత ఎక్కువగా పడ్డది.

1935 జూన్ 2వ తేదీన ప్రభుత్వం డా|| అంబేద్కరుని లా కాలేజీ ప్రిన్స్‌పాల్‌గా నియమించింది. ఆ రోజుల్లో రః హొదాని జడ్జి పదవికి వెళ్లడానికి ఓ మెట్టుగా తలచేవారు. 1935 జూలైలో డా|| అంబేద్కరు జడ్జి అవుతారని, లేదా కొత్త విధానమండలిలో మంత్రి పదవిని అలంకరిస్తారు అన్న వార్త పాక్కింది. జిల్లా జడ్జి పదవి నియామకాన్ని ఆయన స్వీకరించితే ఆయనకి హైకోర్టు జడ్జిగా ప్రమోషను ఇస్తారన్న హామీ కూడా ఆయనకు ఇచ్చారు. ఒకసారి ఆయనే రాజకీయాల నుండి విరమించా అన్న కోరికను వ్యక్తం చేశారు.

ఆ రోజుల్లోనే చవదార్ కేసు సందర్భంలో మహాడ్‌కి వెళ్తున్నప్పుడు, ఉన్నట్టుండి అకస్మాత్తుగా నదికి వరద రావడంతో మార్గమధ్యంలో ఆయన ఆగిపోవలసి వచ్చింది. ఆ చుట్టుపక్కల సమీపంలో అస్పృశ్యుల ఇళ్లు లేవు. అంచేత వరద తీసేవరకు తిండినీళ్లూ లేకుండా అక్కడ ఉండవలసి వచ్చింది. ఏ ఒక్క హిందూకుటుంబమూ ఆయనకి తిండానికి గాని తాగడానికి గాని ఏమీ ఇయ్యలేదు. అవమానాగ్నికి దహించుకుపోయి ఆయన బొంబాయి తిరిగి వచ్చారు. గదిలో తనను తాను బంధించుకుని ఎంతగానో విలపించారు. నాసిక్ దగ్గర ఒక ఊళ్లో అస్పృశ్యులు ఇస్లాం మతాన్ని స్వీకరించబోయారు. 'తొందరపడవద్దు' అని ఆయన వాళ్లకు సలహా ఇచ్చారు.

# ఇరవై మూడు

అక్టోబరు నెలలో అస్పృశ్యుల సభ ఒకటి 'యెవలా' ఊళ్లో ఏర్పాటు చేశారు. ప్రస్తుత రాజకీయ సాంఘిక పరిస్థితులను పునఃపరిశీలించడానికి

1. జోకిమ్ అల్వా : మేన్ ఎండ్ సూపర్ మేన్ ఆఫ్ హిందూస్తాన్ : ఠక్కర్ అండ్ కంపెనీ, బొంబాయి, పే 1943

గాను ఈ సభ ఏర్పాటైంది. అంబేద్కరు నాసిక్ చేరేసరికి అక్కడ ఉన్న మేఘవాల్ గుజరాతీ భంగీ (పాకీ) సమాజం వారు ఆయనని గౌరవించి అల్పాహారం పెట్టారు. అక్కడ అస్పృశ్య సమాజానికి చెందిన వేరు వేరు జాతులవారి కందరికి కలిపి ఏకపంక్తిని విందు జరిగింది. 'యెవలా' వెళ్లాక అక్కడ మ్యునిసిపాలిటీ తరఫున ఆయనకి సన్మానం జరిగింది.

1935 అక్టోబరులో 13వ తారీఖున నిర్ణయించిన తేదీ ప్రకారం చారిత్రాత్మకమైన ఆ సభ ప్రారంభం అయింది. డా॥ అంబేద్కరు సుమారు గంటన్నర సేపు ఉపన్యసించారు. ఈ సభకు రమారమి పదివేలమంది జనం వచ్చారు.

పది సంవత్సరాల బట్టి జరుపుతున్న తమ ఆందోళనను సింహావలోకనం చేయటానికి గాను, మాంటేగు చేమ్స్‌ఫర్డ్ సంస్కరణల పట్ల తమ పాలసీని నిర్ధారించుకోవడానికి ఈ సభ జరుగుతోంది. ఈ రెండూ ప్రధాన ఉద్దేశాలు. డా॥ అంబేద్కరు గొప్పగా ఉపన్యసించారు. ఆయన ఉపన్యాసం ఎంతగానో ఆకట్టుకుంది. అస్పృశ్యులకు ఆర్థికంగా, విద్యా విషయకంగా, సాంఘికంగా, రాజకీయంగా - అన్నిరంగాల్లో ఎలాగా అత్యాచారాలను, అన్యాయాలను సహించవలసివస్తోందో, అంబేద్కరు మనస్సుకి హత్తుకునేటట్టు వర్ణించి చెప్పారు. కాలారామ్ ఆలయంలో ప్రవేశం పొందటానికిగాను సత్యాగ్రహం చేసి ఎల్లాగ్గా శక్తిని, సమయాన్ని వ్యర్థపరుచుకున్నదీ ఆయన వివరించి చెప్పారు. సత్యాగ్రహాన్ని నిలిపి వేసినట్టు ప్రకటించారు. హిందూ మతస్థులం అయిన కారణం చేత మన స్థితి ఈ విధంగా ఉందని ఆయన ఋజువులు సాక్ష్యాలతో సహా వివరించి చెప్పారు. "నేను హిందూమతంలో పుట్టాను. దానిక్కారణం పుట్టడం అన్నది నా చేతిలో లేదు. అయితే నేను హిందువుగా మాత్రం మరణించను" అని ఆయన ప్రతిజ్ఞ చేశారు. అస్పృశ్య సమాజం హిందూ మతాన్ని త్యజించి సాంఘికమైన సమానత్వం, మతపరమైన సమానత్వం ఉన్న మతాన్ని మరొకదానిని స్వీకరించాలి. ఈ అర్థం వచ్చే తీర్మానాన్ని అందరూ ఆమోదించారు. ప్రపంచంలో అతి శక్తిమంతుడిగా పరిగణించబడే హైదరాబాదు నిజాం అస్పృశ్య సమాజంగాని ఇస్లాం మతాన్ని స్వీకరించినట్లైతే ఆ సమాజం కోసం ఐదుకోట్ల రూపాయలు ఏర్పాటు చేసి ఉంచారు.

క్రైస్తవ మత గురువులు ఇందుకు కాస్త భిన్నమైన పాత్రను అవలంబించారు. హృదయ పరివర్తన జరగకుండా మతం మార్పిడి ఉచితం కాదు అని బొంబాయి మెథడిస్టు ఎపిస్కోపల్ చర్చికి చెందిన బిషప్ బ్రేడ్లే అన్నారు. అయినా దళిత సమాజం ఉన్నతస్థాయి జీవితాన్ని గడపాలని కోరుకుంటే క్రైస్తవమతం ఆ సమాజానికి స్వాగతం పలుకుతుంది. బిషప్పు జె.డబ్ల్యు. పికెట్, ఈస్ట్ స్టెన్లే జోన్సు - ఇద్దరూ డా॥ అంబేద్కరుని అనేక పర్యాయాలు కలుసుకున్నారు. క్రైస్తవ మతాన్ని పుచ్చుకొనే విషయం గురించి తప్పకుండా యోచించవలసినదిగా ఆయనను అభ్యర్థించారు.

1936 జూలైలో గాడ్రేఫ్ ఫిలిప్పు "ది అన్‌టచ్‌బుల్స్ క్వెస్ట్" పేరుతో ఓ పుస్తకం రాశారు. అస్పృశ్య సమాజపు మతం మార్పిడి నిమిత్తం క్రైస్తవ మిషనరీలు ఏం చెయ్యాలో అందులో విపులంగా చర్చించారు. డా॥ అంబేద్కరు బాహాటంగా క్రైస్తవ మతానికి ప్రోత్సాహాన్ని యివ్వలేదు అనికూడా అందులో స్పష్టంగా రాశారు.

డా॥ ఫిలిప్పు, డా॥ స్టెన్లె జోన్సుతో తాను చర్చించిన దానిని గురించి ఉటంకిస్తూ ఇలా రాశారు.[1] డా॥ జోన్సుతో డాక్టరు అంబేద్కరు ఇలా అన్నారు - "క్రైస్తవ మతస్థులు జాతి భేదాన్ని రూపుమాపి ఉండినట్లయితే మేం క్రైస్తవ మతం వైపు తప్పకుండా మళ్లి ఉండేవాళ్లం. కాని ఇది సంభవం కాదు." "అంబేద్కరు అన్న ఈ మాటలు కాటు వేసినట్టు బాధపెట్టేవే - అయినా అవి వాస్తవాలు." అంతగా ప్రఖ్యాతి పొందని తన వ్యాసం "క్రిశ్చనాయిజింగ్ అన్‌టచ్‌బుల్స్ అండ్ కండిషన్ ఆఫ్ ది కన్వర్ట్స్" లో డా॥ అంబేద్కరు క్రైస్తవ మతంలో జాతివాదం ఎంతగా పాతుకుపోయి ఉందో, దాని చరిత్ర యావత్తూ ఎంతో విపులంగా రాశారు.[2]

సిక్కు మతస్థుల స్వర్ణ దేవాలయపు ఉపాధ్యక్షుడు కూడా డా॥ అంబేద్కరుకు టెలిగ్రాం ద్వారా ఇలా సూచించాడు - "సిక్కు మతం ఏకేశ్వర వాదాన్ని విశ్వసిస్తుంది. దీనిలో అందరినీ సమానంగా చూస్తారు."[3]

1. డా॥ గోడ్ఫ్రె. ఈ. ఫిలిప్పు : ది అన్‌టచ్‌బుల్స్ క్వెస్టు, (ది లివింగ్‌టన్ ప్రెస్సు, 42 బ్రాడ్వే వెస్ట్ మినిస్టర్, లండను, ఎస్. డబ్ల్యు, 1 - 1936), పే. 88
2. ఈ వ్యాసం మహారాష్ట్ర ప్రభుత్వం తరపున అచ్చయ్యే సీరీస్‌లో డా॥ అంబేద్కరు, రైటింగ్ అండ్ స్పీచెస్, భాగం - 5 లో చేర్చబడ్డాది.
3. కీర్ : పే. 254

"సిక్కుమతం గురించి నేను ఆలోచిస్తున్నాను" అని డా॥ అంబేద్కరు ఆయనకి జవాబు రాశారు.[1] సిక్కు మతానికి చెందిన ఓ 'గురువాణి' భజన కార్యక్రమానికి కూడా ఆయన 1936 జనవరి 13వ తారీఖున హాజరయ్యారు. 1936 ఏప్రిల్ నెల మధ్యలో సిక్కు మిషను పరిషత్తులో కూడా పాల్గొన్నారు. బౌద్ధ మతస్థులు, లంక వాస్తవ్యులు భిక్కు లోకనాథ్ 1936 జూన్ 10వ తారీఖున బాబాసాహెబును కలిసి బౌద్ధ మతాన్ని స్వీకరించమని అభ్యర్థించాడు.

ఆయన అభిప్రాయ ప్రకారం - డా॥ అంబేద్కరు అస్పృశ్య సమాజం 1934 లో బౌద్ధ మతాన్ని గాని స్వీకరించి ఉండి ఉన్నట్లయితే బర్మా భారతదేశం నుంచి విడిపోయి ఉండేది కాదు.

యెవలా పరిషత్తు తర్వాత బౌద్ధ భిక్షువుల సభ కలకత్తాలో జరిగింది. అందులో పాల్గొన్న బర్మా సయాం, టిబెట్టు, చైనా దేశాల ప్రతినిధులు డా॥ అంబేద్కరు నిర్ణయాన్ని అభినందిస్తూ టెలిగ్రాము ద్వారా సందేశాలు పంపించారు.

డా॥ అంబేద్కరు మతం మార్పిడి ప్రకటన హిందూ సమాజంలో గగ్గోలు పుట్టించింది.

డా॥ అంబేద్కరు సిక్కు మతం స్వీకరిస్తే తమకు ఎలాంటి అభ్యంతరం లేదన్న ధోరణిని శంకరాచార్య, డా॥ కృతకోటి, డా॥ ముంజె లాంటి హిందూ మత నాయకులు అవలంబించారు. మతం మార్పిడికి కాంగ్రెసులోని నాయకులందరూ, గాంధీ గారూ గట్టిగా వ్యతిరేకించారు. "అస్పృశ్యత ఆఖరి గడియల్లో చివరి శ్వాస తీసుకుంటోంది. అంబేద్కరు లాంటి విద్వాంసుడు, ఉన్నత విద్యావంతుడు అయిన యువకుడికి కవితాలోనూ, తదితర స్థలాల్లోనూ జరిగిన అత్యాచారాలకి కోపం రావడం సహజం. మతం ఇల్లు అథవా కట్టుకునే గుడ్డలు లాంటిదికాదు. ఎవరు ఎప్పుడు ఎలా మార్చుకోవాలంటే అలా మార్చుకోవడానికి !" అని గాంధీజీ రాశారు. "ఏ మతాన్ని స్వీకరించేదీ మేం ఇంకా ఏదీ నిర్ణయించుకోలేదు. అయితే అన్నివిధాలా ఆలోచించిన తర్వాత హిందూ మతం మా అభ్యున్నతికి ఏ విధమైన ప్రోత్సాహాన్నీ ఇవ్వలేదు అన్న నమ్మకం మాకు కలిగింది. అది మా అభ్యున్నతిని పోషించేదికాదు. ఈ మతం పునాదే

1. కీర్ః పే. 258

అసమానత్వం మీద నిలిచి ఉన్నది. ప్రతి మనిషికీ మతం అవసరం ఉన్నది అన్న గాంధీజీ అభిప్రాయంతో మేం ఏకీభవిస్తున్నాం. కాని మా పూర్వీకులలాగ ఎలాంటి పరిస్థితి లోనైనా మతంతో ముడిపడి ఉండాలన్న దానిని అంగీకరించటానికి బొత్తిగా నేను సిద్ధంగా లేను. మా మనస్సుకి అది ఉచితంగా తోచటంలేదు. మా వికాసానికి అది దోహదకారి కూడా కాదు" అని డా|| అంబేద్కరు గాంధీగారి విజ్ఞప్తిని చదివి అన్నారు.

అస్పృశ్యుల మతం మార్పిడికి సవర్ణ హిందువులు వ్యతిరేకిస్తున్నట్టు గానే అనేక అస్పృశ్య జాతుల వారే - మహార్, మాంగే మోచీ సమాజాల నాయకుల లాంటివారు కూడా తమ వ్యతిరేకతను వెల్లడిస్తున్నారు.

డా|| అంబేద్కరుని మతం మార్పిడి నుండి విముఖులుగా చేయడానికి గాను బొంబాయి హిందూ మహాసభ కార్య నిర్వాహక సంఘం సమావేశం వెంటనే జరిగింది. ఈ సమావేశంలో ఈ అంశం గురించిన ఒక తీర్మానాన్ని కూడా ఆమోదించారు. ఆ తరువాత 1935 అక్టోబరు 24వ తేదీన మో. వా. వేల్‌కర్ నాయకత్వంలో ఒక ప్రతినిధి వర్గం[1] డా|| అంబేద్కరును కలవడానికి కూడా వెళ్లింది. ఆ సమయానికి డా|| అంబేద్కరు విశ్వవిద్యాలయం పరీక్షాపత్రాలు దిద్దుతున్నారు. ఆయన ప్రతినిధి వర్గం అభిప్రాయాలను విన్నారు. "అస్పృశ్యులకు మతం మార్పిడి తప్ప మరో మార్గం లేదు" అనిఆయనగట్టిగా చెప్పారు. "వాళ్లకి శుభం జరగాలన్న దృష్టి తోనే నేను వాళ్లకి మతం మార్పిడి గురించి ఉపదేశించాను." అని అన్నారు.

మతం మార్పిడి వల్ల దేశానికి ఏ హానీ వాటిల్లదు అని భరోసా యిస్తూ ఆయన ఇలా అన్నారు - "నా కర్తవ్యానికి మూడు లక్ష్యాలు ఉన్నాయి. మొదటిది దేశం. రెండవది అస్పృశ్య సమాజం. ఆ తర్వాత వచ్చేది హిందూ సమాజం" తన సంభాషణని ముగిస్తూ ఆయన ఇలా చెప్పారు - "వ్యక్తిగతమైన మతం మార్పిడి వలన ఏం లాభమూ ఉండదు. శుభమూ జరగదు. మతం మార్పిడికి అదును వచ్చినప్పుడు నేను యావన్మంది హిందూ నాయకులతో సంప్రతింపులు చేస్తాను. మేం ఏం చేసినా శూరుడూ వీరుడూ అయిన సైనికుడిలాగ గౌరవప్రదంగా చేస్తాం." డా|| అంబేద్కరు ఇచ్చిన ఈ హామీతో ప్రతినిధి వర్గం సభ్యులందరూ తృప్తిపడి అక్కడనుంచి తిరిగివెళ్లారు.

1 నిర్భీడ్ : 3-9-1935

మహారాష్ట్రలో శుద్ధి సంఘం కార్యాలను నిర్వహించే నాయకులు వినాయక్ మహారాజ్ మసూర్‌కర్ ఇతర మతాలలోకి మారిన హిందువులకు శుద్ధి చేసి తిరిగి హిందూమత దీక్ష ఇస్తున్నారు. నవంబరు నెల మొదటి వారంలో మహారాజు స్వయంగా బాబాసాహబు అంబేద్కరుని కలుసుకోవడానికి వచ్చారు. ఆ సమయానికి బసయీ గ్రామంలో డా॥ అంబేద్కరు సన్మానసభ ముగిసింది. ఆ తర్వాత సాయంత్రం 7 గంటలకు మాలవణ్‌కర్ గారి భవంతిలో మసూర్‌కర్ మహారాజు తమ 15-20 మంది సహచరులతో పాటు డా॥ అంబేద్కరుని కలిశారు. సుమారు 3 గంటల సేపు సంభాషణ సాగింది.[1]

"హిందూస్థానంలో హిందువులే ఉండకపోతే ఈ దేశం పేరు హిందూస్థాన్‌గా ఉండడం జరగదు" అని మహారాజు అన్నారు.

"మీలాగే మాకూ విచారంగానే ఉంది. కాని దీనికి కారణాలేవైతే ఉన్నాయో వాటిని నివారించడం మీ చేతిలో ఉంది. దీనికోసం మీరు పంచవర్ణ ప్రణాళికను అమలు చెయ్యాలి" అని బాబాసాహబు జవాబు చెప్పారు. "నా అభిప్రాయంలో హిందూసమాజంలోని నాలుగువర్ణాల వ్యవస్థని రూపుమాపి ఒకే వర్ణం ఉన్న వ్యవస్థని స్థాపించాలి. పూనాలో జరగబోయే హిందూ మహాసభ సమావేశంలో మీరు జన్మ వల్ల జాతి నిర్ధారించబడ కూడదు" అన్న తీర్మానాన్ని ఆమోదించేటట్టు చేయండి." అని తన అభిప్రాయం చెప్తూ దానికి కావలసిన సాధనం గురించి చర్చించారు.

మహారాజు హిందూ సమాజంలోని వర్ణవ్యవస్థని రూపుమాపడానికి అంగీకరించలేదు. దాంతో డా॥ అంబేద్కరు ఇంకొక మార్గాన్ని సూచించారు. "అయితే మీరు ఓ చిన్న పని, ఎంతో సులువైనది, చక్కటిది, సహజమైనది చెయ్యగలరు. చాలా చిన్న పని - దాన్ని చేసి చూపించండి చాలు. మా శ్రీ కె.కె. సకట్[2] ని కేవలం ఒక్క ఏడాది పాటు శంకరాచార్యుల పీఠం మీద అధిష్టింపచెయ్యండి. పూనాలోని వందమంది చిత్‌పావన్ బ్రాహ్మణ కుటుంబాల సభ్యులని ఆయన పాదాలను కడగడానికి ఏర్పాటు చెయ్యండి. మీరు గాని ఈ చిన్నపని చేయించగలిగితే మీ హృదయంలో సమానత్వం కోసంగాను పొంగి పొరలి వచ్చే శ్రద్ధాభావానికి

1. నిర్భీడ్: 3-9-1935
2. ఆనాటి మాతంగ సమాజానికి చెందిన అస్పృశ్య నాయకులు

దానిని మేం ప్రతీకగా అంగీకరిస్తాం. మా మతం మార్పిడి నిర్ణయాన్ని వాయిదా వేసుకుంటాం."

దీని కోసం శ్రీ సకట్ పేరు ఎందుకు సూచించినదీ స్పష్టం చేస్తూ ఆయన ఇలా అన్నారు. - "ఆయన మాటే గురూజీ ప్రముఖ శిష్యుడు. అదీకాక, 'కేసరిదళ్' ఆయనని అస్పృశుల ఏకైక నాయకుడని ప్రకటించింది. వారి ఈ వాక్యాణింపుకి నేను వ్యతిరేకిని. అయినప్పటికీ నేనూ, నా సహచరులందరూ ఆయన పాదపూజ చెయ్యటానికి సంసిద్ధులమే". డాక్టరు సాహబు చెప్పినదంతా విని మహారాజుగారు ఆయనని యావత్ హిందూజాతి కార్యభారాన్ని వహించవలసినదిగా అభ్యర్థించారు. అంబేద్కరు సూచనలని తమ వారికి తెలియచేస్తామని భరోసా ఇచ్చారు. ఈ చర్చ చాలా సౌహర్ద వాతావరనంలో జరిగింది. మహారాజుగారు వారిదగ్గర సెలవు తీసుకున్నారు. ఆ తర్వాత మహారాజు ఆయన సహచరులు శిష్యులు, శ్రీ సకట్‌కి శంకరాచార్యుల హోదా ఇవ్వటానికిగాను ఏం ప్రయత్నాలు చేశారో, దాని జాడా-ఆనవాలూ ఎక్కడా దొరకలేదు.

"నా సమాజానికి చెందినవారు బౌద్ధమతాన్ని స్వీకరించటానికి నిర్ణయించారు" అని తన వ్యాసం ఒకదానిలో చమార్‌ల (మాదిగ) నాయకుడు దేవరుశేకర్ స్పష్టంగా ప్రకటించారు.

నాసిక్‌లో ఒక బహిరంగ సభలో శ్రీరామ ప్రధాన నాయకత్వంలో హిందువుల ప్రతినిధి వర్గం డా॥ అంబేద్కరుని కలిసింది. "నేటితరం వారు నాడే, గోఖలే, తిలక్ లాగ లక్ష్యం పట్ల నిష్ఠ కలవారు కాకపోవడంవల్ల మాకు చాలా నిరాశ కలుగుతోంది" అని అక్కడ బహిరంగంగా ఆయన చెప్పారు.

ఈ రోజుల్లోనే పీర్‌జమాత్ ఆలీ డా॥ అంబేద్కరుని కలిశారు. ఆ తర్వాత డా. అంబేద్కరు ఇస్లాం మతాన్ని ఆమోదించబోతున్నారని ఆయన పుకారు పుట్టించారు. డా. అంబేద్కరు వెంటనే ఆ పుకారుని ఖండించారు.

"డా॥ అంబేద్కరు హిందూమతాన్ని త్యజిస్తున్నారంటే అది మంచి సంగతి కాదు" అని భాలాకార్ భోపట్‌కర్ అన్నారు.

1935 డిసెంబరు 8వ తారీఖున బొంబాయిలోని పరాస్‌రోడ్ ప్రాంతంలో డా॥ అంబేద్కరు మతం మార్పిడి గురించి విశిష్టమైన మొదటి ఉపన్యాసాన్ని యిచ్చారు. ఆ స్థలంలో దత్త జయంతి ఉత్సవం జరుగుతోంది. వేల సంఖ్యలో భక్తులు అక్కడ హాజరయ్యారు. అక్కడ

ఉపన్యాసం ఇస్తూ ఆయన ఇలా చెప్పారు "కొద్ది కొద్ది మందిగా అక్కడ కొంతమంది ఇక్కడ కొంతమంది చొప్పున ఇతర మతాన్ని స్వీకరిస్తే మీకు కీడు జరుగుతుంది. మతం మారాలన్నది నా దృఢ నిశ్చయం. హిందూమతంలో అస్పృశ్యత అంటురోగంలా తగులుకుని ఉంది. అంచేత అలాంటి మతంతో సంపర్కం లేకుండా మనం ఉండాలి". డా॥ అంబేద్కరు అస్పృశ్యుల దారుణ స్థితిని హృదయవిదారకంగా వర్ణించి చెప్పారు. శ్రోతలు "అవును అవును" అనుకునేటట్లు చేశారు. తన శ్రోతలని ఆయన సుమారు 2 గంటల సేపు స్థబ్దుల్నిగా చేశారు. ఆనాటి పాత్రికేయుడు అనంత హరిగద్రె డా॥ అంబేద్కరు ఉపన్యాసానికి లోకమాన్య తిలక్ ఉపన్యాసాలకి ఎంతో ముగ్ధులయ్యారు. ఆ ఉపన్యాసాల ప్రభావం ఆయన మీద గట్టిగా పడింది. ఆయన ఇలా అన్నారు -- "అంబేద్కరుగారు ఇలాంటి తమ ఉపన్యాసాలని, కుదిపి కదిపే ఉత్తేజకరమైన ఉపన్యాసాలని అస్పృశ్యులకన్నా దుర్బల మనస్కులైన స్పృశ్యులకి ఇవ్వాలి. ఆయన ఉపన్యాసానికి ఏ విలువా ఇవ్వక్కర్లేదని ఎవడైనా అనుకుంటే వాడు తనునీ, తన హిందూ సమాజాన్ని కూడా వంచిస్తున్నాడని నేను అనుకుంటాను. వాడి భ్రాంతికి మనం గురి కాకూడదు. ఆయన ఈ ఉపన్యాసాన్ని వినే అవకాశం నాకు లభించినందుకు నన్ను నేను అదృష్టవంతుణ్ణని అనుకుంటున్నాను.[1]

# ఇరవై నాలుగు

మహాడ్‌లోని అభిమానస్తులు పట్టుపట్టగా తే 25-12-1935న డా॥ అంబేద్కరు బొంబాయినుంచి మహాడ్‌కి బయల్దేరారు.[1] ఉదయాన్నే ధరమతరపర ఓడ రేవుకి చేరగానే పేణ తహసీలుకి చెందిన అస్పృశ్య సమాజం అక్కడ ఆయనకి స్వాగతం పలికింది. అక్కణ్ణుంచి ఆయన కారులో మహాడ్‌కి బయల్దేరారు. మార్గ మధ్యంలో అక్కడ అక్కడ ఆయనకి స్వాగతం చెప్పారు. మహాడ్‌కి మూడు మైళ్ల దూరంలో ఉన్న సవ అనే ఊళ్లో అక్కడి ఇనాందారులు గౌరవనీయులైన బాపూసాహబు టిపణీసు

1. నిర్భీడ్ : 12 జనవరి, 1936

ఆయనకి పుష్పమాల వేసి సత్కరించారు. ఆయన అభ్యర్థించగా డా ॥ సాహబు టిపణీసు ఆయనకి పుష్పమాల వేసి సత్కరించారు. ఆయన అభ్యర్థించగా డా ॥ సాహబు ఆయన బంగళాలో కొద్దిసేపు ఆగారు. వార్త తెలిసి అస్పృశ్యులు గుంపులు గుంపులుగా సవగ్రామం సముద్రపు ఒడ్డున గుమిగూడారు.

సురేంద్రనాద్ టిపణీసుతోపాటు బాబాసాహబు మహాడ్ వెళ్లారు. ఆ సమయంలో టిపణీసు బంగళాలో వందలాది అస్పృశ్యులు వచ్చారు. అక్కడ భోజనం చేసిన తర్వాత బాబాసాహబు నవగ్రామంలో బస చెయ్యడానికి వచ్చారు. ఈ కబురు తెలియగానే సవ గ్రామంలో టిపణీసు హావేలీ ముందు అస్పృశ్య సమాజం వారు అందమైన వేదికని నిర్మించారు. ఈ వేదిక ముందు బాబాసాహబు దర్మకార్థం రాత్రి 11 గం ॥ ల వరకు జనం బారులు తీసి వస్తూనే ఉన్నారు.

గౌరవనీయులైన టిపణీస్ గారి అందమైన కొబ్బరితోటల మధ్య వేడినీటి సెలయేర్లు ఉన్నారు. ఆ మూడు సెలయేర్లకి సమీపంలో అందమైన కుండలు ఉన్నాయి. సెలయేళ్ల కుండీలలో స్పృశ్యసమాజం వారే స్నానం చేసే రివాజు ఉన్నది. కాని మరుచటి రోజు ప్రాతః కాలం ఈ కుండీల యజమాని శ్రీ టిపణీసుగారు ఈ కుండీల్లో బాబాసాహబుగారిని స్నానం చెయ్యవలసినదిగా కోరారు. బాబాసాహబు అక్కడ స్నానం చేసి కేవలం స్పృశ్యులకే ఉపయోగపడే ఈ ఆచారానికి స్వస్తి చెప్పారు.[1]

డిసెంబరు 27వ తారీఖునుండి మూడురోజుల వరకూ బాబాసాహబు కులాబా, రత్నగిరి జమీందార్లకి వ్యతిరేకంగా వారి ప్రాంతాల్లో పనిచేసే రైతుల ఫిర్యాదులు విన్నారు. జమీందారుల పొలాల్లో సాగుచేసే ఈ కుటుంబాలు మరాఠా, మహార్ జాతులకు చెందిన కుటుంబాలు. వాళ్లందరూ జమీందారుల అత్యాచారాలని సమానంగా అనుభవిస్తున్న కారణంగా జాతి భేదాన్ని విస్మరించి ఒకే చోటచేరి బాబాసాహబుకు తమ ఫిర్యాదులు చెప్పుకున్నారు.

డిసెంబరు 30వ తేదీ ఉదయం సవ గ్రామంలోని మహారుల బస్తీలో బాబాసాహబుకి ఘనంగా స్వాగతం చెప్పారు. అక్కడనుంచి ఆయన మహాడ్‌కి

1 నిర్భీడ్ : 12 జనవరి, 1936

చెందిన సురబా టిపణీసుగారి ఇంటికి వెళ్లారు. మధ్యాహ్నం రెండు గంటలకు ఆయన మహాడ్ విద్యార్థుల హాస్టలుని చూడ్డానికి వెళ్లారు. తర్వాత మూడు గంటలకు ఐదువేల జనాన్ని సంబోధించి ఆయన ఉపన్యాసం ఇచ్చారు.[1] "మగవాడు తప్పు పని చేస్తూ ఉంటే ఆడవాళ్ళు దాన్ని వ్యతిరేకించి తిరగబడాలి. మొత్తం సమాజం ప్రగతి, పేరు ప్రఖ్యాతులు ఆడవాళ్ల చేతిలోనే ఉన్నాయి. ఒక్కొక్కరు వేరు వేరుగా మతం మార్పిడి చేసుకోవద్దు. మనం అందరి సామూహిక నిర్ణయం జరిగేటంత వరకూ ఎవరూ మతం మార్చుకోవద్దు" అని స్త్రీలను సంబోధిస్తూ ఆయన అన్నారు.

అదే రోజు సాయంత్రం రాయిగఢ్ జిల్లాలోని కోడోసె అన్న ఊళ్లో పెద్ద సభ జరిగింది. "గాఢ వాంఛ, ఆశావాదం రెండూ ఉంటే ఉన్నత స్థితికి చేరుకోవచ్చును. మనస్సులో ఆశ, ఉత్సాహం, కోరికా ఉన్న వాడు ఎప్పుడూ సంతోషంతో తుళ్లుతూ ఉంటాడు. మన శీల స్వభావాన్ని దిద్దుకోవడం, వృద్ధి చేసుకోవడం జీవితం యొక్క పరమకర్తవ్యం. దానిని పూర్తిగా పెంపొందించుకోండి. ఉజ్జ్వలం చేసుకోండి. పాత ఆచారాలను, రివాజులను పాతి పెట్టండి. కొత్త కలంతో కొత్త పాఠాన్ని రాయండి. ఎప్పుడూ ఆశావాదులుగానే ఉండండి. కష్టపడి పనిచేస్తేనే, త్యాగం చేస్తేనే కర్తవ్య పాలన జరుగుతుంది. మంచి మానవ సంప్రదాయాల వల్లే దేశమూ, సమాజమూ, సంపన్నమవతాయి. భాగ్యవంతమవతాయి. అని అక్కడ ఉపన్యసిస్తూ ఆయన చెప్పారు. "మీకు అదృష్టం పట్టే సమయం ఆసన్నమయింది" అని కూడా ఆయన జనానికి భరోసా ఇచ్చారు.

తన ఉపన్యాసాన్ని ముగించి డా॥ అంబేద్కరు టిపణీసుతోపాటు వారి ఇంటికి వెళ్లారు. రాత్రి టిపణీస్ దివాణంలో మహాడ్ నగర సేట్ శ్రీదేవచంద్ గాంధీ ఆయనని కలిశారు. మతం మార్పిడి గురించి ఆయనతో చర్చించారు.

1931 డిసెంబరు తారీఖున డా॥ అంబేద్కరు ప్రతాప్‌గఢ్ కోట దిగువ భాగంలో ఉన్న పోలాద్‌పూర్ గ్రామానికి బయల్దేరారు. తోవలో తమ తమ గ్రామాల సరిహద్దుల్లో ఆయన కారుని ఆపి జనం ఆయనికి పూలమాలలు

1. అదే

వేశారు. ముత్తయిదు మహిళలు ఆయనకు ఆరతి ఇచ్చి శుభాలు కలగాలని కోరుకున్నారు.

పోలాదపుర్ సమీపంలోని ప్రతాప్‌గఢ్ ప్రాంతానికి చెందిన వేలాది అస్పృశ్యులు జేజే వినాదాలతో ఆయనికి స్వాగతం చెప్పారు. అక్కడ బాబాసాహబు అనంతరావు చిత్రే ఇంట్లో బస చేశారు. అక్కడ వారిని కలుసుకోవడానికి జనం చేరారు. అందరిని కలిసి, వారి కుశల సమాచారాలు అడిగి డాక్టరు సాహబు వారితో సంభాషించారు. రాత్రి పోలాద్‌పుర్ మహారుల బస్తీలో ఆయన ఉపన్యసించారు. ఆ తరువాత ఆయన తన సెక్రటరీ శ్రీకమలాకాంత్ చిత్రే ఇంటికి వెళ్లారు. రాత్రి చల్లని వెన్నెల కాంతిలో అనంతరావు చిత్రే తమ తోటలో డా॥ అంబేద్కరుకు, ఆయన స్పృశ్య మిత్రులకూ, అస్పృశ్యమిత్రులకూ ఘనంగా విందు చేశారు. 1936 జనవరి 1వ తారీఖున పోలాదపుర్ నుంచి మహాడ్ మీదుగా బొంబాయి తిరిగి వచ్చారు.

# ఇరవై అయిదు

1935 డిసెంబరు 29వ తారీఖున పూనాలో హిందూమహాసభ సమావేశం జరిగింది. ఈ సమావేశంలో, హిందూమతం పుట్టుకతో వచ్చే అస్పృశ్యతని అంగీకరించదు అనే తీర్మానాన్ని ఆయన ఆమోదింప చేశారు.

1929లో హిందూ సభకార్యకర్తలు 'హిందూ సంఘం' అనే సంస్థని స్థాపించారు. ఈ సంస్థ సలహా సంఘంలో బారిస్టరు సావర్కర్, డా॥ జయకర్, కేశవరావు జెధె, అనంతహరి గద్రెలతోపాటు డా॥ అంబేద్కరు కూడా ఉన్నారు.[1]

మతం మార్పిడి గురించిన ప్రకటన చేసిన తర్వాత దాని గురించి సమాజంలోని అన్ని వర్గాల వారూ అనుకూలంగానూ ప్రతికూలంగానూ ప్రతిస్పందించారు. వేదశాస్త్ర పారంగతులు సాతవడేకరు విపులంగా ఒక వ్యాసాన్ని రాశారు.[2] దాని శీర్షిక "డాక్టరు అంబేద్కరు కర్తవ్యం." ఈ వ్యాసంలో

1. నిర్భీడ్: 12 జనవరి, 1936
2. పురుషార్థ్: నవంబరు, 1935

ఆయన డాక్టరు అంబేద్కరుకి ఆయన మిత్రులకు మతం మారవద్దని సలహా ఇచ్చారు. ఆయన నీచమైన మాట కూడా రాశారు "డా॥ అంబేద్కరు మహర్ జాతిలో పుట్టిన కారణంచేత ఈ రోజు ఇంత గొప్పతనం పొందారు. ఆయన ఉన్నత కులంలో పుట్టి ఉంటే ఇంత గొప్పతనం వచ్చేదికాదు. అస్పృశ్య సమాజం అంటరాని సమాజంగా పరిగణించబడేంత వరకూ ఆయనికి లాభమే కలుగుతుంది. అస్పృశ్య సమాజం వారు తాము హిందువులుగానే ఉంటామని ప్రకటించాలి. అందులోనే వారికి హితం ఉన్నది" ఆయన ఈ మాటలు నిందనీయాలే.

"మహర్ జాతి వాణ్ణయినా నాకు గొప్పతనం వచ్చింది. దానికి కారణం పాండిత్యం. నేను మతం మార్చుకున్నా నా పాండిత్యానికి ఏ ముప్పూ రాదు" అని ఆ వ్యాసానికి జవాబు చెప్తూ డా. అంబేద్కరు అన్నారు.

"నా మతం-మార్పిడి నిర్ణయం తిరుగులేనిది" అని కూడా ఆయన అన్నారు. చర్చలోనూ, తర్కంలోనూ డా॥ అంబేద్కరు వ్యాసాల్లో తిరుగు లేనివాదం, వకీలు వాదపటిమ గోచరిస్తాయి.

1936 జనవరిలో మతం మార్పిడి నిర్ణయంమీద లోతుగా ఆలోచించటానికిగాను పూనాలో ఒక మీటింగు ఏర్పాటు చేశారు. "ఇప్పుడిక దేవుడే స్వయంగా అవతారం దాల్చివచ్చినా అస్పృశ్య సమాజంవారిని మతం-మార్పిడి నిర్ణయాన్ని మార్చలేడు. నేను మీ అందరిని పతిత స్థితినుండి మీదకు లేవనెత్తడానికి ప్రయత్నం చేస్తూ ఉన్నాను. ఇందులో నా వ్యక్తిగతమైన స్వార్థం ఏదీలేదు. మీరు మీ బాధ్యతని నిర్వహించవలసి ఉన్నాది. నేను చెప్పిన మార్గాన్ని మీరు అనుసరిస్తే మీ ఉద్ధరణే జరుగుతుంది" అని ఈ అఖిల మహారాష్ట్ర యువపరిషత్తులో డా॥ అంబేద్కరు హెచ్చరిస్తూ చెప్పారు. ఈ సభలో ఏ మతాన్ని స్వీకరించడం అన్న విషయాన్ని నిర్ణయించడానికి అంబేద్కరుకి పూర్తిగా అధికారాన్ని అప్పగించారు. డా॥ అంబేద్కరు చుట్టూ ఓ వలయం నిర్మించబడుతోంది. ఈ గొప్పతనం కారణంగానే ఓ కార్యకర్త ఇలా ప్రకటించారు — "అస్పృశ్యులకు వేదాలు అక్కర్లేదు. గీత అక్కర్లేదు. శంకరాచార్యులు అక్కరలేదు. వాళ్లకి దేవదూతల అవసరమూ లేదు. వాళ్లకి అంబేద్కరే కావాలి. ఇంకెవరూ అక్కర్లేదు."

"మిమ్మల్ని మీరు ఉద్ధరించుకోవడం కోసం మీరు పోరాడాలి. మతం మార్పువల్ల మీకు హితం జరుగుతుంది. అయితే ఒకరో, ఇద్దరో మతం మార్చుకుంటే లాభం లేదు" అని డా॥ అంబేద్కరు స్పష్టంగా చెప్పి వారిని అప్రమత్తుల్ని చేశారు.

ఈ సభల సందర్భంలో డా॥ అంబేద్కరు పూనాలోని సిక్కు సమాజం వారి భజన-కీర్తనల కార్యక్రమంలో కూడా పాల్గొన్నారు. సిక్కు నాయకులు తమవైపు ఆయనిని సమ్మోహిత పరచడానికి చాలా ప్రయత్నించారు. సోలంకితోపాటు ఆయన సిక్కు మతాన్ని స్వీకరించ మన్నారు. ఈ వారంలోనే ముస్లిముల ప్రతినిధివర్గాలు రెండు డాక్టరు సాహెబును కలుసుకున్నాయి. వారు డా॥ అంబేద్కరుని ఇస్లాం మతం పుచ్చుకోవడానికి అంగీకరించమని మనవి చేశారు.

మతం-మార్పిడి ముఖ్య సమస్యలో డా॥ అంబేద్కరు తలమునకలై ఉన్నా ఇతర విషయాల పట్ల పూర్తి ధ్యాసతో ఉండేవారు. "రైతులు జమీందారులకి వ్యతిరేకంగా ఆందోళన చెయ్యాలి" అని కులాబా జిల్లాకి చెందిన చరీ గ్రామంలోని ఒక రైతు సభకి అధ్యక్షత వహించి ఉపన్యసిస్తూ పిలుపు నిచ్చారు.

1936 మార్చి ఒకటవతేదీన పనవేల్‌లో ఏర్పాటు చేయబడిన సభకి అధ్యక్షత వహించారు. అక్కడ మహిళలు ఆయనకి ఆరతి ఇచ్చారు. అంజుమాన్-ఎ-ఇస్లాం, ముస్లిముల అఖాడా తరపున ఆయనకు స్వాగతం చెప్పారు. స్థానిక చమార్ సమాజంవారు కూడా ఆయనని సత్కరించారు. "ఈ అస్పృశ్యుల ఆందోళన దళితులందరికోసమూను. చమార్‌లు, మాంగులు ఈ ఆందోళన కార్యభారాన్ని తమ భుజాలకు ఎత్తుకుని బాధ్యత వహిస్తే నేను మహారులను మౌనందాల్చమని చెపుతాను" అని అక్కడ ఇచ్చిన తన ఉపన్యాసంలో ఆయన అన్నారు. బొంబాయి పురపాలక సంఘంలోని విద్యావిభాగపు సూపర్‌వైజర్ పదవులకు చమార్ సమాజంవారిని తీసుకునే సౌకర్యాలని ఎలాగా సంపాదించిపెట్టారో, పోలీసు ట్రైనింగు విభాగంలోకి చమార్లని మాంగులని తీసుకునేటట్టు చేయడానికి ఆయనికి ఎంత ప్రయత్నం చేయవలసి వచ్చినదీ కూడా వివరించిచెప్పారు.

# ఇరవై ఆరు

1936 జనవరిలో వెలువడిన లా కాలేజీ పత్రికలో లాకాలేజి విద్యార్థులు డా. అంబేద్కరు పట్ల తమ హృదయపూర్వక ప్రేమాభిమానాలను వ్యక్తం చేస్తూ సంపాదకీయ వ్యాసం రాసి ఆయనను ప్రశంసించారు. న్యాయ శాస్త్రాన్ని ఎలా బోధించాలి అనే విషయాన్ని వివేచిస్తూ ఒక వ్యాసం రాసి డా॥ అంబేద్కరు ఈ కాలేజీ పత్రికకి ఇచ్చారు. తన వ్యాసంలో పాఠ్యక్రమం ఎలా ఉండాలో వివరించి చెప్తూ ఆయన న్యాయశాస్త్ర విద్యకూడా పారిశ్రామిక పాఠ్యక్రమంలాగే పదవిని పొందడానికి సరిపోయిన పాఠ్యక్రమం అవాలి అని నొక్కి చెప్పారు. ఇంగ్లండులో బారిష్టరు విద్యకున్న పాఠ్యక్రమం పదవిని పొందే దృష్టితో చూస్తే సంపూర్ణమైనది కాదు. ఈ విషయాన్ని తన వ్యాసంలో విపులంగా వివరించి, తన పథకం ప్రకారం లా పాఠ్యక్రమం నిర్ధారించబడినట్లైతే దానివల్ల, విద్యార్థులకు ఎలా లాభం కలగగలదో నొక్కి చెప్పారు. లా పరీక్షల బాధ్యతను బార్‌కౌన్సిలుకి అప్పగించితే బార్ కౌన్సిలు కూడా శ్రామిక సంస్థలాగ పని చేయగలుగుతుంది. వకీళ్లకి న్యాయశాస్త్రంలోని మూలభూతమైన విషయ పరిజ్ఞానంతో పాటు, విస్తారమైన సాధారణ జ్ఞానం కూడా ఉండాలి. అని ఆయన వివరిస్తూ రాశారు. అంచేత లా విద్యతో పాటు సాంఘిక శాస్త్రం, మానవ శాస్త్రం, తర్క శాస్త్రం, వక్తృత్వకళ, వాదవివాద పటిమ, భాష మీద అధికారం కలిగేటట్లు విద్య కూడా పాఠ్యక్రమంలో చేర్చాలి. అభ్యాస క్రమంలో సంపూర్ణంగా మార్పు తేవాలన్న తన అభిప్రాయాన్ని డా॥ అంబేద్కరు వ్యక్తం చేశారు.

1935 డిసెంబరు నుంచి పంజాబులోని జాతికుల నిర్మూలన మండలితో డా. అంబేద్కరు ఉత్తర ప్రత్యుత్తరాలు మొదలు పెట్టారు. ఈ మండలి వార్షికోత్సవానికి డా॥ అంబేద్కరుని అధ్యక్షత వహించమని కోరారు. 1935 డిసెంబరు 5వ తారీఖున తాను రాసిన ఉత్తరంలో అంబేద్కరు తన అధ్యక్షోపన్యాసానికి మూలభూతమైన సిద్ధాంతం ఏమిటో స్పష్ట పరిచారు. మండలి సభ్యులు ఆ ఉపన్యాసపు కాపీని చదివి దానిలో కొన్ని మార్పులు చెయ్యమని సూచించారు. కాని అంబేద్కరు దానిని అంగీకరించడానికి నిరాకరించారు. జాతివ్యవస్థ గురించిన తన అభిప్రాయాలు విప్లవాత్మకమైనవి,

విస్ఫోటకమైనవి వాటిని శ్రోతలు భరించలేరు. అంచేత ఈ సభనే వాయిదా వేయడం జరుగుతోంది అని ఆయన రాశారు.

డా. అంబేద్కరు "అనిహిలేషన్ ఆఫ్‌కాస్ట్" విషయం మీద ఇచ్చిన తన ఉపన్యాసాన్ని అచ్చువేశారు. ఆ పుస్తకం భగవద్గీతతో సమానమైనదిగా ఈ రోజు పరిగణించబడుతోంది. కులం, కుల వ్యవస్థ మీద రాసిన అర్థవంతమైన పుస్తకంగా చూడబడుతోంది. "ఈ పుస్తకాన్ని ప్రతి హిందువూ చదవాలి" అని మహాత్మాగాంధీ ఈ పుస్తకం గురించి తన అభిప్రాయాన్ని వ్యక్తం చేశారు. ఆయన చేసిన ఈ సిఫారసే ఈ పుస్తకం గొప్పతనాన్ని ఋజువు చేస్తోంది. గాంధీగారు చేసిన కొన్ని ఆరోపణలకి విపులంగానూ సుసంగతంగానూ సమాధానాలు ఇస్తూ డా ॥ అంబేద్కరు ఈ పుస్తకానివి రెండు కూర్పులు అచ్చు వేయించారు. భారతదేశంలోని అన్ని ప్రముఖ భాషల్లోకి ఈ పుస్తకం అనువాదం ప్రచురించడమూ, అనేక ముద్రణలు ఆ భాషల్లో రావడమూ జరిగింది. ఏ గ్రంథకర్తా ఇప్పటి వరకూ కుల నిర్మూలన విషయంమీద ఇంత లోతుగా సుసంగతమైన చర్చ ఏ గ్రంథంలోనూ చెయ్యలేదు. హిందూ సంఘాన్ని పునర్నించడానికి డా ॥ సాహెబు ముందు చూపుతో చేసిన సూచనలు ఈ రోజుకీ అంతే నూతనమైనవిగా నిలిచి ఉన్నాయి.

చిత్తరంజను నాటక కంపెనీవారు 1935 మార్చి 15వ తారీఖున 'బాంబేధియేటరు'లో ఆయనని సన్మానించారు.

ఏప్రిలు 13, 14 తేదీల్లో సిక్కు మిషనరీ పరిషత్తు ఉత్సవాలు అమృతసర్‌లో జరిగాయి. ఈ ఉత్సవానికి డా ॥ అంబేద్కరు కూడా వెళ్లారు. "సిక్కు సమాజంలో సాంఘిక సమానత్వం ఉన్నది. దానిని నేను అంగీకరిస్తున్నాను. కాని మా మత-మార్పిడికి ఇంకా సమయం నిర్ధారించడం జరగలేదు" అని ఆయన తన ఉపన్యాసంలో చెప్పారు.

డా ॥ అంబేద్కరుగారి ఈ ఇంగితాన్ని చూసి మహాత్మాగారి అనుయాయులు సేఠ్ బాలచంద్ హిరాచంద్ గాంధీగారిని కలుసుకోవలసినదిగా బాగా పట్టుబట్టారు. ఆ ప్రకారం బాబాసాహెబు సేగాం వెళ్లి గాంధిజీని కలిశారు. అయితే దానివల్ల ఏ ఫలితమూ రాలేదు. సేగాంనుంచి తిరిగి వచ్చేసరికి వార్ధా స్టేషనులో వేలాది దళితులు డా ॥ అంబేద్కరు దర్శనార్థం వేచి ఉన్నారు. "ఈ జనంకోసం మేం లక్షల కొద్దీ డబ్బు ఖర్చు

పెడుతున్నాము. కాని ఈ జనం మమ్మల్ని లక్ష్యపెట్టడం లేదు" అని ఆ దృశ్యాన్ని చూసి సేఠ్ బాలచంద్ హీరాచంద్ అన్నారు. "తల్లికి దాదికి తేడా వాళ్ళకి బాగా తెలుసు" అన్న మాటలు డా॥ అంబేద్కరు నోట సహజంగానే వెలువడ్డాయి.

సిక్కుమతం సిద్ధాంతాలను అర్థంచేసుకోవటానికి గాను తన పుత్రుడు యశవంత్‌ని, మేనల్లుడు ముకుందరావునీ డా॥ అంబేద్కరు అమృత్‌సర్ స్వర్ణమందిర్ గురుద్వారాలో ఉంచారు.

1936 మే 30, 31 తేదీల్లో బొంబాయి ప్రాంతపు మహార్ పరిషత్తుని డా. అంబేద్కరు ఏర్పాటు చేశారు. 'యెవలా' లో ఏర్పాటు చేసిన సభలో ఆమోదించిన తీర్మానాలను అమలులో ఎలా పెట్టాలి అన్న విషయాన్ని చర్చించడానికి గాను ఈ పరిషత్తుని ఏర్పాటు చేశారు. వాటిని చర్చించి మార్గనిర్దేశం చేయవలసి ఉంది. ఈసభలో డా. అంబేద్కరు సుమారు ఒకటిన్నర గంటసేపు ఉపన్యాసించారు.[1] అస్పృశ్య సమాజం జ్ఞానం, ధనం సంఖ్యాబలం దృష్ట్యా ఎంత బలహీనమైనదో ఆయన తాము ఇచ్చిన 12 వేల మాటల చారిత్రాత్మకమైన ఉపన్యాసంలో వివరంగా చెప్పారు. ఈ మూడు శక్తులను సంపాదించుకోకుండా దాని వికాసం ఏ విధంగానూ సంభవం కాదు అని తెలియచేశారు. "అస్పృశ్య సమాజం వారు రకరకాలుగా పేర్లు మార్చుకుని తమజాతిని దాచి చెప్పడానికి ప్రయత్నిస్తారు. ఇలాగ పేర్లు మార్చుకునే కన్నామతం మార్చుకోవడం గౌరవప్రదం". ఉపన్యాసాన్ని ముగిస్తూ చివరగా ఇలా చెప్పారు -- బుద్ధ భగవానులు నిర్వాహణ సమయంలో తన ముఖ్య శిష్యుడు ఆనంద్‌కి ఇచ్చిన ఉపదేశాన్ని దృష్టిలో ఉంచుకోవాలి. "ఓ ఆనంద్ ! స్వయంగా నువ్వే నీ వెలుగువికా. నువ్వే స్వయంగా నీ శరణు పొందు. ఎప్పుడూ ఎవరి శరణూ జొచ్చకు" అని భగవాన్ బుద్ధుడు అన్నాడు. ఈ పరిషత్తు తర్వాత డా॥ అంబేద్కరు బైరాగుల, మేహతరుల సభని ఏర్పాటు చేసి వారిని కలుపుగా మందలించారు. ముందుకు వచ్చి అస్పృశ్య సమాజాన్ని ఉద్ధరించే కార్యకలాపాలకి నేతృత్వం వహించండని వారిని హెచ్చరించి చెప్పారు.

డా॥ అంబేద్కరు ఇచ్చిన ఈ ఉపన్యాసపు ప్రభావం చాలా విస్తృతంగా పడ్డాది. దాని ఫలితంగా అస్పృశ్యులు హిందూ మతస్థుల పండగలూ

1. సంపూర్ణక్షిత : పే. 66

పబ్బాలు, ఆచారాలు-రివాజులు, దేముడి పూజలు మొదలైనవి త్యజించటం మొదలుపెట్టారు.

1936 జూన్ 10వ తారీఖున ఇటలీ బౌద్ధ భిక్షువు లోక్‌నాధ్, రాజగృహ (బీహారు) నుంచి వెళ్లి డా ॥ అంబేద్కరును కలిశారు. బౌద్ధమతాన్ని స్వీకరించవలసినదని అభ్యర్థించారు. కాని డా ॥ అంబేద్కరు ఆయనకి నిర్ధారణగా ఏం చెప్పలేదు.

హిందూమహాసభ నాయకులు డా ॥ మురుజె 1936 జూన్ 18వ తారీఖున డా ॥ అంబేద్కరుని కలిశారు. సిక్కు మతం పరాయి మతం కాదుకాబట్టి దానిని స్వీకరించటానికి డా ॥ అంబేద్కరు సహకరించాలని చెప్పడానికే వచ్చారు. డా ॥ అంబేద్కరుతో చర్చించిన తర్వాత డా ॥ మురుజె, డా ॥ జయకర్ అంగీకారాన్ని కూడా పొందారు. ఇతర నాయకులకు కూడా ఆయన విజ్ఞప్తిని పంపారు. డా ॥ మురుజె ఎమ్.సి. రాజాకి కూడా ఉత్తరం రాశారు. ఉత్తరం ఆయన వ్యక్తిగతంగా రాసినది. అయినా గాంధీజీ రాజామురుజెల మధ్య జరిగిన ఉత్తరప్రత్యుత్తరాలని అచ్చు వెయ్యమని బలవంతం చేశారు. ఈ ఉత్తర ప్రత్యుత్తరాల్లో డా ॥ అంబేద్కరుకి చేసిన విజ్ఞప్తి ఈ విధంగా ఉటంకించ బడ్డాది -- "డా ॥ అంబేద్కరు సిక్కు మతాన్ని స్వీకరించితే, 'కొత్త సిక్కు' గా ఆయనకి పూనా ఒడంబడిక ప్రకారం ప్రాప్తించిన హక్కులన్నీ లభిస్తూనే ఉంటాయి. దీనికి హిందూమహాసభ ఏ అభ్యంతరమూ చెప్పదు". "ముస్లిము అధవా క్రైస్తవ మతాన్ని అంగీకరిస్తే అస్పృశ్యులు భారతీయ సంస్కృతి నుంచి వేరు అవుతారు. కాని సిక్కుమతాన్ని స్వీకరించితే వారు హిందూ సంస్కృతితో ముడిపడే ఉంటారు" అని ఈ విజ్ఞప్తిలో డా ॥ అంబేద్కరు రాశారు.

# ఇరవై ఏడు

లా కాలేజీ 1936 అక్టోబరు పత్రికలో ప్రచురించిన వ్యాసంలో డా ॥ అంబేద్కరు 107 సంవత్సరాల క్రితం ప్రీవీ కౌన్సిలు ఇచ్చిన తీర్పుని

ఉటంకించారు. దానిని వ్యాఖ్యానిస్తూ -- "ఈ కేసు చరిత్ర విద్యార్థులకే ప్రయోజనకరమైనది కాదు. ఇలా విద్యార్థులూ, జనసామాన్యమూ కూడా తెలుసుకోవలసిన కేసు. 1857 తిరుగుబాటుకు ముందు ఈ దేశంలో ఈస్టు ఇండియా కంపెనీకి విక్టోరియా మహారాణి ప్రభుత్వపు అధికారులకి మధ్య వైమనస్యము, క్రోధ ద్వేషాలూ పెరుగుతూ వచ్చాయి. కంపెనీ ద్వారా నియమించిన గవర్నరు, ప్రభుత్వం ద్వారా నియమించబడిన సర్వోన్నత న్యాయాధీశుడితో ఏదో ఒక వాదాన్ని కావాలని తగిలించడం జరిగేది. ఈ దావా ఆ వాద వివాదాల గురించే వెయ్యబడ్డాది. తన అధికార పరిధిలో లేని వ్యక్తి మీద 'రిట్' పంపే హక్కు సర్వోన్నత న్యాయాధీశుడికి ఉందా ? ఈ కేసులో ఇదే ముఖ్యమైన ప్రశ్న. నేటి పరిస్థితిలో కూడా ఈ తీర్పు అంతే మహత్తరమైనదీ, ముఖ్యమైనదీను" అని ఆయన రాశారు. "ఏ ప్రభుత్వ వ్యవస్థలోనైనా విధ్యాపరిషత్తూ, ప్రభుత్వ పాలనా విభాగాలకన్నా న్యాయపాలిక చాలా బలహీనమైనది అవుతుంది. పాలన విభాగం సాధారణంగా న్యాయపాలిక ఆదేశాలను మన్నిస్తుంది. కాని సోమరితనం, చేతకాని, ద్వేషం చేతగాని పాలనావిభాగం న్యాయపాలిక ఆదేశాలను పాటించడానికి నిరాకరిస్తే న్యాయం గాలికి పోతుంది. ప్రజల ప్రాణాలకి, సంపదకీ విపత్తి వచ్చి పడుతుంది" అని దాని గురించి వివరిస్తూ ఆయన చెప్పారు. "1925 చట్టంలో దీని గురించి చేసిన ఏర్పాటు, అమెరికా దేశపు రాజ్యాంగం, జర్మను రిపబ్లిక్‌లో కైజర్ పరాభవం, హిట్లరు ఆవిర్భావం, ఈ పరిస్థితులతో ఈ తీర్పుని పోల్చి చూడాలి" అని ఆయన చివరని రాశారు.[1]

# ఇరవై ఎనిమిది

భారత ప్రభుత్వపు 1935 చట్టం ప్రకారం ప్రాంతీయ స్వాతంత్ర్యం అంగీకరించడం జరిగింది. అన్ని ప్రాంతాలలోనూ ఎన్నికల తర్వాత రాష్ట్ర

1. లా కాలేజీ మాసపత్రిక, అక్టోబరు 1935, "ఎండ్ ది లార్డు సెడ్ అన్ టు" 1829, 31 సంవత్సరాల్లో ప్రీవీ కౌన్సిలు ద్వారా ఇయ్యబడిన తీర్పు - డాక్టరు అంబేద్కరు వివేచన.

ప్రభుత్వాలు స్థాపించబడతాయి. ప్రతిపార్టీ ఎన్నికలకి సిద్ధం అవుతోంది. 1936 ఆగస్టులో డా॥ అంబేద్కరు కూడా 'స్వతంత్ర మజదూర్ దళ్ ఇండిపెండెంట్ లేబర్ పార్టీ - పేరుతో ఒక పార్టీని స్థాపించారు. 15వ తారీఖున తన పార్టీ లక్ష్యాన్ని విధానాన్ని వివరిస్తూ ఒక ప్రకటన పత్రాన్ని 'మానిఫెస్టో) వెలువరించారు. "కొత్త విధానంలోని రాష్ట్ర ప్రభుత్వ వ్యవస్థకి బాధ్యతల భారము తగినంతగా లభ్యంకాలేదు. అయినప్పటికీ మనకి స్వల్పంగా ఏది అయితే ఇచ్చారో ఆ రాష్ట్ర విధానాన్ని సంపూర్ణంగా అమలులోకి తేవాలని మేం నిర్ణయించాము" అని ఆయన తన మానిఫెస్టోలో స్పష్టం చేశారు. ఈ నిర్ణయాన్ని ఉల్లేఖిస్తూ ఆయన లక్ష్యాలను వివరించారు. ఆయన కార్యక్రమం ఈ విధంగా ఉన్నాది. ఉన్న కార్యాల్ని త్వరితగతిని జరిగేటట్టు చూడ్డం, కొత్త పనులను మొదలుపెట్టడం, పట్టాదారులు దోపిడీకి గురి కాకుండా రక్షణ కనిపించడం, శ్రామికుల మేలును దృష్టిలో ఉంచుకుని చట్టాల చెయ్యడం, భూమి లేని వాళ్లకి భూమిని ఇప్పించడం, సంఘసంస్కర్తలకు సహాయాన్ని అందచెయ్యడం, పల్లెపట్టుల్లో ఆరోగ్య పథకాలని, నివాసాలు ఏర్పాటు చేసే పథకాలను ప్రారంభించడం మొదలైన సౌకర్యాలని కలుగ చేయడం లాంటి వాటి గురించి తమ విధానంలో ఉటంకించారు. ఈ మేనిఫెస్టోలు ప్రజలకు ఎంతో మేలు చేకూర్చేది. లక్ష్యంతో కూడుకుని ఉన్నదీను. బొంబాయి రాష్ట్రంలోని ప్రజల జీవితాభ్యుదయానికి ఈ పార్టీ శాయశక్తులా ప్రయత్నిస్తుందన్న నమ్మకాన్ని ఈ మేనిఫెస్టో ప్రతి ఒక్కరికీ కలగ చేస్తోంది. దేశహితం కోసం మనం ఏం చెయ్యగలమో డా॥ అంబేద్కరు 1942 నుంచి 1946 వరకూ శ్రామిక విభాగంలో మంత్రిగా ఉన్న కాలంలో ప్రత్యక్షంగా చేసి చూపించారు. ఆయన గొప్పతనం అందరి దృష్టికి వచ్చింది.

ఎన్నికలకోసం తనపార్టీని వ్యవస్థీకరించి ముందుగా సిద్ధం చేయవలసినది చేసి డా॥ అంబేద్కరు 'ఇటాలియన్ అనే ఓడలో తన ఆరోగ్య నిమిత్తం 1936 నవంబరులో యూరోపుకి వెళ్లారు. తన ప్రయాణానికి ముందు 'టైమ్స్ ఆఫ్ ఇండియా' విలేఖరికి ఇంటర్వ్యూ ఇచ్చారు. "కాంగ్రెసు సంస్థ దోపిడీ చేసేవాళ్లు, దోపిడీకి గురి అయ్యేవాళ్ల

కలుగొలుపుగా ఉన్న సంస్థ. దేశనవ నిర్మాణానికి ఈ సంస్థ ప్రయోజనకారికాదు. స్వతంత్ర మజ్దూర్‌పార్టీ ప్రజాస్వామ్యం అంటే ఏమిటో ప్రజలకు వివరించి చెపుతుంది. ప్రజా స్వామ్య వ్యవస్థను గురించి శిక్షణ యిస్తుంది" అని ఆయన ఆ ఇంటర్వ్యూలో చెప్పారు. ఆయనికి వీడ్కోలు ఇవ్వడానికి అశేష జనానీకం హార్బరుకు వచ్చారు. యూరోపులో తమ దీర్ఘ పర్యటనని ముగించుకుని 1937 జనవరి 14వ తారీఖున అంబేద్కరు బొంబాయి తిరిగి వచ్చారు. 'వివిధ వృత్త' అనే వారపత్రిక ఆయన ఒక బ్రిటీషు మహిళను వివాహం చేసుకున్నారన్న వార్తని ప్రచురించింది. అంచేత డా॥ అంబేద్కరుకి స్వాగతం చెప్పడానికి గాను వచ్చిన వేలాది జనం ఎంతో ఆత్రుతతో డా॥ అంబేద్కరుని భార్యా సమ్మేతంగా చూద్దామని ఆసక్తి పడ్డారు. డా॥ అంబేద్కరు ఒక్కరే రావడంతో పత్రికా విలేఖర్లు ఆయనని ప్రశ్నలు వేసి అడ్డుకున్నారు. "దొంగతనంగా దాపరికంతో పెళ్లి చేసుకోవలసిన అవసరం నాకు లేదు. ప్రస్తుతం మాకు ముఖ్యమైన పని ఉన్నాది. అది కొత్త ఎన్నికల పని" అని ఆయన జవాబు ఇచ్చారు.

ఆయన ఇంగ్లండులో పరే రేమ్సేమెక్‌డోనాల్డుని కలుసుకున్నారు. రేమ్సేమెక్‌డోనాల్డు ప్రధానమంత్రి పదవిలో ఉన్నప్పుడు భారతదేశానికి మేలు చేసే పనులు అనేకం చేశారని డా॥ అంబేద్కరు భావన. ఆయన భారతదేశపు మిత్రులు. "మతం మార్పిడి వల్ల అస్పృశ్యుల హక్కులకు ఏ అశనిపాతం తగలదు కదా ?" అనే విషయం గురించి యూరపులో కూడా డా॥ అంబేద్కరు న్యాయశాస్త్ర పండితులని, చట్ట నిపుణులని అనేకమందిని అడిగి చర్చించారు. న్యాయశాస్త్ర పండితుల అభిప్రాయాలను సలహాలను పొంది ఆయన మాతృదేశానికి తిరిగివచ్చారు.

# ఇరవై తొమ్మిది

1937 జనవరి రెండవ వారంలో డా॥ అంబేద్కరు ఇగత్‌పురి, బరఖెడె, సిన్నర్ పట్టణాల్లో 'స్వతంత్ర మజ్దూర్ పార్టీ' అభ్యర్థుల ప్రచార సభల్లో మాట్లాడారు. నాసిక్, జలగాం ఊళ్లలో కూడా సభల్లో ఉపన్యసించారు. ఇదే నెల ఆఖరి వారంలో ఆయన సతారా, కోల్హాపూర్ వెళ్లడానికి బయల్దేరారు. తోవలో పూనాలో ఆగారు. అక్కడ కాకాసాహబు, న.వి. గాడ్గిలు ఆయనని కలిశారు.[1] అస్పృశ్యుల ఓట్లు కాంగ్రెసుకు రావాలని వారు కోరారు. అంబేద్కరు అక్కడ ఆ విషయం మీద దృష్టి పెట్టలేదు. దాంతో గాడ్గిలు బొంబాయి హైకోర్టులో ఆయనని కలిశారు. "నా అనుయాయులు పులి పిల్లలు. వారి క్రమశిక్షణ అత్యుత్తమమైనది" అని డా॥ అంబేద్కరు ఆయనకి జవాబు చెప్పారు. తన అనుయాయుల పట్ల డా॥ అంబేద్కరుకి నమ్మకం అంత గట్టిది.

ఈ ఎన్నికల్లో డా॥ అంబేద్కరు స్వరాజ్య పార్టీకి చెందిన శ్రీ ల.బ. భోపట్‌కర్‌ని సమర్థించాలన్న భావాన్ని వ్యక్తం చేశారు. ఆయన తన పాత్రని స్పష్టపరుస్తూ ఈ విధంగా రాశారు – "డెమొక్రటిక్ స్వరాజ్యపార్టీ, స్వతంత్ర మజదూర్ పార్టీ రెండూ కొత్త విధానం వల్ల ఎక్కువ కెక్కువ ప్రయోజనాన్ని పొందాలన్న విషయాన్ని ఏకీభవిస్తున్నాయి. ఈ విధానం వల్ల మనకు లభించే రాజకీయ హక్కులను దేశంలోని అధిక సంఖ్యాకుల కష్టాలను నివారించటానికి ఉపయోగించవచ్చును.[2] భోపట్‌కర్ అస్పృశ్యతా నివారణకి హామీ కూడా ఇచ్చారు. డా॥ అంబేద్కరును సమర్థిస్తానని మాటా ఇచ్చారు. న.చి. కేల్‌కర్ వంటి మరాఠీ సాహిత్య సామ్రాట్టులు, తదితర నాయకులు డా॥ అంబేద్కరు అభ్యర్థత్వానికి స్వరాజ్యపార్టీ మద్దత్తు పూర్తిగా ఉంది అని ప్రకటించారు. కేల్కర్ తన పేపరులో ఇలా రాశారు – "రౌండ్ టేబిలు కాన్ఫరెన్సులో డా॥ అంబేద్కరు జాతీయ స్వభావం ఎంత ఉజ్జ్వలంగా వెల్లడయినదీ సర్వవిదితమే. ఆయనతో పోల్చి చూచినప్పుడు

1. వివిధ వృత్త : 7.2-1937
2. అదే : 7-11.1937 (పత్రం 5-2.1937)

తదితర నాయకులు అతిసామాన్యులుగా కనపడుతున్నారు." డా॥ అంబేద్కరు తన వివేకం, లక్ష్యశుద్ధి వల్ల గౌరవనీయమైన ఉన్నత స్థానాన్ని పొందారు. అని తదితర అంశాలను ఉల్లేఖిస్తూ ఆయన రాశారు.

డా॥ అంబేద్కరు బొంబాయి నగరం ఈ, ఎఫ్ వార్డుల ఎన్నికకి నిలబడ్డారు. కాంగ్రెసు పి. బాలూని ఆయనకి ప్రత్యర్థిగా నిలబెట్టింది. పా.నా.రాజభోజ్, దేవరుఖ్కర్ అస్పృశ్యుల ఓట్లని చీల్చడానికిగాను అంబేద్కరుకి పోటీగా నిల్చున్నారు. కమ్యూనిస్టులు కూడా అంబేద్కరుని వ్యతిరేకించారు. 17-2-1937 న ఎన్నికలు జరిగాయి. డా॥ అంబేద్కరు అత్యధిక ఓట్లతో గెలుపు సాధించారు. అంబేద్కరు పార్టీ అభ్యర్థుల్లో 17 మందికి పదమూడు మంది గెలిచారు. ఊరూరా పల్లెపల్లెలా అంబేద్కరు గెలుపుకి సంబరంతో ఉత్సవాలు జరిపారు. సాంగలీ పట్టణంలో అంబేద్కరుకి ఘనమైన స్వాగతం పలికారు. సుమారుగా ఈ రోజుల్లోనే 1937 మార్చి 16వ తారీఖున బొంబాయి హైకోర్టు మహడ్ 'చవదార్' చెరువు విషయంలో తన తీర్పుని ఇచ్చింది. దాని ప్రకారం అస్పృశ్యులకు ఆ 'చవదార్' చెరువు నీరు తాగడానికి, వాడుకోవడానికి హక్కు స్థిరీకరించబడ్డాది.

అదే రోజుల్లో బొంబాయిలని బరలీ ప్రాంతంలో కొత్త బౌద్ధ విహారము పూర్తయింది. "సామాన్య ప్రజానీకం కోసం అన్నిచోట్లా కొత్త విహారాలు స్థాపించాలన్న ఊహని డా॥ అంబేద్కరు బొంబాయి బౌద్ధ విహార్ సొసైటీకి సర్వప్రథమంగా ఇచ్చారు" అని ధర్మానంద్ కోసాంబీ దాన్ని గురించి తెలియచేస్తూ చెప్పారు.[1]

# ముప్పయి

ఎన్నికల్లో కాంగ్రెసు గెలిచింది. కాని మంత్రిమండలిని ఏర్పాటు చేయడాన్ని నిరాకరించింది. అంచేత సర్ ధన్‌జీషాహ్ కపూర్, జమనాదాస్ మెహతాని మంత్రిమండలి ఏర్పాటు చేయడానికి గాను ప్రభుత్వం ఆహ్వానించింది. ప్రముఖ కాంగ్రెసు నాయకులు వి.జి. ఖేర్ కపూర్ మంత్రి

1. ది బుద్ధ ప్రభ (ఇంగ్లీషు) : భాగం - 5, సంచిక - 2 ఏప్రిలు 1937, బొంబాయి

మండలి మీద అవిశ్వాస తీర్మానాన్ని పెట్టారు. దానిని సమర్థించ వలసినదని డా॥ అంబేద్కరుని అభ్యర్థించారు. ఆ సమయానికి డా॥ అంబేద్కరు జంజీరా వెళ్లి ఉన్నారు. అక్కడ నుంచి డా॥ అంబేద్కరు తన అసమ్మతిని రాసి పంపించారు.[1] ఒక మిత్రుడు అప్పుడు ఆయనని ప్రశ్నించాడు - "మీరు కాంగ్రెసు మంత్రిమండలిలో ఆర్థికమంత్రి కాబోతున్నారని గట్టి పుకారుగా ఉన్నది" - డా॥ అంబేద్కరు దానికి వెంటనే జవాబు చెప్పారు - "మొదటి సంగతి అది అసంభవం. ఒకవేళ కాంగ్రెసు పార్టీ నాకు ఆ బాధ్యతని అప్పగించాలని నిర్ణయించినా నేను దానిని అంగీకరించను. దానికి కారణం - (1) సంయుక్త మంత్రిమండలి పట్ల నాకు నమ్మకం లేదు, (2) నేను కాంగ్రెసు పార్టీలో నా పార్టీని వదలను. ఆ పార్టీలో నేను స్వయంగా చేరనూ చేరను.

"కాంగ్రెసు అనుయాయులకు తమ లక్ష్యాలన్నా, రాజకీయ అభిప్రాయా లన్నా నమ్మకం ఎలా ఉన్నాదో అలాగ్గానే మాకూ మా విధానం అన్నా మా సిద్ధాంతాలన్నా ప్రీతి ఉన్నాది. మా ఆలోచనా విధానాల్లో తేడా ఉంది. వ్యత్యాసం ఉంది. ఆలోచనల స్వేచ్ఛతో పాటుగా ఈ సంబంధం సంభవమూ అవసరమూ అయినప్పుడు కాంగ్రెసు పార్టీతో పాటు పని చెయ్యడానికి నాకు అభ్యంతరము ఉండదు."

సావంతవాడీ సంస్థానపు జనప్రియులైన సామంతులు శ్రీబాపూ సాహబు మహారాజు గారి కోర్టులో అపీలు దాఖలు చెయ్యడానికి డా॥ అంబేద్కరుకు వెళ్లవలసి వచ్చింది. పడవే గ్రామపు జమీందారు హత్య జరిగింది. ఈ కేసులో ముద్దాయి తరపున రాజాసాహబు ఎదట డా॥ అంబేద్కరు వాదించారు. ఈ అపీలు వాదం మూడు రోజుల పాటు సామంత్ శ్రీ బాపూ సాహబు కోర్టులో జరిగింది. రాజాసాహబు రోజూ 11 గంటల నుంచి సాయంత్రం 5-30 గం॥ల వరకూ వాదాన్ని ఎంతో జాగ్రత్తగా శ్రద్ధగా విన్నారు. మధ్యలో అరగంటపాటు తీసుకున్న విశ్రాంతి వదిలేస్తే నిర్వి రామంగా ఆరుగంటల పాటు ఏకాగ్రతతో వాదాన్ని వినడం, మధ్య మధ్య చాతుర్యంతో ప్రశ్నలు అడగడం ఆయన నైపుణ్యాన్ని చెప్పక చెప్పాయి. డా॥ అంబేద్కరుకి ఈ అనుభవం చాలా అసాధారణమైన దానిగా తోచింది. రాజాసాహబు గారు ఇచ్చిన తీర్పుని చదివినప్పుడు మహారాజు ఇచ్చిన తీర్పుని

1. వివిధవృత్త : 16-5-1937.

చదివినప్పుడు మహారాజు గారి వివేకం, చట్ట సంబంధమైన లోతైన జ్ఞానం, న్యాయశాస్త్రంలో ఖచ్చితంగా ఉన్న అనుభవమూ అర్థమయ్యాయి.

సావంతవాడీ రాజు గారు 1937 జూన్‌లో స్వర్గస్థులయ్యారు. డా|| అంబేద్కరు శ్రద్ధాంజలిగా వ్యాసం రాసి ఆయనకు తన హృదయ పూర్వక కృతజ్ఞతలను చెప్పుకున్నారు. మహారాజావారి ధర్మపరాయణతని మనసారా ప్రశంసించారు. రాజాసాహబు వ్యక్తిత్వంలో అంబేద్కరుకి ధర్మసంబంధమైన తన ప్రవృత్తి ప్రతిబింబించి కనిపించి ఉండి ఉంటుంది. అంచేత ఆయన సామంత శ్రీ బాపూ సాహబు మహారాజు గురించి "మహనీయులు కర్తవ్యపరాయణులు, పూజనీయులు" లాంటి విశేషణాలని తన వ్యాసంలో ప్రయోగించారు.

రాజ్య పాలనలో కొత్త విధానాన్ని సంపూర్ణంగా అమలులో పెట్టే విషయం గురించి స్వతంత్ర మజదూర్ పార్టీ బొంబాయిలోని కామగార్ మైదానంలో ఓ సభని ఏర్పాటు చేసింది. ఆ సభలో మాట్లాడుతూ డా|| అంబేద్కరు ఇలా అన్నారు – "దళిత సమాజపు శ్రేయస్సు కోసం రాజ్య విధానం నుంచి ఎక్కువకెక్కువ ప్రయోజనాన్ని పొందాలన్నది మా సంకల్పం. ఎంత లాభం లభ్యమయితే అంతా మేం తప్పకుండా తీసుకుంటాం." పండిత నెహ్రూ తమ ఇంటిలోని అస్పృశ్య నౌకరు హరిని ఎన్నికల్లో నిలబెట్టడానికి ఎన్నుకున్నారు. నెహ్రూ గారి ఈ పనిని గురించి ఉటంకిస్తూ అంబేద్కరు ఆయనను బాగా దుయ్య బెట్టారు.

# ముప్పై ఒకటి

కపూర్ మంత్రిమండలి 1937 జూలై 18వ తారీఖున రాజీనామా చేసింది. 1937 జూలై 19 వ తారీఖున కాంగ్రెసు పరిపాలనని చేపట్టింది. కాంగ్రెసు సభ్యులకు ఇంగ్లీషు ప్రభుత్వంతో పాటు శ్రద్ధా విశ్వాసాలతో వ్యవహరిస్తామని శపథం చెయ్యవలసి వచ్చింది. అంబేద్కరు శపథం చేసి నప్పుడు భగవద్గీతను చేతపట్టుకోలేదు. ప్రతిపక్ష సభ్యులుగా డా|| అంబేద్కరు, జమానాదాసు మెహతా ఇద్దరూ వాదనా పటిమ ఉన్న వారు. బాగా ప్రఖ్యాతి

పొందినవారు. భారతదేశం మొత్తంలో ఏ అసెంబ్లీలోనూ వీరికి సమఉజ్జీ సభ్యుడు లేడు.

తన కోర్టు పని మీద డా॥ అంబేద్కరు జూలై 31 వ తారీఖున ధూళియా పట్టణానికి వెళ్తున్నప్పుడు తోవలో చాలీస్‌గాం స్టేషన్‌లో జయజయ నాదాలతో ఆయనకి బ్రహ్మాండమైన స్వాగతం చెప్పారు. హరిజన సేవక్ సంఘపు శ్రీ బర్వే. డా॥ అంబేద్కరు గౌరవార్థం టీ పార్టీ ఇచ్చారు. సాయంత్రం విజయానంద థియేటరులో డా॥ అంబేద్కరు ఉపన్యసించారు. "కాంగ్రెసు మంత్రిమండలిలో అస్పృశ్య సభ్యుడు ఒక్కడైనా మంత్రిగా లేడు. మనం సంఘటితం అయి మన మార్గాన్ని అన్వేషించుకుని ముందుడుగు వెయ్యాలి." అని చెప్పారు.

ఆగష్టు 7వ తారీఖున స్వతంత్ర మజ్‌దూర్ పార్టీ వార్షికోత్సవం బొంబాయిలోని నాగ పాడా ప్రాంతంలో ఏర్పాటు చేశారు. ఈ బహిరంగ సభలో డా॥ అంబేద్కరుని అధ్యక్షులుగానూ, కోశాధ్యక్షులుగానూ ఏకగ్రీవంగా ఎన్నుకున్నారు.

1937 ఆగష్టు 23 వ తారీఖున బొంబాయి విధానసభలో మంత్రుల వేతనాలు, ఇంటి అద్దె, పర్యటన భత్యాలకు సంబంధించిన ఓ బిల్లును చర్చకు పెట్టారు. ఆ బిల్లుని గట్టిగా వ్యతిరేకిస్తూ డా॥ అంబేద్కరు ఇలా అన్నారు – "వేతనం గురించి ఆలోచించేటప్పుడు కార్యదక్షత, సాంఘిక ప్రతిష్ఠ, ప్రజాస్వామ్యం పట్లా, పరిపాలన పట్లా నిజమైన నిష్ఠా భావాన్ని పరిగణనలోకి తీసుకోవాలి."

కొంకణ విభాగంలోని "ఖోత్" అంటే జమీందారులు తమ పట్టాదారులను ఎన్నో శతాబ్దాలుగా దోపిడీ చేస్తూ ఉన్నారు. ఈ రైతులని జమీందారుల దోపిడీ నుంచి విముక్తుల్ని చేయడానికి గాను 1937 సెప్టెంబరు 17వ తారీఖున డా॥ అంబేద్కరు విధానసభలో ఓ బిల్లు పెట్టారు. రైతుల ప్రయోజనార్థం బిల్లును ప్రవేశపెట్టిన ప్రథమ వ్యక్తి డా॥ అంబేద్కరే ! జమీందార్లకు భూమి మీద ఉన్న యాజమాన్యపు హక్కును తొలగించాలని ఈ బిల్లులో సూచించారు. దానికి బదులుగా వారికి నష్ట పరిహారం చెల్లించాలి. అయితే పాలక వర్గం ఈ బిల్లుని నానుస్తూ ఉంచేశారు. మహార్‌జాతి వారి పిత్రార్జిత ఆస్తులకు సంబంధించిన

హక్కుల్లో సంస్కరణ చేయడానికి గాను డా|| అంబేద్కరు ఓ బిల్లును ప్రవేశపెట్టారు. కాని దానిని కూడా జాప్యపు పద్దులో పడేశారు.

ఎన్నికలు గెలిచాక డా|| అంబేద్కరు వాతావరణపు మార్పు కోసం జపాను వెళ్లాలన్న యోచనలో ఉన్నారు. కాని ఆయన మిత్రులు "వివిధ వృత్త" పేపరు సంపాదకులు, రామచంద్ర కాశీనాధ్ తలణీస్ మీద అలీబహాదుర్ ఖాన్ పరువు నష్టం దావా వెయ్యడంతో, ఆ కేసుని వాదించ టానికి గాను ఆయన తమ జపాను పర్యటన ఆలోచనని వదులుకున్నారు. ఈ దావా 1937 ఏప్రిలు వరకూ నడుస్తూనే ఉంది. అంబేద్కరు ఎంతో చాకచక్యంతో ఈ కేసుని వాదించారు. కాని పేపరులో అలీ బహాదుర్ ఖాన్‌ని బహిష్కరించినట్లు చేయబడిన సూచనని ఋజువు చేయలేకపోవడంతో జడ్జి గారు సంపాదకులు తలణీస్ గారికి 5 రూపాయలు జుర్మానా కట్టాలన్న శిక్ష వేశారు.

1937 నవంబరులో 'ఆది ద్రావిడ తరుణ సంఘ్' వారు బొంబాయిలో డా|| అంబేద్కరుకు సన్మానం చేశారు. "యువకులు కాంగ్రెసులో చేరకూడదు" అని డా|| అంబేద్కరు ఉపదేశించారు.

# ముప్పై రెండు

1937 నవంబరులో మెక్‌డోనాల్డు దొర గురించి విపులమైన ఓ వ్యాసాన్ని[1] రాసి డా|| అంబేద్కరు మెక్‌డోనాల్డు ప్రధానమంత్రిగా ఉన్న కాలంలో భారతదేశపు హితం కోసం ఏ విధంగా పని చేసినదీ వివరించారు.

రెండవ రౌండ్ టేబిలు సమావేశంలో బ్రిటను మితవాదులు భారతదేశాన్ని 'ప్రాంతీయ స్వాయత్తత' గురించే చర్చించనివ్వాలి అని చాలా కుట్ర పన్నారు. ఈ లోలోపలి ఎత్తుల వలలో గాంధీజీ కూడా చిక్కుకు పోయారు. ఆయన ఈ ప్రాంతీయ స్వాతంత్ర్యాన్ని ఉద్దేశించిన వెలువ రించిన సర్క్యులర్ మీద తమ సంతకం కూడా పెట్టేశారు. అయితే బ్రిటన్ దౌత్యనీతివేత్తల ఈ ఎత్తుని గౌరవనీయులు ఆగాఖాను, సర్‌తేజ్‌బహాదుర్‌సప్రూ

1. వివిధ వృత్త : 21 - 11-1937

డా॥ అంబేద్కరు పడనివ్వలేదు. దానితో వారి పప్పులు ఉడకలేదు. భారతదేశపు స్వాతంత్ర్యం కోసం గాను చేసిన అన్ని ప్రయత్నాలకు సర్ మెక్‌డోనాల్డు చాలా ఎక్కువగా తన తరపు నుంచి సహకరించారు. ఇలాంటి విషయాలను అనేకమైన వాటిని డా॥ అంబేద్కరు తమ వ్యాసంలో ప్రతిపాదించారు. డా॥ అంబేద్కరు ఇలా వ్రాశారు - "మెక్డోనాల్డు భారతదేశానికి మిత్రులు. తన స్నేహ భావాన్ని కార్యరూపంలో చూపెట్టడానికి మనసారా ఆయన ప్రయత్నం కూడా చేశారు."

డా॥ అంబేద్కరు సోలాపూర్ జిల్లా అస్పృశ్య పరిషత్తుకు హాజరవడానికి గాను డిసెంబరు 30 వ తారీఖున పంఢరీపురీ బయల్దేరారు. తోవలో కుర్డ్ వాడీ రైల్వేజంక్షను దగ్గర ఆయనకు ఘనంగా స్వాగతం చెప్పారు. మాతంగ సమాజం వారి కరకంబ ఊళ్లో కిక్కిరిసి నిండుగా ఉన్న సభలో ఆయన ఉపన్యసించారు. కాంగ్రెసుకు దూరంగా ఉండండి అని సలహా ఇచ్చారు. మధ్యాహ్నానికి పంఢరీపురీకి చేరుకున్నారు. ఆయన అక్కడకు వెళ్లగానే, విశ్రామ భవనం వరకూ ఆయనని ఊరేగించి తీసుకువెళ్లారు. పంఢరీపురీ పురపాలక అధ్యక్షులు అక్కడ ఆయనని కలుసుకోవడానికి వచ్చారు. ఆయన డా॥ అంబేద్కరును తనతో పాటు పరిషత్తుని ఏర్పాటు చేసిన ధర్మ సత్రానికి తీసుకువెళ్లారు. పంఢరీపురీ పురపాలక అధ్యక్షులు అక్కడ ఆయనని కలుసుకోవడానికి వచ్చారు. ఆయన డా॥ అంబేద్కరును తనతో పాటు పరిషత్తుని ఏర్పాటు చేసిన ధర్మసత్రానికి తీసుకు వెళ్లారు. అక్కడ ఉపన్యాసం ఇస్తూ బాబాసాహబు ఇలా అన్నారు. జాతి భేదం ఆచారం సమసిపోనంతవరకూ సమానత్వం ఏర్పడనే ఏర్పడదు. జాతి వ్యవస్థ వినాశనమే సమానత్వపు నిర్మాణము. పేదలు సంఘటితంగా అధికారులను ఎదురుకోనంత వరకూ వారి ఆర్థిక దోపిడీ అంతమవదు. మన ఆత్మగౌరవాన్ని కాపాడుకోవటానికి ఆందోళనని మొదలు పెడితేనే భవిష్యత్తులో మనకు లాభం చేకూరుతుంది. మహార్‌ల పిత్రార్జిత ఆస్తికి సంబంధించిన బిల్లును పరిషత్తు సమర్థించింది. ఆ తర్వాత డా॥ అంబేద్కరు పంఢరీపురీ పురపాలక కార్యాలయానికి వెళ్లి అక్కడ సన్మాన పత్రాన్ని స్వీకరించారు.

పరిషత్తు కార్యక్రమాలని ముగించుకుని అంబేద్కరు సోలాపుర్‌లోని మాతంగ పరిషత్తుకు హాజరయ్యారు. 1938 జనవరి 4 వ తారీఖున సోలాపుర్ పురపాలక సంఘం వారు ఆయనకు సన్మాన పత్రం సమర్పించారు. ఈ

సందర్భంలో ఆ సన్మాన పత్రానికి సమాధానంగా ఆయన ఉపన్యసించారు. "మన దేశంలోని ప్రజాస్వామ్యం తన వివేకాన్ని ఉపయోగించుకోవడాన్ని వాయిదా వేసుకుంది. ప్రజాస్వామ్యంలో అధికారంలో ఉన్న పార్టీ ఆలోచనలని, పనులని సంపూర్తిగా పరీక్షించాలి. చికిత్స కూడా చేయాలి. భారత దేశానికి మంచి నియంతృత్వం కావాలి" అని ఆయన తన ఉపన్యాసంలో అన్నారు.

ఆ మరుసటి రోజు క్రిష్టియన్ సముదాయాన్ని సంబోధిస్తూ ఉపన్యసించారు. "నా మనస్సు మీద ఏసుక్రీస్తు, బుద్ధ భగవానుడు - ఈ మహాపురుషులు మహత్తరమైన వ్యక్తిత్వపు ప్రభావం గట్టిగా ఉన్నది. సమానత్వం, సౌభ్రాతృత్వం, స్వాతంత్ర్యంతో జీవించటాన్ని, వ్యవహరించటాన్ని ఏ మతం మనకు బోధిస్తుందో ఆ మతం అవసరం మనకి ఉన్నది" అని అంబేద్కరు చెప్పారు. సాంఘిక అన్యాయాలకు వ్యతిరేకంగా క్రైస్తవ మత సముదాయమూ సంఘర్షించ లేదు అన్న అంశాన్ని చెప్పడాన్ని కూడా ఆయన విస్మరించలేదు.

• షోలాపూర్ నుంచి తిరిగి వచ్చాక డా॥ అంబేద్కరు విధానసభా భవనం వరకూ రైతుల ర్యాలీని నడిపారు. దీనిలో ఠాణా, నాసిక్, కులాబా, రత్నగిరి, సాతారా ప్రాంతాల పేద రైతులు పాల్గొన్నారు. "జమీందారీ - ముర్దాబాద్, "అంబేద్కరు బిల్లు - సమర్థించాలి అనే నినాదాలతో ఈ ఊరేగింపు విధానసభ భవనం వరకూ వెళ్లింది. శామ్‌రావ్ పరులేకర్, ఇందులాల్ యాజ్ఞిక్, తదితర నాయకులు 15-20 మందిని కూడా తీసుకుని డా॥ అంబేద్కరు ముఖ్యమంత్రిని కలుసుకున్నారు. వ్యవసాయం చేసే రైతులకు కనీస వేతనం నిర్ధారించటం, కౌలు విధానాన్ని ఎత్తివేసే శాసనం సన్నకారు రైతుల నిమిత్తం నీటి ఖరీదుని తగ్గించడం - మొదలైన డిమాండ్లను ఆయన ముఖ్యమంత్రికి సమర్పించారు. విజ్ఞప్తిని సమర్పించిన తర్వాత మోర్చా ఆజాద్ మైదానానికి చేరుకుంది. అక్కడ డా॥ అంబేద్కరు ఉత్తేజకరమైన ఉపన్యాసం ఇచ్చారు. "ప్రపంచంలో రెండే వర్గాలు. ఉన్నాయి. దోపిడీ చేసేవారు, దోపిడీకి గురి అయ్యేవారు. శ్రామికులు, కర్షకులు జాతి భేదాన్ని పరిగణించకుండా వివేకంతో సంఘటితులై విధానసభకు తమ ప్రతినిధులను ఎన్నుకుని పంపించాలి. అప్పుడే వారికి మేలు కలుగుతుంది" అని ఆయన చెప్పారు.

# ముప్పై మూడు

రైతు కూలీల సమస్యల పరిష్కారం కోసం పోరాట పంథాకి దిగిన కారణంగా డా॥ అంబేద్కరుకు ఉపన్యాసం ఇవ్వాలని అంటూ వచ్చే పిలుపులు ఎక్కువ అయ్యాయి. అహమద్‌నగర్‌లో రైతు కూలీల పరిషత్తు ఏర్పాటు చెయ్యబడ్డాది. అక్కడ నుంచి ఆహ్వానం వచ్చింది. 1938 జనవరి 25 వ తారీఖున అక్కడ ఆయన చాలా గొప్పగా ఉపన్యసించారు. సభ అయిన తర్వాత వకీళ్ల తరపున జిల్లా లోకల్ బోర్డులో ఆయనకి టీ పార్టీ ఇచ్చారు. సాయంత్రం అదే జిల్లాలో ఉన్న అకోలా గ్రామానికి వెళ్లారు. అక్కడ కూడా ఓ సభలో మాట్లాడారు.

జాధవ్‌జీ గాంధీ, ధీరజ్‌లాల్ అనే ఇద్దరు వ్యక్తులకి సట్టా (స్పెక్యులేషన్) జూదం ఆడిన నేరానికి గాను చీఫ్ ప్రెసిడెన్సీ మెజిస్ట్రేట్ విధించిన శిక్షను బొంబాయి హైకోర్టు నిలిపివేసింది. భొంబాయి ప్రభుత్వం ఈ ఇద్దరి శిక్షలని తన అధికారాన్ని ప్రయోగించి నిలిపివేసింది. న్యాయ రంగంలో ప్రభుత్వం జోక్యం కలగ చేసుకున్న కారణంగా జమానాదాస్ మెహతా బొంబాయి విధానసభలో వాయిదా తీర్మానాన్ని పెట్టారు. దీనిని సమర్థిస్తూ డా॥ అంబేద్కరు ప్రీవీ కౌన్సిలు దృష్టాంతాన్ని ఇచ్చి ఇలా అన్నారు - "భారతదేశపు క్రిమినలు కోర్టు యిచ్చిన తీర్పు మీద హైకోర్టులో అపీలు స్వీకరించబడదు. అన్నదానిని ఋజువు చేయకుండా ఈ వ్యవహారంలో న్యాయశాస్త్ర సిద్ధాంతాలని ఉల్లంఘించడం జరిగింది. ఇటువంటి కార్యకలాపాల వల్ల ప్రజలకు చట్టము, న్యాయవ్యవస్థ పట్ల, పరిపాలనా వ్యవస్థ నిజాయితీ పట్లా నమ్మకం లేకుండా పోతుంది. శంక కలుగుతుంది. సందేహం, అనుమానం వేస్తాయి. నేరం చేసిన ముద్దాయిలకు వేసిన శిక్షకి క్షమాభిక్ష పెట్టడం న్యాయచట్టాన్ని కాలరాసిన దానితో సమానం" ఈ విషయంలో దేశీయ వ్యవహారాల మంత్రి కె.ఎమ్. మున్షీ ముఖ్యమంత్రి గారి అంగీకారాన్ని తీసుకున్నారా ? లేదా అన్నది కూడా ఆయన తెలుసుకోవాలని కోరారు.

గ్రేట్ ఇండియన్ పెనిన్ శులా రైల్వే దళిత వర్గపు శ్రామికుల సభ 1938 ఫిబ్రవరి 12 వ తారీఖున జరిగింది. ఈ పరిషత్తుకి 20 వేల మంది శ్రామికులు హాజరయ్యారు. ఈ సభకి అధ్యక్షత వహించి డా॥ అంబేద్కరు తమ అధ్యక్షోపన్యాసంలో శ్రామిక ఆందోళనకు అధోగతి పట్టడానికి కారకులైన నాయకుల బూటకాన్ని బట్టబయలు చేశారు. ఆయన తమ ఉపన్యాసంలో ఇలా అన్నారు - శ్రామికుల పెట్టుబడిదారులు, బ్రాహ్మణ వాదులు - ఈ శత్రువులనిద్దరిని ఎదుర్కోవలసి వస్తుంది. మీ ఉన్నతి కోసం, మీకు మీరు వేరుగా సంఘటితం అవ్వాలి. ప్రపంచ ప్రఖ్యాతులైన కమ్యూనిస్టు నాయకులు మానవేంద్రనాథ్ రాయ్ దీనిని ఎందుకు వ్యతిరేకిస్తున్నారో అని ఆయన తమ విస్మయాన్ని వెలిబుచ్చారు. "ఇంగ్లీషు వారి ఈ సామ్రాజ్యవాద శక్తి చేతుల్లోంచి ముక్తి పొందడానికి ఇక్కడి పెట్టుబడిదారీ విధానంతో తలపడవలసి వస్తే మీరు ఇప్పట్నించీ దాని ఏర్పాట్లకి సంసిద్ధం అవండి" అని ఆయన తన అభిప్రాయాన్ని చెప్పారు.

ఈ పరిషత్తులోనే కాక, అక్కడ జరిగిన యువకుల సమావేశంలో వారి మేలు గురించి మాట్లాడుతూ ఆయన ఇలా చెప్పారు - జీవితంలో ఉన్నతమైన ఉద్దేశాలను పొందడానికి ఉదాత్తమైన లక్ష్యాలని ఏర్పరచుకోవడం అన్నది ప్రముఖమైన గట్టి వాంఛ. ఈ లక్ష్యాలను సాధించటానికి ప్రతి వ్యక్తి ఇరవై నాలుగు గంటలూ పూర్తి దీక్షతో ప్రయత్నం చెయ్యాలి. సమాజాన్ని ఉద్ధరించటానికి నిర్విరామంగా కృషి సలపాలి" విద్య గురించి మాట్లాడుతూ ఆయన ఇలా చెప్పారు. విద్య రెండు పక్కలా పదును ఉన్న కత్తిలాంటిది. విద్యావంతుడైనప్పటికీ, చరిత్ర హీనుడు, వినయ హీనుడు అయిన వ్యక్తి మృగం కన్నా భయంకరమైన వాడు అవుతాడు. నాలోని ధార్మిక భావాల కారణంగానే నాలో సుగుణాలు వృద్ధి పొందాయి."

విధానసభలో ప్రత్యేక కర్నాటక ప్రాంతపు నిర్మాణం గురించిన బిల్లు మీద 1938 ఏప్రిలు 4 వ తారీఖున చర్చ జరిగింది. ఆ చర్చలో డా॥ అంబేద్కరు పాల్గొంటూ ఈ విషయాన్ని ఖచ్చితంగా స్పష్టపరిచి చెప్పారు - "ప్రత్యేక ప్రాంతపు ఈ డిమాండు కారణంగా రాష్ట్రంలో లింగాయతులకి, తదితర వాస్తవ్యులకి మధ్య ద్వేషం పుడుతుంది. కేంద్రపాలన బలమైనదిగా ఉండడమూ, మొత్తం యావత్ దేశ వాసులకి ఒకే న్యాయ చట్టం ఉండడం అన్నది బ్రిటిషు పరిపాలన మనకు ప్రసాదించిన

ప్రముఖమైన కానుక. ప్రతి వ్యక్తి మనసులోనూ మనం అందరమూ భారతీయులం అన్న భావాన్ని మేల్కొలపాలన్నది మన భారతీయులందరి లక్ష్యమూ అవాలి."

1938 ఏప్రిలు 27, 28, 29 తారీఖుల మూడురోజుల్లూ డా॥ అంబేద్కరు బొంబాయి పోలీసు చట్టం సవరణ సూచనలు ప్రతిపాదించే బిల్లు మీద ఉపన్యసించారు.

"నేను గత ఇరవై సంవత్సరాల నుండీ బొంబాయిలోని అపరాధుల లోకాన్ని చూస్తున్నాను. గూండాలు, బద్మాషులు, దుర్మార్గులు బీదవాళ్లని బతకనివ్వరు. చెప్పరానంతగా హింసిస్తారు. అయితే ఆ గూండాల మీద చేసిన ఫిర్యాదులకు ఎవరికీ చీమకుట్టినట్లైనా ఉండదు. వాళ్ల ఫిర్యాదులు ఈ చెవితో విని ఆ చెవితో వదిలేస్తారు." అని ఆయన అన్నారు. జాతి మత కలహాలు జరిగినప్పుడు వెంటనే చర్య తీసుకోవాలనీ, వెనువెంటనే సుస్థిరతని కలిగించాలనీ ఆయన డిమాండు చేశారు.

మే నెల ప్రారంభంలో చత్తీస్ గఢ్ వాస్తవ్యులైన సతనామీ పంచవాసుల ధర్మగురువు ముక్తావన దాసు మీద మోపబడిన హత్యా నేరాన్ని వాదించడానికి గాను నాగపూర్ హైకోర్టులో ఆయన అపరాధి తరపున ప్రతివాది వకీలుగా వకాల్తా పుచ్చుకున్నారు. ఆయన తర్కయుక్తమైన వాదాన్ని వినడానికి లెక్కలేనంత మంది జనం హైకోర్టు హాలులోనూ బైటా నిలుచునే వారు. మొదటి రోజు సాయంత్రం నాగపూర్ వాస్తవ్యులు ఆయనకి అఖండమైన స్వాగతం ఇచ్చారు. రెండో రోజున ఆయన కామఠీ వెళ్లారు. అక్కడ అస్పృశ్య విద్యార్థుల సభలో మార్గాన్ని సూచిస్తూ ఉపన్యాసం ఇచ్చారు. ఆ తర్వాత బొంబాయి తిరిగి వచ్చారు.

# ముప్పై నాలుగు

డా॥ అంబేద్కరు 1938 మే నెలలో లా కాలేజీ ప్రిన్సిపాలు పదవికి రాజీనామా చేశారు. లా కాలేజీ మాసపత్రికలో ఆయన చేసిన పనులను వర్ణిస్తూ ఇలా రాశారు - "డా. అంబేద్కరు గారి జ్ఞానమూ, కార్యదక్షతల పట్ల

విద్యార్థులకు అమితమైన గౌరవభావం ఉన్నది. ఆయన ఉపన్యాసాలు ఆయన చేసిన అధ్యయన సారంతో నిండి ఉండేది. మనసు పెట్టి మరీ చెప్పేవారు. న్యాయశాస్త్ర విషయంలో ఆయన అభిప్రాయాలు ఎప్పుడూ విప్లవాత్మకంగా ఉండేవి."

మే 13 వ తారీఖు నుండి డా|| అంబేద్కరు కొంకణ ప్రాంతంలో పర్యటించటానికి బయల్దేరారు. అక్కడ కొంకణ వాస్తవ్యులైన మహార్ సమాజ్ సేవాసంఘ్ తరపున దక్షిణ కొంకణ పంచమహల అస్పృశ్య పరిషత్తు ఏర్పాటు చేయబడ్డాది. ఆ సభకి దూర దూర ప్రాంతాల నుంచి ఐదు ఆరు వేల మంది పేద అస్పృశ్యులు డా. అంబేద్కరు దర్శనార్థం వచ్చారు. తమ దరిద్ర మిత్రులను ఉద్దేశించి ఆయన ఇలా అన్నారు -

"చచ్చిన జంతువుల మాంసం తినం, వాటిని మొయ్యడం గాని పారేసేపని గాని చెయ్యం అని మీరు ఒట్టు పెట్టుకోండి." విద్యాసంపన్నులు, ధనికులు అయిన మహారులకు ఉపదేశిస్తూ ఇలా చెప్పారు - "గొప్ప జాతుల వారిని, పదవుల్లో ఉన్నవారిని యాచించకండి. మీకు చెందిన చట్ట సంబంధమైన న్యాయమైన హక్కుల కోసం పోరాడండి. వాటిని పొందండి. ఇక్కడ ఇప్పుడు ఇంగ్లీషు వారి పాలన లేదు. ప్రజా ప్రభుత్వం ఉంది. విధానసభలో 15 గురు అస్పృశ్య సభ్యులు ఉన్నారు. వారి కార్యకలాపాల పట్ల దృష్టి పెట్టండి. ఇంగ్లీషు వారు దేశాన్ని వదిలిపోతారు. కాని ఈ పెట్టుబడిదారులని, పురోహితులని మీరు ఎదురుకోవాలి."

రెండవ రోజు డా|| అంబేద్కరు దేవరుఖ్, ఆఖలీ అనే ఊళ్లకు వెళ్లారు. అక్కడా ఉపన్యాసాలు ఇచ్చారు. 15 వ తారీఖు రాత్రికి ఆయన చిపలూన్ పట్టణానికి చేరుకున్నారు.

16 వ తారీఖు ఉదయం ముహాగర్ అన్న ఊళ్లో ఆయన ఉపన్యాసం ఇచ్చారు. తిరిగి చిపలూన్ వచ్చారు. చిపలూన్ సభలో ఆయన ఇలా చెప్పారు "ఒక రైతు ప్రధానమంత్రిపదవిని అలంకరించడాన్ని నేను చూడాలి. పొలాల మీద ప్రత్యేక హక్కులను కలిగించే "ఖోతీ' బిల్లుకి విధానసభలో ఆమోదం దొరకకపోతే 'భూమి పన్ను - బంద్ ఉద్యమాన్ని ఆరంభించండి."

ఆ తర్వాత ఖేడ్, దాపోలీ పట్టణాల్లో ఉపన్యాసాలు ఇచ్చి మహాడ్ చేరుకున్నారు. అక్కడ ఏర్పాటు అయిన ఒక గొప్ప సభలో ఆయన సోషలిస్టులను తీవ్రంగా విమర్శించారు.

"జమీందారీలను అంతం చెయ్యాలని గట్టిగా నినాదాలు ఇచ్చే ఈ సోషలిస్టులు "ఖోతీ బిల్లు" విషయంలో నోట్లో ముద్ద పెట్టుకుని కూర్చున్నారు." సుమారు 600 మైళ్లు పర్యటించి డా|| అంబేద్కరు మే 21 వ తారీఖున బొంబాయి వచ్చారు. ఎడతెరపి లేకుండా ఉపన్యాసాలిచ్చే కార్యక్రమాల్లో పాల్గొన్న కారణం చేత ఆయన గొంతు వెలుగు రాసుకు పోయింది.

బొంబాయి వచ్చాక ఒక ఇంటర్వ్యూలో తమ పార్టీకి మద్దత్తు దొరుకు తోంది అని ఆయన చెప్పారు. స్వతంత్ర మజదూర్ పార్టీ తను ఇచ్చిన మాటలను నిలబెట్టుకోవడానికి పూర్తిగా ప్రయత్నం చేస్తోంది.

ఇంచుమించుగా ఈ రోజుల్లోనే నాగపూర్ దరిదాపుల్లో జాఫర్ హుస్సేను అనే పోలీసు ఆఫీసరు తనతో పాటు పనిచేసే వాడి సహాయంతో ఒక మైనరు అస్పృశ్య బాలికని బలాత్కరించాడు. ఆ కేసులో ఇచ్చిన తీర్పుని హైకోర్టులో కూడా అలాగే ఉంచారు. కాని మధ్యప్రదేశ్‌లో డా.నా.భా. ఖరే మంత్రిమండలిలో శరీఫ్ అనే దేశ వ్యవహారాల మంత్రి ఉన్నారు. ఆయన జాఫర్ హుస్సేనును విడిపించారు. సాంఘిక వ్యవహారాల్లో ఎక్కడన్నా అన్యాయం జరిగితే డా|| అంబేద్కరు సహించేవారు కాదు. ఖరే మంత్రి మండలిని నిందించటానికి గాను శ్రీ తటణీస్ అధ్యక్షతన బొంబాయిలో ఏర్పాటు చేసిన ఒక సభలో ఆయన ఉపన్యసించారు. ఈ సభలో అర్ధరాత్రి సమయానికి కూడా పదివేల కన్నా ఎక్కువ జనం హాజరయ్యారు. డా|| అంబేద్కరు భాగా చలించిపోయారు. ఆయన గొంతు గద్గదికం అయింది. ఆయన తమ వెక్కిళ్లను ఆపుకోలేకపోయారు. చాలా కఠినమైన భాషలో ఆయన డా|| ఖరె మంత్రిమండలిని, బలాత్కారం లాంటి అతి నీచమైన నేరాన్ని చేసిన్న జాఫర్ హుస్సేన్‌ను విడిపించిన మంత్రిమండలిని, దుయ్యబెట్టారు. ఖండించారు.[1]

అలా అయినా మహాత్మాగాంధీతో అభిప్రాయ భేదం వచ్చి డా|| ఖరె తమ మంత్రిమండలికి రాజీనామా ఇచ్చినప్పుడు ఆయన స్వాగతార్థం యిచ్చిన సభకి అంబేద్కరు హాజరయ్యారు.

ఈ సభ ఆగష్టు 5వ తారీఖున ఏర్పాటు చెయ్యడం జరిగింది. ఈ సభలో ప్రజాస్వామ్యాన్ని అంచనా వేస్తూ ఆయన ఇలా అన్నారు –

1. వివిధ వృత్త : తే. 27-3-1938.

"ప్రజాస్వామ్య సిద్ధాంతాలకి కాలం చెల్లి పోకుండా అంతమందీ వాటి గురించి యోచన చెయ్యాలి. ఈ దేశంలో ఒకే ఒక రాజకీయ పార్టీ ఉండడం మంచిదికాదు. దేశంలో ఒకటికన్నా ఎక్కువ రాజకీయ పార్టీలు లేని కారణం చేత వివేకం వికసించడానికి అవకాశం లేకుండా పోతుంది. వివేకం వికసించని చోట స్వాతంత్ర్యాన్ని పొందడం, దానిని ప్రయోజన కరంగా చేయడం అన్నది కూడా అసంభవమే అవుతుంది."

దీనికి ముందు 1938 ఆగష్టు 4వ తారీఖున భారత సేవక్ సమాజ్ హాలులో డా॥ ఖరెకి విందు ఇచ్చారు. ఈ సందర్భంలో అధ్యక్షోపన్యాసం యిస్తూ డా॥ అంబేద్కరు మహారాష్ట్ర వాసులు వెనకబడి పోతున్నారన్న తీవ్రమైన తమ మనోవ్యధని వ్యక్తం చేశారు. మహారాష్ట్రీయులు భారతదేశపు స్వాతంత్ర్యం కోసం తమ ప్రాణాలను త్యాగం చేశారు. మహారాష్ట్ర శూరులూ వీరులూ అయిన సేనాపతుల్ని, గొప్ప దౌత్య నీతివేత్తలని, నిపుణులైన రాజకీయ వేత్తల్ని దేశానికి ఇచ్చింది. అటువంటి గొప్పవారిని పొంది ప్రపంచంలో ఏ దేశమన్నా గర్వపడుతుంది. కాని మహారాష్ట్రీయులు వ్యాపారాన్ని చేపట్టక పోవడం నుంచి ముందుకు పోలేక పోయారు."

తిలక్, రానెడే, గోఖలే - ఈ ముగ్గురి నాయకుల రాజకీయం ఉత్తేజకర మైనది కాకపోయినప్పటికీ ఎక్కువ ప్రామాణికమైనది, ఆలోచనలు రేకెత్తించేది, న్యాయనిష్టత కలిసినదీను. ఈ అభిప్రాయాలతో పాటు ఆయన బాధ్యతాయుత పరిపాలనా విధానపు సిద్ధాంతాలని, ముఖ్యమంత్రి అధికారాలని, తదితర విషయాలని వివరించారు. మంత్రులు కూడా తమ ఓటర్లకి జవాబుదారీలు అవడం అవసరం. మొదటి సంగతి, ప్రజాస్వామ్యంలో ఒక పార్టీ అధికారంలో ఉంటే రెండవది ప్రతిపక్షంగా వ్యవహరించబడుతుంది. రెండవ సంగతి, ప్రతిపక్షం నిత్యమూ ప్రభుత్వ పార్టీని గీటు రాయిమీద పరీక్షించి చూస్తూ ఉండాలి. ఈ రెండు విషయాలూ ప్రజాస్వామ్యానికి ప్రాథమికమైన అవసరాలు అని ఆయన స్పష్టపరిచారు.[1]

ఆ రోజుల్లోనే 'చిత్ర' వార పత్రికకి ఇంటర్వ్యూ ఇస్తూ ఆయన వ్యాసం రాశారు - "గాంధీ మహాత్ముడా ?" అన్న ఈ వ్యాసంలో ఆయన వ్యంగ్యాన్ని,

1. వివిధ వృత్త : 14-8-1938.

హేళనని జోడించి ఆ రెండు అస్త్రాలతో గాంధీజీ గారి మహాత్మత్వాన్ని ఇష్టం వచ్చినట్లు వెక్కిరించారు.

అహమ్మదాబాదు దగ్గర ఉన్న బాయలా ఊరికి చెందిన అస్పృశ్య సముదాయం వారి దారిద్ర్యాన్ని చూసి ఆయన దయతో కరిగిపోయారు. తిరిగి వస్తున్నప్పుడు ఖైమాభాయీ సభా భవనంలో ఆయన ఉపన్యాసం ఏర్పాటు చేశారు. గాంధీజీని ఆయన ఎందుకు వ్యతిరేకిస్తున్నదీ ఆయన ఆ ఉపన్యాసంలో వివరించి చెప్పారు. బొంబాయి మంత్రిమండలిలోనూ, మధ్యప్రదేశ్ మంత్రిమండలిలోనూ అస్పృశ్యుడు ఒకడన్నా మంత్రి హోదాలో ఎందుకు లేడు ? అన్న ప్రశ్నను కూడా లేవనెత్తారు. 1938 అక్టోబరు 31 వ తారీఖున నిపాణీ పట్టణంలో ఆయనకు ఘనమైన స్వాగతం పలికారు. 51 ఎద్దులు కట్టిన రథంలో ఆసీనులని చేసి ఆయనను ఊరేగించారు.

# ముప్పై అయిదు

1938 డిసెంబరు నెలలో పారిశ్రామిక వివాదం గురించిన బిల్లు విధానసభలో ప్రవేశపెట్టారు. ఈ బిల్లు ప్రకారం కొన్ని ప్రత్యేక పరిస్థితుల్లో శ్రామికులు హర్తాళ్ చెయ్యడం చట్ట విరుద్ధంగా పరిగణించబడుతుంది - దీనిని చట్టంగా చెయ్యాలి. ఈ బిల్లుని డా॥ అంబేద్కరు చాలా గట్టిగా వ్యతిరేకించారు. "స్వాతంత్ర్యానికి ఒక పవిత్రమైన హక్కు అయితే శ్రామికులకు హర్తాళ్ చేసే హక్కు కూడా అంతే పవిత్రమైనది. ఈ బిల్లు శ్రామికుల పారస్వేచ్ఛని నేలరాసే చట్టం అవుతుంది" అని ఆయన అన్నారు.

విధానసభ బయట ఈ చట్టాన్ని "నల్ల చట్టం' అని దానిని తిరస్కరించడం జరిగింది. 1938 నవంబరు 7వ తేదీన మిల్లు మజ్దూర్ యూనియన్, స్వతంత్ర మజ్దూర్ పార్టీ రెండూ ఈ చట్టానికి విరుద్ధంగా హర్తాళ్ చెయ్యడానికి యుద్ధ ఢంకా వాయించాయి. ఆ ముందు రోజు రాత్రి ఎనిమిది గంటలకు యూనియన్ సభలో హర్తాళ్ రూపురేఖలని సిద్ధం చేశారు. ఈ సభలో అంబేద్కరు, పరులేకర్, డాంగే, నింబ్కర్ మొదలైన

నాయకులు పాల్గొన్నారు. అంబేద్కరు కూడా తన పార్టీ కార్యకర్తల సమావేశాన్ని ఏర్పాటు చేశారు. వేల సంఖ్య మీద స్వయం సేవకుల ద్వారా నగరంలో అన్ని భాగాల్లోనూ విజ్ఞాపనా పత్రాలని పంచి పెట్టించారు.

రెండవ రోజు బొంబాయిలోని కామగార్ మైదానంలో శ్రామికుల పోరాట సభ జరిగింది. సుమారు ఎనభై వేల మంది శ్రామికులను సంబోధించి మాట్లాడుతూ డా॥ అంబేద్కరు కాంగ్రెసు పాలసీల మీద ఉత్తేజితపూరితమైన విమర్శ చేశారు. 1938 నవంబరు 6 వ తారీఖున శ్రామిక నాయకుల సమావేశం జరిగింది. అందులో హర్తాళ్ సమితిని ఏర్పాటు చేశారు. ఈ స్వయంసేవకుల్లో నూటికి తొంభైమంది ఎర్రబట్టలు వేసుకున్న స్వయంసేవకులు స్వతంత్ర మజ్దూర్ పార్టీకి చెందినవారే.

నవంబరు 7వ తేదీన అంబేద్కరు, జమనాదాస్ మెహతా ఉదయం నుంచీ కూలీల బస్తీలో తిరుగుతూ లౌడ్ స్పీకర్ల ద్వారా సూచనలు ఇవ్వడం మొదలు పెట్టారు. బొంబాయిలోని బట్ట మిల్లులన్నీ మూసేశారు.

బొంబాయిలోని డిలా ఇల్ రోడ్డు మీద రాళ్లు విసరడం జరిగింది. పోలీసులు కాల్పులు జరిపారు. దాంతో ఇద్దరు వ్యక్తులు గాయపడ్డారు. ఆ రోజు ఈ నల్ల చట్టానికి వ్యతిరేకంగా బొంబాయి రాష్ట్రంలోని పెద్ద పట్టణాలన్నిటిలోనూ ప్రదర్శనలు జరిగాయి.

సాయంత్రం కామగార్ మైదానంలో శ్రామికుల సభ అతి బ్రహ్మాండంగా జరిగింది. హర్తాళ్ విజయవంతం అయినందుకు అంబేద్కరు శ్రామికులని అభినందించారు. "శ్రామికుల చేతికి పరిపాలనాధికారం రానంతవరకూ వారి సమస్యలు కూడా పరిష్కరించబడవు" అని ఆయన అన్నారు.

ఈ హర్తాళ్తో డా॥ అంబేద్కరు పేరు నిపుణులైన శ్రామికనాయకులుగా సర్వత్రా వ్యాపించింది. ఆయన ప్రతిభ వెయ్యి వెలుగులు వెలిగింది. సమయం వచ్చినప్పుడు అభిప్రాయ భేదాలను విస్మరించి శ్రామికులందరి మంచికోసం అందరూ కలసికట్టుగా నిలుచోవాలి అన్న పాఠాన్ని ఆయన శ్రామిక సంస్థలన్నిటికీ బోధించారు. తమ పార్టీ ప్రత్యేక అస్తిత్వాన్ని ఆయన నిలబెట్టే ఉంచారు.

ఈ హర్తాళ్ విజయంతో ప్రభావితులై సంయుక్త ప్రదేశ్ (ఉత్తరప్రదేశ్) రైతుకూలీ నాయకులు స్వామి సహజానంద డా॥ అంబేద్కరును కలిసి రైతుల సమస్యల గురించి చర్చించారు.

బాబాసాహెబు గారి మార్గదర్శకత్వంలో పి.జె. రోహమ్ 1938 నవంబరు 10వ తేదీన బొంబాయి విధానసభలో ఒక తీర్మానాన్ని ప్రవేశపెట్టారు - "సంతాన నిరోధం, కుటుంబ నియంత్రణం రెండింటిని ప్రభుత్వం తీవ్రంగా ప్రచారం చెయ్యాలి. వాటి సాధనాలు తేలికగా లభ్యం అయ్యే ఏర్పాటు చెయ్యాలి." అనారోగ్య కారణంగా ఆ రోజు బాబాసాహెబు విధాన సభకు హాజరు కాలేకపోయారు. అయితే ఆయన వారి ద్వారా ఉపన్యాసపు విషయాల్ని తెలుసుకున్నారు. ఈ ఉపన్యాసంలో వివిధ దేశాల జనసంఖ్య గణాంక వివరాలు, ఆ జనానికి లభించే వైద్య చికిత్స సదుపాయాలు, అక్కడ సంభవించే మరణాల సంఖ్య నిష్పత్తి మొదలైన విషయాల గురించి సరిపోలుస్తూ అభిప్రాయాలు వ్యక్తపరచడం జరిగింది. భారతదేశంలో కుటుంబ నియంత్రణం అవసరం ఎంత ఎక్కువగా ఉందో కూడా ఎత్తి చూపించడం జరిగింది. కాని అప్పుడు హిందువులు, ముస్లిములు, సిక్కులు, క్రైస్తవులు - అందరూ సభ్యులూ మతం ఆధారంగా ఈ ప్రతిపాదనని వ్యతిరేకించారు. ఆ కారణంగా, ఈ తీర్మానం ఆమోదం పొందలేదు. కుటుంబ నియంత్రణ గురించి మాట్లాడ్డం కూడా అపవిత్రం అని భావించే రోజులలో డా॥ అంబేద్కరు చేసిన సాహసం ప్రశంసనీయమైనది. ఈ తీర్మానాన్ని సమర్పించేటట్టు చెయ్యటంలో భారతదేశపు భవిష్యత్తు పట్ల ఆయనకున్న మనోదీక్ష, సూక్ష్మదృష్టి అవగతమవుతాయి.

ఈ సంవత్సరంలోనే శ్రీ. జి.ఆర్. ప్రధాన్ పి.హెచ్.డి. డిగ్రీ కోసం రాసిన థీసీసు వ్యాసాన్ని పుస్తకరూపంలో ప్రచురించారు. దాని శీర్షిక - 'అన్‌టచ్‌బుల్ వర్కర్సు ఆఫ్ బోంబే సిటీ" - ఈ పుస్తకం ముందు మాటలో డా॥ అంబేద్కరు ఇలా రాశారు - "రచయిత తన వ్యాసంలో వాస్తవిక పరిస్థితులను చక్కగా చిత్రించారు. స్పృశ్యులతోనూ, తదితర మతాలకు చెందిన శ్రామికులతోనూ సరిపోలుస్తూ చేసిన అధ్యయనాన్ని కూడా పొందుపర్చి ఉండి ఉంటే మత మార్పిడి తర్వాత వారి స్థితిలో ఏ మార్పు కలగ గలదు అన్న విషయాన్ని కూడా సులువుగా అర్థం చేసుకోవడానికి వీలు కలిగి ఉండేది."

ఋణగ్రస్తులను సాహుకార్ల ఉచ్చుల్లోంచి ఋణ ముక్తుల్ని చేయించ డానికి గాను డా॥ అంబేద్కరు ఈ రోజుల్లోనే "ఎ బిల్ టు రెగ్యులేట్ మనీ లెండర్స్ యాక్ట్" అనే బిల్లుని విధానసభలో ప్రవేశపెట్టారు. ఈ బిల్లులో

సాహుకార్లకి అనుమతి విధానాన్ని, అ ప్పులు ఇవ్వడానికి అనేక రకాలైన విధులని సూచించారు.

# ముప్పై ఆరు

1938 జనవరి నెలలో రైతు మహాసభ మహాడ్ గ్రామంలో జరిగింది. ఈ మహాసభలో మాట్లాడుతూ ముఖ్యమంత్రి ఖేర్‌ని మహారాష్ట్రీయుడు అని ఆయనని అగౌరవపరచినందుకు గాను సర్దార్ పటేలుని డా॥ అంబేద్కరు తీవ్ర పదజాలంతో తిరస్కారాన్ని తెలుపుతూ చీవాట్లు పెట్టారు.

బొంబాయి తిరిగి వచ్చాక 'సమత సైనిక దళ్ స్వయం సేవకులు నిర్వహించిన కార్యకలాపాలను ఆయన ఎక్కువగా కొనియాడారు. ఈ సంస్థని డా॥ అంబేద్కరు యువకుల కోసం ప్రారంభించారు. ఇప్పుడు 'స్వయంసేవీ సైనిక్ పథక్' కి 'సమత సైనిక్ దళ్' అని పేరు పెట్టారు. ముఖ్యమంత్రి ఖేర్, సర్దారు వల్లభ్‌భాయీ పటేలు కూడా వారి పనులను ప్రశంసించారని ఆయన తన ఉపన్యాసంలో చెప్పారు.

ఆ రోజుల్లో 'రాష్ట్ర సంఘం' ప్రణాళిక గురించి యావత్ భారతదేశంలో తీవ్రంగా చర్చ సాగుతోంది. పూనాలోని 'గోఖలే అర్థశాస్త్ర సంస్థ' ఈ ప్రణాళిక మీద మాట్లాడ్డానికి గాను డా॥ అంబేద్కరుని 1939 జనవరి 29 వ తారీఖుకి పిలిచింది. ఆయన రెండు గంటల సేపు ఉపన్యాసం ఇచ్చారు. హెచ్చరిస్తూ ఇలా వివరించారు – ఈ 'రాష్ట్ర సంఘం పరిపాలనతో సంస్థానాల ప్రతినిధులు ఇంగ్లీషువారి ఏజంట్లుగా ఉంటారు' అక్కడి వాస్తవ్యులు కేవలం సంస్థానాల ప్రజలే ఉంటారు. రాష్ట్ర సంఘానికి వారిమీద ఏ అధికారమూ ఉండదు. ఇది ఒక ప్రమాదం. "మనకి కేంద్ర పరిపాలన విధానం కావాలి. రక్షణశాఖ, విదేశ వ్యవహారాల శాఖ ఈ రాష్ట్ర సంఘం అధికారంలో ఉండాలి", మొదలైన అంశాల మీద అభిప్రాయాలని వ్యక్తం చేస్తూ, " ఈ నియమించబడిన రాష్ట్ర సంఘం కారణంగా మనకి స్వరాజ్యం ఉండదు" అని స్పష్టం చేశారు.

"రానాడే యుగం వెలుగు యుగం. కాని ఈ గాంధీ యుగం చీకటి యుగం." అని కూడా ఆయన చెప్పారు. "రాజకీయాల్లో విద్యతో పాటు

అధ్యయనం కూడా ఎంతో అవసరం" అని ఆయన నొక్కి వక్కాణించారు. ఆయన ఈ ఉపన్యాసం తర్వాత 'ఫెడరేషన్ ఫర్సెస్ ఫ్రీడమ్' శీర్షికతో ప్రచురణ పొందింది.

1938 నవంబరు 7వ తేదీన హర్తాళ్‌లో జరిగిన కాల్పుల దర్యాప్తుకి ఒక కమిటీని నియమించారు. ఈ కమిటీ తన రిపోర్టులో హర్తాళ్ చేసిన వారిని నేరస్థులని స్థిరీకరించింది. కమిటీ వివరణని విమర్శిస్తూ విధానసభలో డా॥ అంబేద్కరు ఇలా అన్నారు – "స్వరాజ్యం అంటే ఇప్పుడు తుపాకి కాల్పుల ప్రభుత్వం అని తాత్పర్యం. దాని అర్థం ప్రజలు నోరు మూసుకుని జరుగుతున్నది చూస్తూ చిరునవ్వులు ఒలకబొయ్యాలి. ఇదే దాని తాత్పర్యం అయితే ఇది స్వరాజ్యం కాదు. అభిశాపం."

1939 ఫిబ్రవరి నుండి రాజకీయ సంస్కరణల నిమిత్తం రాజకోటలో ఆందోళన ప్రారంభం అయింది. సుభాష్‌చంద్ర బోసు మహాత్మాగాంధీల మధ్య అభిప్రాయ భేదాలు తారస్థాయికి చేరుకున్నాయి.

1939 ఏప్రిలు నెలలో రాజకీయ సంస్కరణల విచారణార్థం ఏర్పరచిన కమిటీలో తమ ప్రతినిధిని కూడా చేర్చుకోవాలన్న డిమాండును సమర్థించటానికి గాను రాజకోటకి చెందిన అస్పృశ్య ప్రజలు బాబాసాహెబు అంబేద్కరుని ఆహ్వానించారు. బాబాసాహెబు రాజకోట రాజా ఠాకుర్‌ని కలిశారు. రాత్రి అస్పృశ్యుల సభలో మాట్లాడారు. రెండవ రోజు గాంధీజీని కలిసి ఆయనకి – "అస్పృశ్యుల ప్రతినిధిని ఒకరిని కమిటీలో వేసుకోవాలి" అని చెప్పారు. కాని జ్వరం కారణంగా గాంధీజీ ఈ విషయం గురించి ఆయనతో పూర్తిగా చర్చించలేకపోయారు.

1939 జూలై నెలలో "రోహిత్ దాస్ శిక్షణ్ సంస్థాన్" ద్వారా ఏర్పాటు చేసిన పరేల్ ప్రాంతపు చమార్‌ల సభలో బాబాసాహెబు మాట్లాడారు. ఆయన ఉద్యమం ప్రత్యేకించి ఏ కులం కోసమూ కాదు. దళిత సమాజంలో ఉన్న కుల భేదాన్ని సంపూర్తిగా రూపుమాపాలి. ఇదే ఆయన ఖచ్చితమైన అభిప్రాయం" అని ఆ సభలో ఆయన స్పష్టంగా చెప్పారు.[1]

అక్టోబరు 25, 26, 27 తారీఖుల్లో జరిగిన విధానసభ సమావేశాల్లో యుద్ధం విషయంలో పాలసీ నిర్ధారణ గురించి జరిగిన చర్చలో ఆయన

1. డా॥ అంబేద్కరు : రైటింగ్స్ అండ్ స్పీచెస్, ఖండం 2, పే. 245

పాల్గొన్నారు. దక్షిణ అమెరికాలో స్థిరపడ్డ స్పెయిను దేశస్థులు స్పెయిను సామ్రాజ్యం నుండి వేరు అయిపోవడానికి నిశ్చయించుకున్నప్పుడు రాజ్యాంగం తయారు చేయవలసినదని రాజ్యాంగ నిపుణుడు జెరెమీ బెల్థామ్‌కి చెప్పారు. ఆయన ఎంతో కృషి చేసి రాజ్యాంగపు రూపురేఖని సిద్ధం చేశారు. దాని కాపీలు వేలసంఖ్యలో ఓడ ద్వారా బండిలు కట్టి పంపించారు. అయితే ఈ రాజ్యాంగం దక్షిణ అమెరికాకి ఉపయోగకరం కాదని తేలింది. ఆ కాపీలన్నిటినీ అగ్నికి ఆహుతి ఇచ్చారు. ఈ ఉదాహరణని ఇస్తూ బాబాసాహబు ఈ విధంగా చెప్పారు - "ఒంటిని వేసుకోవడానికి కుట్టించుకునే సూటులాగే రాజ్యాంగం కూడా ఆ దేశానికి ఉపయుక్తంగా ఉండాలి. అధ్యక్షుల వారి పలచటి శరీరానికి సరిపోయిన బట్టలు నా శరీరానికి ఎలాగా ఉపయోగపడవో అల్లాగ్గానే రాజ్యాంగం దేశానికి ఉపయుక్తమైనది కాకపోతే, దానివల్ల దేశానికి ఏ లాభమూ చేకూరదు. ప్రజాస్వామ్యం అంటే బహుజనుల పరిపాలన. అంచేత ఈ దేశంలో పరిపాలన హిందువులది అవుతుంది. ఆ కారణంగా ఈ మెజారిటీలో అస్పృశ్యుల విషయంలో, ఆదివాసుల విషయంలో, అల్ప సంఖ్యాకుల విషయంలో ఏ పాలసీ చేపెట్టబోతున్నారో అన్నది చాలా ముఖ్యమైన విషయం."

"నా వ్యక్తిగత హితానికీ దేశ హితానికీ మధ్య ఘర్షణ వచ్చినప్పుడల్లా నేను దేశ హితానికే ప్రాధాన్యత ఇచ్చాను. అయితే నేను నా సమాజం పట్ల నిష్ఠ కలిగి ఉన్నాను. చివరి ఊపిరి వరకూ అస్పృశ్య సమాజాన్ని నేను దూరం చేసుకోను" అని తన వ్యక్తిగత భూమిక గురించి వివరణగా చెప్పారు.

నవంబరు నెల మొదటి వారంలో కాంగ్రెసు మంత్రిమండలులు రాజీనామా ఇచ్చాయి. దీనిని జిన్నా గారు ముస్లిములను "ముక్తి దినం" గా జరుపుకోమని ఆదేశించారు. బొంబాయి లోని భెండి బజారు ప్రాంతంలో ముస్లిములు 'ముక్తి దినం' సందర్భంగా ఒక పౌరట సభని ఏర్పాటు చేశారు. ఈ సభలో డా|| అంబేద్కరు కాంగ్రెసు పాలసీలను ఘాటుగా విమర్శించారు.

1927 నుంచి డా|| అంబేద్కరు మహారుల వంశానుక్రమంగా సంక్రమించే పిత్రార్జిత ఆస్తిని అంతం చెయ్యటానికి ఎంతో ప్రయత్నించారు. కాని ప్రభుత్వం దానిపట్ల ఏ సానుభూతీ చూపించలేదు. కాని మహార్ వతన్

హక్కు మీద ఎక్కువ పన్ను విధించింది. దీనికి 'తమ వ్యతిరేకతను ప్రదర్శించటానికి గాను మహారులు, మాంగులు 1939 డిసెంబరులో హరిగాంలో ఒక సభని ఏర్పాటు చేశారు. సుమారు 20 వేలమంది వతన్‌దారులను ఉద్దేశించి ఉపన్యాసం యిస్తూ డా॥ అంబేద్కరు ఆరు నెలలలోగా వతన్‌దారులను బానిసత్వపు కట్టు చెర నుండి విముక్తుల్ని చెయ్యకపోతే , వారికి ప్రభుత్వోద్యోగులతో సమానంగా జీతాలు ఇవ్వకపోతే ఈ వతన్‌దారులు హర్తాళ్ చెయ్యాల్సి వస్తుంది అని ప్రభుత్వాన్ని హెచ్చరించారు.

# ముప్పై ఏడు

సుమారుగా ఆ రోజుల్లోనే యూరపులో పోలాండు సమస్య మీద రెండవ మహాయుద్ధం వచ్చి పడ్డాది. ఈ యుద్ధంలోకి భారతదేశాన్ని కూడా లాగారు. కాంగ్రెసు నాయకులందరూ బేషరతుగా ఇంగ్లీషు వారికి మహాయుద్ధంలో సహాయపడతామని హామీ ఇచ్చారు. "ఫెడరలు పరిపాలన ప్రభుత్వ లక్ష్యం అయినప్పటికీ ప్రస్తుత పరిస్థితుల్లో దానిని వాయిదా వేయడం తప్పించి మరో మార్గం లేదు" అని 1939 సెప్టెంబరు 11 వ తేదీన వైస్రాయి గారు ప్రకటించారు.

డా॥ అంబేద్కరు యుద్ధం విషయంలో తన భూమికని స్పష్టపరచటానికి ఒక వివరణని ప్రచురించారు. "పోలాండు ప్రశ్న ఒక వంక. కాని తన అభిప్రాయాలతో ఏకీభవించని వారి మీదా, ఏకీభవించలేకపోయిన వారి మీదా తన అభిప్రాయాలను రుద్దడం జర్మనీ పాలసీ. ఇది ప్రపంచానికి హానికరమైన విషయం. భారతదేశం దేనివల్ల మళ్లీ బానిసత్వపు అఘాతంలో పడవలసి వస్తుందో ఆ మార్గాన్ని భారతదేశం స్వీకరించకూడదు. బ్రిటిషు సామ్రాజ్యాలలో భారతదేశానికి ఏ హోదా ఇవ్వబోతున్నదీ బ్రిటిషు ప్రభుత్వం తన అభిప్రాయాన్ని ఖచ్చితంగా స్పష్టం చెయ్యాలి - బ్రిటనుకి ఇది అవసరం" అని అందులో ఆయన చెప్పారు.

"స్వాతంత్ర భారత ప్రజాస్వామ్యం తదితర స్వతంత్ర రాష్ట్రాలతో పాటు భద్రత కోసం సహకరించే కృషి చేస్తుంది" అని సెప్టెంబరు 14 వ తేదీన కాంగ్రెసు నాయకులు ప్రకటించారు. డా॥ అంబేద్కరుకి కాంగ్రెసు ప్రకటించిన ఈ పాలసీ నచ్చలేదు. డా॥ అంబేద్కరు లాగే కాంగ్రెసులో లేని నాయకులందరికీ కాంగ్రెసు సమస్త భారతీయులకి ప్రాతినిధ్యం వహించటం అన్నది అంగీకారం కాలేదు. "కాంగ్రెసు క్లెయిము ఫాసిస్టు ప్రవృత్తిది. ఇది ప్రజాస్వామ్యానికి గొడ్డలిపెట్టు అవుతుంది" అని బాబాసాహబు ఒక వివరణ పత్రాన్ని ప్రచురించి తన ప్రతిక్రియని ప్రకటించారు.

అక్టోబరు నెల మొదటి పక్షంలో భారత వైస్రాయి లార్డు లిన్‌లిథ్‌గో భారతదేశ నాయకులు ఏభై యిద్దరిని కలుసుకున్నారు. వారితో చర్చలు చేశారు. డా॥ అంబేద్కరు అక్టోబరు 9వ తారీఖున ఆయనతో చర్చించటానికి వెళ్లారు. భవిష్యత్తు రాజ్యాంగంలో దళిత సమాజానికి ఏ స్థానం ఉండాలన్న దానిమీద తన అభిప్రాయాలను వైస్రాయికి తెలియచేశారు.

అందరి నాయకులను కలిసిన తర్వాత వైస్రాయి ఒక వివరణని ప్రకటించారు. యుద్ధం అయిపోయిన తర్వాత ప్రముఖమైన పార్టీల నాయకులందరి అంగీకారంతో భారత ప్రభుత్వపు చట్టం సవరించబడుతుంది. ఏ ముఖ్యమైన సంస్కరణా అల్ప సంఖ్యాకుల అంగీకారం లేకుండా చేయబడదు, అని ఆయన స్పష్టపరిచారు.

వైస్రాయి ప్రకటన సంతోషజనకంగా లేదని కాంగ్రెసు కార్యవర్గ సమితి నిర్ణయించింది. కాంగ్రెసు మంత్రిమండలుల నన్నిటినీ రాజీనామా చేయవలసినదని ఆదేశించింది. దీనికి తన ప్రతిక్రియని వ్యక్తం చేస్తూ ఢిల్లీలో డా॥ అంబేద్కరు తన స్టేట్‌మెంట్ ఇచ్చారు. "దేశభక్తి కేవలం కాంగ్రెసు వారి గుత్తాధికారం ఏం కాదు. ఇతర పార్టీలకు కూడా తమ ఆలోచనా విధానం ప్రత్యేకమైనది ఉంటుంది" అని ఆయన స్పష్టమైన భాషలో చెప్పారు. "కాంగ్రెసు ప్రభుత్వంలో ముస్లిముల మీద అత్యాచారం జరిగింది అన్న వివరణ మీద మాకు బొత్తిగా నమ్మకం లేదు" అని ముస్లిము లీగు పాలసీలను కూడా విమర్శిస్తూ చెప్పారు.

1939 అక్టోబరులో పండిత జవహర్‌లాల్ నెహ్రూ అస్పృశ్యుల డిమాండ్లను అర్థం చేసుకోవడానికి గాను అంబేద్కరుతో రెండు రోజులు చర్చ చేశారు. ఆ తర్వాత వెంటనే బొంబాయి రాష్ట్రం కాంగ్రెసు కమిటీ

నాయకులతో కూడా ఆయన చర్చలు మూడు నాలుగు రోజులు పాటు సాగాయి. కాని ఏ పరిణామమూ జరగలేదు.

# ముప్పై ఎనిమిది

"పేష్వాల పరిపాలనాల కాలంలో దుకాణంలో బట్ట కొన్నప్పుడు తానులోంచి కత్తిరించిన తర్వాత కూడా చింపే ఇచ్చేవారు. కొనేవాడు అస్పృశ్యుడు అని తెలియాలని అలా చేసేవారు" అని 1940 జనవరి 15 వ తారీఖున ఇంటర్‌నేషనల్ ఫెలోషిప్పు ఎదుట ఉపన్యాసం యిస్తూ డా॥ అంబేద్కరు చెప్పారు.[1]

1940 ఫిబ్రవరి నెలలో డా॥ అంబేద్కరు బొంబాయిలోని ఓ పాత్రికే యుడికి ఇంటర్యూ ఇచ్చారు.[2] "తమ మతాన్ని త్యజించి హిందూమతాన్ని అవలంబించని బౌద్ధ మతస్థులకు తూర్పు ప్రాంతపు బ్రాహ్మణులు ఈ శిక్ష వేశారు" అని ఆయన ఆ ఇంటర్యూలో చెప్పారు. తర్వాత తన ఈ సిద్ధాంతాన్ని 1948 లో తన పుస్తకం "పూర్వం అస్పృశ్యులు ఎవరు ?" అన్న దానిలో విపులంగా ప్రతిపాదించారు.

ఈ రోజుల్లోనే హ.వి. దేశాయికి ఇచ్చిన ఇంటర్వ్యూలో కూడా ఆయన బౌద్ధ మతం గురించి తమ అభిప్రాయాలను స్పష్టంగా ప్రకటించారు.[3] "బౌద్ధమతంలో సమానత్వం, స్వతంత్రం రెండు తత్వాలు మిళితంగా ఉన్నాయి. ఈ తత్వాలు బ్రాహ్మణ వర్ణానికి బొత్తిగా నచ్చలేదు. బౌద్ధ మతం విజయం సాధిస్తే సమాజంలో జాతి భేదం అన్నది ఉండనే ఉండదు. దాంతోపాటు బ్రాహ్మణుల స్థానం కూడా కదిలిపోతుంది. రాజకీయ ప్రభుత్వం, సైనిక శక్తి - రెండింటి సహాయంతో శక్తివంతమైన మతాన్ని బ్రాహ్మణులు చేత బట్టుకున్నారు. ఈ కారణంగానే బౌద్ధ మతాన్ని నాశనం చెయ్యడం సంభవం అయింది." బౌద్ధమతంలోని అహింసాతత్వ

1. సంజానా, నే. ఇ. కాస్ట్ అండ్ అండర్ కాస్ట్. పే. 149
2. సంఘరక్షిత : అంబేద్కరు ఎండ్ బుద్ధిజమ్. పే. 69
3. దేశాయి హ.వి. : మోఠయాచా ములాకాతీ. హిరనీ మోహన్ జీ ప్రకాశన్. బొంబాయి కం. 2 పే. 20–28

జ్ఞానాన్ని విశ్లేషిస్తూ ఆయన ఇలా అన్నారు - "ఇది బుద్ధ భగవానుడికి ఇష్టమైన తత్వజ్ఞానము. శస్త్ర బలం చేతిలో ఉండాలి కాని దాని ఉపయోగం వినాశకరం కాకూడదు. దానిని అలా ఉపయోగించనూకూడదు. శక్తివంతుడు అత్యాచారాన్ని తలపెట్టనని దీక్ష పూనాలి. ఈ వ్రత దీక్ష బలహీనులకు కాదు. ఇదీ బుద్ధడి తత్వజ్ఞానానికి సరియైన తాత్పర్యం."

"మనిషి జీవితాన్ని నియంత్రించడానికి ఏదో ఒక ధర్మం కావాలి. మార్క్స్ దర్శనం పీడితులకు వరం." ఆయన రష్యా గురించి మాట్లాడుతూ ఇలా అన్నారు - "ఒక్క కలం పోటుతో ఆదర్శ సమాజం స్థాపించటం జరగదు. ఇది గుర్తుంచుకోండి." "మనదేశంలోని ధనికులకి చిత్రకళ పట్ల విశేషమైన అభిరుచి లేదు. చతుర్వర్ణాల గొడవలో వారి రసికత కొట్టుకుపోయి కనిపించకుండా పోయింది." ప్రతి ఒక్కరికి సంగీతం పట్లా హాస్యం పట్లా అభిరుచి ఉండవలసిన అవసరాన్ని వివరిస్తూ ఆయన దానిని ఎత్తి చెప్పారు. "హాస్యరసం శక్తివంతమైన శస్త్రం. హేళనతో కూడిన హాస్యంతో శత్రువుని చీల్చి చెండాడవచ్చును. వ్యంగ్యంలో ఆ శక్తి ఉంది."

ప్రతి సంవత్సరం మార్చి నెలలో మహాడ్ పోరాటపు స్వాతంత్ర్యదినం పాటించడం జరిగేది. 1940 లో కూడా డా. అంబేద్కరు దాని నిమిత్తం మహాడ్ వెళ్లారు. సుమారు పదివేల మంది జనాన్ని ఉద్దేశించి ఉపన్యాసం ఇచ్చారు. "మీ శక్తిని కేవలం రాజకీయ సమస్యల పరిష్కారానికి సాంఘిక సమస్యల పరిష్కారానికీ వెచ్చించకండి. ఆర్థిక సమస్య పట్ల దృష్టి పెట్టకపోతే ప్రయోజనం చేకూరదు."

1940 మార్చి 26 వ తారీఖున తమ లాహోరు సమావేశంలో ముస్లిమ్‌లీగు "పాకిస్తాను ఏర్పరచాలన్న తమ తీర్మానాన్ని ఆమోదించింది.

యుద్ధజ్వాలలు సర్వత్రా వ్యాపిస్తున్నాయి. బ్రిటిషు సామ్రాజ్యవాదానికి ఆ వేడిసెగలు తగులుతున్నాయి. భారతదేశానికి కూడా ఆ సెగ తగులుతున్నాది. ఆ సమయంలోనే వైస్రాయి కేంద్రమంత్రి మండలిని విస్తృతం చేస్తున్నట్లు, యుద్ధ కమిటీని నిర్ధారించినట్లు ప్రకటించారు. కాంగ్రెసు ఈ ప్రణాళికను వ్యతిరేకించింది.

1940 జూన్ 20 వ తేదీన సుభాష్‌చంద్రబోసు డా॥ అంబేద్కరును కలిశారు. ఇంగ్లీషు పరిపాలనకి విరుద్ధంగా ప్రజాభిప్రాయాన్ని సేకరించటానికి

గాను ఆయన చేసిన ప్రయత్నం ఇది. డా।। అంబేద్కరు సుభాష్‌బాబుని రెండే రెండు ప్రశ్నలు సూటిగా అడిగారు - "మీరు కాంగ్రెసుకు వ్యతిరేకంగా ఎన్నికల్లో అభ్యర్థిని నిలబెడతారా ? అస్పృశ్యుల సమస్య మీద మీరు ఖచ్చితంగా చేపట్టబోయే కార్యక్రమం ఏది ?" మొదటి ప్రశ్నకు జవాబు "లేదు" అని వచ్చింది. రెండవ ప్రశ్నకు ఆయన దగ్గర ఖచ్చితమైన జవాబే లేదు.

"రెండవ మహాయుద్ధంలో భారతదేశం అస్సలు పాల్గొనరాదు" అన్న గాంధీజీ ప్రచారం పట్ల తన దృక్పథాన్ని డా।। అంబేద్కరు స్పష్టం చేశారు. - "ఇది భారతదేశపు రక్షణ చట్టాన్ని ఖండించడంతో సమానం. ఆలోచనాపరులైన వారందరూ హింసామార్గాన్ని తప్పకుండా నిందించాలి. కాని హింసని ఓడించటానికి శక్తిని ఉపయోగించటం పాపం ఏంకాదు."

పాకిస్తాను ఏర్పాటు జరగాలన్న డిమాండు యావత్ భారతదేశంలో పెరుగుతోంది. ఇప్పటి వరకూ ఈ విషయం మీద సమగ్రమైన భావాలను వ్యక్తీకరిస్తూ గొప్ప గ్రంధాన్ని ఎవరూ రాయలేదు. 1940 చివరలో డా।। అంబేద్కరు రాసిన 'థాట్స్ ఆన్ పాకిస్తాను' అన్న పుస్తకం ప్రచురించబడ్డాది. ఈ పుస్తకం భారతదేశపు రాజకీయాల్లో గొప్ప సంచలనాన్ని రేకెత్తించింది. ఆయన తన గ్రంథంలో - భారతదేశపు హిందువులు శాంతిగా బతకడానికి భారతదేశాన్ని హిందుస్థాన్, పాకిస్తాన్ - అని రెండు భాగాలు చేసెయ్యాలి అన్న సిద్ధాంతాన్ని ప్రతిపాదించారు.

"పొరుగు నున్న ముస్లిము దేశం మన మీద దండెత్తి వస్తుందని హిందువులు తమ మనస్సులో భయపడనక్కర లేదు. ఎంచేతా అంటే ప్రస్తుతపు యుద్ధతంత్ర కారణంగా నేటి ప్రపంచంలో భౌగోళిక సరిహద్దులకు ఏ విలువా లేదు. భద్రతతో కూడిన సరిహద్దుల కన్నా భారతదేశం పట్ల విశ్వాసం ఉన్నా ముస్లిమేతర సైన్యం రక్షణ దృష్ట్యా ఎక్కువ మహత్తరమైనది." పాకిస్తాను ఏర్పరచటానికి ముందు పాకిస్తాను భాగం నుండి హిందువులు, హిందుస్తాన్ నుండి ముస్లిములు అటూ ఇటూ మారిపోవాలి అని ఆయన సూచించారు. ముస్లిము సమాజం ఆది నుంచీ మత ప్రవృత్తి ఉన్న సమాజం. సంఘ సంస్కరణని వ్యతిరేకించే సమాజం. ఇస్లాంని ఆదినుంచీ ప్రయోజనకరమైనదనీ ప్రపంచంలో వ్యాపించిన మతం అనీ ముస్లిములు భావిస్తారు. వారి ఆచారాల, వారి భ్రాతృత్వ భావం

ముసల్మానుల వరకే పరిమితం. డా॥ అంబేద్కరు తన అభిప్రాయాలను పుస్తకంలో స్పష్టం చేశారు.

టర్కీ, ఈజిప్టు ఇత్యాది దేశాల ఉదాహరణ యిస్తూ ముసల్మానులను పాకిస్తాను ఏర్పరుచుకోనివ్వడం ఏ విధంగా హిందువులకు ప్రయోజనకరమో ఆయన స్పష్టపరిచారు. కేంద్ర పరిపాలనని శక్తివంతం చెయ్యటానికి భారత విభజన అవసరం. అలా కాకపోతే "భారతదేశపు స్వాతంత్ర్యం ఎప్పుడూ విపత్తికి గురి అయ్యే ఉంటుంది." భావాలు, ఉద్దేశాలు, పాండిత్యం, జ్ఞానం, విషయ పరిజ్ఞానం నిండా ఉన్న ఈ పుస్తకం ఆధునిక భారతదేశపు రాజకీయ సంఘటనలకు వాస్తవిక పరిస్థితుల్లో అద్దం పట్టే చరిత్ర పుస్తకం. డా॥ అంబేద్కరు వివేకం, దేశభక్తి, హిందూ సమాజపు అదృష్టం గురించిన చింత – ' ఈ విశిష్టతలన్నీ చక్కగా మిళితమై ఈ పుస్తకంలో గోచరిస్తాయి. 'పాకిస్తాను' విషయం మీద ఈ పుస్తకం అధికారపూర్వకమైన పుస్తకం. దీనికి మహాత్మాగాంధీ, జిన్నా సాహబు ఇద్దరి గుర్తింపూ లభించింది.[1] 1945 లో ఈ పుస్తకం రెండవ ముద్రణ 'పాకిస్తాన్ ఆర్ ది పార్టిషన్ ఆఫ్ ఇండియా' అనే పేరుతో వచ్చింది. భారతదేశపు రాజకీయ క్షితిజానికి పాకిస్తాను డిమాండు కారణంగా పట్టిన గ్రహణాన్ని వివేకంతో విడిచేటట్లు చేయడానికి గాను డా॥ అంబేద్కరు ఈ పుస్తకాన్ని రాసినప్పటికీ ప్రభుత్వము, కాంగ్రెసు అథవా ముస్లిము లీగు – అందరికందరూ ఆయన సూచనలను పట్టించుకోలేదు. ఆ కారణంగానే పాకిస్తాను ఏర్పడ్డం ఏర్పడ్డాది కాని లక్షలాది హిందువులు ముస్లిములు జాతి మత కొట్లాటల్లో ప్రాణాలు పోగొట్టుకోవలసి వచ్చింది. దాంతోపాటు ఇరు దేశాల్లోని ప్రజలు అటూ ఇటూ మారడం దానంతట అది జరిగింది.

# ముప్పైతొమ్మిది

మహార్ జాతి యువకులను సైన్యంలో భర్తీ చేసుకోవాలి. దీనికిగాను డా॥ అంబేద్కరు చాలా కాలంగా కృషి చేస్తున్నారు. 1941 ప్రారంభంలో

1. డా॥ అంబేద్కరు : పాకిస్తాన్ ఆర్ ది పార్టిషన్ ఆఫ్ ఇండియా

ఆయన మళ్లీ ఈ అంశం మీద అలజడి లేవనెత్తారు. మహార్ జాతి యుద్ధ వీరుల జాతి. కాని 'మార్షకరేస్' గా వారిని పరిగణించటానికి నిరాకరించి 1892 తర్వాత దగ్గర నుంచి సైన్యంలో చేర్చుకోవడం మానేశారు. అయితే ప్రతి పర్యాయం యుద్ధంలో వారిని ఉపయోగించుకున్నారు. అంచేత వారి రెజిమెంటుని తిరిగి ఏర్పరచాలని డా|| అంబేద్కరు గవర్నరు మహాశయు లకు విజ్ఞప్తి చేశారు. ప్రభుత్వం మహారుల సైన్యం ఏర్పరచటానికి నిర్ణయించింది. స్వదేశాన్ని రక్షించటానికి, స్వప్రయోజనం కోసం ఈ అవకాశాన్ని వినియోగించుకుని మహార్ యువకులు సైన్యంలో చేరవలేసినదని డా|| అంబేద్కరు మహార్ జనానికి పిలుపునిచ్చారు. ఆయన ఈ పిలుపుకి బదులుగా అనేకమంది యువకులు సైన్యంలో చేరారు.

1941 జూలైలో వైస్రాయి పోషక సలహా కమిటీని ఏర్పాటు చేశారు. జమనాదాసు మెహతా, రామరావ్ దేశ్‌ముఖ్‌తో పాటు బాబాసాహబు అంబేద్కరుని కూడా ఈ కమిటీకి ఎన్నుకున్నారు. కాని కేంద్ర ప్రభుత్వం కార్య నిర్వాహక వర్గంలోని సభ్యుల సంఖ్య పెంచి కూడా దానిలో దళితుల ప్రతినిధులకు స్థానం యివ్వలేదు. అంచేత డా|| అంబేద్కరు భారత మంత్రి లార్డ్ ఎమరీకి టెలిగ్రాం ద్వారా తమ నిరసనని తెలియచేశారు.

1941 ఆగష్టులో వతన్‌దార్ మహారుల సభ సిన్నర్ నగరంలో జరిగింది. బాబాసాహబు దానికి హాజరయ్యారు. ఈ సభలో యిచ్చిన ఉపన్యాసంలో ఆయన 'వతనదారీ' ని ఎలా రూపుమాపవచ్చునో, దాని కోసం మనం ఏం చెయ్యాలో స్పష్టం చేశారు. మహార్ 'వతనదారుల' మీద విధించిన పన్నుని తీసివెయ్యకపోతే మళ్లీ "పన్ను - బంద్" ఉద్యమం చేపట్టడం జరుగుతుంది. ఆయన ఈ హెచ్చరికని రెండవ పర్యాయం చేశారు.

సిన్నర్ నుంచి తిరిగి వచ్చాక బొంబాయి గవర్నరు రాజర్ లుమ్లేని కలిసి మహార్ డిమాండు 'వతనదారుల' సమస్య గురించి అచ్చు వేయించిన రిపోర్టుని ఆయనకి ఇచ్చారు. మహార్ 'వతన్‌దారులు' తమ డిమాండ్ల కోసం అక్రోశిస్తున్నారని ఆ రిపోటర్టులో ఆయన సూచించారు. వారి దుఃఖాన్ని తీర్చక పోయినట్లయితే వారు హర్తాళ్ చేస్తారు. మొత్తం ఈ ఉద్యమపు ప్రభావం అతి తొందరగానే ప్రసరించింది. కొద్ది రోజులకే 'వతన్‌దారుల' మీద అన్యాయంగా రుద్దిన "టెక్సు ఆర్డరు" ని ప్రభుత్వం

రద్దు చేసింది. ఈ విధంగా డా|| అంబేద్కరుకి ఈ సమస్యని సాధించ టంలో గెలుపు లభించింది.

ఆ తర్వాత సైన్యం భర్తీని మొదలు పెట్టించడానికి గాను అంబేద్కరు వివిధ స్థలాల్లో ఉత్సాహపరిచే ఉపన్యాసాలు ఇవ్వసాగారు. "నాజీలు కాని ఈ దేశాన్ని ఆక్రమిస్తే ఇహ దేశంలో కార్యవర్గ కమిటీ ఉండదు. ప్రజాస్వామ్యమూ ఉండదు" అని బొంబాయిలో జరిగిన ఓ సభలో ఆయన ప్రకటించారు.

ఆయన ఉపన్యాస ధోరణి ప్రభుత్వంతో కాంగ్రెసు సహకరించాలి అన్న విషయాన్ని సూచిస్తూ ఉండేది. మహార్ యువకులు సైన్యంలో అధికారులు అవడానికి పరీక్షల్లో ఉత్తీర్ణులు అవాలి అని ఆయన అభిప్రాయాన్ని వ్యక్తం చేశారు.

1941 డిసెంబరు నెలలో ఆయన జాతీయ భద్రతా కమిటీ రెండవ సమావేశంలో పాల్గొనటానికి ఢిల్లీ వెళ్లారు. ఈ కమిటీ మూడవ సమావేశం 1942 ఫిబ్రవరిలో జరిగింది. దీనిలో కూడా డా|| అంబేద్కరు పాల్గొన్నారు. ఆ రోజుల్లోనే ఆయన తన గ్రంథం "వాట్ హిందూస్ హేవ్ డన్ టు అస్" రాయటం ప్రారంభించారని అనిపిస్తుంది.[1]

1942 - 18, 20 తారీఖుల్లో 'వసంత వ్యాఖ్యానమాల" బొంబాయిలోని వాగలే హాలులో ఏర్పాటు అయింది. దాంట్లో డా|| అంబేద్కరు గ్రంథాలు "పాకిస్తాను గురించిన అభిప్రాయాలు" మీద మూడు రోజుల పాటు చర్చ సాగింది. ఆచార్య మె.వా. దోదే అధ్యక్షులు. చర్చకి సమాధానం ఇస్తూ అంబేద్కరు ఇలా చెప్పారు - "ప్రజలని చరిత్ర మరిచి పోవలసినదని అడగడం తప్పు. చరిత్రను విస్మరించిన వారు కొత్త చరిత్రని నిర్మించలేరు. భారత సైన్యంలో ముస్లిముల ప్రాధాన్యతను తగ్గించి ఏకరూపత సాధించడం అవసరం. సవర్ణ హిందువులతోనే నా పోరాటం. అయినప్పటికీ నాదేశ స్వాతంత్ర్యాన్ని కాపాడడానికి నా ప్రాణాల్ని అర్పిస్తాను, అని ఆయన ప్రతిజ్ఞ చేశారు."

1. కీర్ (మరాఠీ) : పే : 351, ఈ పుస్తకాన్నే "వాట్ కాంగ్రెస్ అండ్ గాంధీ హేవ్ డన్ టు అస్" అన్న పేరుతో తిరిగి ప్రచురించారు. కీర్ అన్న ఈ మాట సరియైనదిగా తోచదు. దీని గురించి కొన్ని తెలియని ప్రకరణాలు ఐదవ ఖండంలో చేర్చబడ్డాయి. వాటిలోని విషయం సమకాలికమైనది, మత సంబంధమైనది. రాజకీయమైనది కాదు.

భారతదేశపు రాజకీయ చిక్కుల్ని తీర్చటానికి గాను బ్రిటిషు ప్రభుత్వం సర్. స్ట్రెఫర్డ్ క్రిప్పుని నియమించింది. ఆయన భారతదేశం వెంచెయ్యగానే డా॥ అంబేద్కరు తన ప్రణాళికని ఆయనకి ఇచ్చారు. తన ప్రణాళికలో జిన్నా ప్రణాళికను వ్యతిరేకిస్తూ ఆయన ఇలా రాశారు - కార్యవర్గంలోనూ, విధానమండలి - న్యాయాలయాల్లోనూ, ప్రభుత్వోద్యోగాల్లోనూ ముస్లిము లకు 50 శాతం స్థానాలు ఇవ్వాలన్న జిన్నా గారి ఈ డిమాండు అన్యాయ మైనది. ఈ ప్రణాళికను ఆమోదించకుండా ఉండడం కోసం ఆయన గవర్నరు గారిని అభినందించారు.

స్టైఫర్డు క్రిప్పు మిషను 1942 మార్చిలో భారతదేశం వచ్చింది. ఈ ప్రతినిధి మండలి కాంగ్రెసు, హిందూ మహాసభ, ముస్లిము లీగు ప్రతినిధు లతో చర్చలు జరిపింది. ఎమ్.సి. రాజాతో పాటు డా॥ అంబేద్కరు మార్చి 30 వ తేదీన ప్రతినిధి మండలిని కలిశారు. క్రిప్పు మిషన్ ప్రణాళిక ప్రకారం రెండవ మహాయుద్ధం ముగిసిన వెంటనే రాజ్యాంగ కమిటీ ఏర్పాటు జరుగుతుంది. కాని కాంగ్రెసు, ముస్లిం లీగు, హిందూ మహాసభ - మూడు సంస్థలూ ఈ క్రిప్పు ప్రణాళికను ఆమోదించలేదు. అంబేద్కరు ఆయన సహచరులు పరస్పరం చర్చించుకుని తమ అభిప్రాయాలను క్రిప్పుకు సూచించారు. అస్పృశ్య సమాజం వారి చేతులూ కాళ్లూ కట్టేసి హిందూ పాలకులకు అప్పగించే ప్రయత్నమే ఈ ప్రణాళిక అని వారు తమ విజ్ఞప్తిలో స్పష్టపరిచారు. వారి అంగీకారం తీసుకోకుండా ఏ ప్రణాళికనైనా వారిమీద రుద్దితే అది సంపూర్తిగా విశ్వాసఘాతకత్వం అవుతుంది. వారి ఈ దృఢ నిశ్చయాన్ని బ్రిటిషు ప్రభుత్వానికి తెలియ చేయవలసినది అని సూచించారు.

1942 ఏప్రిలు 14 వ తేదీన ప్రతి ఏడాదీ జరిగినట్టుగానే ఈ ఏడాదీ డా॥ అంబేద్కరు పుట్టిన రోజు వేడుకలు చాలా ఘనంగా జరిగాయి. బొంబాయిలో స్వతంత్ర మజదూర్ పార్టీ తదితర 45 సంస్థలూ కలిసి ఈ జన్మ దినోత్సవాలని పది రోజుల పాటు చేశాయి. వివిధ స్థలాల్లో సభల్లోనూ, సమావేశాల్లోనూ ఆయన దీర్ఘాయువులై జీవించాలని హార్దిక శుభాకాంక్షలు తెలియచేశారు. 1942 ఏప్రిలు 19వ తారీఖున బాబా సాహబు "రోహిదాసు తరుణ సుధారక్ సంఘ్" వారి మహిళా విభాగాన్ని ప్రారంభిం చారు. తన ఉపన్యాసంలో ఆయన ఇలా చెప్పారు - "ఇతరుల సహాయంతో

బతకడాన్ని నేర్చుకోకండి. స్వావలంబనాన్ని నేర్చుకోండి." ఉపదేశాలతో నిండిన తన ఉపన్యాసంలో ఆయన మహాభారతంలోని కచుడి ఉదాహరణ ఇస్తూ ఇలా వివరించారు - "దేవయాని మీద ఉన్న లోభాన్ని త్యజించి ఎల్లాగ్గా కచుడు సంజీవనీ విద్యని పొందాడో, చివరికి తన బృందంలో వెళ్లి కలిశాడో అలాగా యువకులు ఎప్పుడూ తమ సమాజాన్ని విస్మరించ కూడదు."

అంబేద్కరు జయంతి ప్రధాన సభ ఏప్రిలు 19 వ తేదీన చౌపాటీలో జరిగింది. కామగార్ మైదానంలో జన్మదిన సందర్భంగా అంబేద్కరుకి పర్సుని సమర్పించారు. విశాలమైన ప్రజాసమూహాన్ని హెచ్చరిస్తూ డా|| అంబేద్కరు నిర్మొహమాటంగా యిచ్చిన ఉపన్యాసంలో ఇలా చెప్పారు - "మనం మన భక్తి శ్రద్ధలతో ఎవరినైనా దేవతని చేసి సింహాసనం మీద అధిష్టింపచేస్తే దానివల్ల సమాజానికి పతనమే వాటిల్లుతుంది. ప్రపంచంలో ఎవడూ దైవత్వ గుణాలతో పుట్టడు. వాడు స్వయంగా తనకు తాను చేసిన ప్రయత్నాల వల్లే వాడి అభ్యున్నతి కలుగుతుంది, లేదా పతనం సంభవిస్తుంది." అస్పృశ్యుల ప్రగతిని సింహావలోకనం చేస్తూ ఆయన ఇలా అన్నారు - బ్రిటిషు ప్రభుత్వం తాను చేపట్టే ఏ ప్రణాళిక ద్వారానైనా అస్పృశ్యుల న్యాయమైన హక్కులను ఉపేక్షించినట్లయితే మనం ఆ ప్రణాళికని గట్టిగా వ్యతిరేకిస్తాం. హిందువులు మన సహకారం వాంఛిస్తే వారితో చెయ్యీ చెయ్యీ కలిపి, కలిసి పోరాడతాం."

# నలభై

1942 జూలై 5వ తారీఖున ఢిల్లీలో జరిగిన డిఫెన్సు కౌన్సిలు మీటింగుకి ఆయన హాజరయ్యారు. జూలై 11 కి తిరిగి వచ్చారు. అదే రోజు రాత్రి బొంబాయి రేడియో క్లబ్బు తరఫున ఆయనకు విందు చేశారు. ఈ సందర్భంలో ఉపన్యసిస్తూ ఆయన ఇలా అన్నారు - "నేను పేదల్లోనే పుట్టాను. పెరిగాను. బతికాను. అల్లాగ్గానే నేను తడినేల మీద బల్ల చెక్క వేసుకుని నిద్ర పోయాను. వారి కష్టాలు నాకు బాగా తెలుసు. నేను నా మిత్రులతో, తదితరులందరితో పూర్వం ఎలా ఉండేవాణ్ణో ఎప్పుడూ

అలాగే ఉంటాను. నా ఢిల్లీ బంగళా తలుపులు అందరి కోసం తెరిచే ఉంటాయి" జోకిమ్ అల్వా మాటల్లో - "కీర్తి శిఖరాలు ఉన్నతమైనవి అధిరోహించినా పాత స్నేహితులు, పూర్వం తిరిగిన స్థలాలు ఎప్పుడూ ఆయన జ్ఞాపకంలో నిలిచి ఉండేవి."[1]

రెండవ రోజునే బొంబాయి నగర పాలక మజదూర్ యూనియన్ స్వతంత్ర మజదూర్ పార్టీల తరపున డా॥ అంబేద్కరుకి సన్మానం జరిగింది. ఇవీ ఆయన పలికిన పలుకులు - "నా కీర్తి నా సహచరుల సహకారం మీదే ఎక్కువగా ఆధారపడి ఉంటుంది." భట హైస్కూలులో కొంకణ జిల్లా రైతులను సంబోధిస్తూ ఆయన గట్టిగా నొక్కి చెప్పారు - "భారతీయ రైతుల మేలు కోసం జరుపుతున్న ఉద్యమంలో కష్టాతికష్ట సమయంలో కూడా వెనుకంజ వేయనన్నది నా ఖచ్చితమైన పాలసీ." శ్రామిక సంస్థ తప్ప తదితర కార్యాల కోసం దళితులకు తమదైన ఓ సంస్థని ఏర్పరచుకోవలసిన అవసరం ఉన్నాది. - దీని ప్రాధాన్యాన్ని వివరిస్తూ ఆయన ఇలా అన్నారు - "ఏ భవనానికైనా పునాది బలహీనమైనది అయితే ఆ భవనం తాలూకు భవ్యమైన కట్టడం కూలిపోవడానికి ఎక్కువ అవకాశం ఉంటుంది. ఇప్పటికీ భారతీయ శ్రామికులు జాతివాదులు. అంచేత ఇలాంటి ప్రత్యేకమైన సంస్థని ఏర్పరచుకోవడం అవసరం అయింది."

డా॥ అంబేద్కరు సర్ క్రిప్స్‌ని కలిసినప్పుడు క్రిప్స్ ఆయనని ప్రశ్నించారు - "మీరు శ్రామిక నాయకులా? దళిత సమాజ నాయకులా?" అస్పృశ్యుల సమస్యలను పరిష్కరించడానికి, వాటిని ఎత్తి చూపడానికి, క్రియలో పెట్టడానికి డా॥ అంబేద్కరు కృషి చేస్తున్నప్పటికీ ఆయన పార్టీ పేరు "స్వతంత్ర మజదూర్ పార్టీ". ఆ పార్టీ కార్యరంగం, మధ్యప్రదేశ్, బరార్, బొంబాయి ప్రాంతమేను. అంచేత అఖిల భారతీయ స్థాయిలో అస్పృశ్యుల సంస్థని ఒక దానిని ఏర్పరచవలసిన అవసరం ఎంతగానో కలిగింది. యావత్ భారతదేశపు అస్పృశ్య నాయకులని 1942 మార్చి 30, 31 తేదీలకి ఢిల్లీ రమ్మనమని అంబేద్కరు ఆహ్వానించారు. ఆ సమావేశంలో అఖిల భారతీయ దళిత సమాజపు మొదటి సభలను 1942 జూలై 19, 20 తేదీల్లో నాగపూర్‌లో చెయ్యాలని నిర్ణయించారు. భారత స్వాతంత్ర్య చరిత్రలో 1942 సంవత్సరం అతి ముఖ్యమైన సంవత్సరంగా

1. జోకిమ్ అల్వా : పే. 26

పరిగణించబడుతోంది. ఈ సంవత్సరంలోనే మహాత్మాగాంధీ భారతీయులకు ఓ నినాదాన్ని ఇచ్చారు.

– "ఆంగ్లేయులారా ! భారతదేశాన్ని వదలివెళ్లండి." ఈ నినాదం యావత్ భారతదేశంలో ప్రతిధ్వనించింది. దీని ప్రతిక్రియ, సర్వత్రా గోచరించింది. అస్పృశ్య సమాజపు దృష్ట్యా కూడా ఈ సంవత్సరం సువర్ణాక్షరాలతో లిఖించవలసిన సంవత్సరం. వేలవేల సంవత్సరాల దాసత్వం తర్వాత మొట్ట మొదటిసారిగా ఒక అస్పృశ్యవ్యక్తిని భారతదేశపు రాజధానిలో మంత్రి పదవిలో నియమించడం జరిగింది. వైస్రాయి కౌన్సిలులో 1942 జూలై 2వ తేదీన అంబేద్కరుని సభ్యుడిగా నియమించినట్లు లార్డు లిన్‌లిథ్‌గో ప్రకటించారు.

శ్రామికుల సమస్యలని, అసౌకర్యాలని డా॥ అంబేద్కరు అతి చేరువుగా చూశారు. ఆయన శ్రామికుల నాయకులు. పాలనా వ్యవస్థలో అర్థశాస్త్రాన్ని ఎలా ఉపయోగించవచ్చునో ఆయనకు మొదటి నుంచీ తెలుసును. ఆయనకి ఆ ఎరుక ఉన్నాది. యూరోపు, అమెరికా, భారతదేశపు విధాన సభల కార్య విధానాల అనుభవమూ ఆయనకు ఉన్నాది. అందేత భారతీయ శ్రామికుల హితం కోసం ఆమూలంగా సంస్కరణ చెయ్యడానికి చట్టం తేవాలని మనస్సులో నిర్ణయించుకుని ఆయన తన పని ప్రారంభించారు.

నాగపూర్ సభల బాధ్యత స్వతంత్ర మజదూర్ పార్టీ ప్రాంతీయాధ్యక్షుడు శ్రీ దశరథ పాటీలుకి అప్పగించారు. శ్రీ టి.జి. మెశ్రాయ్ స్వాగతాధ్యక్షులు.

ఈ సభలకి యావత్ భారతదేశం నుంచి ప్రతినిధులు వచ్చారు. డా॥ అంబేద్కరు ఎన్. శివరాజ్‌తోపాటు జూలై 18వ తేదీ ఉదయం మెయిలులో నాగపూరు వచ్చారు. వేల సంఖ్యలో జనం నాగపూర్ స్టేషన్‌లో ఆయనకి ఎంతో ఉత్సాహంతో స్వాగతం పలికారు. "సమతా సైనిక్ దళ్" కి చెందిన ఐదు వేల మంది స్వయం సేవకులు బేండు వాయిద్యాలతో ఆయనకు గార్డ్ ఆఫ్ ఆనర్ ఇచ్చారు. ఈ గౌరవ వందనం తర్వాత ఆయనని బ్రహ్మాండ మైన ఊరేగింపుతో ఎంతో క్రమ శిక్షణతో తీసుకు వెళ్లారు. ఈ ఊరేగింపు సభా ప్రాంగణానికి చేరుకుంది. అంబేద్కరుని వైస్రాయి కౌన్సిలులో చేర్చుకున్న కారణంగా ఆయనకి బదులుగా ఎన్. శివరాజ్‌ని సభకి అధ్యక్షులుగా చేశారు.

1942 జూలై 19-20 తేదీల్లో అఖిల భారతీయ దళిత ఫెడరేషను మహాసభలు నాగపూర్‌లో జరుగుతున్నాయి. బాబాసాహెబు ఇక్కడనుంచే తనకు మంత్రిమండలిలో నియామకం ఇచ్చినందుకుగాను వైస్రాయి మహాశయులకు ధన్యవాదాలు తెలియచేస్తూ తమ అంగీకారాన్ని పంపించారు.

ఈ సభకి సుమారుగా 75 వేల మంది జనం హాజరయ్యారు. రౌండ్ టేబిలు సమావేశం నాటి నుంచి ఈ మహాసభ వరకూ అస్పృశ్యులకు ఒక ప్రత్యేక సముదాయంగా గుర్తింపు ఇప్పించటానికి చేసిన ప్రయత్నాలని, దాని చరిత్రని వివరంగా డా॥ అంబేద్కరు ఆ జన సమూహాన్ని సంబోధించి ఉపన్యసిస్తూ చెప్పారు. ముస్లిం లీగు అల్ప సంఖ్యాకులతో కాకుండా వేరుగా తన ప్రత్యేక ఉద్యమాన్ని ఆరంభించేసింది. అంచేత అస్పృశ్యులు కూడా తమ ప్రత్యేక సంస్థని ఏర్పరచుకోవాలి అని ఆయన చెప్పారు. అస్పృశ్య సమాజం వారికి ప్రత్యేకించిన బస్తీలు, విద్యాసంస్థలు స్థాపించ డానికి కావల్సిన నిధి ఏర్పాటు, ప్రభుత్వోద్యోగాల్లో, న్యాయశాఖ, పోలీసు శాఖ మొదలైన రంగాల్లో కచ్చితమైన నిష్పత్తిలో కేటాయించిన సీట్లు ఇత్యాది డిమాండ్లను ఈ సభలో ఆయన పెట్టారు. గంటన్నర సేపు ధారా ప్రవాహంగా మరాఠీలో ఉపన్యసించి ఆయన శ్రోతలని మంత్రముగ్ధుల్ని చేశారు.

ఈ మహాసభల స్వాగత సమావేశం తరపున డా॥ అంబేద్కరుకి సన్మాన పత్రాన్ని సమర్పించారు. తన సన్మానానికి సమాధానం యిస్తూ ఆయన తన ఉపన్యాసంలో ఇంగ్లండులో సన్మానపత్రం సమర్పించే ఆచారం ఎల్లాగ్గా ప్రభుత్వం పట్ల ఉండే భక్తి విశ్వాసాలతో పుట్టిందో మొట్ట మొదట చెప్పారు. ఆసక్తికరమైన ఆ చరిత్ర చెప్పిన తర్వాత తన ఉపన్యా సాంతంలో ఆయన ఇలా అన్నారు - "మీ ఉద్దేశాలను సఫలం చెయ్యటానికి నేను శాయశక్తులా ప్రయత్నిస్తాను అనే దానికి నా హామీ మీకు అవసరం ఉందని కాదు. అయినా మీరు ఎప్పుడూ ఐక్యతతో మీ హక్కుల కోసం నిలబడతారనీ వాటిని పొందడానికి గాను సంఘర్షించడంలో విజయం సాధించేటంత వరకూ వెనుకంజ వెయ్యమని నిర్ణయించుకున్నారని నాకు మీరు మాట ఇవ్వాలి. పోరాటం నాకు జీవితంలో ఆనందాన్ని ఇస్తుంది - ఈ భావనే నిజమైన శక్తి. 'మన ఈ పోరాటం భద్రత పొందడానికి కాదు.

సంపద కోసమూ కాదు. స్వాతంత్ర్యం సంపాదించుకోవడం కోసం" ఇలా చెప్పి ఆయన తన మూడు సూత్రాల సందేశాన్ని వారికి ఇచ్చారు - "విద్యావంతులు అవండి, ఆందోళన సాగించండి, సంఘటితంగా ఉండండి."

ఈ పెండాలులోనే దళిత సమాజపు మహిళా విభాగపు సభ సౌ. సులోచనా బాయీ డోంగరే అధ్యక్షతని జరిగింది. 75 వేల మంది జనంలో 25 వేల కన్నా అధిక సంఖ్యలో మహిళలు ఉన్నారు. జనరలు సెక్రటరీ సౌ. ఇందిరాబాయీ పాటీలు, స్వాగతోధ్యక్షురాలు సౌ. కీర్తిబాయీ పాటీలు. వివరణిక చదివి వినిపించారు. ఈ తర్వాత డా॥ అంబేద్కరు ఉపదేశంతో కూడిన తన ఉపన్యాసంలో ఇలా చెప్పారు - నేను మహిళా సమాజపు ప్రగతి మీదే దళిత సమాజపు ప్రగతికి కొలబద్దని ఉంచుతాను. మహిళలు సంఘటిత మవవలసిన అవసరం ఉన్నాది. మహిళామణులారా ! స్వచ్ఛతతో మెలగండి. దుర్గుణాలను దరికి రానివ్వకండి. మీ కుమార్తెలకు చదువు చెప్పించండి. వారి మనస్సుల్లో గాఢమైన, మహత్తరమైన ఆకాంక్ష కలగనియ్యండి. వారికి వివాహం శీఘ్రంగా చేసెయ్యాలని ప్రయత్నాలు చెయ్యకండి."

'సమతా సైనిక్ దళ్' సమావేశం కూడా జూలై 20 వ తారీఖున ఇదే పెండాలులో జరిగింది. డా॥ అంబేద్కరు సైనికులకు మార్గాన్ని నిర్దేశించారు. ఆయన అహింసా తత్వం గురించి చర్చిస్తూ ఇలా అన్నారు - 'తుకారాం రాసిన ప్రఖ్యాతమైన "అభంగ్" ని మనం ఆధారంగా చేసుకోవాలి. భూత దయ, దుష్ట శిక్షణ - ఈ రెండింటిలో దుష్ట శిక్షణ - దుష్టులను అణిచివెయ్యడం ఎక్కువ ప్రధానమైనది. శీల సంపద ద్వారా నియంత్రించ బడిన శక్తే మన ఆదర్శం. సైనికులుగా మీరు స్త్రీల మీదా దళిత వర్గ ప్రజల మీదా జరుగుతున్న అత్యాచారాల పట్లా, అటువంటి విషయాల పట్లా దృష్టి ఉంచాలి.[1]

ఢిల్లీ తిరిగి వెళ్లాక ఆయన శ్రీ. జి.టి. మేశ్రామ్ కి రాసిన ఉత్తరంలో కార్యకర్తలందరికీ కృతజ్ఞతలు తెలియచేశారు. "ఈ మహాసభ తన ప్రత్యేకతల కారణంగా చారిత్రికమైనదిగా పరిగణించబడుతుంది. అందుకు నాకు గర్వంగా ఉంది. 'సమతాదళ్' ప్రగతిని చూసి నాకు విశేషించి ఆనంద దాయకంగా ఉంది. ఈ మహాసభలో వేల సంఖ్యలో మహిళలు పాల్గొనడం

1. కోసారే : పే. 418-19

మరీ విశిష్టమైన సంగతి. ఆ దృశ్యం దేవతలు చూడ తగ్గది. ఆ మహిళల వస్త్రధారణ, క్రమశిక్షణ, స్వచ్ఛత, ఆత్మ విశ్వాసం చూసి నేను ఎంతో పరవశించాను." ఈ ఉత్తరం ఆయన భావ స్పందనలతో పూర్తిగా నిండిపోయింది.[1]

ఢిల్లీలో 1942 ఆగష్టు 9వ తారీఖున మహారాష్ట్ర క్లబ్బులో మహారాష్ట్ర సమాజం, బ్రాహ్మణ మహారాష్ట్ర మండల్ మొదలైన సంస్థల తరపున డా।। అంబేద్కరుకి సన్మానం జరిగింది. ఆ సందర్భంలో బాబాసాహబు ఇలా అన్నారు - మహారాష్ట్రీయులు ఉదాత్త స్వభావులు, ప్రత్యేకమైన ఠీవి కలవారు, దృఢ సంకల్పం కలవారు, తమ వ్యవహార దక్షతకి పేరు పొందిన వారు. ప్రస్తుతం మనం వెనకబడి ఉన్నాం నిజమే - మనం సాహసంతో ముందడుగు వెయ్యాలి. నన్ను నేను మహారాష్ట్రీయుణ్ణని చెప్పుకోవడం ఎంతో గర్వ కారణంగా భావిస్తాను."[2]

బాబాసాహబు ఏప్రిలు నెలలో బొంబాయి వచ్చాడు. బొంబాయి ప్రాంతపు లేబరు ఫెడరేషను తరపున 1943 ఏప్రిలు 11 వ తేదీన ఆయనని సత్కరించారు. సత్కారానికి సమాధానం చెప్తూ ఆయన ఇలా అన్నారు - "భారత దేశంలో మొత్తం అంతటికీ విస్తరించిన లేబరు పార్టీని స్థాపించి లేబరు పార్టీ ప్రభుత్వాన్ని భారతదేశపు పరిపాలన కోసం ఏర్పరచడం మన లక్ష్యంగా చేసుకోవాలి. ఇది ఎంత త్వరలో జరిగితే అంత త్వరలో శ్రామికులకు ఎక్కువ మేలు జరుగుతుంది."

ఢిల్లీకి బయల్దేరడానికి ముందు డా।। అంబేద్కరు 'టైమ్సు ఆఫ్ ఇండియా" విలేఖరికి ఇంటర్వ్యూ ఇస్తూ ఇలా చెప్పారు - భారతదేశపు సరిహద్దుల్లో బర్బరులు తమ స్థావరాలు వేసుకుని ఉన్నప్పుడు దేశంలోని చట్ట నియమాలను చీల్చి చెండాడడం, అధవా వాటి చక్కటి వ్యవస్థని బలహీన పరచడం కేవలం వెర్రితనం అవుతుంది. బ్రిటిషు ప్రజాస్వామ్యం గెలుపు పొందిందంటే భారతదేశపు స్వాతంత్ర్యానికి ఏ ఆటంకమూ **ఉండదు."** "ఆంగ్లేయుల ప్రభుత్వాన్ని వెనక వేసుకువచ్చేది అని గాంధీజీ మీద చేసిన విమర్శ" - పాత్రికేయుల ద్వారా చేయబడిన టిప్పణి ఆశ్చర్య కరమైనది ఏం కాదు, స్వాతంత్ర్యాన్ని పొందే రాజ్యాంగ మార్గంలో చట్టాన్ని

1. అదే : పే. 477-78; ఉత్తరం తే. 3-8-1942

2. జ్ఞానప్రకాశ్ : తే. 20.8.1942

భంగపరచడం అన్నది ఎప్పుడూ రాదు అనే దానినే డా॥ అంబేద్కరు సర్వదా నమ్ముతూ వచ్చారు.

1942 ఆగస్టు 8వ తేదీ రాత్రి కాంగ్రెసు తమ సహాయ నిరాకరణోద్యమాన్ని ప్రకటించింది. లార్డు లిన్‌లిథ్‌గో మంత్రిమండలి సమావేశంలో కాంగ్రెసు నాయకులు యావన్మందినీ అండమానులో బందీలుగా ఉంచాలి అనే తీర్మానం పెట్టబడినప్పుడు అంబేద్కరు హెచ్చరిస్తూ ఇలా అన్నారు - "వారిని ఖైదీలుగా అండమాను పంపిస్తే బ్రిటిషు ప్రభుత్వానికి చాలా పెద్ద కళంకం వస్తుంది. ప్రభుత్వం ప్రజాస్వామ్యానికి వ్యతిరేకంగా ఆచరించకూడదు."[1]

# నలభై ఒకటి

"కాంగ్రెసు తీర్మానం యావద్దేశాన్ని అల్లకల్లోలంలో పడేస్తుంది. అరాచకత్వాన్ని కలిగిస్తుంది. అంచేత ఇది దేశపు వ్యవస్థకి ఒక సవాలు." ఈ తీర్మానం వైస్రాయి కౌన్సిలులో ఆమోదించడం జరిగింది. మొత్తం దేశంలో వెనువెంటనే కాంగ్రెసు నాయకుల అరెస్టులు మొదలయ్యాయి. కార్యకర్తలని జైల్లో కుక్కడం జరుగుతోంది. యావద్దేశంలో ప్రభుత్వపు దమనకాండ మొదలయింది.

లేబరు మంత్రి అయిన తర్వాత ఢిల్లీలో డా॥ అంబేద్కరుకి మొదటి సన్మానసభ 1943 ఆగష్టు 8వ తేదీన 'దళిత వర్గ హిత కారిణి' సంస్థ తరపున జరిగింది.[2] మంత్రిమండలిలో చేరడంలోని తన ఉద్దేశాన్ని వివరిస్తూ ఆయన ఇలా అన్నారు. - "అస్పృశ్య సమాజానికి సమానత్వపు హోదాని ఇప్పించడంలో సఫలం అవడమే నా వంతు అంశదానం. మీరు ఇతరులకి బానిసలు కాకుండా ఉండాలి. దానికోసం పరిపాలనా పగ్గాలు మీరు మీచేతుల్లోకి తీసుకోవాలి. మన సమాజపు భవిష్యత్తుని తీర్చిదిద్దడంలో

1. శంకరానంద శాస్త్రి : ప్రబుద్ధ భారతం, 14-4-97
2. మానం : పే. 4

నా ప్రయత్నాలు ఫలించబోవటం లేదని ఏ మాత్రం సందేహం కలిగినా నేను ఈ అధికార హోదాని అంటిపెట్టుకుని ఉండను. వెంటనే రాజీనామా ఇచ్చి బైటపడతాను."

నాగపూర్ లోని శ్రీ ఎస్.ఎన్. కోసారెకి ఉత్తరం రాసి కాంగ్రెసు ద్వారా ప్రేరేపించబడిన శ్రామిక సంస్థ సమావేశంలో పాల్గొనవద్దని ఆయనకి అంబేద్కరు సలహా ఇచ్చారు.

1942 నవంబరు 13వ తేదీన డా॥ అంబేద్కరు ఆలిండియా రేడియో బొంబాయి కేంద్రం నుంచి "భారతీయ శ్రామికులు ; రెండవ ప్రపంచ మహా యుద్ధం" అనే విషయం మీద ఒక ప్రసంగం ఇచ్చారు.

ఈ మహాయుద్ధం మనిషికి మనిషికి మధ్యా, ఒక దేశానికి ఇంకొక దేశానికి మధ్య ఎలాంటి సంబంధం ఉండాలో గోచరింప చేస్తుంది. నాజీలు గాని గెలిచారా స్వాతంత్ర్యపు పీక నులిమెయ్యబడుతుంది. సమానత్వం అంగీక రించబడదు. స్వరాజ్యం కేవలం పొందినా దానివల్ల ఏమీ ప్రయోజనం కలగదు. శ్రామికవర్గం వారు "భారత్ వదిలి పో" అన్న నినాదానికి బదులు "నవభారత నిర్మాణం చెయ్యి" అన్న డిమాండు చెయ్యాలి. హింసకి తల ఒగ్గి పొందిన శాంతి ఎప్పుడూ నిజమైన శాంతి కాజాలదు. యుద్ధాన్ని శాశ్వతంగా పరిసమాప్తం చెయ్యాలంటే యుద్ధాన్ని గెలిచి ఉచితమైన విరామసంధిని స్థాపించుకోవాలి." ఆయన తన ఈ అభిప్రాయాలను అందులో ప్రతిపాదించారు.

కెనడాలోని క్యూబెక్ నగరంలో "ఇన్స్టిట్యూట్ ఆఫ్ పసిఫిక్ రిలేషన్స్' అనే సంస్థ 1942 డిసెంబరులో తన ఎనిమిదవ సభని ఏర్పాటు చేసుకుంది. ఈ సభకి డా॥ అంబేద్కరు "అన్ టచ్బుల్స్ అండ్ ఇండియన్ కాన్స్టిట్యూషన్" అనే వ్యాసాన్ని పంపించారు. తన ఈ వ్యాసంలో ఆయన అస్పృశ్యుల సమస్య ఎలాగ జాతీయ సమస్యో వివరించి చెప్పారు. వారి ప్రస్తుత పరిస్థితి ఇతర దేశాల్లోని దాస్యం కన్నా కనాకష్టంగా ఉన్నాది. వారి సమస్యల వేపు ఎవరూ దృష్టి పెట్టడం లేదు. ఆయన ఇలాంటివే మరికొన్ని సమస్యల గురించి వివరించటానికి ప్రయత్నం చేశారు. భారతదేశపు గ్రామీణ వ్యవస్థని కూడా ఆమూలాగ్రంగా మార్చడం ఎంతో అవసరం. అస్పృశ్యులకి విధానసభల్లో, కార్య నిర్వాహక సంఘాల్లో, న్యాయసంస్థల్లో, ప్రాతినిధ్యం లభించడం అవసరం. అస్పృశ్యులకి

ప్రత్యేకంగా గృహ వ్యవస్థ ఉండాలి. - మొదలైన విషయాలని వివరిస్తూ మహాత్మాగాంధీ, నెహ్రూ మొదలైన వారు అస్పృశ్యుల పట్ల అవలంభించిన పాలసీ అస్పృశ్యుల హితాన్ని బలపరిచేది కాదు[1] అని ఆయన స్పష్టపరిచారు. తన ఈ వ్యాసాన్నే తర్వాత "మిస్టర్ గాంధీ అండ్ ది ఆమానిసిపేషన్ ఆఫ్ అన్‌టచ్‌బల్స్" అన్నపేరుతో ఆయన పుస్తక రూపంలో ప్రచురించారు.

సూరత్ పట్టణంలో 1943 జనవరి 16వ తేదీన దళిత సమాజం తరపున డా॥ అంబేద్కరుకు సన్మాన పత్రం సమర్పించబడ్డాది. మధ్యాహ్నం పౌర సముదాయాన్ని ఉద్దేశించి మాట్లాడిన తమ ఉపన్యాసంలో సైనిక శిక్షణ ప్రాధాన్యత గురించి ఆయన వివరించి చెప్పారు.

1943 జనవరి 18వ తారీఖున పూనా జిల్లా లోకల్ బోర్డు ద్వారా ఆయనకి సన్మాన పత్రం సమర్పించబడ్డాది. అదే రోజు సాయంత్రం నాలుగు గంటలకి అహిల్యాశ్రమంలో పూనా కాలేజీల్లో చదువుతున్న అస్పృశ్య విద్యార్థుల తరపున ఆయనకు స్వాగతం ఇవ్వబడ్డాది.

1943 జనవరి 19వ తేదీన గోఖలే ఇన్స్టిట్యూట్ ఆఫ ఎకానమిక్సు సంస్థ తరుపున న్యాయమూర్తి రానాడే 101 వ పుట్టిన రోజు సందర్భంగా డా॥ అంబేద్కరు ఉపన్యాసం ఏర్పాటు చేయబడ్డాది. తన ఉపన్యాసంలో ఆయన "మహా పురుషుడు అని ఎవరిని అనాలి" - అన్న విషయాన్ని చర్చించారు. కార్లైయిలు తన గ్రంథం "హీరో అండ్ హీరో వర్షిప్పు" లో మహాపురుషుడు అని ఎవరిని అనాలో చెప్పడానికి గాను పొందుపరిచిన గీటురాళ్లను విశ్లేషించి డా॥ అంబేద్కరు ఆ గీటురాళ్లు ఎల్లాగ్గా సరి పడవో వివరించారు. "సంఘంలోని దుర్గుణాలని పోగొట్టడానికి రాత్రీ పగలు తదేక దీక్షతో మునిగి ఉన్న నాయకుణ్ణి మహాపురుషుడు అనాలి." ఇది చెప్పి న్యాయమూర్తి రానాడె ఎలాగ్గా మహాపురుషులు అవుతారో ప్రమాణీకరించి విశ్లేషించారు. "మహాత్మా గాంధీ, జిన్నా ఇద్దరు నాయకులూ రాజకీయాన్ని తమ సొంత వ్యవహారం చేసేసుకున్నారు. ఇద్దరి మధ్యా తమకి ఎలా గొప్పతనం లభిస్తుందా అన్న పోటీ ఏర్పడ్డాది. వారి గొప్పతనం మహత్మ్యపు జెండా ఎగరెయ్యడానికి గాను దేశ హితాన్ని బలి పెడుతోంది" అని ఆయన చెప్పారు. చివరిగా, ఏ తరం అయితే రానాడేని తమ గురువుగా

1. డా॥ అంబేద్కరు : అన్‌టచ్‌బుల్స్ అండ్ ఇండియన్ కాన్సిటిట్యూషన్, న్యూయార్కు, 1962

స్వీకరించిందో ఆ తరం చాలా వివేకం కలది అని చెప్పుకు తీరాలి అని చెప్పారు.

ఆగష్టు విప్లవంతో యావద్దేశంలో లూటీలు, దహనకాండలు ఎక్కువ య్యాయి. అయితే ఈ అరాజకత్వం అతి శీఘ్రంగానే సమాప్తం అయింది. గాంధీజీని ఆగాఖాను పాలెస్‌లో బందీగా పెట్టారు. ఆయన అక్కడ ఫిబ్రవరి 20వ తారీఖు నుండి ఉపవాసం మొదలు పెట్టారు. ఆయన నిరాహార దీక్ష వల్ల వైస్రాయి మంత్రిమండలిలోని భారతీయ సభ్యుల మీద ఒత్తిడి ఎక్కువ అయింది. కొంతమంది సభ్యులు రాజీనామా ఇచ్చేశారు. డా॥ అంబేద్కరు మీద ఈ ఒత్తిడి ప్రభావం ఏమీ పడలేదు. ప్రభుత్వంలో ఉండి ఆయన భారతీయులకు ఏదన్నా తప్పకుండా చెయ్యగలుగుతారన్న నమ్మకం ఆయనకి ఉన్నది.

1943 మే 10 వ తారీఖున బొంబాయిలోని 'మహారాష్ట్ర చేంబర్ ఆఫ్ కామర్స్' సంస్థలో డా॥ అంబేద్కరు ఉపన్యసించారు. - ఆయన ఇలా అన్నారు. - "యావత్ ప్రపంచం సామ్రాజ్య విస్తరణ, వర్ణ భేదపు అసహ్యం, బీదరికం - ఈ మూడు రోగాలతో నిండి ఉన్నాది. భారతదేశం పారిశ్రామికంగానూ ఆర్థికంగానూ బలం పుంజుకుని వృద్ధి పొందినప్పుడు సామ్రాజ్యవాదం, నలుపు-తెలుపుల వ్యత్యాసాలు అంతం అవుతాయి."[1] ఈ సందర్భంలో ఆయన యూరపు వాసుల ఉదాహరణ యిచ్చి వారు పేష్వాల దగ్గర ఎలా ఆ రోజుల్లో వంగి వంగి సలాములు పెట్టేవారో చెప్పారు. ఆయన ఎల్లప్పుడూ స్వతంత్ర భారతదేశం కోసం, శక్తివంతమైన భారతదేశం కోసం కలలు కంటూ ఉండేవారు.

తన బొంబాయి ప్రవాస సమయంలో ఒక బహిరంగ సభలో ఉపన్యాసం ఇస్తూ డా॥ అంబేద్కరు ఇలా అన్నారు. - గాంధీజీ దగ్గర ప్రచురంగా ధన బలం ఉన్నప్పటికీ ఆయన ఒకదాని తర్వాత ఒకటి తప్పులు చేస్తూ నేటి పరిస్థితిని కలిగించారు. దేశం విభజన అంచువరకూ చేరుకుంది." ఆయన ఈ మాట 1943 లో అన్నారు.[2] ఆయన అన్న ఈ మాట రాజకీయ సంఘటనలకి జోస్యం అయింది.

1. కీర్(మ) : పు. 372
2. మూనె : పే. 80

ఇదే విషయం మీద 1943 మే 12 వ తేదీన తాను ఇచ్చిన ఒక ఇంటర్వ్యూలో తన అభిప్రాయాన్ని వ్యక్తం చేశారు. – 'పాకిస్తాను' సమస్య వారు స్వయంగా చేసుకున్న నిర్ణయపు సమస్య. అంచేత వారి అభిప్రాయం ప్రకారమే దాని పరిష్కారం చెయ్యాలి. వారే దాని పరిణామాన్ని అనుభవిస్తారు. ఈ కారణం చేత (1) పాకిస్తానులో నివసించే ప్రజల అభిప్రాయాన్ని తెలుసుకోవాలి, (2) ఏ ప్రాంతంలో అయితే ముస్లిముల సంఖ్య ఎక్కువగా ఉందో అక్కడ ముస్లిమేతర అభిప్రాయం తెలుసుకుని వారికి ఒకవేళ పాకిస్తాను వెళ్లడం అంగీకారం కాకపోతే వారు వారి అభిప్రాయాన్ని నమోదు చేసి, అలాంటి జిల్లాల సరిహద్దులు, సరిహద్దుల కమిటీలు స్థాపించి దాని ద్వారా నిర్ణయం చేయించాలి. ఈ ప్రాంతాల ముస్లిములకు పదేళ్లపాటు భారతదేశంలోనే ఉంచి తర్వాత వారికి ఎక్కడ నివాసం కల్పించాలో నిర్ణయించాలి. లేదా (3) పాకిస్తానుని తక్షణమే ఏర్పరచి పదేళ్ల తర్వాత ప్రజాభిప్రాయాన్ని సేకరించపేసి ఆ జనం ఎక్కడ ఉండాలనుకునేది నిర్ణయించాలి." బాబాసాహెబు ఈ విధంగా దేశం ముందు మూడు పద్ధతులను పెట్టారు.

ఆస్ట్రేలియా దౌత్య నీతివేత్త మిస్టర్ కర్టిన్ బ్రిటిషు సామ్రాజ్య విషయానికి సంబంధించిన సంప్రతింపుల కమిటీని స్థాపించాలని సూచించాడు. దీని గురించి తన అభిప్రాయాన్ని వ్యక్తం చేస్తూ అంబేద్కరు ఇలా అన్నారు. – హిందూస్తాన్‌కి సామ్రాజ్యం అంటే ఆవగింజంతైనా యావలేదు. ఎంచేతా అంటే ఇక్కడి ప్రజలను తమతో సమానమైన హోదా కలిగిన పౌరులుగా భావించడానికి సామ్రాజ్యవాదులు ఎప్పుడూ సంసిద్ధులవరు."[1]

డా॥ అంబేద్కరు లేబరు మంత్రి అయి సుమారు 15 నెలు గడిచి పోయాయి. ఈ పధ్నాలుగు పదిహేను నెలల్లో లేబరు మంత్రి హోదాతో అస్పృశ్యుల కోసం ఆయన ఏం పనిచేశారో తమ అస్పృశ్య సమాజానికి ఎరుకపరచడం అవసరం. ఆయన లార్డు లిన్‌లిథ్‌గోకి 72 పేజీల వివరణ సమర్పించారు. అందులో ఆయన దిగువనీయబడిన డిమాండ్లను పెట్టారు (1) ఐ.సి.ఎస్. ఉద్యోగానికి అస్పృశ్యుల నిష్పత్తిని పెంచాలి; (2) జన సంఖ్య నిష్పత్తిని బట్టి ముస్లిముల లాగే అస్పృశ్యులకు ఉద్యోగాలు ఇవ్వాలని 1934 లో తీసుకున్న నిర్ణయాన్ని అమలుపరచాలి ;

1. కీర్(మ) : పే. 373.

(3) అస్పృశ్యుల విద్య నిమిత్తం కొంత నిధిని నిశ్చయించాలి; (4) దళిత విద్యార్థులకు లండనులో కొన్ని సీట్లను కేటాయించాలి; (5) కేంద్ర అసెంబ్లీలో 141 మంది సభ్యులున్నారు. అందులో కేవలం ఒక్కడే లస్పృశ్య సభ్యుడు ఉన్నాడు. ఈ సంఖ్యని పెంచాలి; దీనితో పాటు (6) ఎగ్జిక్యూటివ్ కౌన్సిల్‌లో ఒకరికి బదులు ఇద్దరు అస్పృశ్య ప్రతినిధులను నియమించాలి.

1943 నవంబరులో ఆయన ఢిల్లీలో దళిత కార్యకర్తల సమావేశం ఏర్పరచారు. దానిలో ఆయన కార్యకర్తలకి పై విషయాల గురించి తెలియ జేశారు. 1943 డిసెంబరు 8 వ తేదీన బొంబాయికి చెందిన పరేలులో డా॥ అంబేద్కరు చేసిన పనులకు గౌరవం ప్రదర్శించటానికి గాను ఒక పెద్ద సభ ఏర్పాటు చెయ్యబడ్డాది. శ్రీ గణపతిరావు జాధవ్ ఉరఫ్ మండకేబు ఆ సభకి అధ్యక్షత వహించారు. బాబాసాహబు వేల వేలమంది శ్రోతలకు ఉపన్యాసం ఇస్తూ ఎక్కువ డిమాండ్లకు ఎల్లాగ్గా గుర్తింపు లభించిందో విపులంగా వివరించి ఏ దాపరికం లేకుండా చెప్పారు. తమ అవకాశాల పట్ల మెలకువ కలిగి ఉండమని సూచిస్తూ ఆయన ఇలా అన్నారు - "కేవలం అవకాశాలు దొరికినందువల్ల ప్రయోజనం, ఏమీ ఉండదు. ఈ అవకాశాలు మన ఒళ్లో పడుతున్నాయో లేదో కూడా మనం గమనిస్తూ ఉండాలి. ఈ దేశానికి స్వాతంత్ర్యం వచ్చినప్పుడు హిందువులు ముస్లిములతో పాటు అస్పృశ్యులు కూడా దానికి వంతుదారులు అవుతారు. అస్పృశ్యులకు ముస్లిముల లాగే, సమానమైన హోదా ఇప్పించినందుకు గాను ఈనాడు నాకు పేరు వచ్చింది. ప్రభుత్వంలో మంత్రి పదవిలో నా నియామకం తామరాకు మీద పడ్డ మంచు బిందువు లాంటిది. అంతకన్నా కూడా క్షణభంగురమైనదే అనుకోండి. క్రైస్తవులు, పార్సీలు, యూదులు మొదలైన అల్పసంఖ్యాక వర్గాలవారు కాంగ్రెసును ఎదురుకోలేదు. అస్పృశ్య సమాజం కాంగ్రెసుని ఎదురుకుంది. ఇది నిజంగానే ప్రశంసించదగిన విషయం. మన పరాభవాలకి లజ్జ పడవలసినది ఏమీ లేదు. ప్రతీ వ్యక్తీ తన సిద్ధాంతాలకి అనుగుణంగా సంఘర్షించడానికి సంసిద్ధుడై ఉండాలి. అన్ని ప్రాంతాలలో నివసిస్తున్న అస్పృశ్యులందరికీ లాభం కలిగే పని ఏదన్నా ఒకటి చెయ్యాలన్నదే నా వాంఛ." తన ఉపన్యాసం చివరని అస్పృశ్యులకి ఉపదేశం ఇస్తూ డా॥ అంబేద్కరు ఇలా అన్నారు - "అస్పృశ్య సమాజానికి

ప్రస్తుతం పక్షవాం వచ్చింది. ఆ కుంటి సమాజం తన కాళ్ల మీద తాను నిలబడగలిగే శక్తిని సంపాదించుకోవాలి. తన యోగ్యతతో గుణ గుణాలతోనే పైకి లేవడానికి ఆశించాలి."

# నలభై రెండు

హిందూ ముస్లిముల ఐకమత్యాన్ని సాధించాలని మహాత్మాగాంధీ చేసిన ప్రయత్నాలన్నీ మట్టి కొట్టుకు పోతున్నాయి. చక్రవర్తి రాజగోపాలాచారి కూడా తన ప్రణాళికని ఒకదానిని సమర్పించారు. ఒక పాత్రికేయుడు ఈ ప్రణాళిక గురించి డా|| అంబేద్కరుని ప్రశ్నించాడు. ఆయన ఇలా సమాధానం చెప్పారు - "గాంధీజీ రాష్ట్ర స్వయం నిర్ణయాధికారాన్ని అంగీకరించారు. అందుకు నేనే సంతుష్టిపడ్డాను. కాని ఆయన ముస్లింలీగుతో పాటు కలిసి పనిచేయటానికి పెట్టిన షరతులను ఆయన పెట్టకుండా ఉండవలసినది."[1] ఈ ప్రణాళిక కన్నా నేను 1943 లో ఇచ్చిన ప్రణాళిక ఎక్కువ ప్రశస్థమైనది. ఆఖరిగా ఆయన ఇలా అన్నారు - "ఈ ప్రణాళిక వల్ల సంభాషణలకి దారి ఏర్పడ్డాది."[2]

మహారాష్ట్రలో కొంతమంది కావాలని పనికట్టుకుని డా|| అంబేద్కరు మహారుల నాయకుడనీ, ఆయన మహారుల హితం కోసమే పని చేస్తారని ప్రచారం చేస్తున్నారు. అయితే ఆయన తన పనుల్లో కాని, తన అభిప్రాయాల్లో గాని, ఆచరణలో గాని ఏ విధమైన భేద భావాన్నీ ఎప్పుడూ ప్రదర్శించలేదు. అసెంబ్లీ లోనూ కౌన్సిలు ఆఫ్ స్టేట్‌లోనూ అస్పృశ్య సభ్యులను సిఫారసు చెయ్యడంతో పాటు సంయుక్త ప్రాంతంలోని మోచీ పేరూ అస్సాము రాష్ట్రానికి చెందిన ఒక అస్పృశ్యుడి పేరూ సూచించారు.

1944 జనవరి 29 వ తేదీన కాన్పూర్‌లో దళిత ఫెడరేషన్ రెండవ వార్షికోత్సవం జరిగింది. అప్పుడు ఆయన కాంగ్రెసుని తీక్షణమైన వాక్బాణా

1. మానె : పే. 84
2. అదే : పే., 85-86

లతో చీల్చి చెండాడేరు. "కాంగ్రెసు ఓ మండుతున్న ఇల్లు. దాంట్లోకి వెళ్లి, మీకూ, మీ సమాజానికి నష్టాన్ని తెచ్చుకోకండి" అని ఆయన ఈ అభిప్రాయాన్ని వెలిబుచ్చారు - "దళిత యువకులు తమ యావచ్ఛక్తిని ఫెడరేషనుకి చేయూత ఇవ్వడానికి గాను వినియోగించాలి. దానివల్ల ఆంగ్లేయ ప్రభుత్వానికి కూడా అస్పృశ్యుల న్యాయోచిత అధికారాలను మన్నించకుండా ఉండడం సాధ్యపడదు. దళితులు ద్వితీయ స్థాయి పౌరసత్వాన్ని ఆమోదించకూడదు. వారు బానిసల్లాగ బతకడాన్ని వ్యవహరించడాన్ని విడనాడాలి. యజమాని లాగ బతకాలి" ఆయన ఉపన్యాసం ఎంతో స్ఫూర్తిదాయకంగా సాగింది.[1] ధారా ప్రవాహంగా ఆయన నోట వచ్చే మాటలు ఎంతో గంభీరంగానూ శాంతంగానూ ఉండి మనిషిలో ఆత్మ గౌరవాన్ని కలిగించే అద్భుతమైన శక్తితో నిండి ఉన్నాయి. తన ఉపన్యాసం చివరని మహిళలకు యువకులకు ఉపదేశం ఇవ్వడాన్ని మహిళల సహకారం లేకుండా సాధ్యం కాదు. యువకులు పార్టీలుగా సంఘటితమవ్వాలి. పరస్పర అభిప్రాయ భేదాలను నివారించుకోవాలి."

భారతదేశపు రాజకీయ రంగంలో బ్రిటిషు ప్రభుత్వానికి కాంగ్రెసుకు మధ్య సయోధ్య కుదర్చడానికి సర్ తేజ్ బహాదుర్ సప్రూ, డా|| ముకుందరావ్ జయకర్, శ్రీ శ్రీనివాస శాస్త్రి అనేక పర్యాయాలు మధ్యవర్తులుగా కృషి చేశారు. 1944 లో స్వతంత్ర పరిషత్తు అధ్యక్షుడి హోదాలో సప్రూ నాయకత్వం వహించారు. ఒక కమిటీని ఏర్పరచాలని నిర్ణయించడం జరిగింది. 'ఈ కమిటీలో ముగ్గురు న్యాయ నిపుణులను చేర్చుకోవాలి. ఈ కమిటీ లక్ష్యం కేవలం జాతి ఐకమత్యమే కాకుండా ప్రతి అల్పసంఖ్యాక వర్గం యొక్క సమస్యలను జాతీయ హితాన్ని దృష్టిలో ఉంచుకుని పరిశీలించడానికి ప్రయత్నం కూడా చేయాలి." డా|| అంబేద్కరు ఈ సూచనని యిచ్చారు.[2] ఆఖరికి సప్రూ కమిటీ నాలుగు సబ్ కమిటీలను ఏర్పరచినప్పుడు అంబేద్కరు దానినుంచి వైదొలగారు. ఏ పక్షానికి చెందని వారు విస్తృతమైన దేశ హితానికి ఆటంకం కలిగించేవారు అవుతారు అని ఆయనకి అనిపించసాగింది.

1. ఫ్రీ ప్రెస్ జనరల్ : 1-2-1944.
2. సప్రూ కమిటీ ఆన్ ఇండియన్ కాన్స్టిట్యూషనల్ రిఫార్మ్స్. 1945 : అపెండిక్సు XI, పే. LXXI

డా॥ అంబేద్కరు సూచించిన సాధనోపాయాలని జాతీయతా సిద్ధాంతం ఉన్న వార్తా పత్రికలు మెచ్చుకున్నాయి. 1944 జూలై 17వ తారీఖున గాంధీ జిన్నాలు కలుసుకున్నారు. వారిద్దరూ రాజాజీ గారి ప్రణాళిక గురించి చర్చించారు. అయితే చర్చలు విఫలమయ్యాయి. చర్చల్లో "పాకిస్తాను అంటే ఏమిటి దానర్థం ?" అని గాంధీజీ జిన్నాని ప్రశ్నించినప్పుడు జిన్నా డా॥ అంబేద్కరు పుస్తకం 'థాట్స్ ఆన్ పాకిస్తాను" గురించి సూచించి దానిని అధ్యయనం చెయ్యమని గాంధీజీకి సలహా ఇచ్చారు.[1]

దీనిమీద తన అభిప్రాయాలను వ్యక్తం చేస్తూ డా॥ అంబేద్కరు ఇలా అన్నారు – "రాజాజీ గారి పథకంలో జాతి సమస్యని రాజకీయ సమస్యతో ముడిపెట్టడం జరిగింది. ముందు మీరు మాకు స్వాతంత్ర్యం లభించేటట్టు చెయ్యడానికి సాయపడండి. ఆ తర్వాత మేం పాకిస్తాను గురించి యోచన చేస్తాం అని ఓ వల విసరడం జరిగింది." "హిందూ రాజులు ఇతరుల ఆక్రమణ నుంచి తమ రాజ్యాన్ని కాపాడుకోవటానికి గాను ఎలాగైతే పొరుగు దేశపు రాజు గారితో వైవాహిక సంబంధాలు కలుపుకుంటారో అలాగ. దీనివల్ల మంచి వరుణ్ణి ఎన్నుకోవడం అన్న ప్రసక్తే ఉండదు. అంచేత మంచి వరుడూ దొరకడు సంపదా లభించదు." ఇలా వ్యంగ్యంగా ఓ విసురు విసురుతూ డా॥ అంబేద్కరు ఈ పథకంలోని లొసుగులు దోషాలను ఎన్నిటినో ఎత్తి చూపించారు. పాకిస్తాను ఏర్పరిచినప్పుడు పంజాబులోనూ బెంగాలు రాష్ట్రంలోనూ రమారమి 15 – 20 శాతం అస్పృశ్యులు నివసిస్తున్నారు. అన్న దాన్ని దృష్టిలో ఉంచుకోవాలని ఆయన చివరని చెప్పారు. ఆ అస్పృశ్యుల అభిప్రాయ సేకరణ చేయకుండా పాకిస్తానులో వారిని చేర్చడం అన్నది చేయకూడదు.

డా॥ అంబేద్కరు జిన్నాని అనేక విధాలుగా ప్రశ్నించారు. గాంధీ గారి మీద దోషారోపణా చేశారు – "ఆయన జిన్నాగారిని ఈ ప్రశ్నలు ఎందుకు అడగలేదు ? పాకిస్తాను సమస్య కేవలం హిందువుల – ముస్లిముల సమస్య అని గాంధీ గారు భావిస్తున్నారు. కాని దీనిలో అస్పృశ్యులది కూడా ముఖ్యమైన మూడో సమాజం ఉన్నదన్న విషయాన్ని ఆయన మరిచి పోతున్నారు. వీరి తరపున మాట్లాడ్డానికి కాంగ్రెసు, ముస్లింలీగు అథవా

1. మానె : పే. 151

హిందూ మహాసభ - వీటికి బొత్తిగా అధికారం లేదు." ఈ సమయానికి డా॥ అంబేద్కరు అస్పృశ్య సమాజానికి జాతీయ స్థాయి ప్రాధాన్యతని కలగచేశారు. అంతచేత భవిష్యత్తులో ఏర్పడే పాకిస్తాను ప్రాంతాల్లో ప్రజాభిప్రాయ సేకరణ చేయకుండా అస్పృశ్య సమాజం వారు పాకిస్తాను పౌరులుగా అవరు. అని ఆయన స్పష్టంగా హెచ్చరించారు.

గాంధీజీ పాకిస్తాను డిమాండు గురించి గంభీరంగా ఆలోచన చేస్తున్నారని, అంబేద్కరుకి తోచినప్పుడు గాంధీజీ అస్పృశ్యుల డిమాండ్లను గురించి కూడా సానుభూతితో ఆలోచిస్తారని అనుకున్నారు. అంచేత ఆయన ఒక ఉత్తరం రాశారు - "హిందూస్థాన్ తన రాజకీయ లక్ష్యాన్ని పొందాలంటే హిందూ ముస్లిము సమస్యతో పాటు అస్పృశ్యులూ - అస్పృశ్యుల సమస్యకి కూడా పరిష్కారాన్ని అన్వేషించాలి." "అస్పృశ్యుల సమస్య స్వరూపం మతపరమైనది, సాంఘికపరమైనది" అని గాంధీజీ ఈ ఉత్తరానికి జవాబు ఆగష్టు 6వ తేదీన తాను రాసిన ఉత్తరంలో ఇచ్చారు.[1]

1944 సెప్టెంబరు నెల మధ్యలో అస్పృశ్య సమాజం తరపున కలకత్తాలో అంబేద్కరుకు సత్కారం జరిగింది. అప్పుడు డా॥ అంబేద్కరు క్రిప్సు మిషన్ విఫలమైనందుకు సంతోషాన్ని ప్రకటించారు. హిందువులు రాజీ కోసం ముస్లిములను యాచిస్తున్నారు కాని అస్పృశ్యులని ఖాతరే చెయ్యటం లేదు అని తన ఆశ్చర్యాన్ని ప్రకటించారు. గాంధీ వైస్రాయిల మధ్య ఇటీవలే జరిగిన ఉత్తర ప్రత్యుత్తరాలను గమనించమన్నారు. 'ప్రభుత్వపు పగ్గాలు అప్పచెప్పడానికి కేవలం హిందువులూ ముస్లిములు మధ్య రాజీ కుదిరితే చాలదు, దళిత సమాజంలో కూడా ఒప్పందం జరగడం అవసరం" అని ఆయన వైస్రాయికి స్పష్టంగా చెప్పారు. వైస్రాయి గారు ఆయన వాదాన్ని గమనించారు. ఈ కారణం చేత "మన గెలుపు దగ్గర పడ్డాది" అని ఆయన ప్రకటించారు.[2]

కీర్(మ) : 376

మానె : పే.84

# నలభై మూడు

1944 సెప్టెంబరు 20 వ తేదీన హైదరాబాదు సంస్థానంలోని షెడ్యూల్డు కాస్ట్ ఫెడరేషను సభలో డా|| అంబేద్కరు ఎంతో క్షోభ కలిగించే ఉపన్యాసం ఇచ్చారు. "దేశ పరిపాలనలో తన వంతు హక్కును పొందడం దళిత సమాజం లక్ష్యం" అని చెప్పారు.[1]

హైదరాబాదు షెడ్యూల్డు కాస్ట్ ఫెడరేషను తరపున డా|| అంబేద్కరుకు సమర్పించిన సన్మానపత్రంలో ఇలా రాశారు - "గాంధీ జిన్నాల మధ్య జరిగే ఒప్పందానికి అంబేద్కరు అంగీకారం లేకపోతే ఆ కరారు అస్పృశ్యులు కట్టుబడి ఉండే కరారు అవదు." అదే సాయంత్రం డా|| అంబేద్కరు మద్రాసు షెడ్యూల్డు కాస్ట్ ఫెడరేషన్ కార్యవర్గ సమావేశానికి హాజరు అవడానికిగాను బయల్దేరారు.

1944 సెప్టెంబరు 22 వ తేదీన మద్రాసు నగరపాలక సంఘం వారు మద్రాసు రిప్పను భవనంలో డా|| అంబేద్కరుకు సన్మానపత్రం సమర్పించారు. దానికి సమాధానం యిస్తూ ఆయన ఇలా అన్నారు - "నేను స్వరాజ్యానికి స్వాతంత్ర్యానికి వ్యతిరేకిని కాను. ప్రజాస్వామ్యపు పగ్గాలు పెట్టుబడి దారుల చేతుల్లోకి వెళ్తే తదితర ప్రజలు బానిసత్వంలోనే బతుకు వెళ్లబుచ్చుకోవాలి."

రెండవ రోజు 23 వ తారీఖున మద్రాసు సదర్న్ రైల్వేకి చెందిన స్పృశ్య దళిత వర్గాలకు చెందిన శ్రామికులు డా|| అంబేద్కరుకు సన్మాన పత్రం సమర్పించారు. వారిని ఉద్దేశించి మాట్లాడుతూ ఈ ఉపదేశాన్ని ఆయన ఇచ్చారు - "శ్రామిక సంస్థ స్థాపించడానికి బదులు రాజకీయ అధికారాన్ని పొంది శక్తిని సంపాదించడం ఎక్కువ ముఖ్యం."[2]

హిందూ ముస్లిముల ఒప్పందం కోసం గాంధీ జిన్నాల సమావేశాలు మొదలయ్యాయి. ఈ సమావేశాల్లో అస్పృశ్యులను ఉపేక్షించడం జరిగింది.

1. అదే : పే. 86
2. కీర్ (మ) : పే. 377

ఈ సమావేశాలు డా|| అంబేద్కరుని దళిత సమాజాన్ని విడిగా వదిలేసి జరుగుతున్న కారణంగా అస్పృశ్యులు వీటిని ఖండించారు. తమ వ్యతిరేకతని వ్యక్తం చేశారు. 1944 సెప్టెంబరు 23వ తేదీన అఖిల భారతీయ దళిత ఫెడరేషను కార్యవర్గ సమావేశం మద్రాసులో జరిగింది. డా|| అంబేద్కరు స్వయంగా దీనిని నడిపారు. ఈ మీటింగులో 11 తీర్మానాలు ఆమోదించారు.[1] ఈ తీర్మానాల్లో దిగువనీయబడిన డిమాండ్లు పొందుపరచబడ్డాయి – గాంధీ జిన్నాల మధ్య ఒప్పందానికి జరిగే చర్చల నిషేధం; దేశంలోని రాజకీయాల్లో అస్పృశ్య సమాజానికి ప్రత్యేకమైన అంతర్భాగంగా గుర్తింపు; ప్రత్యేకమైన నియోజకవర్గం; జాతి హక్కుల భద్రతకి హామీ; అల్ప సంఖ్యాకులందరికీ రాష్ట్ర మరియు కేంద్ర విధాన సభల్లో సమానమైన ప్రాతినిధ్యం వ్యవహారం కల్పించే ఒకే సూత్రం; ఉద్యోగాల్లో అస్పృశ్యులకు ప్రత్యేక స్థానాలు; ఉన్నత విద్యకు సముచితమైన వ్యవస్థ; అస్పృశ్య సమాజానికి ప్రత్యేకంగా బస్తీల ఏర్పాటు ఇత్యాదులు.

వేదాలు, గీత, శ్రుతులు, స్మృతులు, పురాణాలు ఇవన్నీ వైదిక విశ్వాసాలకు ప్రామాణిక గ్రంథాలుగా పరిగణించబడతాయి. హిందూ సంఘంలో అధిక జనుల – స్త్రీలు, శూద్రులు, అతి శూద్రులు మొదలైన వారి అధోగతికి ఈ గ్రంథాల ఉపదేశాలే కారణభూతాలు అని డా|| అంబేద్కరు భావన. మహాడ్ సత్యాగ్రహంలో ఆయన 'మనుస్మృతి' ని దహనం చేసి ఆ గ్రంథం పట్ల తన తీవ్ర ప్రతిక్రియని ప్రదర్శించారు. 1944 సెప్టెంబరు 24 వ తేదీ ఉదయం మద్రాసు లోని 'బుద్ధివాదీ సభ' (మేధావుల సభ) తరపున ఏర్పాటు చేయబడిన బహిరంగ సభలో ఆయన వేదాలను తీవ్రంగా విమర్శించారు. "భారతదేశపు బౌద్ధిక సంస్కరణ" అన్న విషయం మీద మాట్లాడుతూ ఆయన ఇలా అన్నారు[2] – హిందూమతాన్ని సమాజాన్ని పరిశుద్ధం చెయ్యటానికి, పునర్ నిర్మించటానికి భావ పరివర్తనం అవసరం. హేతుబద్ధమైన భావాలు, హేతువాదం – వీటి ఘర్షణ మతస్వరూపంతో కాదు – వీటి సంఘర్షణ సాంఘికస్థాయిలోనూ రాజకీయ స్థాయిలోనూ జరిగే ఘర్షణ. బుద్ధుడు, బ్రాహ్మణులు – వీరు ప్రతిపాదించిన మతాల్ని సరిపోల్చి ఆయన ఇలా అన్నారు – బుద్ధుడికి సత్యనిష్ట అన్నా

1. సంగ్రామ్ : 24-9-1944; మానె; పే. 89-90
2. ఇండియన్ ఎక్స్‌ప్రెస్ : 25.9.1944

తర్క శుద్ధి అన్నా ఇష్టం. వేదాంతంలో ఏదుంటే అదే సత్యం అన్నది బ్రాహ్మణుల భావన. బుద్ధుడి భావాలు అభ్యుదయకరమైనవి. పురోగమింప చేసేవి. వైదిక భావాలు ప్రతిక్రియాత్మకమైనవి. అభ్యుదయ నిరోధక మైనవి. విప్లవ నిరోధకమైనవి. బౌద్ధ మత వినాశనం ఈ దేశానికి జరిగిన గొప్ప హాని." బౌద్ధ మతాన్ని వైదిక మతాన్ని తులనాత్మకంగా చూస్తూ ఆయన ఇంకా ఇల్లాగ్గా చెప్పారు - ఆలోచనాపరమైన, వివేకవంతమైన సమాజ నిర్మాణం ఇప్పటి ఈ సమయపు డిమాండు."

1944 సెప్టెంబరు 24 వ తేదీన జస్టిసు పార్టీ కార్యకర్తలను ఉద్దేశించి ఉపన్యసించారు. మద్రాసు జస్టిసు పార్టీ, మహారాష్ట్ర సత్యశోధక్ సమాజ్ రెండూ బ్రాహ్మణేతర సంస్థలు. రెండు రాష్ట్రాల్లోనూ బ్రాహ్మణేతర ప్రభుత్వాలు ఉన్నాయి. కాని 1937 సాధారణ ఎన్నికల్లో జస్టిసు పార్టీ చిత్తుగా ఓడిపోయింది. ఈ ఓటమిని విశ్లేషిస్తూ డా॥ అంబేద్కరు ఇలా అన్నారు - "ముఖ్యమైన శాఖల్లో విశిష్టమైన హోదాల్లో ఉద్యోగం చేస్తున్న వారు తమ పార్టీ వైపు దృష్టి పెట్టలేదు. బ్రాహ్మణేతరులు కేవలం బ్రాహ్మణులను విమర్శించారు. అంతేకాని వారు బ్రాహ్మణుల ప్రభావం నుంచి తమని తాము తప్పించుకోలేకపోయారు. బ్రాహ్మణేతరులు పార్టీ ముప్పై సంవత్సరాల పాటు ప్రభుత్వాన్ని తమ చేతుల్లో పెట్టుకున్నప్పటికీ ఏ సంస్కరణనీ చెయ్యలేకపోయింది. భూసంస్కరణల పని తప్పించితే ఇంకేమీ మేలు కలిగించే పనినీ చెయ్యలేదు. అందుచేత పల్లెల్లో తొంభై శాతం ప్రజలు బీదరికంతో చాలా హేయమైన బతుకుని జీవిస్తున్నారు."

సాయంత్రం పార్కు టవునులో ఉన్న మెమోరియల్ హాలులో షెడ్యూల్డు కాస్ట్ ఫెడరేషను, దక్షిణ భారత బుద్ధిస్టు ఎసోసియేషనులు బాబాసాహెబుకి సన్మాన పత్రం సమర్పించాయి. అదే రోజుల్లో శ్రీనివాస శాస్త్రి తాను ఇచ్చిన ఉపన్యాసాల్లో ఒక దాంట్లో "అంతర్జాతీయ పరిషత్తుకి అంబేద్కరు హాజరైతే దేశానికి వినాశ హేతువు అవుతుంది." అని అన్నారు. దానిని ఆక్షేపిస్తూ డా॥ అంబేద్కరు శ్రీనివాస శాస్త్రిని తీవ్రమైన పదజాలంతో విమర్శించారు. ఆయనను గట్టిగా దుయ్యబడుతూ ఇలా అన్నారు - నా సార్వజనీక జీవితంలో సిగ్గు పడవలసినట్టుగా నేనెప్పుడూ ప్రవర్తించడం జరగలేదు."

రౌండ్ టేబిలు సమావేశపు ఘటనలను కొన్నిటిని ఉల్లేఖిస్తూ ఆయన ఇలా అన్నారు – "భారతదేశంలో ఎవరైనా వంచించారో అన్నట్లయితే అది అస్పృశ్య సమాజం వారు ఎంత మాత్రమూ కాదు. అది శాస్త్రి లాంటి వాళ్లే చేశారు. అస్పృశ్యులు కేవలం న్యాయం కోసం భద్రతని కోరారు. స్వరాజ్యపు డిమాండును పూర్తిగా సమర్థించారు."

"సెంధ్ అబ్జర్వర్" వార్తా పత్రిక ప్రతినిధికి ఇంటర్వ్యూ ఇస్తూ డా॥ అంబేద్కరు స్పష్టంగా చెప్పారు. – దేశ స్వాతంత్ర్యాన్ని నేను ఏమీ వ్యతిరేకించటం లేదు. అధవా పాకిస్తాను ఏర్పడడానికి నేను వ్యతిరేకిని కాను. నా అస్పృశ్య సమాజానికి సముచితమైన భద్రత కావాలి అన్నదే నేను కోరుతున్నాను – అంతే."

తన మద్రాసు ప్రవాసం సమయంలో ఆయన జస్టిస్ పార్టీ నాయకులు రామస్వామి నాయకర్‌తో దీర్ఘ చర్చలు చేశారు. తర్వాత ఆయన ఏలూరు వెళ్లారు. ఏలూరు పురపాలక సంఘం, షెడ్యూల్డు కాస్ట్ ఫెడరేషను, క్రిష్టియన్ ఫెడరేషను, వెస్ట్ గోదావరి, జిల్లా బోర్డు తరపున ఆయనకి సన్మాన పత్రాలు సమర్పించబడ్డాయి.

ఏలూరు పురపాలక సంఘంవారి సన్మాన పత్రానికి సమాధానం ఇస్తూ బాబాసాహబు ఇలా అన్నారు – గాంధీజీకి రాజ దౌత్య దృష్టి లేదు. నీగ్రోల ఓటు ఉత్తర భాగంలో నివసిస్తున్న సంస్థలకి లభించాలని అబ్రహాం లింకను వాంఛించారు. అంచేతే 1762 లో నీగ్రోల కోసం స్వాతంత్ర్యపు అపీలు చేయింపించారు. దీని వెనక నీగ్రోల స్వాతంత్ర్యానికి బదులు ఫెడరల్ స్టేటు పట్ల ఉన్న నిష్ఠ ఎక్కువ ప్రధానమైనది. గాంధీజీకి కూడా స్వాతంత్ర్యం కావాలి. దానితో పాటు చతుర్వర్ణాలు కూడా ఆయనకి అవసరమే. అంచేత ఆయన భూమిక అబ్రహాం లింకన్ లాంటిదే."

అస్పృశ్య సమాజం తరపున డా॥ అంబేద్కరుకి గుడివాడలో కూడా సన్మాన పత్రం సమర్పించబడ్డాది. దళితులకు ఉపదేశిస్తూ ఆయన ఇలా అన్నారు – "హరిజన సేవక సంఘ్ ద్వారా నడపబడుతున్న హాస్టలుని వదలి విద్యార్థులు బైటికి వచ్చేయ్యాలి. తమ విద్య కోసం ఎక్కువ ధనరాశిని మంజూరు చెయ్యవలసినదిగా ప్రభుత్వం మీద ఒత్తిడి తీసుకు రావాలి.[1]

1. జ్ఞాన ప్రకాశ్ : 4-10-1944

అఖిల భారతీయ హరిజన కమిటీ ప్రతినిధి మండలి 1944 సెప్టెంబరు 26 తారీఖున మహాత్మాగాంధీని కలిసింది. ఈ హరిజనసభ్యులు డా॥ అంబేద్కరుని వ్యతిరేకించారు. వారు పూనాఒప్పందాన్ని సమర్థించారు. "హరిజన సేవక్ సంఘ్‌లో మాకు 50 శాతం ప్రాతినిధ్యం ఇవ్వండి" అని గాంధీజీని డిమాండు చేశారు. "హరిజన సేవక్ సంఘ్ హరిజనుల సంస్థ కాదు. హరిజనుల ఔన్నత్యానికి కృషి చేస్తున్న వ్యక్తుల సంస్థ. అంచేత అందులో మీ ప్రాతినిధ్యపు ప్రశ్న ఏదీ లేదు", అని గాంధీజీ వారికి జవాబు చెప్పారు.[1]

1944 సెప్టెంబరు 28వ తారీఖున డా॥ అంబేద్కరు రాజమహేంద్రవరం వెళ్లారు. అక్కడ ఆయనకు సన్మానపత్రం సమర్పించారు. దానికి జవాబు ఇస్తూ తన ఉపన్యాసంలో ఆయన ఇలా అన్నారు – "గాంధీజీ వర్ణాశ్రమ వ్యవస్థని భంగపరచారు. ఆయనలో దూరదృష్టి లేనే లేదు." ఇది ఆయన గాంధీజీ మీద నిర్మొహమాటంగా చేసిన వ్యాఖ్యానం. గాంధీజీ తమ తప్పులను మరోసారి యోచించుకోవాలి అని కూడా ఆయన సలహా ఇచ్చారు. అక్టోబరు 4వ తారీఖున పూనాలోని అహిల్యాశ్రమంలో ఇచ్చిన ఉపన్యాసంలో కూడా తీవ్ర పదజాలాన్ని ప్రయోగించి గాంధీజీ గారి పట్ల తనకున్న అభిప్రాయాన్ని వ్యక్తం చేశారు. ఆయన ఇలా అన్నారు – "గత ఇరవై అయిదేళ్ల బట్టీ ఆయనకు కోట్ల కొద్ది రూపాయలు లభించాయి. లక్షలాది జనం చేసిన త్యాగం ప్రాప్తించింది. అయినా చెప్పుకోదగిన రాజకీయపు ఎత్తు ఆయన వల్ల కాలేదు.[2]

డా॥ అంబేద్కరు మీద కూడా ఆ రోజుల్లో విమర్శల వర్షం భారీగానే పడ్డాది. యుద్ధకాలంలో బ్రిటిషు ప్రభుత్వానికి వ్యతిరేకంగా కాంగ్రెసు సహాయ నిరాకరణ పాలసీని స్వీకరించింది. అప్పుడు డా॥ అంబేద్కరు ప్రభుత్వంలో మంత్రి హోదాలో పనిచేశారు. అంచేత భారతదేశపు వార్తాపత్రికలు ఆయనను దేశద్రోహి అనేంతవరకూ వెళ్ళాయి.

డా॥ అంబేద్కరు మద్రాసులో ఇచ్చిన ఉపన్యాసం మీద అన్ని వేపుల నుండి తీవ్రమైన విమర్శ రేగడం సహజమే. కొన్ని వార్తా పత్రికలు ఆయన ఉపన్యాసాన్ని తప్పుడు ధోరణిలో సమర్పించాయి. కొన్ని సందర్భాన్ని వదిలేసి వార్తలు ప్రచురించాయి.

1. మానె : పే. 171
2. సకాల : 5 – 10 – 1945

మద్రాసు ఉపన్యాసం మీద ప్రొఫెసరు ఎ.ఆర్. వాడియా 'రస్త రహబర్' అనే వార్తా పత్రికలో "సెన్సు అండ్ నాన్‌సెన్సు ఇన్ పాలిటిక్సు" పేరుతో ఓ వ్యాసం రాశారు. అందులో సాతవలేకర్ లాగే వివరణలు ఇవ్వబడ్డాయి. ఉదాహరణకి - "డా|| అంబేద్కరు అస్పృశ్య సమాజం నుంచి వచ్చారు. అంచేతే ఆయనకి ఈ గొప్పదనం వచ్చింది. ఆయన ముస్లిమో, క్రైస్తవుడో, బ్రాహ్మణుడో అయితే ఎవరూ ఆయనని ఖాతరు చేసి ఉండేవారు కాదు." ఈ వ్యాసానికి జవాబు రాస్తూ జె.ఇ. సంజానా తన వ్యాసంలో ఇలా రాశారు - "ఏ సమాజానికి చెందిన ఏ ప్రసిద్ధ నాయకుడితో పోల్చి చూసినా డా|| అంబేద్కరు, ఆయన యోగ్యతా కారణంగా ఏ విషయంలోనూ తక్కువ వారిగా కనిపించరు."[1]

అయితే డా|| అంబేద్కరు ఉప్పెనగా వచ్చి పడే విమర్శలకి భయపడే మనిషి కాదు. పూనా ప్రవాస కాలంలో 1944 నవంబరు 29 వ తారీఖున పి.ఎన్. రాజభోజ్ గారింటికి ఆయనని టీకి ఆహ్వానించారు. ఈ సందర్భంలో తనని విమర్శిస్తున్న వారికి మళ్లీ నోరెత్తకుండా జవాబు ఇస్తూ తన భావాలను విపులంగా విశదీకరించారు - "గీత నాలుగు సార్లు రాయబడ్డాది. మొదట్లో గీతలో మతం, తత్వజ్ఞానం రెండింటికి సంబంధించిన విషయాలు లేవు. కేవలం అందులో 60 శ్లోకాలే ఉండేవని చెప్తారు. పోబాడేలాగ ఇది యాదవుల గాథా-గీతం. కృష్ణుణ్ణి భగవంతుడి అవతారంగా స్వీకరించినప్పుడు భక్తిమార్గాన్ని ఆధారం చేసుకోవడం జరిగింది. ఈ గ్రంథంలో శూద్రులని నిందించడం ఉపేక్షించడం జరిగింది. నేను హిందువుల ఈ మత గ్రంథాన్ని హేళనా చెయ్యటం లేదు. నిందించటమూ లేదు. నేను కేవలం వాస్తవ స్థితిని చెపుతున్నాను. వేదాలని కేవలం బ్రాహ్మణులే అంగీకరించగలుగుతారు. బుద్ధుడి మతం శూద్రుల మతం. అది వేదాన్ని ప్రామాణిక గ్రంథంగా అంగీకరించదు. బ్రాహ్మణేతర సమాజం వేదాలని మత గ్రంథంగా అంగీకరించలేదు. ఋగ్వేదంలోనూ అథర్వ వేదంలోనూ నైతికతని పెంచే విషయం ఏదీ లేదు. వర్ణాశ్రమ ధర్మాన్ని సుస్థిరంగా ఉంచటానికి గాను గీత రచించబడ్డాది. గీత నాలుగు వర్ణాలకు ఆసరా ఇచ్చింది. అందుకే అది ఇప్పటికీ స్థిరంగా ఉంది."

1. జె.ఇ. సంజానా : పే. 5

డా॥ అంబేద్కరు చేసిన ఈ వివేచన విమర్శకులకు సమాధానం కాదు. అయితే ఆయన మీద విమర్శలు వరదలా వచ్చిపడ్డాయి. విమర్శకులు మరోసారి అత్యంత తీవ్రంగా ఆయన మీద విరుచుకుపడ్డారు.

డా॥ అంబేద్కరు లేవనెత్తిన ప్రశ్నలకు ఖండించడానికి ఒక్క విద్వాంసుడూ ముందుకు రాలేదు. కాని ప్రత్యర్థుల విమర్శల స్థాయి ఎంత కిందికి దిగ జారుతుందో అది మాత్రం ఖచ్చితంగా తెలిసింది. డా॥ అంబేద్కరు తన ఉపన్యాసాల్లో ఏ అంశాలని ఎత్తి చూపెట్టారో, ఏ వాదాన్ని ప్రతిపాదించారో - వాటన్నిటిని తన గ్రంథం "రిడల్సు ఇన్ హిందూయిజమ్"[1] లో విపులంగా ప్రమాణాలతో సహా పొందు పరిచారు. యుద్ధం తర్వాత వైదిక మత గ్రంథాలని వ్యతిరేకిస్తూ గట్టిగా గొంతెత్తి ఎదుర్కొన్న ఒకే ఒక్క విద్వాంసుడు డా॥ అంబేద్కరే అని చెప్పడంలో తప్పు ఏమీ లేదు.

ఈ రోజుల్లోనే బేవర్లె నికోలస్ అనే పాత్రికేయుడికి ఇంటర్వ్యూ ఇస్తూ బాబాసాహబు అంబేద్కరు ఇలా చెప్పారు - పల్లెల్లోనూ, గ్రామాల్లోనూ నివసిస్తున్న గుప్పెడు మంది అస్పృశ్యులని శక్తిమంతులుగా చెయ్యాలి. అంచేత నేను వారిని పల్లె పట్టుల నుంచి బైటకి లాగి వారికోసం పెద్దపెద్ద బస్తీలు ఏర్పరచాలి. వారిని తమ కాళ్లమీద తాము నిల్చునేటట్టు చెయ్యాలి. మేం ఇది చెయ్యగలం. కాని వారు మమ్మల్ని పూర్తిగా చెయ్యనివ్వాలనే మేం వాంఛిస్తున్నాం. తదితర సమాజాల లాగే మేమూ జాతీయ పౌరులం."[2]

1945 జనవరి 2వ తారీఖున కలకత్తాలో అఖిల భారతీయ అస్పృశ్య విద్యార్థి పరిషత్తు సమావేశం ఏర్పాటు చేయబడ్డాది. ఈ సమావేశంలో మాట్లాడుతూ డా॥ అంబేద్కరు విద్యార్థులకు ఉపదేశం యిస్తూ ఇలా చెప్పారు - "రాజకీయాలకు దూరంగా ఉండడమే విద్యార్థులకు శ్రేయస్కరం. తమ చదువుని త్యజించి రాజకీయాల వేపు దృష్టి పెట్టడం వల్ల భారతీయ విద్యార్థుల చదువు నష్టపోతోంది. వారి విద్యా స్థాయి దిగజారిపోతోంది." అక్కడ "పీపల్సు హెరాల్డు' అనే వారం వారం వెలువడే వార్తా పత్రిక ప్రచురణ ప్రారంభోత్సవ సందర్భంలో మాట్లాడుతూ ఆయన ఇలా అన్నారు - "రాజకీయదృష్ట్యా, నైతికదృష్ట్యా కూడా 'దళిత ఫెడరేషను'

1. డా॥ బాబాసాహబు అంబేద్కరు : రైటింగ్స్ అండ్ స్పీచెస్, వాల్యూం 4, మహారాష్ట్ర ప్రభుత్వం, బొంబాయి
2 బేవరలె నికోలస్ : పే. 40

పార్టీ ఈ దేశంలో ఎప్పటికీ నిలిచే ఉంటుంది." కలకత్తాలో ఆయన డి.జి. జాధవ్ ఇంట్లో భోజనం చేశారు. డా॥ అంబేద్కరు జాధవ్‌కి బాల్య కాలం నుంచీ చాలా సహాయం చేశారు. జాధవ్ రైల్వేలో లేబరు ఆఫీసరు. కాని అస్పృశ్యులైన అంబేద్కరు వారింట భోజనం చేశారు అన్న విషయం తెలియగానే వారింట్లో పనిచేసే నౌఖర్లు అందరూ పని చెయ్యడానికి నిరాకరించారు.

డా॥ అంబేద్కరు పాకిస్తానుకి సంబంధించిన తన గ్రంథం రెండవ ముద్రణని 1945 లో ప్రచురించారు. ఆ గ్రంథంలో మరో అధ్యాయాన్ని ఆయన జోడించారు. కెనడా, స్విట్జర్‌లాండ్ మొదలైన దేశాల్లో భారతీయ సాంస్కృతిక ఐకమత్యాన్ని అంగీకరించి అనేక రాష్ట్రాల నుండి వచ్చిన సమాజాల వారు కలసి ఉండగలరు అన్న విషయాన్ని ఆయన ఋజువు చేశారు. కాని భారతదేశపు భద్రత దృష్ట్యా, ఖర్చుని తగ్గించటానికి గాను హిందువులు పాకిస్తాను ఏర్పాటుని అంగీకరించాలి అన్న ఆయన అభిప్రాయం అలాగే స్థిరంగా ఉన్నాది.

అఖిల భారతీయ దళిత ఫెడరేషను మూడవ వార్షిక సమావేశం బొంబాయిలో 1945 మే నెల 8వ తారీఖున జరిగింది. ఆ రోజు ఆదివారం. అంచేత రోజంతా కార్యక్రమాలు జరుగుతూనే ఉన్నాయి. ఫెడరేషను సమావేశాల్లో సమతాసైనిక్‌దళ్ అథవా 'యువక్ సంగఠన్ తరఫున మొత్తం ఏర్పాట్లు అన్నీ జరుగుతాయి. ఈసారి కూడా ఉదయం అస్పృశ్య యువక పరిషత్తు జరిగింది. మధ్యాహ్నం మహిళా పరిషత్తు జరిగింది. యావత్ భారతదేశం నుంచి సుమారు వెయ్యిమంది ప్రతినిధులు వచ్చారు. సింధు, పంజాబు, సంయుక్త ప్రాంతం, బెంగాలు, అస్సాము, మద్రాసు, మధ్యప్రదేశ్, ఆంధ్ర, మహారాష్ట్ర - ఈ రాష్ట్రాల ప్రతినిధులు ప్రేక్షక సముదాయం కలిపి లక్షా పాతికవేలకి మించిన జనం ఆ సమావేశంలో పాల్గొన్నారు.

అఖిల భారతీయ స్థాయిలో సవర్ణ మహిళల సమావేశాన్ని కూడా పాత్రికేయులు చూశారు. ఈ సమావేశాన్ని చూసి వారు ఇలా చెప్పారు - "సవర్ణ మహిళల నాలుగు సమావేశాలలో సమానమైనది డా॥ అంబేద్కరు గారి ఈ మహిళా సమావేశం. హాజరైన జనం దృష్ట్యా అంబేద్కరు కాంగ్రెసుతో పాటు అన్ని సంస్థలను ఓడించేశారు." సభావేదిక మధ్య

కేవలం బుద్ధుడి చిత్రం పెట్టబడ్డాది. సభ ప్రాంగణం అంతా సైనిక క్రమశిక్షణతో ఉన్నదా అన్నట్టు ఉన్నాది. శ్రీ మడకేబు ఆ జాధవ్, సర్వసంగపరిత్యాగం చేసి సాంఘిక సేవావ్రతం పట్టిన గృహస్థు - ఈ సమావేశానికి స్వాగతాధ్యక్షులు, ఆయన మరాఠీలో తన స్వాగతోపన్యాసం ఇచ్చారు. అధ్యక్షత వహించిన శ్రీ ఎన్. శివరాజన్ ఇంగ్లీషులో ఉపన్యాసం ఇచ్చారు. డా|| అంబేద్కరు తన ఉపన్యాసాన్ని ఇంగ్లీషులో రాసి తెచ్చారు. కాని అలవుగా మాట్లాడే వక్తలాగ మరాఠీలోనే మాట్లాడారు.[1] "అస్పృశ్య సమాజం జ్ఞానం లేనిది. అమాయకమైనది. దానికి తమదైన ప్రచార సాధనం కూడా లేదు. అయినా ఇక్కడికి ఇంత అధిక సంఖ్యలో జనం చేరేరు." ఆయన మొదట కార్యకర్తలను ప్రశంసించారు. తర్వాత రాజకీయ విషయాల గురించి, సాంఘిక విషయాల గురించి మాట్లాడుతూ ఆయన ఇలా అన్నారు - "భారతీయ వ్యవహారాల మంత్రి మహాశయులు రాజ్యాంగాన్ని డిమాండు చేస్తే నెహ్రూ 150, 200 పేజీల నెహ్రూ రిపోర్టుని సిద్ధం చేశారు. అందులో ఆయన "అస్పృశ్యుల సమస్య, మతపరమైనది. రాజకీయమైనది కాదు" అని దానిని రద్దు చేసేశారు. ఏడు కోట్ల అస్పృశ్యులు ఆయన దృష్టికి శూన్యంతో సమానం. కాని రౌండ్ టేబిలు సమావేశంలో వారికి నూటికి 10 స్థానాలు ఇవ్వబడ్డాయి. సప్రూ కమిటీ ఈ సంఖ్యని 50 కి పెంచింది. ఇంత ప్రగతి మనది జరిగింది. బెల్లం ముక్క దగ్గర చీమలు చేరతాయి. బెల్లాన్ని కాపాడ్డానికి చేరవు. బెల్లాన్ని తింటానికి చేరతాయి. అలాగే ఇప్పుడు ఈ కమ్యూనిస్టులు మొదలైన అనేక పార్టీలవారు స్నేహసంబంధాలు పెంపొందించుకోవడానికి మనచుట్టూ మూగుతున్నారు." కాంగ్రెసుతో వైమనస్యం ఉండకూడదు. అన్నదే ఆయన వాంఛ. ఆ భావాన్ని వ్యక్తం చేస్తూ ఆయన ఇలా అన్నారు - "మనకి ఎవరి దీవెనలూ అక్కరలేదు. మనం మన సాహసం, వివేకం కార్యదక్షతలతో మనదేశం కోసం, మనకోసం పూర్తి దీక్షతో పనిచేద్దాం. మేలుకొన్నవాడికి, సంఘర్షించే వాడికి ఆఖరికి సుస్థిరమైన న్యాయం లభిస్తుంది."

జాతి ఒప్పందం కోసం ఆయన సూచించిన చికిత్సని "కమ్యూనల్ డెడ్‌లాక్ అండ్ ఎవే టు సాల్వ్ ఇట్" అనే పేరుతో ఆయన ప్రచురించారు. ఈ ముసాయిదాలో ఆయన ఇలా సూచించారు - హిందూస్తాన్‌లోని

1. కాల : 9.5.1945

పార్టీలు రాజకీయమైనవి కావు. జాతి పార్టీలు. అంచేత బహుసంఖ్యాక వర్గాలకు పూర్తి మెజారిటీ ఇవ్వడానికి బదులు సాపేక్ష మెజారిటీ ఇచ్చే పథకాలు అమలు చెయ్యాలి. వలసరాజ్య స్వరాజ్యాన్ని అమలుపరచాలంటే మనం మన రాజ్యాంగాన్ని తయారు చేసుకోవాలి. బ్రిటిషువారి మీద ఆధారపడితే ఈ కార్యం జరగదు," ఇదీ ఆయన సూచన.

డా॥ అంబేద్కరు ఆనాటి రాజకీయ సమస్యలను పరిష్కరించటానికి మధ్య మధ్య సముచితమైన మార్గాలను సూచిస్తూ ఉండేవారు. కాని దురదృష్టవశాత్తూ ఈ గొప్ప వివేకవంతుడి సూచనలను సరిగా పట్టించు కోవడం జరగలేదు.

డా॥ అంబేద్కరుకి 1945 మే 20 వ తారీఖున ఆయన మిత్రులు బొంబాయి కేపు మాడల్ అనే హోటలులో విందు ఇచ్చారు. ఈ సందర్భంలో ఆయన ఇలా అన్నారు - "హిందూస్తాన్‌కి సంపూర్ణ స్వరాజ్యానికి బదులు వలస రాజ్య స్వరాజ్యం యివ్వబడాలి ఎందుచేతా అంటే అంతర్జాతీయ చట్టం ప్రకారం ఈ వలసరాజ్య స్వరాజ్యం కూడా సంపూర్ణ స్వరాజ్యంతో సమానమైనదే."

# నలభై నాలుగు

డా॥ అంబేద్కరు రాసిన "వాట్ కాంగ్రెస్ అండ్ గాంధీ హేవ్ డన్ టు ద అన్‌టచబుల్స్" అన్న పేరున్న రాజకీయ విషయంతో సంబంధించిన గ్రంథం 1945 లో ప్రచురించబడ్డాది. ఈ గ్రంథం వెలువడ్డంతో మరోసారి కాంగ్రెసు పార్టీలో కలవరపాటు పుట్టింది. అంబేద్కరు వైదుష్యం, హేతువాదం, వాదన ప్రతిపాదించే అడ్వకేటు శైలి చాలా గొప్పగానూ పరిణామదాయకంగానూ ఉన్నాయి. తాను ప్రతిపాదించిన వాటిని సమర్థించే ప్రమాణాలతో, గణాంకాలతో ఈ గ్రంథం ఈ చివరి నుండి ఆ చివర వరకూ నిండి ఉన్నాది. కాంగ్రెసు 1917 లో అస్పృశ్యుల ఉద్ధరణ పని ప్రారంభించింది. కాని కాంగ్రెసు ఆడంబరం జాస్తిగా చేసింది. పని కొంచెం

కూడా చెయ్యలేదు. ఈ గ్రంథంలో ఈ విషయాన్ని ఎత్తి చూపించడం జరిగింది.

డా॥ అంబేద్కరు ఈ గ్రంథాన్ని "ఎఫ్" అనే బ్రిటిషు మహిళకు అంకితం ఇచ్చారు. తన ఈ అంకితంలో ఆయన బైబిలు ఓల్డు టెస్టెమెంటు నుంచి నుడులను కొన్నిటిని ఉటంకించారు. ఉదాహరణకి "మీ దేవుడే మా దేవుడు" - ఇద్దరి లక్ష్యాల సమానత్వాన్ని దర్శింపచేసే బైబిలులోని నుడులను ఉటంకించి డా॥ అంబేద్కరు ఈ గ్రంథాన్ని అంకితం ఇచ్చారు. ఈ మహిళ రౌండు టేబిలు సమావేశ కాలంలో ఆయనకి చాలా సహాయం చేసింది. తన 'ఫిలాసఫీ ఆఫ్ హిందూయిజమ్' అన్న వ్యాసంలోనూ ఆయన 'రూథ్ నావోమీ' ల సంభాషణని ఉటంకించారు. రెండవ గ్రంథం 'కాంగ్రెసు - గాంధీలు అస్పృశ్యులకు ఏం చేశారు ?' మీద వార్తాపత్రికలు డా॥ అంబేద్కరుని చాలా విమర్శించాయి చక్రవర్తి రాజగోపాలాచారి, కె. సంతానం - ఈ ఇద్దరు కాంగ్రెసు నాయకులు ఈ పుస్తకానికి సమాధానం యిచ్చే ప్రయత్నం కూడా చేశారు.

జూన్ నెల మొదటివారంలో భారత వైస్రాయి తన సెలవల తర్వాత తిరిగివచ్చాడు. ఆయన జూన్ ఆఖరివారంలో అఖిలపక్ష సమావేశం కోసం సిమ్లాకి పిలిచారు.

ఈ సమావేశానికి అన్ని రాష్ట్రాల మాజీ ముఖ్యమంత్రులు, అల్ప సంఖ్యాకవర్గాల ప్రతినిధులూ హాజరయ్యారు. డా॥ అంబేద్కరు లేబరు మంత్రి అయిన కారణం చేత ఈ సమావేశంలో పాల్గొనలేకపోయారు. కాని ఫెడరేషన్‌కి చెందిన ఎన్. శివరాజ్ దానికి హాజరయ్యారు. డా॥ అంబేద్కరు తయారుచేసిన రిపోర్టులో జనసంఖ్య నిష్పత్తి ననుసరించి ముస్లిములకు 5 సీట్లు ఇచ్చినప్పుడు అదే పద్ధతిని దళిత సమాజానికి మూడు సీట్లు ఇవ్వాలి అని డిమాండు చేశారు. సిమ్లా సమావేశం ద్వారా భారతదేశానికి స్వాతంత్ర్యాన్ని ఇచ్చే నిర్ణయాన్ని వాయిదా వేయటానికి ప్రయత్నం చేస్తున్నారన్న సందేహం గట్టిపడుతోంది. డా॥ అంబేద్కరు తదితర కేంద్రమంత్రులు కొంతమంది ద్వారా తన అభిప్రాయాలను లార్డు వేవలుకి సూచించారు.

1945 జూన్ ఆఖరివారంలో డాక్టరు అంబేద్కరు బొంబాయి వచ్చినప్పుడు ఆయన 'టాటా ఇన్స్టిట్యూట్ ఆఫ్ సోషల్ సైన్సెస్

విద్యార్థులను ఉద్దేశించి మాట్లాడారు. ఆయన తన ఉపన్యాసంలో ఇలా అన్నారు - "అనివార్య ఒప్పందం శ్రామికులకు, చాలా శ్రేయస్కరమైనది". యుద్ధకాలంలో టెక్నికల్ విద్య కోసం తెరిచిన విద్యాలయాలు భవిష్యత్తులో కూడా ఇలాగే కొనసాగుతాయి అని ఆయన హామీ ఇచ్చారు.

భారతదేశపు సమస్య విడటం లేదని గుర్తించి లార్డు వేవలు ఆగస్టు నెలలో లండను వెళ్లారు. అక్కడ నుంచి సెప్టెంబరు మధ్యలో తిరిగి వచ్చారు. వస్తూనే ఆయన సాధారణ ఎన్నికలను ప్రకటించారు.

అన్ని పార్టీల వారూ ఎన్నికల రంగంలోకి దిగారు. కాంగ్రెసు, ముస్లింలు, హిందూ మహాసభ - ఈ మూడు పార్టీల వారిదగ్గరా అర్థబలమూ అంగబలమూ ఉన్నాయి. అంతేకాకుండా ఎన్నో వార్తా పత్రికలు కూడా వారిని సమర్థిస్తున్నాయి. అంబేద్కరు దగ్గర ఇవి ఏవీ లేవు. అయినా షెడ్యూల్డు కాస్ట్ ఫెడరేషను ఎన్నికల రంగంలోకి దిగింది.

1945 సెప్టెంబరు 24 వ తారీఖున బాబాసాహబు అంబేద్కరు డా. ఎమ్. ఆర్. జయకర్‌కి ఓ ముఖ్యమైన ఉత్తరం రాశారు. సుమారుగా 1929 లో డా॥ అంబేద్కరు ఒక బిల్లును తయారుచేసి కేంద్ర విధానసభలో సమర్పించటానికి గాను డా. జయకర్‌కి ఇచ్చినట్లు ఈ ఉత్తరం వల్ల తెలుస్తోంది. "అంటరాని తనం కారణంగా ఎవరికీ ఏ సార్వజనిక స్థలానికైనా రావడానికిగాని వెళ్లడానికి గాని నిషేధం ఉండదు" అన్నదే దాని ఆశయం. తాను ఈ బిల్లుని 1929 డిసెంబరులో కేంద్ర విధానసభలో సమర్పించా నని డా॥ జయకర్ డా॥ అంబేద్కరుకి తెలియజేశారు. అయితే అంబేద్కరు ఈ ఉత్తరంలో ఆయనకి ఇలా రాశారు "కేంద్ర విధానసభలో 1927 మార్చి దగ్గర నుంచి 1930 జూలై వరకూ ఇలాటి బిల్లుని దేనినీ మీరు సమర్పించిన దాఖలా లభించలేదు." ఈ ఉత్తరం ద్వారా డా॥ జయకర్ దృష్టికి ఈ అంశం తీసుకురాబడ్డాది.[1]

1945 అక్టోబరు 4వ తారీఖున పూనాలో ఓ సభతో ఎన్నికల ప్రచారానికి శ్రీకారం చుడుతూ ఆయన అతి ముఖ్యమైన ప్రశ్నలు కొన్నిటిని ప్రస్తావించారు. ఎంచేతో అంటే కాంగ్రెసు దళితుల పట్ల జరిగే అన్యాయాలను నివారించటానికి ప్రయత్నమే చెయ్యలేదు. దళితులు పరిపాలనా అధికారాన్ని తమ చేతుల్లోకి తీసుకుని శాసనకర్తల హోదాకి చేరుకోవాలి. మన హక్కుల్ని

1. నేషనల్ ఆర్కైవ్స్ ఫైలు, క్రమసంఖ్య 832 ; జయకర్ పేపర్స్ నం. 37

మనమే స్వయంగా పదిలపరుచుకోవాలి. రాష్ట్ర విధానమండలుల ద్వారానే రాజ్యాంగ కమిటీ సభ్యులు ఎన్నుకోబడతారు." ఈ అత్యవసరమైన అంశాన్ని దళిత సమాజం దృష్టికి ఆయనే తెచ్చారు. తదితర పార్టీలకు కూడా ఈ అంశం గురించి తెలియదు. డా|| అంబేద్కరు గారి ఈ జ్యోతిషం ఆఖరికి సత్యమే అయింది.

1945 అక్టోబరు 30 వ తారీఖున డా|| అంబేద్కరు పూనాలోని "అంబేద్కర్ స్కూల్ ఆఫ్ పాలిటిక్సు" అనే సంస్థను ప్రారంభించారు. దేశంలోని రాజకీయ పార్టీల్లో జరుగుతున్న జబర్దస్తీతనానికి తిరుగులేని రోగ నిర్ణయం చెయ్యడంలో అంబేద్కరు చాలా నిపుణులు. రాజకీయాల స్వరూపాన్ని బట్టబయలు చేస్తూ ఆయన ఇలా అన్నారు - "మహాత్మాగాంధీ రాజకీయాల్లోకి రాకముందు ఉండేవి. మొదటిది మితవాదులది. దీనికి నాయకులు రానాడే - గోఖలేలు. రెండవ ఆలోచనా విధానం బెంగాలుకు చెందిన విప్లవకారులది. ఈ రెండు ఆలోచనాధోరణులకి చెందినవారిలో అబద్దాలకోరులకి, సిద్ధాంతాలకే నమ్మకద్రోహం చేసేవారికి, బానిస మనస్తత్వం కలవారికి, కపటస్వభావం కలవారికి బొత్తిగా స్థానం లేదు. లోతైన అధ్యయనం, జ్ఞాన సముపార్జనా ఈ రెండు ఆలోచనా ధోరణులు వారి ప్రముఖ లక్ష్యాలు."

"నా మరణాంతరం నా ఆలోచనలని, లేదా సంప్రదాయాన్ని సంస్థగా చేయకండి. కాలానుగుణంగానూ సమయానుసారంగానూ తన ఆలోచనలను మార్చుకోని లేదా మార్చుకోవడానికి సిద్ధం కాని సమాజమైనా సంస్థ అయినా తన జీవిత సంఘర్షణలో నిలదొక్కుకోలేదు."

"నా పక్షం సంపూర్తిగా ఉచితమైనది అని నమ్మకం ఉంటేనే విద్యార్థులు నా నేతృత్వానికి స్వీకరించాలి."

# నలభై అయిదు

గుజరాతులో దళిత ఫెడరేషను తరఫున అహమ్మదాబాదులో ఎన్నికల సభా, సమావేశం ఏర్పాటు చేయబడ్డాయి. నవంబరు 29-30 తేదీల్లో డా|| అంబేద్కరు అహమ్మదాబాదులో మకాం వేశారు. 29 వ తారీఖున

జి.టి. పరమార్ అధ్యక్షతని బ్రహ్మాండమైన సభ ఒకటి జరిగింది. దానిలో ఉపన్యాసం ఇస్తూ అంబేద్కరు ఇలా అన్నారు – “దళితులకు ఏ మాత్రమన్నా మేలు జరిగిందీ అంటే అది అంతా దళితుల ప్రయత్నాల ఫలితమే. అంచేత దళితులు తమ సంస్థను బాగా బలపరుచుకోవాలి. ఎవరూ దానిని ముక్కలు చెయ్యకుండా ఉండేటంతగా అది బలపడాలి. ఇది చాలా ముఖ్యమైన పని.” ఈ సభ సబర్మతి నది ఒడ్డున జరిగింది. ఈ స్థలానికి బుద్ధనగర్ అని పేరు పెట్టారు. 30 వ తారీకున అహమ్మదాబాదు పురపాలక సంఘంవారు అంబేద్కరుకి సన్మానపత్రం సమర్పించారు. ఈ సందర్భంలో ఆయన ఇలా చెప్పారు. “దేశానికి స్వరాజ్యం అక్కర్లేదని ఎవరు అంటారు ? నాకూ సంపూర్ణ స్వరాజ్యం కావాలన్న వాంఛ ఉన్నాది. స్వాతంత్ర్యం మన తలుపు కొడుతోంది. బ్రిటిషు ప్రభుత్వం ఇంక ఎన్నో రోజులు ఈ దేశంలో నిలిచి ఉండలేదు.”

1945 డిసెంబరు మొదటి వారంలో లేబరు అధికారుల ఆ శాఖకి సంబంధించిన మీటింగు బొంబాయి సచివాలయంలో జరిగింది. ఈ మీటింగుని ఆరంభిస్తూ డా॥ అంబేద్కరు ఇలా అన్నారు – “పారిశ్రామిక తగాదాలను నివారించటానికి మూడు విషయాలు అవసరం – (1) సముచితమైన వ్యవస్థ, (2) చట్టాల్లో అవసరమైన సంస్కరణ, (3) శ్రామికుల కనీసవేతన నిర్ధారణ. పారిశ్రామిక నిశ్చలత అధికారం మీద కాకుండా న్యాయవిధాన నిర్దేశాల మీద ఆధారపడి ఉండాలి. శ్రామికులు తమ కర్తవ్యాలను గుర్తించాలి. యజమానులు కూడా శ్రామికులకు సముచితమైన వేతనాలు ఇవ్వాలి. దాంతోపాటు ప్రభుత్వమూ, శ్రామిక వర్గమూ నిష్ఠతో తమ పరస్పర సంబంధాలను సౌహార్దతతో నిండి ఉండేటట్టు ప్రయత్నించాలి.”

ఆ తర్వాత డా॥ అంబేద్కరు మన్‌మాడ్, అకోలాల్లో ఎన్నిక – సభలు చేశారు. డిసెంబరు 13 వ తారీఖున నాగపూరులో సుమారు లక్షన్నర జనం హాజరైన సభలో ఆయన ప్రసంగించారు. ఆయన తన ఉపన్యాసంలో పూరీ జగన్నాథ దేవాలయంలో ఎల్లాగ్గా దూరం నుంచే ఆయనకి దేవుడి దర్శనం చేసుకోవలసి వచ్చినదో – ఆ ఉదంతాన్ని జ్ఞాపకం చేసుకుంటూ చెప్పారు. అదేవిధంగా ఆయన గురుఘంటాలు అనే సాధువు కథ కూడా చెప్పారు. గురుఘంటాలు మూడు వంతులు రొట్టె

తను స్వయంగా తినేసేవాడు. పావు వంతు రొట్టెని తన శిష్యులకు పంచుతూ ఉండేవాడు. ఆయన ఆమీద ఇలా చెప్పారు – "కాంగ్రెసు గురుఘంటాలు భూమికనే నిర్వహిస్తోంది." దళితులకు ఇదీ ఆయన ఇచ్చిన సూచన.

నాగపూరు నుంచి డాక్టరు సాహెబు ఎన్నికల ప్రచారానికి మద్రాసు వెళ్లారు. ఆయన మద్రాసు, మధురై, కోయంబత్తూరుల్లో ఏర్పాటు అయిన సభల్లో ప్రసగించారు. తిరిగి వస్తున్నప్పుడు మద్రాసులో "దక్షిణ భారతంలో జస్టిసు పార్టీ వికాసమూ, ప్రభావమూ" అన్న విషయం మీద పార్కు టవునులో ఉపన్యాసం ఇచ్చారు. ఆయన ఇలా చెప్పారు – "జస్టిసు పార్టీకి నాయకత్వం, క్రమశిక్షణ, కార్యక్రమం – ఈ మూడింటి అవసరం ఉన్నాది."

బ్రిటిషు పార్లమెంటుకి చెందిన పదిమంది సభ్యుల ప్రతినిధిమండలి 1946 జనవరిలో ఢిల్లీ వచ్చింది. సభ్యులు 1946 జనవరి 10 వ తేదీన జిన్నాతోనూ, నెహ్రూతోనూ చర్చలు చేశారు. డా॥ అంబేద్కరుతో కూడా గంటన్నర సేపు సంభాషణలు జరిగాయి.

జనవరి 13వ తారీఖున డా॥ అంబేద్కరు బొంబాయి వచ్చారు. అక్కడనుంచి సోలాపూర్ వెళ్లారు. సోలాపూర్‌లో లోకల్ బోర్డు, పురపాలక సంఘంవారూ ఆయనకు సన్మానపత్రం సమర్పించారు. తన ఉపన్యాసంలో ఈ సంస్థల ద్వారా అస్పృశ్యుల మేలు కోసం చేయబడిన కృషిని ఆయన మెచ్చుకున్నారు. అక్కడవారే ఆయన డా. వి.వి. ముతె గారి సహకారంతో తాను ఇక్కడ అస్పృశ్య వీరుడి పనిని ఎలా ప్రారంభించినదీ ఆయన ఉటంకించారు. సాయంత్రం తన ఎన్నికల ఉపన్యాసంలో ఆయన ఈ ప్రకటన కూడా చేశారు – "అస్పృశ్య అభ్యర్థులు కాని ఎన్నికల్లో గెలవకపోతే నేను తెల్లటోపీ ధరిస్తాను."

డా॥ అంబేద్కరుకి విశాలమైన సభలో దళిత ఫెడరేషను, తరఫున బొంబాయిలో ఓటర్లు సమర్పించారు. ఈ సందర్భంలో ప్రసంగిస్తూ ఆయన ఇలా అన్నారు – "అస్పృశ్య సమాజం ముసల్మాను ల్లాగ భారత భూమిని విభజించాలని అనదు. కేవలం సమాన హక్కులు కావాలని కోరుతోంది. మా డిమాండ్లు సముచితమైనవి, న్యాయబద్ధమైనవీ కావని కాంగ్రెసు ఒకవేళ అనుకుంటూ ఉంటే అది మా కేసుని తటస్థంగా ఉండే

ప్రపంచ న్యాయపీఠానికి తీసుకువెళ్ళాలి. మేము ఆ న్యాయపీఠపు తీర్పుని అంగీకరించడానికి సిద్ధంగా ఉన్నాము."

1945 మార్చి 10వ తారీఖున సంయుక్త ప్రాంతపు దళిత ఫెడరేషన్ సమావేశం ఆగ్రాలో జరిగింది. అక్కడ విశాలమైన జనసముదాయాన్ని ఉద్దేశించి ప్రసంగిస్తూ ఆయన కాంగ్రెసు మీద గట్టిగా విసురులు విసిరారు. ఆయన ఇలా అన్నారు - "అల్ప సంఖ్యాకుల సహకారంతో వారి అంగీకారంతో అధిక సంఖ్యాకులు పరిపాలన చెయ్యడమే స్వరాజ్యం ?" ఈ విధంగా ఆయన తన స్వరాజ్యపు ఊహను సభ ముందు ఉంచారు."

ఎన్నికల్లో దళిత ఫెడరేషను ఓడిపోయింది. అంతటా కాంగ్రెసు గెలుపొందింది. అధిక సంఖ్యాక హిందూ నియోజక వర్గాల్లో అస్పృశ్య అభ్యర్థులు ఎన్నికల్లో ఓడిపోయారు.

ఇహ భారతదేశానికి శీఘ్రమ్ స్వాతంత్ర్యం ఇవ్వాలి అన్న ఈ లక్ష్యంతో ఇంగ్లండులోని రాజకీయవేత్తలు ఎక్కువగా శ్రమించటం మొదలయింది. బ్రిటను ప్రధానమంత్రి క్లైమెంట్ అట్లే ప్రకటించాడు. - "హిందూస్తాన్‌కి స్వాతంత్ర్యం పొందే హక్కు ఉన్నాది.", ఆ తర్వాత శీఘ్రంగానే బ్రిటిషు ప్రభుత్వం సర్‌స్టెఫర్డ్ క్రిప్పుని భారతదేశానికి పంపించింది. ఆయనతో పాటు ఎ.వి. అలగ్జాండరు, భారతదేశపు మంత్రి లార్డు పేథిక్ లారెన్సు - ఈ ముగ్గురితో కూడిన ప్రతినిధి మండలి భారతదేశానికి వచ్చింది.

ఈ మంత్రుల ప్రతినిధిమండలి వైస్రాయి భవనంలో అనేకమంది నాయకులతో చర్చలు జరిపింది. పరస్పరమూ అభిప్రాయాల వ్యక్తీకరణ జరిగింది. ఈ చర్చల్లో 1946 ఏప్రిలు 5వ తారీఖున డా॥ అంబేద్కరుని కలిసింది. డా॥ అంబేద్కరు - అస్పృశ్యులకు తమ ప్రతినిధులను ఎన్నుకోవడానికి ప్రత్యేక నియోజక వర్గం, ప్రత్యేక నివాసాల బస్తీల అవసరం, కేంద్ర, రాష్ట్ర విధానసభల్లో సముచితమైన ప్రాతినిధ్యం, ప్రభుత్వోద్యోగాలలోనూ సర్వీసు స్కీము కార్యాలయాల్లోనూ రిజర్వేషనులు, దళిత విద్యార్థులకు సముచితమైన ఆర్థిక గ్రాంటు - ఈ డిమాండ్లను పెట్టి అవి కావాలని పట్టు పట్టారు. దేశ రాజ్యాంగంలో వీటిని చేర్చాలని కూడా పట్టుపట్టారు.

మే 19వ తారీఖున ముగ్గురు మంత్రుల ప్రతినిధి మండలి తన నివేదికను సమర్పించింది. వారు డా॥ అంబేద్కరు డిమాండ్లను తిరస్కరించారు. ఈ మధ్యలో కార్యనిర్వాహణ మండలిని బర్తరఫు చేశారు. వైస్రాయి గారి ఈ

ప్రకటన తర్వాత డా॥ అంబేద్కరుకి ఢిల్లీ వదిలి బొంబాయి రావలసి వచ్చింది.

ఎన్నికలు వేడినందుకోవడంతో జాతి సంబంధమైన ఉద్రిక్తత పెరిగింది. అస్పృశ్య అభ్యర్థులు గెలవకుండా ఉండటానికిగాను ఓటర్లని నిర్బంధించటం మొదలయింది. అస్పృశ్యుల బస్తీల మీద దండయాత్రలు సాగాయి. నాగపూరులో ముగ్గురు యువ కార్యకర్తలని చంపేశారు. బొంబాయిలో చమార్ సమాజానికి చెందిన అంబేద్కరు అనుమాయుడు వి.జి. దేవరుఖ్‌కర్‌ని కత్తితో పొడిచి చంపేశారు. అల్లకల్లోలం, గందరగోళం మిన్నుముట్టాయి. డా॥ అంబేద్కరు గారి భారత భూషణ్ ప్రెస్సుని కూడా గూండాలు నిప్పు పెట్టి బూడిద చేశారు.

జూన్ మొదటి వారంలో షెడ్యూల్డు కాస్ట్ ఫెడరేషను కార్యనిర్వాహక కమిటీ సమావేశం జరిగింది. ఈ మీటింగు డా॥ అంబేద్కరు గారి నివాసం 'రాజగృహ' లో ఏర్పాటు చేయబడ్డాది. ముగ్గురు మంత్రుల ప్రతినిధి వర్గాన్ని తీర్మానం ద్వారా నిషేధించారు. "అన్యాయాన్ని ఆపకపోతే సూటిగా ప్రతీకారం అనగా ప్రత్యక్ష చర్యకి మార్గాన్ని స్వీకరించడం జరుగుతుంది." అని దాంతోపాటు హెచ్చరిక కూడా చేయబడింది. ప్రింటింగు ప్రెస్సుని తగలబెట్టడాన్ని కూడా తీవ్ర పదజాలంతో నిందించారు.

## నలభై ఆరు

ఢిల్లీలో వైస్రాయి ఇన్‌ఛార్జి ప్రభుత్వాన్ని ఏర్పరచడానికి సిద్ధం చేస్తున్నారు. 1946 జూన్ మూడవ వారంలో మంత్రిమండలి వైస్రాయి వీడ్కోలు ఉత్సవాన్ని ఏర్పాటు చేసింది. ఈ కార్యనిర్వాహక సభ్యుడు, డా॥ అంబేద్కరు కార్య సామర్థ్యాన్ని, పనులను చూసి హిందూస్తాన్ కమాండర్ - ఇన్ - ఛీఫ్ కృతజ్ఞతలు తెలిపారు. డా॥ అంబేద్కరు పదవీ కాలంలోనే భారతదేశంలో అనేక విమానాశ్రయాలు నిర్మించబడ్డాయి. అరేబియా సముద్రాన్ని బంగాళాఖాతంతో కలపాలన్నది ఆయన హార్దిక అభిలాష. కాని ఈ గాఢవాంఛ నెరవేరలేదు. రాజు భగీరథుడి లాగ తన

మనస్సులో కలలు ప్రోది చేసుకునే ఈ శిల్పికి తన పనిని సగంలోనే వదిలిపెట్టి తిరిగి రావలసి వచ్చింది.

ఆయన కేంద్ర విధానసభలో గొప్ప వక్తగా పేరు పొందారు. లేబరు మంత్రిగా పరిపాలనా సూత్రాలని చేతిలోకి తీసుకోగానే ఆయన కేంద్ర విధానసభలో తాను ఇచ్చిన మొదటి ఉపన్యాసంతోనే వక్తగానూ వాదనా పటిమ ఉన్న వ్యక్తిగానూ జనం మనస్సులో ముద్రించుకు పోయారు. 1942 సెప్టెంబరు 14 వ తారీఖున ఆయన బొంబాయి శ్రామిక ఆందోళనలో తన సహచరుడూ, కార్యకర్త అయిన శ్రీ సీతారామ్ చింతామణి జోగికి ఓ ఉత్తరం రాశారు. ఆ ఉత్తరంలో విధానసభలో రాజ్యాంగ విషయం మీద తాను లేవనెత్తిన సమస్యల వల్ల ఎల్లాగ్గా కల్లోలం రేకెత్తిందో ఆయున వర్ణించారు. ఆపైన ఇలా రాశారు – "సత్యం కటువుగానే ఉంటుంది. కాని ఇల్లాగ్గా తుఫాను రేకెత్తించటం నాకు సరదా."[1]

ఆయన కరడు కట్టిన జాతీయవాది కూడా. దక్షిణ ఆఫ్రికాలో నివసిస్తున్న భారతీయులు వర్ణభేదం కారణంగా చాలా కష్టాలు పడుతున్నారు. అంచేత అక్కడ ప్రభుత్వానికి ఆర్థిక అవరోధం కలిగించాలి అని ఒక భారతీయ సభ్యుడు తీర్మానాన్ని ప్రవేశపెట్టాడు. యూరోపియను సభ్యులందరూ దానిని వ్యతిరేకించారు. కాని డా|| అంబేద్కరు కోపంతో మండిపోతూ టేబిలు మీద చేత్తో గుద్ది మరీ చెప్పారు – "ఇది భారతీయుల స్వాభిమానానికి సంబంధించిన సమస్య." అంబేద్కరు మధ్యవర్తిత్వం వల్లే కౌన్సిలులో ఈ బిల్లు ఆమోదించబడ్డాది.[2]

1942 నుంచి 46 వరకూ డా|| అంబేద్కరు లేబరు మంత్రిగా ఉన్నారు. ఈ కాలంలో ఆయన శ్రామికుల కోసం చేయించిన చట్టాలూ, సంస్కరణలు అత్యంత మేలికరమైనవి. శ్రామికుల సమస్యలను పరిష్కరించడానికి ప్రభుత్వం, యాజమాన్యం, శ్రామికులు – ముగ్గురి ప్రతినిధుల త్రిపక్షమండలి ఆయన పదవీకాలంలోనే ఏర్పడ్డాది. లేబరు విభాగం యొక్క స్థాయీ సంఘంలో ఈయనే ముగ్గురు ప్రభుత్వేతర సభ్యుల నియామకం చేయించారు. శ్రామికులకు లభించే కరువుబత్తెం సరిపడినంత ఉండేదికాదు. ఈ బత్తాన్ని అనేక పర్యాయాలు ఆయన పెంచేటట్టు చేశారు. టీ తోటల్లో

1. ఖైరె. హ.వి. : పే. 516
2. దుర్గాదాసు : పే. 236

పనిచేసే శ్రామికుల పరిస్థితి మెరుగుపడాలని ఇండియన్ టీ కంట్రోలు సంస్కరణ బిల్లుని ఆమోదింప చేశారు. మిల్లుల్లో పనిచేసే కార్మికులకు యుద్ధకాలంలో నష్టం వాటిల్లితే కార్మికులకు నష్టపరిహారాన్ని యాజమాన్యం చెల్లిస్తూ ఉండే సదుపాయాన్ని ఇప్పించారు. గనుల్లో పనిచేసే గర్భవంతులైన మహిళా శ్రామికులకు ప్రసవకాలపు సెలవులుని, జీతం ఏర్పాటును కలిగించే బిల్లును కూడా ఆయన ఆమోదింపచేశారు.[1] ఆయన 1943 మే 7, 8 తేదీల్లో బొంబాయిలో జరిగిన స్టాండింగ్ కమిటీ సమావేశంలో నిపుణులైన పనివారు, నైపుణ్యత లేని పనివారు రెండు రకాల వారిని చేర్చుకోవడానికి వృత్తి ఆఫీసులు తెరవడానికి నిశ్చయించడం జరిగింది అని చెప్పారు. అలాంటి ఆఫీసులను ఆయన ఏర్పడేటట్టు చేశారు కూడా. దాంతోపాటు శ్రామికుల ఫిర్యాదులను నివారించటానికి లేబరు ఆఫీసర్ల నియామకాలని కూడా ఆయన ప్రారంభించేటట్టు చేశారు. నైపుణ్యత లేని పనివారికి టెక్నికల్ విద్యని నేర్పించే ఏర్పాటుని, పనివారికి తగినపనిని ఇప్పించే బాధ్యతని మొదటిసారిగా భారత ప్రభుత్వం తనదిగా స్వీకరించింది. ఇదేవిధంగా శ్రామికులకు యజమానులకు మధ్య వచ్చే కలహాలకు సంబంధించిన ప్రతీ తగాదాను అవార్డు ద్వారా యజమానులు పరిష్కరించడాన్ని తప్పనిసరి చేశారు.

1943 సెప్టెంబరు 9వ తారీఖున ప్లీనరీ లేబరు పరిషత్తులో పారిశ్రామీకరణ మీద ఉపన్యాసం ఇస్తూ ఆయన ఇలా అన్నారు - "పెట్టుబడిదారీ పార్లమెంటు ప్రజాస్వామ్య వ్యవస్థలో రెండు విషయాలు తప్పకుండా ఉంటాయి. పనిచేసేవాళ్లు బీదరికంలో ఉండవలసివస్తుంది. పనిచేయని వారిదగ్గర లెక్కపెట్టలేనంత పెట్టుబడి పోగవుతుంది. ఒక వేపు రాజకీయ సమానత్వం రెండోవేపు ఆర్థిక వ్యత్యాసాలు. శ్రామికులకి ఇల్లూ, బట్టా, ఆధారం, ఆరోగ్యమైన జీవితం లభించేటంతవరకూ, విశేషించి గౌరవంగా తలెత్తుకుని నిర్భయంగా వారు జీవితాన్ని గడిపేటంతవరకూ స్వాతంత్ర్యానికి ఏమీ అర్థం లేదు. ప్రతి కార్మికుడికీ భద్రతా, జాతీయ సంపదలో భాగస్వామిగా ఉండడానికి హామీ దొరకడం అవసరం." శ్రమ విలువ పెరగాలన్న విషయం మీద ఆయన దృష్టి ఉన్నది.

1. అసెంబ్లీ డిబేటు : తే. 29-7-1943

బాబాసాహెబు - ఆయనే ఒక శ్రామిక నాయకులు - చాలా సంవత్సరాలు కూలీల బస్తీల్లో ఉన్నారు. అంచేత కూలివాళ్ల సమస్యను గురించి పూర్తిగా ఆయనకి ఎరుక ఉన్నాది. దాంతో పాటు ఆయన స్వయంగా పేరు పొందిన ఆర్థిక శాస్త్రవేత్త అయిన కారణంగా ఆ సమస్యలను పరిష్కరించే విధానాలు కూడా ఆయనకు తెలుసు. అంచేత ఆయన ప్రభుత్వంలో ఉన్నకాలంలో మిల్లు కార్మికులు, గని కార్మికులు, టీ తోటల్లో పనిచేసేవారు - వీరందరి కోసం ఎన్ని సంస్కరణలు చెయ్యబడ్డాయో అన్ని సంస్కరణలు అంతకు ముందు ఇంకెవరి కాలంలోనూ చెయ్యబడలేదు. ఆయన స్వయంగా వెళ్లి పరిశ్రమలను, కార్ఖానాలను నిరీక్షించేవారు. కార్మికుల ఇబ్బందులను అర్థం చేసుకుని అవసరమైన చట్టాలు పాసు చేయించేవారు.

1943 డిసెంబరు 9 వ తారీఖున బాబాసాహెబు ధన్‌బాదు వెళ్లారు. అక్కడ ఆయన భులన్ బరారీ గనిని నిరీక్షించారు. తన తలమీద భద్రతా టోపీని పెట్టుకుని తన అధికారులతో పాటు 400 అడుగులు లోతు గనిలోకి వెళ్లారు. బొగ్గును ఎలా బద్దలు కొడతారో ఆయన చూశారు. అక్కడ పనిచేస్తున్న కూలీలను ప్రశ్నలు అడిగారు. గనిలోంచి బయటకు వచ్చిన తర్వాత ఆయన బొగ్గు రాశుల్లో, పెద్దపెద్ద వాటిలో పనిచేస్తున్న కూలీలతో మాట్లాడారు. ఆ తర్వాత కూలీల బస్తీకి వెళ్లారు. ఒక కూలీ ఇంటి లోపలికి వెళ్లి అతని జీవనస్థాయిని గమనించారు. ఆ తర్వాత గని యాజమాన్యం ద్వారా నడపబడుతున్న ఆస్పత్రిని తణికీ చెయ్యడానికి వెళ్లారు. అక్కడ రోగుల్ని కొంతమందిని మంచి చెడ్డా అడిగారు. ఆయన మహిళల వార్డుని కూడా తణికీ చేశారు.

ఆ తర్వాత ఆయనకి దిగ్‌బాడీ గనిలో అత్యాధునిక మెషీన్లను కూడా చూపించారు. ఇక్కడ ఆయన సుమారు ఒక గంట సేపు కార్మికులతో పాటు గడిపారు. గని యజమానులు కట్టించిన ఇళ్లను కూడా తణికీ చేశారు. కార్మికులను పనిలోకి తీసుకునే విధానం గురించి అడిగి తెలుసుకున్నారు. 'తిసరా' అనే గని లోపలికి వెళ్లి అక్కడ కార్మికులని ఎంతో ఆసక్తితో దర్యాప్తు చేశారు. గని లోపల నుంచి బయటికి వచ్చేసరికి చాలా రాత్రి అయిపోయింది. డాక్టరు సాహెబు పనినుంచి తిరిగి వెళ్తున్న కార్మికుల ఇంటికి వెళ్లి వారి భోజనం మొదలైన వాటి గురించి ఎంతో ఆసక్తితో అడిగి తెలుసుకున్నారు.

మరుచటి రోజు రాణీగంజ్ బొగ్గుగని కార్మికుల స్థితిగతులను, ఉత్పత్తి విధానాలను అధ్యయనం చేశారు. శివపూర్ గని కార్మికుల కోసం ఇటీవలే కట్టిన ఆస్పత్రిని అక్కడ ఏర్పాటు చేసిన ఎక్సరే మెషీనుని కూడా ఆయన పరీక్షించారు. మధ్యాహ్నం తర్వాత డాక్టరు సాహబు కుష్టు రోగ నిర్మూలన సెంటరుని నిరీక్షించారు. కార్మిక స్త్రీల శిశువుల కోసం నడిపే శిశుగృహం - క్రెష్‌ని చూశారు. సన్నగా బలహీనంగా ఉన్న పిల్లల ఆరోగ్యం వైపు విశేషించి దృష్టి పెట్టాలని ఆయన సూచన కూడా ఇచ్చారు.

సీతాపుర్ గని నుంచి తిరిగి వచ్చేసరికి స్కూలు విద్యార్థులు పువ్వుల దండ వేసి ఆయనకి స్వాగతం చెప్పారు. ఓ ఏడేళ్ల విద్యార్థిని అడిగి వాళ్ల ఇంటి స్థితిగతుల గురించి దర్యాప్తు చేశారు. డాక్టరు సాహబు సోదపూర్‌లో ఒక గంటలో 200 టన్నుల ఇసకని గనిని నింపడానికి లోపల పడెయ్య గలిగే ఉట్టిని చాలా పెద్దదాన్ని చూశారు. ధన్‌బాదు నుండి తిరిగి వచ్చేటప్పుడు కార్మికుల బస్తీలో 'ఒక గది ఇళ్ల' ని చూడ్డానికి వెళ్లారు. అక్కడ బేగునియా గని కార్మికులు ఉంటున్నారు. కార్మికుల రీతి రివాజుల గురించి తెలుసుకున్నారు. సెప్టెంబరు 11 వ తారీఖున ధన్‌బాదులో కేంద్ర ప్రభుత్వ ప్రతినిధులను బెంగాలు బీహారు రాష్ట్ర ప్రతినిధులను, గని కార్మికులు ఈ ముగ్గురి సంస్థల పరిషత్తులో ప్రసంగించారు.[1]

1944 జనవరిలో గనిలో పనిచేసే కార్మికుల సంక్షేమం కోసం ఒక ఫండుని ఏర్పరచటానికి ఆదేశం జారీ చెయ్యబడ్డాది. దీనికోసం నియమించ బడ్డ సలహా సంఘంలో మొదటిసారి మహిళా ప్రతినిధికి స్థానం కల్పించ టానికి నిశ్చయించారు. డా॥ అంబేద్కరే శ్రామిక భీమా పథకానికి పునాది వేశారు. 1944 ఫిబ్రవరిలో బొగ్గు గని మహిళా కార్మికులకి పురుష కార్మికులతో సమాన వేతనం ఇవ్వాలి అనే ఆదేశాన్ని విడుదల చేయించారు. అంతేకాదు డా॥ అంబేద్కరు శ్రామికుల కోసం అనేక సౌకర్యాలను ప్రకటించారు.

1944 ఏప్రిలు 29 వ తారీఖున కోడర్మా ఊళ్లో అభ్రకం గని పరిషత్తు జరిగింది. దాని అధ్యక్షోపన్యాసంలో [2] డా॥ అంబేద్కరు అభ్రకం పరిశ్రమని బలమైన పునాది మీద నిర్మించాలన్న కోరికను వ్యక్తంచేశారు. కార్మికులకు

1. ఇండియన్ ఇన్‌ఫర్మేషను: 1-1-1944

2. ఇండియన్ ఇన్‌ఫర్మేషను : 15-5-1944

హెచ్చరిస్తూ ఇలా చెప్పారు – సరిపోయినంత వేతనం దొరకకపోతే ఏవిధమైన సంస్కరణా సంభవం కాదు. కార్మికుల జీవనస్థాయి మీద దృష్టి ఉంచడం యజమానుల కర్తవ్యం." ఇక్కడే ఆయన కార్మికుల సంస్కరణ కోసం ఒక ఫండుని పెట్టాలని ప్రకటించారు.

అంతకుముందు ఏప్రిలు 28 వ తారీఖున కోడర్మా అభ్రకం గనులను నిరీక్షించారు. విద్యుత్తుతో నడిచే ఉయ్యాలలో గనిలో 400 అడుగులు దిగువకు వెళ్లారు. అక్కడ అభ్రకం తవ్వి తీయడం, తదితర ప్రక్రియలను ఆయన చూశారు. ఇక్కడ కూడా కార్మికుల గుడిసెలు ఉన్న బస్తీని చూశారు. వారి జీవనస్థాయి గురించి చర్చించారు. అక్కడ ఆయన అభ్రకాన్ని కుప్పలుగా ఒక స్థలం నుంచి మరో స్థలానికి తీసుకువెళ్లడం, అభ్రకానికి ఓ ఆకారం ఇవ్వడం, ముక్కలుగా కొయ్యడం, పలచటి రేకులుగా చెయ్యటం మొదలైన పనుల గురించీ తెలుసుకున్నారు. ఇక్కడనుంచి తిరిగి వెళ్లాక ఆయన ఈ పరిశ్రమలో జరిగే దుర్నీతిని, సామగ్రి దొంగతనాలను తగ్గించడానికి ప్రతిగా పనికి వచ్చే సాధనం కోసంగాను ప్రభుత్వ ఆదేశాన్ని 1944 జూన్ 3వ తారీఖున జారీ చేశారు.

1944 ఆగష్టు 23 వ తారీఖున డాక్టరు సాహబు కలకత్తాలోని సర్వీసు స్కీము ఆఫీసుని తణికీ చేశారు. దాంతోపాటు ఆయన కేంద్ర ముద్రణాలయాన్ని, స్టేషనరీ ఆఫీసును కూడా చూశారు. ఆయన లేబరు కమీషనరుతో శ్రామికుల సమస్యలపై భవిష్యత్ ప్రణాళికల గురించి చర్చించారు. సాయంత్రం ఆయన బెంగాలు ప్రభుత్వం ద్వారా వేయబడిన కార్మిక సంఘపు సలహా కమిటీలో ప్రసగించారు. భారత ప్రభుత్వపు ప్రణాళికలను ఏవిధంగా కార్యరూపంలో పెట్టవలసినదీ చెప్తూ మార్గ నిర్దేశం చేశారు.

అక్టోబరు 20 వ తారీఖున ఆయన ఢిల్లీలో త్రిపక్ష కార్మిక పరిషత్తుకి అధ్యక్షత వహించి సభ్యులకు మార్గనిర్దేశం చేశారు. నవంబరు నెలలో ఫేక్టరీ అర్హత బిల్లుని సమర్పించారు. కార్మికులకు ఏడు రోజులు జీతం నష్టం లేకుండా సెలవు ఇప్పించే ఏర్పాటు మొదటిసారిగా చేశారు.

1945 మార్చిలో గనుల్లో పనిచేసే మహిళా కార్మికుల ప్రసవకాల గైరుహాజరు సెలవు విషయమై ముఖ్యమైన బిల్లుని పాసు చేయించారు. 1946 ఫిబ్రవరిలో ఆయన పది గంటల పనిదినాన్ని ఎనిమిది గంటల

పనిదినంగా తగ్గించి వెయ్యటానికి బిల్లును పాసు చేయింపించి భారతదేశపు కార్మికుల జీవితంలో విప్లవాత్మకమైన సంస్కరణను తెచ్చారు. డా. సాహబు భారతదేశపు పనివాళ్లు, శ్రామికులు, శ్రామిక మహిళలు - అందరికోసం లేబరు విభాగానికి సంబంధించిన అన్ని శాఖలలో ఆమూలాగ్రంగా మార్పు తెచ్చే సంస్కరణల నెన్నిటినో అమలులోకి తెచ్చారు.

దామోదర్ డామ్ ప్రాజెక్టు విషయంలో ఆయన చేసిన కృషి తూర్పు భారతదేశాన్ని పూర్తిగా మార్చివేసింది. ఈ ప్రాజెక్టు గురించిన విషయ జ్ఞానం పాఠకుల ఎరుకను పెంచుతుంది.

దామోదరనది బీహారుకి శాపంగా పరిగణించబడేది. ప్రతి మూడు నాలుగేళ్ల వ్యవధిలో నదికి భయంకరమైన వరద వచ్చేది. లక్షలాది ప్రజలు ఇల్లూ వాకిలీ కొట్టుకుపోయి ఇక్కట్లపాలయ్యేవారు. ఈ భయంకరమైన వరదవల్ల లెక్కలేనంతమంది చనిపోయేవారు. ఆస్తినష్టం వాటిల్లేది. 1859 లగాయితు ఈ నదికి 12 సార్లు భయంకరమైన వరదలు రావడం ప్రజలు ఎరుగుదురు. కాని 1943 జూలై 17 వ తారీఖున వచ్చిన వరద అతి భయంకరమైనది. అది గత వరదల అత్యధిక రికార్డుని బద్దలు కొట్టింది. 70 ఊళ్లు నీటిలో మునిగిపోయాయి. 18 వేల ఇళ్లు కొట్టుకుపోయాయి. లెక్కకు మించిన జనులు ఇల్లూ వాకిలీ పోగొట్టుకున్నారు.

ఈ వరద బెంగాలుతో మొత్తం భారతదేశానికి సంబంధం లేకుండా చేసింది. అక్కడికి భోజన సామగ్రి పంపించటం కష్టసాధ్యం అయింది. ఆ రోజుల్లో జపాను కలకత్తా మీద బాంబులు కురిపిస్తోంది. అంతటా అస్తవ్యస్తంగా ఉన్నాది. ఈ ఆపద కాలంలోనే బెంగాలులో భయంకరమైన కరువు వచ్చి పడ్డాది. ఘోరమైన ఇక్కట్టుని తెచ్చిపెట్టింది.

ఈ కాటకం వల్ల సుమారు 25 లక్షల మంది మృత్యువాత పడ్డారు. లక్షలాది జనం అంగవిహీనులయ్యారు. అలాంటి స్థితిలో దామోదర నదిని అదుపులోకి తేవడం కోసంగాను భారత ప్రభుత్వం ఒక శాశ్వతమైన ప్రణాళికను తయారు చెయ్యడానికి సంకల్పించింది.

తూర్పు భారత స్వరూపాన్ని మార్చివేసే ఈ పనిని డా. బాబా సాహబు అంబేడ్కరుకి అప్పగించారు. డా॥ అంబేద్కరు అప్పటికి బొగ్గు గనులు, ప్రింటింగు స్టేషనరీ, సైనిక అధికారులకు, సైనికేతర అధికారులకు వేరు వేరు సంస్థల్లో తెరవబడిన ట్రైనింగు సెంటర్లలో సాంకేతిక విద్య ఇచ్చే పని,

ప్రచారము, సైనిక నియామకాలు, గృహ నిర్మాణం, సార్వజనిక నిర్మాణ కార్యం, పిలానీ ట్రైనింగు సెంటరు - ఈ శాఖల నన్నిటినీ చూస్తున్నారు. లేబరు డిపార్టుమెంటు మొత్తం కార్యభారాన్ని డా|| అంబేద్కరుకే అప్పగించడం జరిగింది. 1943 అంతంలో ఆయనకి సివిలు పయోనీరు ఫోర్సు పనిని కూడా అప్పగించారు.

ఈ దామోదర ఘాటీ ప్రాజక్టు పేదల సంక్షేమానికి శాశ్వతమైన ప్రణాళిక అవుతుందని డా|| అంబేద్కరుకి తోచింది. అమెరికాలో టెనెసీ నది చాలా ప్రాంతాల్లోంచి ప్రవహిస్తుంది. ఓ కాలంలో దాని వరదకి జనం భయభీతులయ్యారు. అమెరికను ప్రజలు ఈ నదిని ప్రజోపయోగకారిగా ఎల్లాగా చేశారో అదే పద్ధతిని దామోదర నదిని కూడా ప్రజోపయోగ కారకంగా చెయ్యవచ్చును, అని ఆయన నమ్మకం. ఆయన టెనెసీ ఘాటీ ప్రాజక్టుకు సంబంధించిన పుస్తకాలు అనేకం తెప్పించారు. తన విభాగపు ఉద్యోగుల పెత్తందారీ భరోసాలో ఉండడం డా|| అంబేద్కరు స్వభావానికి భిన్నమైన విషయం. ఆయన టెనెసీఘాటీ ప్రాజెక్టుతో పాటుగా భారత దేశంలోని మైసూరు సంస్థానపు తుంగభద్రా, పంజాబులోని చిన్నా - పెద్దా ప్రాజక్టుల గురించి అధ్యయనం చేశారు.

లేబరు డిపార్టుమెంటులో పవర్‌బోర్డు పేరుతో ఒక శాఖని ఏర్పరిచారు. డా. అంబేద్కరే ఈ శాఖకి అధిపతి. నదులు, డాములు, విద్యుత్తు ప్రోజక్టులు - వీటన్నిటి పనులను ఈ శాఖకి అప్పగించారు. సుమారు మూడునెలల వరకు దామోదర నది డామ్ ప్రాజక్టు మీద ప్రభుత్వం గట్టిగా వర్తించింది. చివరకి డా|| అంబేద్కరు గట్టి పాలిసీవల్ల ప్రభుత్వం నిర్ణయం తీసుకోవడం జరిగింది. డా|| అంబేద్కరే దామోదర్ ఘాటీ ప్రాజక్టును అమలు చేశారు.[1]

ఈ రోజుల్లోనే ఒరిస్సా ప్రముఖ నాయకులు (ఆ తర్వాత ఒరిస్సాకి ముఖ్యమంత్రి అయ్యారు) హరేకృష్ణ మెహతాబ్ జైలునుంచి ఓ ఉత్తరం రాస్తూ అంబేద్కరుని మహానది గురించి కూడా దృష్టి ఉంచమని అభ్యర్థించారు. అంచేత 1945 నవంబరులో ఒక సమావేశాన్ని కటక్‌లో కూడా డా. అంబేద్కరు ఏర్పాటు చేశారు. ఈ సమావేశంలో తత్సంబంధిత రాష్ట్ర అధికారులకు జలమార్గాన్ని అదుపులో పెట్టడం యొక్క ప్రాధాన్యతని వివరించి వారి శంకలను నివారించారు.

1 పోర్ట్: పే 72

దామోదర్ ఘాటీ ప్రాజక్టును అమలుపరచటానికి అనుభవజ్ఞుడూ నిపుణుడూ అయిన మెకానికల్ ఇంజనీరు కావాలి. ఈజిప్టులోని అస్వాన్ డామ్ నిర్మించిన బ్రిటిషు ఇంజనీరుకి ఈ పని అప్పగించాలని వైస్రాయి వేవెలు అభిప్రాయపడ్డారు. ఇంగ్లండులో భారత దేశంలో లాగ పెద్ద నదులు లేవు. అక్కడ ఇంజనీర్లకి నదులమీద డాముకట్టే అనుభవం లేదు. వారికన్నా ఎక్కువ అనుభవజ్ఞులు అలాంటి పనుల్లో నైపుణ్యం ఉన్నవారు - అమెరికన్ నిపుణులే ఈ పనికి తగినవారు అని బాబాసాహెబు స్పష్టంగా చెప్పారు.[1] బ్రిటిషు ప్రభుత్వానికి ఈ వాదాన్ని అంగీకరించక తప్పలేదు. అల్లాగ్గా అంబేద్కరు చేశారు. అమెరికాలోని టెనెసీ వేలీ అధారిటీలో పనిచేస్తున్న దుర్‌దుఇన్ అనే ఇంజనీరుకి ఆయన ఈ ప్రాజక్టును అమలు పరచే భారాన్ని అప్పగించారు. భారత ప్రభుత్వపు 1935 చట్టం ప్రకారం జల మార్గం రాష్ట్ర ప్రభుత్వ ఆధీనంలోకి వస్తుంది. డా.అంబేద్కరుకి ఈ విషయం నచ్చలేదు. భారత రాజ్యాంగం తయారుచేసినప్పుడు ఆయన కేంద్ర ఎజెండాలో ఈ విషయాన్ని చేర్చారు.

అమెరికను ఇంజనీర్లు పని పూర్తి చేసిన తర్వాత ఈ పనిని సెంట్రలు పవరు బోర్డు అథవా సెంట్రలు వాటరు ఇరిగేషను అండ్ నేవిగేషను కమీషను నిర్వహించాలి. ఈ కమీషను పనిని నిర్వహించటానికి మంచి యోగ్యుడైన భారత అధికారిని నియమించడం అవసరం. ఈ పనికి భారతీయ అధికారినే నియమించాలని డా॥ అంబేద్కరు పట్టుదల. ఆ రోజుల్లో పంజాబు చీఫ్ ఇంజనీరుగా రాయబహాదుర్ ఎ.ఎన్. ఖోస్లా పనిచేస్తున్నారు. అంబేద్కరు గురించి ఆయనకు ముందే ఏదో భావం గట్టిగా ఏర్పడి ఉన్నాది.

ఆయన డా॥ అంబేద్కరు కింద పనిచెయ్యడానికి మొదట నిరాకరించారు. తర్వాత అంబేద్కరు ఆయనని కలుసుకోవలసినదిగా పిలిపించి ఆయనతో ఇలాచెప్పారు - "ఏ అమెరికను ఇంజనీరునో బ్రిటిషు ఇంజనీరునో ఈ పనికి నియమించడం నాకేం కష్టం కాదు. అయితే నాకు భారత ఇంజనీరు కావాలి." ఖోస్లా మనస్సులో ఉన్న శంకపోయింది. ఆయనకి జ్ఞానోదయం అయింది. ఆయన వెంటనే ఈ పనిని అంగీకరించారు.[2]

1. దుర్గాదాసు : పే. 236

2. భగవాన్‌దాస్ : వాల్యూము 3 (ప్రస్తావన)

దామోదర్ ఘాటీ ప్రాజక్టు డా॥ అంబేద్కరు మెదడులోంచి పుట్టింది. ఆయనే దానికి జనకుడు. ఆయనే ఈ ప్రాజక్టు కలని వాస్తవం చేయించారు. కాని ఈ ప్రాజక్టు పూర్తి అవడానికి ముందే దేశవిభజన ఆపదతో మొత్తం దేశం అట్టుడికిపోయింది. స్వాతంత్ర్యం వచ్చాక శ్రీ ఎన్.వి. గాడ్గిలు ఈ ప్రాజక్టును పూర్తి చేయించారు. 1922 లో జార్జి డబ్లు బారిస్ ఇలాంటి రాష్ట్ర ప్రాజక్టులకి పునాది వేశాడు. అక్కడి ప్రజలు ఆయన స్మృతి చిహ్నంగా ఒక డాముకి ఆయన పేరు పెట్టారు. కాని భారతదేశంలో డా॥ అంబేద్కరు ఈ గౌరవానికి నోచుకోలేదు. దామోదర్ ఘాటీ ప్రాజక్టు కోసం పట్టువదలకుండా డా॥ అంబేద్కరు శ్రమించారు. కష్టాలని ఎదుర్కొన్నారు చికాకుల్ని తలకెత్తుకున్నారు. ప్రాణం పెట్టారు. బీహారు, బెంగాలు, ఒరిస్సాలకు పచ్చదనాన్ని ఆనందాన్ని ఇచ్చారు. నవజీవనాన్ని ప్రసాదించారు. అలాంటి అంబేద్కరుని మనం తలచుకోనైనా తలచుకోం.

రాజకీయాల గందరగోళంతో నిండిన జీవితం అయినా డా॥ సాహెబు లేఖనం నిరంతరం సాగుతూనే ఉంది. దాంతోపాటు ఒక కాలేజీని మొదలుపెట్టాలన్న యోచన కూడా ఒక ఏడాది నుంచి ఆయన మనస్సుని గొలుకుతూనే ఉన్నాది. అయితే డబ్బు ఏర్పాటు అవడంలో ఆలస్యం అయింది. ఆయన "పీపుల్స్ ఎడ్యుకేషన్ సొసైటీని స్థాపించారు. ఈ సంస్థ పర్యవేక్షణలో 1946 జూన్ 20 వ తారీఖున ఆయన సిద్దార్థ కాలేజీని స్థాపించారు. దానిలో కర్తవ్య పరాయణులూ, సహనశీలురూ అయిన అధ్యాపకులను నియమించారు. కాలేజీకి సిద్ధార్థుడి పేరు ఎంచుకుని మరొకసారి బౌద్ధ మతం పట్ల తనకుగల నిష్ఠా భావాన్ని ప్రదర్శించారు. బొంబాయిలో కాలేజీని స్థాపించి డా॥ అంబేద్కరు ఢిల్లీకి బయల్దేరారు.

# నలభై ఏడు

జూన్ 25 వ తారీఖున డా॥ సాహెబు ఢిల్లీ నుండి తిరిగివచ్చినప్పుడు బొంబాయి సెంట్రలు స్టేషనులో ఆయనకు అఖండమైన స్వాగతం పలికారు. అప్పుడు ఆయన తన అనుయాయులకు ఈ విధంగా సూచించారు

- "మీరందరూ మీ హక్కుల కోసం, న్యాయం కోసం అరచేతిలో ప్రాణాలు పెట్టుకుని పోరాడ్డానికి సంసిద్ధులవండి."

జూన్ 29 వ తారీఖున తాత్కాలిక ప్రభుత్వం ఏర్పడింది. ఈ ఇన్ - ఛార్జి పరిపాలన మొదలయ్యాక జూలై 25 వ తేదీన బొంబాయి విధానసభ వర్షాకాల సమావేశాలు ప్రారంభమయ్యాయి. అంబేద్కరు అనుయాయులు తమ డిమాండ్లను ప్రజల దృష్టికి ప్రభుత్వపు దృష్టికీ తేవడానికి గాను యావత్ భారతదేశంలో సత్యాగ్రహం ఆరంభించారు. జూలై 15 వ తారీఖున పూనాలో సత్యాగ్రహం మొదలయింది. లక్నో, నాగపూరు, కాన్పూరు మొదలైన పట్టణాల్లో, ఎక్కడైతే రాష్ట్ర విధానసభల్లో సమావేశాలు జరుగుతున్నాయో, అక్కడ కూడా సత్యాగ్రహం చేయబడ్డాది. ఈ ఆందోళన 'ముగ్గురు మంత్రుల పరిషత్తు ప్రణాళికకు వ్యతిరేకంగా చేయబడుతోందని డా॥ అంబేద్కరు పాత్రికేయులకు చెప్పారు. ఈ సత్యాగ్రహంలో దళిత ఫెడరేషను కార్యకర్తలు అధికాధికంగా వేలకొద్దీ అనుయాయులతో సహా జైళ్లకు వెళ్లారు. "అవసరం అనిపిస్తే నేను కూడా జైలుకు వెళ్తాను," అని డా॥ అంబేద్కరు ప్రకటించారు. సత్యాగ్రహులు జైలుకు వెళ్తూ, 'పూనా ఒప్పందం - రద్దు చెయ్యాలి,' 'మా లక్ష్యం పాలనా అధికారం,' 'మేము శాసనకర్తలం అవుతాం,' "అంబేద్కరు - జిందాబాద్" మొదలైన నినాదాలు మిన్ను ముట్టేటట్టు చేశారు.

జూలై 21 వ తేదీన పత్రికా ప్రతినిధులకు ఇంటర్వ్యూ ఇస్తూ అంబేద్కరు ఇలా అన్నారు - "బ్రిటిషువారు ఇండియా వదలబోతున్నారు. ఆరుకోట్ల దళితులకు రాజ్యాంగంలో ఏ స్థానం లభిస్తుందో స్పష్టం చెయ్యవలసినదిగా మేం కాంగ్రెసును అడుగుతున్నాం. దళితులకు న్యాయంగా రావలసిన హక్కులు యిప్పించడానికిగాను మేం యావత్ దేశంలో సత్యాగ్రహం చేస్తాం. మా ఈ ఆందోళన సాగుతూనే ఉంటుంది. మా స్వయంసేవకులు ఏ అహింసా మార్గాన్ని అవలంబిస్తున్నారో అది గాంధీజీకి కూడా ఆదర్శప్రాయం అవుతుంది." "పూనా ఒప్పందాన్ని రద్దు చెయ్యండి" అని ఆయన డిమాండు చేశారు.

ఈ సత్యాగ్రహం 15 రోజులు నడిచింది. దీని ప్రభావం వల్ల బొంబాయి విధానసభ సమావేశాలను కూడా వాయిదా వేయవలసి వచ్చింది. బొంబాయి రాష్ట్రపు కాంగ్రెసు నాయకులు స.కా. పాటీలు సిద్ధార్థ కాలేజీలో

జూలై 27 వ తారీఖున అంబేద్కరుని కలిశారు. ఆయనతో చర్చించారు. ఆ తర్వాత ఇద్దరూ సర్దారు వల్లభాయి పటేలుని కూడా కలిశారు. అయితే చర్చలు విఫలమయ్యాయి.

ఆగష్టు 24 వ తారీఖున వైస్రాయి తాత్కాలిక ప్రభుత్వంలోని మంత్రిమండలి సభ్యుల పేర్లు ప్రకటించారు. ముస్లింలీగు సహాయ నిరాకరణం చేసింది. ఈ మంత్రిమండలిలో జగజీవనరామ్‌ని చేర్చుకోవడం జరిగింది.

సుమారుగా ఇదే సమయంలో దళిత ఫెడరేషను కార్యనిర్వాహక సంఘం సమావేశం పూనాలో జరుగుతోంది. ఈ సంఘం టెలిగ్రాం ద్వారా జగజీవనరాంని మంత్రి పదవి స్వీకరించవద్దని అభ్యర్థించింది. దళిత సమాజానికి చెందిన వ్యక్తులందరూ తమ గౌరవనీయమైన పదవులను త్యజించాలి అన్న తీర్మానాన్ని కూడా దానితోపాటు పాసు చేశారు. దీని ప్రకారం అనేకమంది కార్యకర్తలు 'రాయ్ సాహబు' 'రాయ్ బహాదుర్' బిరుదులను త్యజించారు.

అక్టోబరు 2వ తారీఖున ముస్లింలీగు మంత్రిమండలిలో చేరింది. బ్రిటిషు ప్రభుత్వం ద్వారా తమ డిమాండ్లకు కాస్త రాజీ అనొచ్చునన్న ఉద్దేశంతో డా॥ అంబేద్కరు అక్టోబరు 15 వ తారీఖున లండనుకు బయల్దేరారు. అక్కడకి చేరగానే పత్రికా ప్రతినిధులకు ఈవిధంగా నివేదించారు.

"శ్రామిక పార్టీ మంత్రిమండలి అస్పృశ్యులకు విశ్వాస ఘాతకం చేసింది." ఆయన ఒక స్టేట్‌మెంటును తయారుచేసి దానిని అన్ని పార్టీలకు చెందిన ప్రముఖ నాయకులకు పంపించారు. ఆయన మాజీ భారత మంత్రి లార్డు టెంపల్ వుడ్, సైమ్యూల్‌హూలర్ ని కలిసి తమ పక్షపు దృక్పథాన్ని తెలియచేశారు. ఆ తర్వాత ఆయన బ్రిటను ప్రధానమంత్రి అట్లీని, భారతమంత్రినీ కలిశారు. పార్లమెంటులోని లిబరల్ పార్టీ సభ్యులను కొంతమందిని, లేబరు పార్టీ సభ్యులనూ ఆహ్వానించి వారికి దళితుల సమస్యలను వివరించటానికి ప్రయత్నించారు. అస్పృశ్యుల సమస్యని తన జీవన్మరణ సమస్యగా భావించి ఇరవై నాలుగు గంటలూ సంఘర్షిస్తూ ఉండేవారు. తన ప్రయత్నాలన్నిటి తర్వాత ఆయన భారతదేశానికి తిరిగి వచ్చారు.

బొంబాయి 'గ్లోబు' వార్తా పత్రికకి ఇచ్చిన ఇంటర్వ్యూలో ఆయన ఇలా అన్నారు - "సహపంక్తి భోజనం, సహజీవనం అనగా కులాంతర, జాత్యంతర వివాహాల ద్వారా అస్పృశ్య సమాజం హిందూ సమాజంలో విలీనం కాగలదు. సాంఘికంగా స్థాయి పెరిగిన తర్వాత ఈ ఏకం అయ్యే ప్రక్రియ తీవ్రతరం అవుతుంది."

అదే రోజుల్లో డా॥ అంబేద్కరు గ్రంథం "హూ వర్ ద శూద్రాజ్" ప్రచురించబడ్డాది. శూద్రులు మొదట సూర్యవంశ క్షత్రియులు. మొదట్లో కేవలం మూడే వర్గాలు ఉండేవి. శూద్ర సమాజం క్షత్రియులతో ఏకమై ఉండేది. కాని బ్రాహ్మణులకు క్షత్రియులకు మధ్య నిరంతరం సంఘర్షణ జరుగుతూ ఉండేది. ఈ పరస్పర యుద్ధం కారణంగా బ్రాహ్మణులు రాజుల ఉపనయనం చెయ్యడాన్ని నిరాకరించారు. ఆ కారణం చేత క్షత్రియుల ఆ సముదాయం వేరు అయిపోయింది. దానిని వైశ్యుల కన్నా నికృష్టమైన దానిగా పరిగణించడం జరిగింది. ఈవిధంగా నాలుగవ వర్ణం అస్తిత్వంలోకి వచ్చింది - అని ఈ పుస్తకంలో చెప్పబడ్డాది. అంబేద్కరు ఈ సిద్ధాంతాన్ని ప్రతిపాదించారు.

ఈ గ్రంథం ప్రస్తావనలో డా॥ అంబేద్కరు ఇలా రాశారు - "చారిత్రక సత్యాన్ని పరిశోధించటానికి కావలిసిన డా॥జాన్సను లాంటి దృఢనిశ్చయంతో నేను పవిత్ర మత గ్రంథాలను తర్జుమా చెయ్యాలనుకుంటున్నాను. దానివల్ల వారి సమాజం దేశపు అధోగతికి వినాశనానికి కారణం అయింది అన్న సంగతి హిందువుల అవగాహనకి రాగలుగుతుంది. రెండో విషయం - భవభూతి చెప్పినట్లుగా కాలం అనంతమైనది. పృథ్వి విశాలమైనది. ఎప్పుడో ఒకప్పుడు ఎవరో ఒకరు పుడతారు. నేను ఏదైతే చెప్పానో దాని గురించి ఆలోచిస్తారు." ఈ గ్రంథాన్ని డా॥ అంబేద్కరు ఆధునిక భారతదేశపు సర్వశ్రేష్ఠ శూద్ర పురుషులు జ్యోతిబాపులేకి సమర్పించారు.

తాత్కాలిక మంత్రి మండలిలో ముస్లిం లీగు తరపున బెంగాలు షెడ్యూల్డుకాస్ట్ ఫెడరేషను నాయకులు జోగేంద్రనాథ్ మండల్‌ని న్యాయమంత్రిగా తీసుకున్నారు.

1946 డిసెంబరు 9వ తారీఖున రాజ్యాంగ కమిటీ సమావేశాలు ఆరంభం అయ్యాయి. ముస్లింలీగు నాయకులు రాజ్యాంగ కమిటీని

బహిష్కరించారు. 1946 డిసెంబరు 13 వ తారీఖున రాజ్యాంగ కమిటీ ఉద్దేశాలను, లక్ష్యాలను వివరించే తీర్మానం పెట్టబడ్డాది. ఈ తీర్మానంలో డా॥ జయకర్ అనుబంధ సూచనని జోడించారు. ముస్లింలీగూ, సంస్థానాల ప్రతినిధులూ చేరనంతవరకూ ఈ తీర్మానాన్ని పాసు చేయకూడదు అని ఈ అనుబంధ సూచనలో చెప్పబడ్డాది. ఆ రోజుల్లో డా॥ జయకర్ భారతదేశపు గొప్ప న్యాయనిపుణులుగా పరిగణించబడేవారు. కాని వల్లభభాయీ పటేలు, మసానీ మొదలైన కాంగ్రెసు వారు చాలా తీవ్రంగా విమర్శించి డా॥ జయకర్‌ని మాట్లాడనివ్వకుండా చేశారు. ఆ సమయంలో రాజ్యాంగ సభ అధ్యక్షులు రాజేంద్రప్రసాద్ అంబేద్కరుని ప్రసంగించమని కోరారు. అకస్మాత్తుగా ఈ విధంగా అభ్యర్థించడంతో కాంగ్రెసు సభ్యుల్లో గుసగుసలు మొదలయ్యాయి. డా॥ అంబేద్కరు వెంటనే లేచి నిల్చున్నారు. సభని కలయచూసి తన శాంత గంభీరమైన కంఠంతో మాట్లాడ్డం మొదలుపెట్టారు. సుమారు అరగంటసేపు ధారాప్రవాహంగా మాట్లాడారు. రాజ్యాంగ చరిత్రలో ఆయన వర్ణించనలవికాని వక్తృత్వానికి ఇది ఒక మరపురాని దినంగా పరిగణించబడింది.

ఆయన తన ఉపన్యాసంలో ఇలా చెప్పారు - "ప్రస్తుతం మనం రాజకీయ దృష్ట్యా, సాంఘిక దృష్ట్యా, ఆర్థిక దృష్ట్యా చితికిపోయి ఉన్నప్పటికీ అనుకూలమైన పరిస్థితులూ సమయం ఆసన్నం అయినప్పుడు మన ఐకమత్యాన్ని ఎవరూ నిరోధించలేరు. ఈనాడు ముస్లింలీగు హిందుస్థానుని ముక్కలు చెయ్యడానికి ఆందోళన కొనసాగిస్తున్న మాట నిజమే అయినప్పటికీ ఒకానొక రోజున అదికూడా అఖండ భారతదేశమే. మనందరికీ శ్రేయోదాయకం అన్న విషయాన్ని గ్రహిస్తుంది." బర్కు వాక్యాన్ని తిరిగి చెప్తూ ఆయన ఇలా అన్నారు - 'ప్రభుత్వాధికారాన్ని అప్పగించడం తేలిక. కాని వివేకాన్ని ప్రసాదించడం కష్టమైన సంగతి. అంతమందిని కూడగట్టుకుని ముందడుగు వెయ్యడానికి, మున్ముందు మన ఐకమత్యం బలీయమవడానికి ఏ మార్గాన్ని అవలంబించాలో దానికి కావలసిన శక్తి సామర్థ్యాలు, వివేకం మనకి ఉన్నాయి. దీనిని మనం మన ప్రవర్తనతో ఋజువు చెయ్యడానికి ప్రయత్నిద్దాం."

డా॥ అంబేద్కరు గారి ఈ ఉపన్యాసం తర్వాత ఆయన పట్ల కాంగ్రెసు దృక్పథం సంపూర్ణంగా మారిపోయింది. యావత్ భారతదేశంలోని

వార్తాపత్రికలు "అఖండ హిందూస్థాన్ కోసం ప్రకటన" అన్న శీర్షికతో ప్రాధాన్యత ఇచ్చి అంబేద్కరును స్తుతించాయి. ఆచార్య అత్రె ఆ రోజు నుంచి అంబేద్కరుకు వ్యతిరేకంగా ఏదీ రాయనని శపథం చేశారు. ఈ సందర్భం గురించి వర్ణిస్తూ ఇలా రాశారు – "ఏ చేతులు రాళ్లు విసరడానికి మీదకి లేచాయో ఆ చేతులే పూలవాన కురిపించాయి." 'వివిధవృత్త' వార్తాపత్రిక షేక్స్పియర్ 'జూలియస్ సీజరు' నాటకంలోని సీజరు వర్ణనని కాస్త మార్చి ఇలా రాసింది – "అంబేద్కర్ లేచి నిల్చున్నారు. ఆయన చూశారు. ఆయన గెలిచారు." ఓ విమర్శకుడిగానూ, నిందించేవాడి గానూ పేరుపడ్డ డా॥ అంబేద్కరు ఇప్పుడు రాజ్యాంగ కమిటీకి సలహాదారు అయ్యారు. ఈ ఉపన్యాసం తర్వాత సభ తీర్మానాన్ని పాసు చెయ్యడాన్ని వాయిదా వేసింది. తర్వాత 1947 జనవరి 20 వ తారీఖున పాసు చేయడం జరిగింది.

# నలభై ఎనిమిది

1946 డిసెంబరు 20 వ తారీఖున అఖిలభారతీయ దళిత విద్యార్థి ఫెడరేషను విద్యార్థులకు పంపించిన, దాని నిండా ఉపదేశాలతో ఉన్న తన సందేశంలో బాబా సాహబు ఇలా రాశారు – "దళిత యువకులు ఎప్పుడన్నా అవకాశం వచ్చినప్పుడు వివేకంలోనూ, తెలివితేటలూ – యోగ్యతలోనూ వారు ఏ వ్యక్తి కన్నా కూడా ఆవగింజంతన్నా తక్కువవారు కాదు అని ఋజువు చెయ్యడానికి ప్రయత్నించాలి. దాంతోపాటు ఎల్లప్పుడూ తమ స్వార్థం వేపు దృష్టి ఉంచి తమ సమాజాన్ని స్వతంత్రమైన, శక్తివంతమైన, ప్రతిష్ఠమైన దానిగా చెయ్యడానికి ప్రయత్నించాలి."[1]

బొంబాయి, నాగపూరు శాఖల్లో అంబేద్కరు అనుయాయులకు కాంగ్రెసు కార్యకర్తలు కొంతమందికి మధ్య జాతిగతమైన వైమనస్యం కారణంగా

1. శ్రీ టి.బి. గెడామ్ రాసిన ఉత్తరాలు : రిపోర్టు ఆఫ్ ఆల్ ఇండియా షెడ్యూల్డు కాస్ట్ స్టూడెంట్ ఫెడరేషను, సెకండ్ సెషన్, హెల్డ్ ఎట్ నాగపూర్ ఆన్ 25–27 డిసెంబరు 1946 ; 1947.

ఉద్రిక్తత వ్యాపించింది. డాక్టరు సాహెబు బొంబాయి తిరిగివచ్చిన తర్వాత సిద్ధార్థ కాలేజీ కార్యకలాపాలు చూడ్డం మొదలుపెట్టారు. ఆయన నివాసం 'రాజగృహ' కి చుట్టుపక్కల కొంతమంది గూండాలు తిరుగుతున్నారు. ఆ కారణంగా ఆయనని బయటికి రావొద్దని సలహా ఇవ్వడం జరిగింది. ఆయన ఆ సలహాని లెక్క చెయ్యకుండా 'రాజగృహ' లో ఉండడానికి వెళ్లారు. ఫిబ్రవరి 27 వ తారీఖున బీహారీ అస్పృశ్య సైనికుల మీద దేవలాలీలో నడుస్తున్న దావాల్లో ముద్దాయిలను రక్షించే పనిని చేశారు.

భారతదేశానికి స్వాతంత్ర్యం లభించే సమయం దగ్గర పడుతోంది. అన్న సంగతి తెలియగానే డా॥ అంబేద్కరు రాజ్యాంగపు ముసాయిదాను తయారుచేసి రాజ్యాంగ కమిటీకి సమర్పించారు. 1947 మార్చిలో ఈ ముసాయిదా "స్టేట్స్ ఎండ్ మైనారిటీస్" పేరుతో అచ్చయింది. ఈ ముసాయిదా భారత రాజ్యాంగపు డ్రాఫ్టే. షెడ్యూల్డు కాస్ట్ ఫెడరేషను తరపున సమర్పించబడిన ఈ ముసాయిదాలో అస్పృశ్యులను అల్పసంఖ్యాకులుగా పరిగణించని వారికి గట్టిగా జవాబు ఇయ్యడం జరిగింది. దాంతోపాటు, భారతదేశపు భవిష్యత్ రాజ్యాంగంలో పౌరులకు మౌలిక హక్కులు ఏవి ఉండాలో, అల్పసంఖ్యాకులకు భద్రత ఎలా లభించగలదో, అల్ప సంఖ్యాకుల హక్కుల రక్షణకు ఏ ఏర్పాట్లు చెయ్యాలో, మొదలైన విషయాల స్పష్టీకరణ ఇందులో పొందుపరచబడ్డాది. రాజ్యాంగాన్ని రాయడంలో డా॥ అంబేద్కరు పాండిత్యం ఈ డ్రాఫ్టులో గోచరిస్తుంది. 1946 ఎన్నికల గణాంకాలతో సహా విశ్లేషణ చేసి పూనా ఒప్పందం ఏవిధంగా దళితులకు హానికరమైనదీ ఆయన ఋజువుచేశారు.

భీమా కంపెనీల జాతీయకరణ, పరిశ్రమల జాతీయకరణ, వ్యవసాయ జాతీయకరణలను ముఖ్యంగా ఈ డ్రాఫ్టులో సూచించటం జరిగింది. రాజ్యాంగంలో జాతీయకరణ చెయ్యడానికి కావలసిన ఏర్పాటుని చేర్చమనే సలహా కూడా ఇవ్వబడ్డాది. సామ్యవాద రాజ్యవ్యవస్థను సమర్థించిన తర్వాత కూడా అంబేద్కరు వ్యక్తి స్వాతంత్ర్యాన్ని నిర్వివాదంగా ఉంచారు.

రాజ్యాంగ సభ మూడవ సమావేశం 1947 ఏప్రిలులో జరిగింది. 1947 ఏప్రిలు 29వ తారీఖున సర్దారు పటేలు అస్పృశ్యతా సాంప్రదాయాన్ని అంతం చెయ్యాలన్న తీర్మానాన్ని ప్రవేశపట్టారు. అది పాసు చెయ్యబడ్డాది. ఈ ఘటనని "చారిత్రక ఘటన", "మానవ స్వాతంత్ర్య విజయం" అని

వార్తా పత్రికలు వర్ణించాయి. సభ్యులందరూ బల్లలమీద చరుపులు చరిచి మహాత్మా గాంధీకి జేజేలు పలికారు. డా॥ అంబేద్కరు జీవితం అంతా అస్పృశ్యతను సమూలంగా నాశనం చెయ్యడానికి ప్రయత్నించారు. అయితే పత్రికల వారు ఆయన ఊసే ఎత్తలేదు.

1947 జూన్ 3వ తారీఖున లార్డు మౌంట్ బేటన్ లండను నుంచి తిరిగి వచ్చారు. ఆయన గాంధీ నెహ్రూల ముందు దేశ విభజన ప్రతిపాదన పెట్టారు. వారిద్దరూ దానిని కాంగ్రెసు అఖిల భారత కమిటీ ద్వారా ఆమోదింప చేశారు. హిందూ మహాసభ దీనిని గట్టిగా వ్యతిరేకించి ఖండించింది. అయితే దాని అరుపులు అరణ్యరోదనే అయ్యాయి. జూలై 15 వ తారీఖున బ్రిటిషు పార్లమెంటు హిందూస్థాన్ స్వాతంత్ర్యానికి సంబంధించిన తీర్మానాన్ని పాసు చేసింది. బెంగాలు, పంజాబుల విభజన జరిగింది. బెంగాలు విభజకనతో బాబాసాహబు అంబేద్కరు స్థానం ఖాళీ అయింది. కాని కాంగ్రెసు బాబాసాహబు జ్ఞానాన్ని, అనుభవాన్ని దేశహితం కోసం దేశనిర్మాణం కోసం ఉపయోగించుకోవాలని నిశ్చయించింది. బొంబాయి విధానమండలిలో డా॥ జయకర్ రాజీనామా కారణంగా ఏర్పడిన ఖాళీ స్థానంలో డా॥ అంబేద్కరుని ఎన్నుకొన్నారు.

జూలై 3వ తారీఖున డా॥ అంబేద్కరు బొంబాయి వచ్చినప్పటికి ఆయన రాజ్యాంగసభ జెండా కమిటీ సభ్యులు. ఆయన బొంబాయి ప్రవాస కాలంలో హిందూ మహాసభ కార్యకర్తలు అనేకమంది ఆయనని కలిశారు. జాతీయజెండా కాషాయ రంగులో ఉండాలని సూచించారు. జూలై 10 వ తారీఖున డా॥ అంబేద్కరు ఢిల్లీ తిరిగి వెళ్తున్నప్పుడు శాంతాక్రూజ్ విమానాశ్రయంలో కాషాయజెండాని సమర్పించారు. కాషాయ జెండా కోసం ఆందోళన చెయ్యవలసి వస్తే వారు ఆయనని సమర్థిస్తామని డా॥ అంబేద్కరుకి మాట ఇచ్చారు. కాని జూలై 22వ తారీఖున రాజ్యాంగసభ అశోకచక్రం ఉన్న మూడు రంగుల జెండాని జాతీయ జెండాగా స్వీకరించింది. కాషాయజెండాని సమర్థించినవారు ఏ ఆందోళనా చెయ్యలేదు.

డా॥ అంబేద్కరు కొత్త ఢిల్లీలో సరిహద్దుల నిర్ణయం చేస్తున్నప్పుడు "దేశం సరిహద్దులు నైసర్గికమైనవి కాకపోతే భారత ప్రభుత్వానికి సరిహద్దుల రక్షణలో చాలా కష్టాలు కలుగుతాయి. దేశ రక్షణకి దాని భద్రతకి చాలా

పెద్ద ముప్పు వాటిల్లుతుంది." అని ప్రభుత్వానికి హెచ్చరికతో కూడిన సూచనని ఇచ్చారు.

1947 జూలై ఆఖరివారంలో కాంగ్రెసు పార్టీ మంత్రిమండలి నిర్మాణంలో సంభావ్య - మంత్రుల పేర్ల పట్టికను తయారు చేసింది. పండిత నెహ్రూ డా|| అంబేద్కరును పిలిచి "మీరు న్యాయశాఖా మంత్రి పదవిని స్వీకరిస్తారా ?" అని ఆయనని అడిగారు. ఆయనకి ప్రణాళిక, వికాస శాఖలు కూడా (Planning and Development Department) ఇస్తారని కూడా హామీ ఇచ్చారు. డా|| అంబేద్కరు దీనికి తన అంగీకారాన్ని తెలిపారు.

ఆగష్టు 3వ తారీఖున విడుదలైన కేంద్ర మంత్రుల జాబితాలో డా|| అంబేద్కరు పేరు అన్నిచోట్లా ఉన్నాది. అప్పుడు ఆయన బొంబాయిలో ఉన్నారు. అక్కడ చెంబూరులో ఏర్పాటు చేయబడిన, పురపాలక సంఘం శ్రామికసంస్థ తరపున జరిగిన సభలో ఉపన్యసించారు. ఈ సందర్భంలో ఆయనకి బిల్డింగు ఫండు కోసం గాను రెండువేల రూపాయ్మల పర్సు సమర్పించబడ్డాది. ఆగష్టు 6వ తారీఖున బొంబాయి వకీళ్ల సంస్థ తరపున మంత్రి పదవిలో నియమించబడిన సందర్భాన్ని పురస్కరించుకుని ఆయనకి సన్మానం చేశారు.

ఆగష్టు 15 వ తారీఖున భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చింది. ఆగష్టు 29 వ తారీఖున రాజ్యాంగ సభ రాజ్యాంగపు డ్రాఫ్టు తయారుచెయ్యడానికి గాను డ్రాఫ్టు కమిటీని నిర్మించింది. బాబా సాహబు అంబేద్కరుని దానికి అధ్యక్షులుగా చేసింది. ఈ విధంగా భారత భవిష్యత్ నిర్మాణకార్యం ఆయనకి అప్పగించబడ్డాది.

సెప్టెంబరు 25వ తారీఖున డా|| అంబేద్కరు సిద్ధార్థ కాలేజీలో వక్తృత్వ శాఖని ప్రారంభించారు. ఉపన్యసించే కళను ఎలా పొందాలి, ఎలా వృద్ధి చేసుకోవాలి అన్న విషయం గురించి విద్యార్థులకు ఆయన హితబోధ చేశారు. విద్యార్థులను ప్రభావితం చెయ్యడానికి ఆయన ఇలా చెప్పారు - "వక్తృత్వ శక్తిని పొందడానికి విద్యార్థులు సాధన చెయ్యాలి. ప్రయత్నం ద్వారా అసంభవం కూడా సంభవం అవుతుంది. అంచేత ఉపన్యాసం ఇవ్వడాన్ని నేర్చుకోండి. సాధన చెయ్యండి."

ఈ రోజుల్లోనే దేశంలో తూర్పు, పడమర సరిహద్దుల్లో భయంకరమైన మతకలహాలు రేగి రక్తజ్వాలలు లేచాయి. లక్షలమంది హత్యకు గురి అయ్యారు. స్త్రీలు అపహరణకి గురి అయ్యారు. వారి శీలం దోచుకోబడింది. అత్యాచారాలు చేయబడ్డాయి. ఇలాంటి హేయాతిహేయమైన పనులు అడ్డూ ఆపూ లేకుండా జరిగాయి. పాకిస్తాను మీద తాను రాసిన గ్రంథంలో హిందూస్థాన్ నుంచి ముస్లిములు, పాకిస్తాను నుంచి హిందువులు స్థానాంతరణం వెళ్లడం విషయమై ఆయన సలహాలు సూచించారు. వాటిని గమనించక పోవడం నుంచి రెండు దేశాలకు చెందిన నిస్సహాయులూ, బీదవారూ అయిన ప్రజలు హత్యాకాండకి గురి అయ్యారు. డా॥ అంబేద్కరు ఒక స్టేట్‌మెంటు వెలువరించి పాకిస్తాను ప్రభుత్వాన్ని నిందించారు. దళిత సమాజం వారికి తన అభిప్రాయాన్ని అందచేశారు - "ఏ తోవ దొరికినా, ఏ విధమైన సాధనం సాధ్యమయినా ఎలాగో ఒకలాగ హిందూస్థాన్‌కి చేరుకోండి. మతమార్పిడి చేసుకున్నా దళితులను కూడా తిరిగి సమాజంలోకి స్వీకరించడం జరుగుతుందని కూడా ఆయన అన్నారు. చివరిగా అస్పృశ్యులను అక్కడ నుంచి విడిపించి తేవడానికి గాను మహార్ రెజిమెంటును అక్కడకి పంపించవలసిందిగా ఆయన నెహ్రూజీని అభ్యర్థించారు. ఈ సైనికులు సుమారు 75 వేలమంది అస్పృశ్య స్త్రీ పురుషులని గూండాల పిడికిట్ల నుంచి విడిపించి భారతదేశానికి తీసుకువచ్చారు.

పశ్చిమ పాకిస్తాను నుంచి భారతదేశానికి వచ్చిన అస్పృశ్య శరణార్థులకు తూర్పు పంజాబులో ముస్లిముల ద్వారా వదిలేయబడిన భూముల్ని ఇవ్వాలి అని బాబా సాహబు పండిత నెహ్రూకి సూచించారు. అది సుమారుగా నలభై లక్షల ఎకరాల భూమి. కాని ముఖ్యమంత్రి ప్రతాప్ సింహ్ కైరో కుట్ర వల్ల దళితులకు కేవలం ఒక లక్ష ఎకరాల భూమి మాత్రమే లభ్యం అయింది.[1]

ఈ రోజుల్లోనే డా॥ పి. లక్ష్మినరసు రాసిన గ్రంథం 'ఎసెన్సు ఆఫ్ బుద్ధిజమ్' మూడో ముద్రణని అచ్చు వేయించారు. ఈ గ్రంథం ప్రస్తావనలో బాబాసాహబు అన్నిమతాల పట్ల వ్యక్తమైన రచయిత నిష్ఠని ప్రశంసించారు - ఇంకా ఇలా రాశారు - "ఇప్పటి వరకూ ప్రచురించబడిన

1. సోహన్‌లాల్ శాస్త్రి : పే. 63.

పుస్తకాలన్నిటిలో ఈ పుస్తకం బౌద్ధ మతం మీద రాయబడిన సర్వోత్తమమైన పుస్తకం. ఈ దృష్ట్యా ఈ గ్రంథాన్ని నేను ప్రత్యేకంగా సిఫారసు చేస్తున్నాను."

ఇప్పుడు ఇంక రాజ్యాంగం ముసాయిదాను తయారు చేసే పనిలో బాబాసాహబు లీనమయ్యారు. తన ఆరోగ్యాన్ని లక్ష్య పెట్టకుండా రాత్రీ - పగలూ రాజ్యాంగం తయారు చేసే కార్యంలో మునిగిపోయారు. వివిధ రకాలైన మతాలు, జాతులు, భాషలు, రీతి రివాజులు ఉన్నా ప్రజల కోసం దేశాన్ని ఒక తాటితో కలిపి కలిసికట్టుగా ఉండగలిగేటట్టు చేసే రాజ్యాంగాన్ని ఆయన రచించవలసి వచ్చింది.

1948 జనవరిలో ఆయన బొంబాయి వచ్చారు. ధోబీ తాలాబ్‌నైట్ స్కూలులో జరిగిన డిబేటు పోటీ సందర్భంలో ఆయన విద్యార్థులకు హితబోధ చేశారు. ఉపన్యాసం యివ్వడం ఒక కళ అనీ, ప్రయత్నించి దానిని సాధించవచ్చుననీ చెప్పి పేరు ప్రఖ్యాతులు తెచ్చుకున్న ప్రసిద్ధ వక్తల గురించి తెలియజేశారు. గోపాలకృష్ణ గోఖలే ప్రఖ్యాత రచయితలు అన్న మాటలను కంఠస్థం చేస్తూ ఉండేవారు. ఆయన తన ఉపన్యాసంలో వాటిని ఉపయోగిస్తూ ఉండేవారు. ఫిరోజ్ శాహ మెహతా తన ఇంట్లో ఏర్పాటు చేసుకున్న అద్దాల మహలులో తన ఉపన్యాసాన్ని ముందస్తుగా అభ్యాసం చేసేవారు. చర్చిలు తన షర్టు చివర అంచుమీద వాదనాంశాలను నోటు చేసుకుంటూ ఉండేవారు. ఇలాంటివే కొన్ని జ్ఞాపకాలను చెప్పి వక్తృత్వ కళని శ్రమించి నేర్చు కోవలసినదని ఆయన విద్యార్థులకు సలహా ఇచ్చారు.

1948 జనవరి 30 వ తారీఖున బిర్లా భవన ప్రాంగణంలో మహాత్మాగాంధీని తుపాకీ గుండు పేల్చి హత్య చేశారు. యావద్దేశం శోక సముద్రంలో మునిగిపోయింది. గాంధీజీ శవయాత్రలో కొద్ది సేపు పాల్గొని డా॥ సాహబు తిరిగి వచ్చారు. ఆయన అలిసిపోయి ఉన్న కారణం చేత ఎక్కువ సేపు శవయాత్రలో పాల్గొని కష్టాన్ని భరించలేకపోయారు.

మహాత్మాగాంధీ మరణం తర్వాత అలవర్ సంస్థానపు ప్రధానమంత్రి డా॥ ఎన్. బి. ఖరేని భర్తరఫ్ చేశారు. అలవర్ రాజుని కూడా జైలులో పెట్టారు. అలవర్ సంస్థానపు ప్రధానమంత్రి హోదాలో డా॥ ఖరే రాజ్యాంగ కమిటీ మెంబరు కూడా. ఆయన ఈ సభ్యత్వం కూడా రద్దు

చేయబడ్డాది. 1948 ఫిబ్రవరి 7వ తారీఖున ఈ వార్త రేడియోలో ప్రసారితం అయింది. అది విని డా|| అంబేద్కరు వాకబు చెయ్యడానికి డా|| ఖరేని కలిశారు. "ఈ వార్త విన్నాక ఎవరూ మీ దరిదాపులకు రారు. మీ మిత్రులు హితాభిలాషులు కూడా తప్పి దారి•అయినా మీ వేపులకు రారు. మీకు ఒంటరితనం వల్ల చాల బాధ కలుగుతుంది. అంచేత ఎప్పుడు కావాలంటే అప్పుడు అన్నివేళలా నాతో బాతాఖాణీ కొట్టడానికి మీరు రావొచ్చు. నా ఇంటి తలుపులు మీ కోసం ఎప్పుడూ తెరిచే ఉంటాయి." అని ఆయనకు ధైర్యం చెపుతూ అంబేద్కరు అన్నారు. నాలుగు పర్యాయాలు డా|| అంబేద్కరు దగ్గరకు వెళ్లారు. తన అభిప్రాయాలను చెప్తూ డా|| ఖరే ఇలా రాశారు - "మేము పరస్పరం బ్రాహ్మణ, బ్రాహ్మణేతరుల గుణాల గురించి, దోషాల గురించీ, మహారాష్ట్ర రాజకీయాల గురించి మాట్లాడుకుంటూ ఉండేవారం. అంబేద్కరు మాటల వల్ల ఆయనకి మహారాష్ట్ర మహెూన్నత చరిత్ర అంటే చాలా గర్వం ఉన్నాదని తెలిసేది. డా|| అంబేద్కరు మాటలు వాస్తవాలే అయ్యాయి. నేను ఢిల్లీలో ఉన్నంత వరకూ మహారాష్ట్ర మిత్రుడు ఏ ఒక్కడూ నన్ను కలుసుకోవడానికి రాలేదు."[1]

1948 ఫిబ్రవరిలో, కేవలం ఆర్నెల్లలోనే అంబేద్కరు రాజ్యాంగపు చిత్తు ముసాయిదాని రాజ్యాంగసభ అధ్యక్షులు డా|| రాజేంద్రప్రసాద్‌కి సమర్పించారు. ఆ డ్రాఫ్టుని ప్రజాభిప్రాయాన్ని తెలుసుకోవడానికిగాను ప్రజల ముందుకు తెచ్చారు.

రాజ్యాంగ ముసాయిదాని తయారు చేసే బాధ్యతని చేపట్టిన లగాయితు డా|| అంబేద్కరుగారి ఆరోగ్యం త్వరితగతిని దిగజారుతూ వచ్చింది. 1947 ఆగష్టులో ఆయనకు పదిహేను రోజులు పాటు వరసగా నిద్ర అన్నది పట్టలేదు. చాలా రోజుల బట్టి ఆయన మెదడులోని నరం నొప్పి పెడుతూ ఉంది. ఆయన ఎలోపతి, హెూమియోపతి రెండు రకాల చికిత్స చేయించుకున్నారు. దానితోపాటు మధుమేహపు బాధ కూడా అధికం అయింది. రాజ్యాంగపు చిత్తు ప్రతి తయారు అయిన తర్వాత డా|| అంబేద్కరు తన శరీరానికి విశ్రాంతి ఇవ్వడానికిగాను బొంబాయి వెళ్లారు.

1. డా|| ఎన్. బి. ఖరే : మై పొలిటికల్ మెమోయర్స్ ఎండ్ బయోగ్రఫీ : ప్రచురణ కర్తలు - జె.ఆర్. జోషి, బుటిబాడా, నాగపూరు, పే. 356 - 357

ఆయన విశ్రాంతి తీసుకుంటున్న నర్సింగు హోములో ఆయనకి కుమారి డా॥ శారదా కబీరుతో పరిచయం ఏర్పడ్డాది. ఢిల్లీ తిరిగి వచ్చేసరికి మళ్లీ ఆరోగ్యం దెబ్బతిన్నది. ఇద్దరు ప్రఖ్యాత వైద్యులు ఆయనని పరీక్షించి చికిత్స చేశారు. కాని ఆయనకి సుళువు చిక్కలేదు. ఇలాంటి దిగజారి పోతున్న ఆరోగ్యం పరిస్థితిలో ఆయనకి శుశ్రూష చేసేవారు ఎవరైనా కావాలి, ఈ అభిలాషతో ఆయన డా॥ శారదా కబీరుని వివాహం చేసుకోవడానికి నిశ్చయించుకున్నారు.

1948 ఏప్రిలు 15 వ తారీఖు ఉదయం బాబాసాహబు హార్డింగు ఎవెన్యూ నివాసంలో కొంతమంది వేళ్లమీద లెక్కపెట్టేటంతమంది మిత్రుల సమక్షంలో డా॥ బాబాసాహబు అంబేద్కరు డా॥ శారదా కబీరుని రిజిస్టరు వివాహం చేసుకున్నారు. ఈ సందర్భంలో కేవలం 16 మంది హాజరయ్యారు.

అంతకుముందు ఏప్రిలు 14 వ తారీఖున డా॥ బాబాసాహబు అంబేద్కరు పుట్టిన రోజు పండగను దళిత సమాజపు బస్తీల్లో ఎంతో ఉత్సాహంతో జరిపారు.

# నలభై తొమ్మిది

ఏప్రిలు నెల ఆఖరివారంలో డా॥ అంబేద్కరు ఉత్తరప్రదేశ్ దళితవర్గ పరిషత్తు సభలో ఉపన్యాసం యిచ్చారు. తన ఉపన్యాసంలో జనంలో తాను కాంగ్రెసులో కలిసిపోయినట్టుగా వ్యాపించిన భ్రమను నివారిస్తూ ఆయన ఇలా అన్నారు – "నేను ప్రభుత్వంలో చేరాను. కాంగ్రెసులో కాదు. కాంగ్రెసు భస్మం అవుతూ ఉన్న గృహం. ఒకటి రెండు సంవత్సరాల్లో భస్మం అయిపోతుంది. మీ గుడిసెను వదులుకుని ఇతరుల మహలుకి వెళ్లకండి."

ఈ ఉపన్యాసంతో కాంగ్రెసు వర్గాల్లో గగ్గోలు పుట్టింది. నెహ్రూ పటేలులతో గట్టిగా జగడం అయింది. అప్పుడు డాక్టరు సాహబు రాజీనామా ఇవ్వడానికి సిద్ధం అయ్యారు. దీనిగురించి తన స్టేటుమెంటుని

వెలువరించి ఆయన దానిలో స్పష్టంగా చెప్పారు - "బేషరతుగా నేను మంత్రిమండలిలో చేరాను. దళితుల మేలును సాధించడమే నా ముఖ్య ఉద్దేశం."

భారత ప్రభుత్వం భాషా ప్రయుక్త రాష్ట్రాల నిర్మాణం గురించి యోచన చేయటానికి ఒక కమిటీని నియమించింది. డా|| అంబేద్కరు కూడా మహారాష్ట్రలో ఈ "థార్ కమిటీ' కి ఒక విజ్ఞప్తిని సమర్పించారు. "ప్రజాస్వామ్యం కోసం భాషా ప్రయుక్త రాష్ట్ర నిర్మాణం అవసరం. కాని ప్రాంతీయ భాషని జాతీయ భాషగా అవనీయకూడదు. అలాకాకపోతే ప్రాంతీయ జాతీయతావాదం కలగడానికి అవకాశం ఉంటుంది." దీనిని ప్రతిపాదిస్తూ బొంబాయి గురించి కూడా ఆయన తన ఖచ్చితమైన అభిప్రాయాలను వ్యక్తం చేశారు. బొంబాయి మహారాష్ట్ర అభిన్న భాగం అని కూడా ఋజువు చేశారు.

1948 అక్టోబరులో డాక్టరు సాహబు గ్రంథం "ది అన్‌టచబుల్స్" ఇంగ్లీషులో అచ్చయింది. తన ఈ వ్యాసంలో అస్పృశ్యత సుమారుగా క్రీ.శ. 400 నుంచీ ఉద్భవించింది అని ఋజువు చేశారు. బౌద్ధమతం కన్నా తమ శ్రేష్టతని ఋజువు చేసుకోవడానికి బ్రాహ్మణులు గోమాంసం తినడాన్ని వర్జించారు. కాని బౌద్ధ మతాన్ని స్వీకరించినవారు గోమాంసాన్ని తిండం మానలేదు. వారిని అస్పృశ్యులుగా పరిగణించడం జరిగింది. అన్న సిద్ధాంతం ఈ గ్రంథంలో ప్రతిపాదించబడ్డాది.

ఈ రోజుల్లోనే డా|| అంబేద్కరు ఎమ్.ఆర్. ఎడ్. గుంజీ పుస్తకం 'సోషల్ ఇన్సూరెన్సు ఇన్ ఇండియా" కి ప్రస్తావన రాశారు.

"ఇది సాంఘిక బీమా మీద క్రమ పద్ధతిలో రాసిన పరిశోధనా గ్రంథం." ఆయన ఇంకా ఇలా రాశారు. - "ఇది భారతదేశానికి నూతన విషయం. రచయిత చెప్పిన ప్రకారం ఉత్పత్తి బీమాని ఆరంభించే ప్రణాళిక స్వీకరించబడితే గ్రామీణ ప్రజల దారిద్ర్యం నివారించటానికి, కరువు కాలంలో వారికి సహాయం అందించటానికి ఈ ప్రణాళిక బాగా ప్రయోజనకారి కాగలదు."[1]

రాజ్యాంగపు ముసాయిదా 1948 నవంబరు 4 వ తారీఖున రాజ్యాంగ సభలో చర్చించటానికిగాను సమర్పించబడ్డాది. 315 నిబంధనలు 8 అను

1. ఎడ్ గున్‌జీ : ప్రస్తావన, డా|| అంబేద్కరు.

బంధాలతో కూడిన ఈ రాజ్యాంగపు గుణాలను, లక్షణాలను తన శైలీ సంపన్నమైన ఉపన్యాసంలో విశ్లేషించారు. తన ఉపన్యాసాన్ని ముగిస్తూ ఆయన ఇలా అన్నారు - "ఈ రాజ్యాంగం ప్రత్యక్షంగా అమలు పరచటానికి వీలైనది. అది సర్దుబాటుకు వీలైనది. దాంతోపాటు యుద్ధకాలంలోనూ, ప్రశాంత సమయంలోనూ దేశాన్ని ఒకటిగా ఐకమత్యంతో ఉంచడానికి కావలిసిన సామర్థ్యం కలిగినది. ఎక్కువ ప్రభావవంతమైనదీను ..., రాజ్యాంగాన్ని సముచిత రీతిలో అనుసరించలేక పోతే తప్పు రాజ్యాంగానిది కాదు, మనిషిలో గూడు కట్టుకున్న అవగుణాలది అని చెప్పవలసి వస్తుంది." అంబేద్కరు ఇచ్చిన ఈ ఉపన్యాసానికి సభ్యులు ఆయనని వేయినోళ్లతో కొనియాడారు. ప్రస్తుతించారు.

నిబంధనల ప్రకారం రాజ్యాంగం మీద చర్చ మొదలయింది. 1948 నవంబరు 20 వ తారీఖున అస్పృశ్యతన అంతం చెయ్యాలి అనే నిబంధనం ఆమోదించబడ్డాది. డిసెంబరు 18 వ తారీఖున డా॥ అంబేద్కరు షెడ్యూల్డు కాస్ట్ ఫెడరేషను కార్యకర్తలను ఉద్దేశించి ఉపన్యసించారు. 1949 జనవరి 15 వ తారీఖున మన్‌మాడ్ పట్టణంలో ఆయనకు పర్సు సమర్పించబడ్డాది. అప్పుడు ఇచ్చిన తన ఉపన్యాసంలో ఆయన ఇలా అన్నారు - 'ఏ సమాజమైనా విద్యారంగంలో ఎంత ముందుని ఉంటుందో దాన్నిబట్టే ఆ సమాజపు ప్రగతిని అంచనా వేయడం జరుగుతుంది."

ఆ తర్వాత ఆయన హైదరాబాదు వెళ్లారు. అక్కడ ఆయన నిజాం సంస్థానపు అధికారులతో ఔరంగాబాదులో కాలేజీని ప్రారంభించటం గురించి చర్చించారు. తన ఈ ప్రవాసకాలంలో ఆయన అజంతా గుహలని చూడ్డానికి వెళ్లారు. కాలేజీ పనిమీద ఆయనకి మార్చిలోనూ మేలోనూ తరుచు బొంబాయి రావలసివచ్చింది. ఆయన జూలై 7వ తారీఖున బొంబాయి వచ్చినప్పుడు బొంబాయి మజదూర్ సంఘం హర్తాళ్‌ని విరమింపచేయటానికి ప్రయత్నించారు. 1948 జూలై 30 నుండి అక్టోబరు 17 వ తారీఖుల మధ్య డా॥ అంబేద్కరు రాజ్యాంగ సభలో రాజ్యాంగం మీద ద్వితీయ పఠనాన్ని పూర్తి చేయించారు. ఎక్కువగా అంబేద్కరు స్వయంగా ప్రతి నిబంధనని సమర్పించి దాని ప్రాముఖ్యాన్ని వివరించారు. ఆయన ఆరోగ్యం బాగా లేకపోయినప్పటికి రాజ్యాంగపు కార్యకలాపాల్లో ఆయన ఎప్పుడూ నిర్లక్ష్యంగా వ్యవహరించలేదు. 1948 సెప్టెంబరులో

రాష్ట్రీయ స్వయంసేవక్ సంఘ్ ప్రధాన సంచాలకులు గోల్‌బల్‌కర్ గురుజీ ఆయనని కలిశారు.

1948 లో భారతదేశపు సంబంధం కామన్‌వెల్తుతో ఎలా ఉండాలో అన్న విషయం మీద ఒక ముఖ్యమైన విజ్ఞప్తిని తయారుచేసి తనకుతానుగా డా|| అంబేద్కరు భారతదేశపు ఆర్థికమంత్రికి పంపారు. ఆర్థికమంత్రి 1948 నవంబరు 19 వ తారీఖున డా|| అంబేద్కరుకి రాసిన తన ఉత్తరంలో ఇలా రాశారు - "ఇంత క్లిష్టమైన ప్రశ్నకు ఇంత సరళంగా, చాకచక్యంగా, నైపుణ్యంతో, ఉచితమైన పద్ధతిలో చేసిన విశ్లేషణని ఎంతో ఆసక్తితో నేను చదివాను."

తన ఈ విజ్ఞప్తిలో బాబాసాహబు ఇలా రాశారు - "భారతదేశానికి లాగే కామన్‌వెల్తుకి భారతదేశపు సహకారం కావాలి. పారిశ్రామిక వికాసం కోసం, రక్షణ నిమిత్తం బ్రిటిషు కామన్ వెల్తు నుంచి ఎంత తొందరగా సహాయం దొరకగలదో అంత తొందరగా మరి ఎక్కడ నుంచీ దొరకదు. అంచేత కామన్‌వెల్తుతో సంబంధాలు తెంచుకోవడం భారతదేశానికి ఉచితం కాదు."

కాలనీ గురించి వివరిస్తూ బాబాసాహబు ఇలా అన్నారు - "జాతీయ హెూదా దొరికిపోయిన తర్వాత ఇక ఇప్పుడు వలసదేశ సంబంధమైన స్థానాన్ని స్వీకరించటం సరికాదు. ఎందుచేతానంటే మనం ఇప్పుడు రాజు పట్ల నిష్ఠతో ఉండలేం. అంతేకాక మన జాతీయ పతాకం రాజుకి ప్రాతినిధ్యం వహించలేదు. ఇంకొక ప్రముఖమైన కారణం మానసికమైనది. "బ్రిటిషు" శబ్దాన్ని మనం తొలగించివేశాం అని అనుకున్నప్పటికీ కామన్‌వెల్తులో ప్రాధాన్యత తెల్లదొరలదే అవుతుంది. అలాంటి పరిస్థితిలో మనం పౌరసత్వపు ఆధారంగానే కామన్‌వెల్తు సభ్యులం అవగలిగినా, మన సామాన్య పౌరసత్వం ఎల్లప్పుడూ ఆపదలోనే పడి ఉంటుంది." ఈ విషయాలని విపులంగా వివరిస్తూ ఆయన ఇలా అన్నారు - "కామన్‌వెల్తు పౌరసత్వం బోలు నేల లాంటిది. ఈ పౌరసత్వంలో రాజభక్తి ఉన్నాది. భారతదేశం ప్రజాస్వామ్యం అయిన కారణంగా రాజభక్తితో ఉండడమన్నదే కుదరదు. అంచేత 1921 లో ఐర్లెండు స్వాతంత్ర్య సేనాని డి. వెల్సు ఏ షరతుల మీద సహకరించే రాజ్యం అనే యోగ్యతతో కామన్‌వెల్తులో చేరాడో మనం కూడా అదే ఏర్పాటును డిమాండు చెయ్యాలి. కామన్‌వెల్తులో ఉండడం, దానికి వెలుపల ఉండడం అన్నది సంపూర్తిగా భారతదేశపు

అభిమతం మీద జరగాలి." కామన్‌వెల్తు సభ్యత్వం సంధిపత్రం ద్వారా కాక, రాజ్యాంగంలో ఒక నిబంధనని జోడించి చేయగలగవచ్చును అని ఆయన సూచించారు.

కామన్‌వెల్తుతో మన ప్రస్తుత సంబంధం బాబాసాహబు ద్వారా సూచించిన షరతులపైనే ఆధారపడి ఉన్నాది.

1949 నవంబరు 5వ తారీఖున టి.టి. కృష్ణమాచారి రాజ్యాంగసభలో బాబాసాహబు డా।। అంబేద్కరు రాజ్యాంగ నిర్మాణంలో అందించిన దేయం గురించి ఉపన్యసిస్తూ ఇలా అన్నారు - "రాజ్యాంగ నిర్మాణం చేయడం కోసం ఎంపికచేసిన ఏడుగురు సభ్యుల కమిటీలో ఒక సభ్యుడు రాజీనామా చేశారు. ఒక సభ్యుడు మరణించాడు. ఇంకొక సభ్యుడు అమెరికా వెళ్లిపోయాడు. మరొక సభ్యుడు సంస్థానాల కార్యకలాపాల్లో మునిగి ఉన్నాడు. ఒకరిద్దరు సభ్యులు ఢిల్లీకి దూరంగా ఉండే సభ్యులు. వారి ఆరోగ్యం సరిగా లేకపోవడం వల్ల హాజరు కాలేకపోయారు. ఫలితంగా మొత్తం రాజ్యాంగ నిర్మాణ కార్యం అంతటి భారమూ అంబేద్కరు ఒక్కరే ఎత్తవలసి వచ్చింది." కృష్ణమాచారి ఇచ్చిన ఈ వివరణతో డా।। అంబేద్కరు ఎంతో కఠోరమైన పరిశ్రమ చేశారో ఊహించుకోవచ్చును."

నవంబరు 14 వ తారీఖు నుండి రాజ్యాంగపు తృతీయ పఠనం ప్రారంభం అయింది. సభ్యులు రాజ్యాంగం మీద తమ తమ అభిప్రాయాలు వెలిబుచ్చారు. మునిస్వామి పిళ్ళై డా।। అంబేద్కరుని తిరువల్లూర్ లాంటి సంఘ సంస్కర్తతో పోల్చారు. అధికాధిక సభ్యులు డా।। అంబేద్కరు కృషిని, కార్యాన్ని ప్రశంసించారు.

1949 నవంబరు 29 వ తారీఖున బాబాసాహబు అంబేద్కరు చర్చకి సమాధానం యివ్వడానికి లేచి నిల్చున్నప్పుడు చప్పట్లతో జయ జయ ధ్వానాలతో భవనం ప్రతిధ్వనించింది. ఈ మహత్తర ప్రాధాన్యతతో కూడిన చారిత్రక ఉపన్యాసంలో డా।। అంబేద్కరు ఇలా అన్నారు - "ఈ రాజ్యాంగం మంచిదో, చెడ్డదో, దీని మంచిచెడ్డలు దీనిని అమలు పరిచిన వారిమీద ఆధారపడి ఉంటాయి. ఇంతకు పూర్వం భారతదేశం తన స్వాతంత్ర్యాన్ని తనవాళ్లు చేసిన దేశద్రోహం కారణంగానే పోగొట్టుకుంది." భారతదేశ చరిత్ర నుంచి దేశద్రోహపు ఉదాహరణలను ఇస్తూ ఆయన ఉద్విగ్నతతో పిలుపునిచ్చారు - "మనం మన స్వాతంత్ర్యాన్ని

నిలబెట్టుకోవడానికి మన నెత్తురులోని ఆఖరి బిందువు చిందేటంతవరకూ పూర్తి దీక్షతో, సంకల్పంతో కటిబద్ధులం కావాలి."

ఆ తర్వాత ప్రజాస్వామ్యాన్ని కాపాడుకోవటానికి ఏం చెయ్యవలసిన అవసరం ఉన్నాదో విశ్లేషించి చెప్పారు. ఇక ఇప్పుడు ప్రజలు కేవలం రాజ్యాంగ పద్ధతుల ద్వారానే తమ సాంఘిక సమస్యలనూ, ఆర్థిక సమస్యలనూ పరిష్కరించుకోవాలి అని ఆయన అభిప్రాయపడ్డారు. సత్యాగ్రహం అథవా సహాయ నిరాకరణ మార్గం మనని అరాజకత్వం లోకి ఈడ్చుకెళ్తుంది.

రెండవ ముఖ్యమైన విషయం వ్యక్తి ఆరాధన. ఆయన ఇలా అన్నారు - "రాజకీయరంగంలో ఇక్కడ నాయకుల పట్ల భక్తి ప్రదర్శించడం ఆచారం అయిపోయింది. మోక్షం పొందడానికి భక్తి అవసరం కావొచ్చునేమో కాని రాజకీయాల్లో భక్తి వల్ల మనం అధోగతికి చేరతాం. దీనివల్ల కలిగే పరిణామం పరిహరించలేనిది అవుతుంది - అది నియంతృత్వమే అవుతుంది.

"మూడో ముఖ్యమైన విషయం మనం కేవలం రాజకీయ ప్రజాస్వామ్యం తోనే సంతుష్టులం కాకూడదు. ఈ ప్రజాస్వామ్యం మన సాంఘిక, ఆర్థికరంగాల్లో పూర్తిగా ఆవరించుకుని నిండిపోయేటట్టుగా మనం నిరంతరం ప్రయత్నం చేయాలి. అంటే ప్రజాస్వామ్యం కేవలం రాజకీయంగానే కాదు ఆర్థికంగానూ సాంఘికంగానూ కూడా కావాలి."

తన ఉపన్యాసంలో ఎర్రజెండా లాగ ప్రమాదపు దీపాన్ని చూపిస్తూ ఆయన హెచ్చరించారు - "1950 జనవరి 26 వ తారీఖు నుండి దేశపు రాజకీయ జీవితంలో సమానత్వం అడుగుపెడుతుంది. కాని సాంఘిక జీవితంలోనూ ఆర్థిక జీవితంలోనూ అసమానత్వమే నిలిచి ఉంటుంది. ఈ వ్యత్యాసం, అసంగతం అలాగే ఉంటే ఈ వ్యత్యాసపు తాపంతో ఉడుకెత్తిన వర్గం మనం ఎంతగానో శ్రమించి నిర్మించిన ఈ రాజకీయ భవనాన్ని ధ్వంసం చేయక మానదు."

డా॥ అంబేద్కరు గారు ధారాప్రవాహంగా ఇచ్చిన ఈ ఉపన్యాసాన్ని నలభై నిమిషాల పాటు సభా భవనంలో ఉన్నవారంతా నిశ్శబ్దంగా విన్నారు. మధ్యమధ్య కరతాళ ధ్వనులతో భవనం ప్రతిధ్వనించింది. మరుచటి రోజు దేశం నలుమూలల నుంచి ఈ ఉపన్యాసాన్ని తమంతతాముగా

అతి సహజంగా అందరూ స్వీకరించారు. వార్తా పత్రికల కాలములు డా॥ అంబేద్కరు ప్రశంసలతో నిండిపోయాయి.

నవంబరు 29 వ తారీఖున రాజ్యాంగసభ ఈ రాజ్యాంగాన్ని తమ దేశం కోసం స్వీకరించింది. తమ ముగింపు ఉపన్యాసంలో రాజ్యాంగసభ అధ్యక్షులు డా॥ రాజేంద్ర ప్రసాదు డా॥ అంబేద్కరు కృషిని ఎంతో గౌరవభావంతో ఉటంకించారు. "దిగజారుతున్న తమ ఆరోగ్యాన్ని కూడా లక్ష్యపెట్టకుండా డా॥ అంబేద్కరు చూపించిన కార్యదక్షత వల్ల వారిని ఈ కార్యానికి ఎన్నుకోవడం సార్ధకం అవడమే కాదు ఆ పదవికే హుందాని తెచ్చిపెట్టింది." అని అన్నారు.

## ఏభై

భారత రాజ్యాంగపు పని పూర్తికాగానే బాబాసాహబు హిందూ కోడ్ బిల్లు తయారు చెయ్యడంలో లీనమయ్యారు. ఇంతకుపూర్వం రావ్ కమిటీ హిందూ కోడ్ బిల్లుని తయారుచేసింది. కాని దానిలో ఆమూలాగ్రంగా మార్పులు చేసి డా॥ అంబేద్కరు 1948 అక్టోబరులో రాజ్యాంగసభలో తాను తయారుచేసిన హిందూ కోడ్ బిల్లుని సమర్పించారు. ఈ కారణం చేత మరోసారి మళ్లీ యావత్ భారతదేశంలో అలజడి రేగింది.

1950 జనవరి 2వ తారీఖున అంబేద్కరు బొంబాయి తిరిగివచ్చారు. అప్పుడు విమానాశ్రయంలో ఆయనకు ఘనంగా స్వాగతం పలికారు. జనవరి 11 వ తారీఖున సిద్ధార్థ కాలేజీ పార్లమెంటులో ఉపన్యసిస్తూ సమర్పించబడిన బిల్లు ప్రగతికి అడుగు అని చెప్పారు. భారత రాజ్యాంగంలో యావద్దేశానికి ఒకే ఒక పౌరచట్టాన్ని చెయ్యటానికి ప్రయత్నించాలన్న సూచన ఉన్నాది. ఈ హిందూ కోడ్ బిల్లు, హిందువుల ధర్మశాస్త్రం ఆధారంగా ఉన్న బిల్లు.

అదే రోజు సాయంత్రం బొంబాయి ప్రాంతపు షెడ్యూల్డు కాస్టు ఫెడరేషను తరపున ఆయనని సత్కరించారు. భారత్ రాజ్యాంగపు కాపీనొక దానిని ఆయనకి ఇచ్చారు. ఈ సత్కారానికి సమాధానం చెప్తూ

ఆయన ఇలా అన్నారు - "మానవ జీవితంలో ఇలాంటి సువర్ణావకాశం అరుదుగానే లభిస్తుంది. ఈ అవకాశం నాకు లభించినందుకు నేను గర్వపడుతున్నాను." "దళితులు తమంతటతాము జాతీయ స్వభావాన్ని పెంపొందించుకుని తదితర సమాజాలవారి సానుభూతిని సంపాదించాలి," అని ఆయన సలహా ఇచ్చారు.

1950 జనవరి 29 వ తారీఖున ఢిల్లీ నగరానికి చెందిన మహారాష్ట్ర మండలి, తదితర మరాఠీ సంస్థలు కలిసి డా॥ అంబేద్కరుని సన్మానించాయి. ఈ సందర్భంలో ఆయన ఇలా చెప్పారు - "ఏ మహారాష్ట్రుడూ జాతీయ ప్రేమ విషయంలోగాని, కర్తవ్య దీక్షలో గాని తదితరుల్లో ఏ వ్యక్తి కన్నా తక్కువవాడు కాడు. జ్ఞానంలోనూ, త్యాగనిరతిలోనూ మరాఠీలు అందరికన్నా ముందు ఉన్నారు."

అదే రోజుల్లో బ్లేకు క్లార్కు అనే రచయితకు డా॥ అంబేద్కరు ఇంటర్వ్యూ ఇచ్చారు. ఆ ఇంటర్వ్యూలో ఆయన ఇలా అన్నారు - "గరుడ పక్షికి ఎగిరేటప్పుడు, - బాగా ఎత్తుగా ఆకాశం మీదకి ఎగిరేటప్పుడు గాలి ప్రతిఘటనని ఎదురుకుంటూ మీదకి ఎగరాల్సి వస్తుంది. గాలి వాటాన్ని అది ఊతగా తీసుకోదు. అస్పృశ్యులు కూడా అల్లాగ్గానే పరిస్థితులను ఎదుర్కొంటూ మీదకి లేవాలి. ఔన్నత్యం పొందాలి."[1]

1950 ఏప్రిలు 14 వ తేదీన యావద్దేశంలో డా॥ అంబేద్కరు పుట్టిన రోజు పండగని ఎంతో ఉత్సాహంతో జరిపారు.

1950 మే నెలలో బుద్ధ జయంతి జరపబడ్డాది. ఈ సందర్భంలో డా॥ అంబేద్కరు గొప్ప ఉపన్యాసాన్ని ఇచ్చారు - "బుద్ధుడిని వదిలేస్తే తతిమ్మా మత ప్రవక్తలు అందరూ తమను తాము మోక్షదాతలుగా చెప్పుకున్నారు. దీనిని విరుద్ధంగా బుద్ధుడు తనకి ఏవిధమైన దైవత్వాన్ని ఆపాదించుకోకుండా తనని ఒక మార్గదర్శకుడిగా చెప్పుకున్నాడు, బుద్ధుడి మతం నీతి, ధర్మం."

మహాబోధి సొసైటీ బుద్ధ జయంతి ప్రత్యేక సంచికను వెలువరించింది. ఈ ప్రత్యేక సంచికలో డా॥ అంబేద్కరు "బుద్ధ ఎండ్ ది ఫ్యూచర్ ఆఫ్ హిజ్ రెలిజియన్" అనే శీర్షికతో రాసిన ఒక వ్యాసం అచ్చు అయింది. ఆ వ్యాసంలో ఆయన నాలుగు వాదాల్ని ప్రతిపాదించారు :

1. రీడర్సు డైజస్టు : మార్చి 1950

(1) సంఘానికి నిగ్రహం అవసరం అంటే దానికి నీతి కావాలి. (2) మతం ప్రయోజనకారి అయితే అది ఆచరణ ధర్మం, వివేకం మీద ఆధారపడాలి. (3) సమానత్వం, స్వాతంత్ర్యం, సౌభాతృత్వంతో కూడిన నీతి నియమాలు మతంలో ఉండాలి. (4) మతం ఎప్పుడూ దారిద్ర్యాన్ని ఉదాత్తం చెయ్యకూడదు. ఈ వాదాలను ప్రతిపాదించి, ఈ నాలుగు కొలబద్దల మీద మతాన్ని కొలిచిచూస్తే కేవలం బౌద్ధమతమే విశ్వవ్యాప్తమైన మతం కాగలదు అన్న విషయం నిష్కర్షగా అర్థమవుతుంది అని ఋజువు చేశారు.

1950 మే 5వ తారీఖున ఆయన న్యూఢిల్లీ నుంచి బొంబాయి వచ్చారు. 'జనత' వార్తాపత్రికకు ఇచ్చిన తన ఇంటర్వ్యూలో ఆయన తాను బౌద్ధమతాన్ని స్వీకరించబోతున్నట్లు ఖచ్చితమైన మాటల్లో చెప్పారు.

కొలొంబోలో జరగబోతున్న బౌద్ధ పరిషత్తుకి హాజరు కావడానికిగాను డా॥ అంబేద్కరు 1950 మే నెల 25 న తారీఖున విమానంలో కొలొంబో వెళ్లారు. వార్తా పత్రికలకు ఇచ్చిన ఇంటర్వ్యూలో తాను మత సంబంధమైన ఉత్సవాల్లో పాల్గొని, మత నియమాలను అభ్యసించబోతున్నట్టుగా చెప్పారు. ఆ తర్వాత ఆయన కైండీలో ఏర్పాటైన పరిషత్తుకి హాజరయ్యారు. కొలొంబోలోని యంగ్‌మెన్స్ బుద్ధిస్ట్ ఎసోసియేషను ప్రతినిధుల సమక్షంలో 'భారతదేశంలో బౌద్ధమతపు ఔన్నత్యమూ, పతనమూ,' అన్న విషయం మీద డా॥ అంబేద్కరు ఉపన్యాసం యిచ్చారు. ఆయన ఇలా అన్నారు - "భారతదేశంలో బౌద్ధమతం లోపించిపోయినట్లు అనిపించవచ్చును కాని దాని వేళ్లు చాలా లోతుగా వ్యాపించి ఉన్నాయి. బౌద్ధమతం మనకి సమానత్వాన్ని బోధిస్తుంది. శంకరాచార్యులు, ఆయన గురువూ బౌద్ధులే." ఇది చెప్పి ఆయన బౌద్ధ మత పతన కారణాలను విశ్లేషించి చర్చించారు.

ఈ సభ తర్వాత ఆయన కొలొంబో టవును హాల్లో ఒక సభకి మార్గ నిర్దేశం చేశారు. ఆయన అక్కడ హాజరైన దళిత సమాజం వారికి బౌద్ధమతాన్ని స్వీకరించి, తమ ప్రత్యేకమైన అస్తిత్వాన్ని బౌద్ధ సమాజంలో విలీనం చేసుకోమని సలహా ఇచ్చారు. ఆదిలో భారతదేశం నుండి అక్కడికి వచ్చి స్థిర నివాసం ఏర్పరచుకున్న వారిమీద ఆయన ఉపన్యాసపు ప్రభావం చాలా గట్టిగా పడింది. దాంతో అక్కడ 450 మంది భారతీయులు బౌద్ధ

మతాన్ని స్వీకరించారు. ఆ తర్వాత అక్కడ నుంచి అంబేద్కరు భారతదేశానికి తిరిగివచ్చారు. ఆయన త్రివేండ్రమూ, మద్రాసు కూడా వెళ్లారు. త్రివేండ్రంలో ఆయన ఇలా అన్నారు - "రాజ్యాంగం కన్నా రాజ్యాంగ విధానం ఎక్కువ ప్రధానమైనది." త్రివేండ్రం అతిథిగృహంలో ఆయన కేరళ ముఖ్యమంత్రి, ఏడ్వకేటు జనరల్, హైకోర్టు జడ్జిలు, వకీల్లు మొదలైన ఉన్నత పదవుల్లో ఉన్నవారికి హిందూకోడ్ బిల్లు ప్రాముఖ్యాన్ని గురించి వివరించారు.[1] ఆయన దేవాలయాల్లో ఘోరంగా జరిగే నష్టానికి విచారాన్ని వెలిబుచ్చారు.

తన మద్రాసు ప్రవాసంలో ఆయన 'సౌత్ ఇండియన్ బుద్ధిస్టు ఎసోసియేషను నుంచి పి. లక్ష్మీనరసు రాసిన ముద్రితముల ప్రతి 'బుద్ధిజమ్ ఇన్ మాడర్న్ లా ఇట్' అన్నదానిని సంపాదించారు. 700 టైపు చేసిన పేజీలు ఉన్న ఈ మూలప్రతి వారసుల అనుమతి లభ్యం కాని కారణంగా ప్రచురణకు నోచుకోలేదు.[2] బాబాసాహబు ఆపోధీదాసు రాసిన తమిళ వ్యాసాన్ని కూడా అనువాదం చేయించారు.

బాబాసాహబు బొంబాయి తిరిగి వచ్చాక జూలై 25 వ తారీఖున రాయల్ ఎసియాటిక్ సొసైటీ తరపున ఏర్పాటు చేయబడిన సభలో ఉపన్యాసం ఇస్తూ బౌద్ధ మతం మీద చేయబడిన విమర్శలని - ఆరోపణలని ఖండించారు. ఈ సభ ప్రొ. ఎన్.కె. భాగవత్ అధ్యక్షతన జరిగింది. ఈ సభలో ఆయన ఇలా అన్నారు - "నాకు బాల్యం నుంచీ బౌద్ధ మతం పట్ల శ్రద్ధాసక్తులు ఉన్నాయి." ఆయన మద్రాసు నుంచి తిన్నగా ఢిల్లీ వెళ్లారు.

సెప్టెంబరు 29 వ తారీఖున బొంబాయిలోని వరలీ బౌద్ధవిహార్‌లో ఆయన ఉపన్యాసం యిచ్చారు. తన ఉపన్యాసంలో ఆయన బౌద్ధమతాన్ని స్వీకరించవలసినదిగా పిలుపునిచ్చారు. బౌద్ధమతాన్ని పునరుద్ధరించటానికి, ప్రచారం చేయటానికి ఇప్పుడిహ తన జీవితాన్నంతటినీ సమర్పించ బోతున్నట్టు ఆయన ప్రకటించారు.

1. శ్రీ వి.పి.ఎస్. మనియార్ బాబా సాహబుకు రాసిన ఉత్తరం, తే. 25.9.1950 (హైకోర్టు పత్రాలు).
2. శ్రీ కె.ఎస్. గణేశన్ వ్యక్తిగత ఉత్తరప్రత్యుత్తరాలు (డా|| అంబేద్కరు ఉత్తరాలు తే 10.7.50 ; 7.10.50 ; 11.7.51) 72 సంవత్సరాల వయస్సున్న గణేశన్ బాబాసాహబును అనేక పర్యాయాలు కలిసి ఈ గ్రంథాన్ని ప్రచురించమని కోరారు. కాని బాబాసాహబు పని ఒత్తిడిలో ఉన్న కారణంగా ఇది అచ్చు కావడం జరగలేదు.

# ఏభై ఒకటి

బొంబాయి నుంచి డా|| అంబేద్కరు ఢిల్లీ వెళ్లారు. ఆయన హిందూ కోడ్ బిల్లు కోసం తన యావచ్ఛక్తిని వినియోగించారు. 1950 డిసెంబరు వరకూ ఈ బిల్లు ఎక్కడ ఉన్నది అక్కడే ఉన్నాది. ముందుకు జరగలేదు. ఆయన హిందూ కోడ్ బిల్లు స్వరూపం ఉద్దేశం మొదలైన వాటిని స్పష్టపరిచే పుస్తకాన్ని, 39 పేజీలున్న దాన్ని అచ్చు వేయించి సభా గృహంలో పంచిపెట్టించారు.

హిందూ కోడ్ బిల్లు ప్రత్యేకమైన ఒక తెగకి వర్తిస్తుందని పార్లమెంటు సభ్యులు అన్నారు. డా|| పంజాబ్‌రావ్ దేశముఖ్ లాంటి బ్రాహ్మణేతర విద్యావేత్త కూడా ఈ బిల్లుకి వ్యతిరేకతని ప్రకటించడం ఆశ్చర్యమైన విషయమే.[1] వ్యతిరేకులు లేవనెత్తిన ప్రతి అంశాన్నీ అంబేద్కరు తన వాదాల ద్వారా ఖండించారు. సభ్యులు కాలయాపన చేసే నిశ్చయాలను పరోక్షంగా స్పీకరు కూడా సమర్థించారు. ఈ బిల్లును కొత్తగా ఎన్నికైన సభ్యుల ముందు పెట్టవలసినది అని అన్నప్పుడు డా|| అంబేద్కరు కోపంతో ఇలా అన్నారు - ప్రతీ పర్యాయం, ఏదన్నా ముఖ్య విషయం మీద నిర్ణయం తీసుకోవడానికి ముందు చట్టం అంటే తెలియని వారి సమక్షానికి పార్లమెంటు చర్చించటానికి వెళ్లాల్సి వస్తే ఆ పార్లమెంటు ఉండి దండగ. దాన్ని ఎత్తి వెయ్యడమే ఉత్తమం అవుతుంది. "క్రీ.శ. 1830 నుంచి హిందూ న్యాయ నిర్వచనంలో బౌద్ధులు, సిక్కులు, జైనులు - కలపబడే ఉన్నారు. అంచేత ఈ బిల్లు వారందరికీ వర్తించబోతుంది. ఈ బిల్లు మీద మూడురోజుల పాటు చర్చ సాగింది. అయితే ఫలితం శూన్యమే అయింది.

"బౌద్ధ మతం కారణంగా స్త్రీల అధఃపతనం జరిగింది," అన్నీ సిద్ధాంతాన్ని అదే రోజుల్లో 'ఈవ్స్ వీక్లీ' అనే స్త్రీల మాసపత్రికలో మహిళల మీద వ్యాసం రాస్తూ ఒక రచయిత ప్రతిపాదించాడు. దానికి జవాబు రాస్తూ డా|| అంబేద్కరు 'మహాబోధి' అనే మాసపత్రికలో 1951 లో రైజ్

1. ఐ. నారాయణ ఎండ్ ఉపరేతి : పే. 353

ఎండ్ ఫాల్ ఆఫ్ ది హిందూ విమెన్ అన్న శీర్షికతో ఓ వ్యాసం రాశారు. ఈ వ్యాసంలో ఆయన ఈ సిద్ధాంతాన్ని ప్రతిపాదించారు - "బౌద్ధ యుగంలో భారత స్త్రీ కి లభించిన స్వాతంత్ర్యాన్ని మనువు నాశనం చేశాడు. బుద్ధుడు స్త్రీ కి పరివ్రాజక లేదా భిక్షుణి అవడానికి అనుమతి ఇచ్చాడు. దాంతో స్త్రీ కి విద్యని పొందే స్వేచ్ఛ దొరికింది. దాంతోపాటు ఆత్మోన్నతికి కూడా స్వాతంత్ర్యం లభించింది. దాని ఫలితంగా మొత్తం సమాజంలోనే బుద్ధుడు విప్లవం తెచ్చాడు. స్త్రీలకు స్వాతంత్ర్యం, గౌరవంతో పాటు ప్రతిష్ఠ కూడా కలిగింది. కాని మనువు బౌద్ధ మతాన్ని స్వీకరించే ఈ స్త్రీల ప్రవాహాన్ని అడ్డుకోవడానికిగాను నానారకాలైన కట్టుబాట్లను పెట్టాడు. వారిని దాస్య శృంఖలాలతో కట్టి పడేశాడు."

1951 ఏప్రిలులో డా|| అంబేద్కరు ఢిల్లీలో అంబేద్కరు భవనానికి శంఖుస్థాపన చేశారు. ఈ సందర్భంలో మాట్లాడుతూ ప్రభుత్వం అస్పృశ్యుల కోసం ఏమీ చెయ్యలేదు అని ప్రభుత్వం మీద ఆరోపణ చేశారు.

1951 మే నెలలో ఢిల్లీలో జరిగిన బుద్ధ జయంతి ఉత్సవంలో ఉపన్యాసం యిస్తూ బాబాసాహబు హిందూమతాన్ని తీవ్రంగా విమర్శించారు. ఫ్రాన్సు రాయబారి ఈ సభకి అధ్యక్షత వహించారు. అనేక దేశాల నుంచి ప్రతినిధులు ఈ సభకు హాజరయ్యారు.

1951 సెప్టెంబరు 9 వ తారీఖున డా|| రాజేంద్రప్రసాద్ ఔరంగాబాదు లోని మిలింద కాలేజీకి శంఖుస్థాపన చేశారు. బాబాసాహబు స్వయంగా చివరివరకూ డా|| రాజేంద్రప్రసాద్‌తోపాటు ఉన్నారు. 1951 ఆగష్టు 10వ తారీఖున డా|| అంబేద్కరు తన ఆరోగ్యం రోజు రోజుకీ బాగా దిగజారి పోతూ ఉన్న కారణం చేత ఆగష్టు 16 వ తారీఖు నుంచి సెప్టెంబరు ఒకటవ తారీఖు వరకూ హిందూ కోడ్ బిల్లుని చర్చకు పెట్టవలసినదనీ, దాని ఆమోదింప చేయవలసినదనీ పండిత నెహ్రూకి ఉత్తరం ద్వారా సూచించారు. ఆయనను ఓపిక పట్టవలసినదిగా నెహ్రూ సలహా ఇచ్చారు.

1951 సెప్టెంబరు 17వ తారీఖున బిల్లు రెండవసారి చర్చకి వచ్చినప్పుడు డా|| శ్యామాప్రసాద్ ముఖర్జీ ఆధునిక యుగపు మనువుననీ, యజ్ఞవల్క్యుణ్ణనీ అనిపించుకోవాలని అంబేద్కరు కోరిక" అని వ్యంగ్యంగా అన్నారు. 'ప్రజాభిప్రాయం సేకరించిన తర్వాతే చట్టంగా చెయ్యడం ఎక్కువ ఉపయుక్తంగా ఉంటుంది అని పంజాబ్‌రావ్ దేశ్‌ముఖ్ తన

అభిప్రాయాన్ని చెప్పారు. కు. జయశ్రీ అనే పేరు గల పార్లమెంటు సభ్యురాలు, డా. కుంజరు బిల్లుని చాలా గట్టిగా సమర్థించారు. కావాలని నిష్కారణంగా చర్చని సాగతియ్యడానికి ప్రయత్నం కొనసాగింది. ప్రధానమంత్రి అభ్యర్థన ప్రభావం కూడా సభ్యులమీద పడలేదు.

పండిత మదన్‌మోహన్ మాలవ్యలాంటి హిందూ నాయకులు బిల్లుకి వ్యతిరేకంగా పార్లమెంటు లోపలా, వెలుపలా ప్రజాభిప్రాయాన్ని కూడగడుతున్నారు. కాని కు.పద్మజానాయుడు బిల్లుని సమర్థించటానికి, దానికోసం కూడగట్టడానికి తన యావచ్ఛక్తినీ వినియోగిస్తోంది.

బిల్లుమీద చర్చ కొల్లేటి చాంతాడులా సాగుతూనే ఉంది. ప్రతి చిన్న అంశానికి, చితక అంశానికి జాప్యం చెయ్యాలన్న భావంతో జాప్యం చెయ్యడం జరుగుతోంది. అంచేత తొందరలో అది పూర్తి అవుతుందన్న నమ్మకం సన్నగిల్లి ఆశ మసగబారిపోతుంది. "ఒక్కొక్క నిబంధన మీద వారం వారం రోజులు చర్చ సాగడం అన్నది పార్లమెంటు చరిత్రలో ఇల్లాగా ఎప్పుడూ జరగలేదు." అని డా॥ అంబేద్కరు ఎంతో క్షోభపడుతూ అన్నారు.

విడాకులకు సంబంధించిన 4వ క్లాజు మీద చర్చ జరిగిన ప్పుడు పార్లమెంటు సభ్యులందరూ అంబేద్కరు మీద విరుచుకుపడ్డారు. ఒకరు అంబేద్కరుని "కలియుగపు మనువు గారు" అని సంబోధించారు. వ్యక్తిగతమైన వ్యాఖ్యని ఉపేక్షించి డా॥ అంబేద్కరు కింకర్తవ్యతా మూఢులయ్యారు. ఇలా అన్నారు – "నన్ను ఎంతగా దూషించాలనుకుంటే అంతగా దూషించండి. కాని కాలాన్ని అధికంగా వ్యర్థం చెయ్యకండి. ఈ దూషణలు, తిట్లూ – తిమ్మలూ కన్నా ఎక్కువ ముఖ్యమైనది సమయం విలువ అని నాకు తోస్తోంది."

కాని ఆ తర్వాత ఈ హిందూ కోడ్ బిల్లులోని తదితర క్లాజులను చర్చకు తీసుకోకపోవడంతో పండిత నెహ్రూ తనపట్ల నమ్మక ద్రోహం చేశారు అని డా॥ అంబేద్కరుకి అనిపించింది.

1951 సెప్టెంబరు 27వ తారీఖున డా॥ అంబేద్కరు మంత్రి పదవి నుండి వైదొలగడానికి రాజీనామాని నెహ్రూకి పంపించారు. రాజీనామా గురించి స్టేటుమెంటు ఇవ్వడానికి 1951 అక్టోబరు 11వ తారీఖున స్పీకరు అడ్డంకి చెప్పారు. ఆయన వెంటనే సభా గృహాన్ని వదిలి బయటికి

వచ్చేశారు. తన రాజీనామా కాపీని వార్తాపత్రికల ప్రతినిధులకు పంపించారు. "సంఘం గతాన్ని విడిచిపెడ్తున్నప్పుడు, భవిష్యత్తుని అంచనా వేసుకుంటున్నప్పుడు, వివేకం ఒక్కటే గీటురాయి అవుతుంది. ఏ విషయాన్నైనా ఆ గీటురాయి మీదే పరీక్షించి చూడాలి. అంచేత పరస్పర వర్గాల మధ్య, స్త్రీ పురుషుల మధ్య అసమానత్వమే ఆత్మగా కల హిందూ సంఘాన్ని వేళ్లతో సహా కుదపి కదల్చకుండా మనం ఒకదాని తర్వాత ఒకటిగా కేవలం ఆర్థిక సంబంధమైన అంశాల మీదే చట్టాలు చేసుకుంటూ పోతే ఈ రాజ్యాంగం వెకసెక్కానికి, ఎగతాళికి సరిపోయినది అవుతుంది. లేదా ఇసకమీద కోటని కట్టే ప్రయత్నం అవుతుంది." అని డా|| అంబేద్కరు తన విజ్ఞప్తిలో తెలియచేశారు.[1]

డిసెంబరు 22వ తారీఖున పార్లమెంటు సమావేశాలు అనిర్దిష్ట కాలంవరకూ వాయిదా పడ్డాయి. ఈ కారణం చేత డా|| అంబేద్కరు బొంబాయి వచ్చారు. ఆయన వరలీ బౌద్ధ విహార్‌లో బౌద్ధ మతం మీద ఉపన్యాసం ఇచ్చారు.

## ఏభై రెండు

1951 జూలైలో డా|| అంబేద్కరు ఇండియన్ బుద్దిస్ట్ సొసైటీని స్థాపించారు. 1951 అక్టోబరులో దళిత ఫెడరేషను కార్యవర్గ సమావేశం డా|| అంబేద్కరు అధ్యక్షతన ఢిల్లీలో జరిగింది. ఈ సమావేశంలో బాబాసాహబు తయారుచేసిన ఫెడరేషను ఎన్నికల మానిఫెస్టో ఆమోదించబడ్డాది. కాశ్మీరు మీద డా|| అంబేద్కరు వెలిబుచ్చిన అభిప్రాయంతో మానవేంద్రనాథ్ రాయ్ తన ఆమోదాన్ని తెలిపారు. ఆ పిమ్మట కొద్ది రోజులకే లక్నో విశ్వవిద్యాలయం విద్యార్థుల సమక్షాన అందరినీ హెచ్చరిస్తూ డా|| అంబేద్కరు ఇలా అన్నారు – "దేశం గాని కమ్యూనిస్టు అయితే ఈ దేశపు భవిష్యత్తు ప్రమాదంలో పడుతుంది. మనం కాశ్మీరు యావత్తునీ కాపాడుకోలేకపోతే పోనీ కనీసం మన మిత్రుల్ని కాపాడుకోవాలి." హిందువులకి ఇదీ ఆయన ఇచ్చిన సందేశం.

1. ఆ.ప. నారాయణ : పే. 248 – 49

ఈ రోజుల్లోనే సోషలిస్టు పార్టీతో పాటు ఎన్నికల్లో సహకరించే నిమిత్తం ఆయన అడుగు వేశారు. జనవరి 18 వ తారీఖున ఆయన బొంబాయి వచ్చినప్పుడు సోషలిస్టు పార్టీ, దళిత ఫెడరేషను తరఫున ఆయనకి అఖండమైన స్వాగతం చెప్పారు. బోరీబందర్ స్టేషన్ నుంచి ఆయనని, అంటే సిద్ధార్థ కాలేజీ పరిసరాల నుంచి ఆయన నివాస స్థలం వరకూ ఘనంగా ఊరేగిస్తూ తీసుకువెళ్లారు. సాయంత్రం చౌపాటీలో బ్రహ్మాండమైన సభ జరిగింది. ఆ సభలో ఎన్నికల ప్రచారానికి శ్రీకారం చుడుతూ ఆయన ఇలా అన్నారు - "సుభాష్ బోసు కారణంగానే దేశం స్వతంత్రం అయింది." మరుచటి రోజు ఫెడరేషను, సోషలిస్టు పార్టీ తరఫున జహంగీరు హాలులో ఏర్పాటు చేయబడిన సభలో - "కాంగ్రెసు కారణంగానే అవినీతి పిశాచం దేశానికి పట్టుకుంది." అని దోషారోపణ చేశారు. పరే పార్కులో ఏర్పాటు చేసిన సభలో కూడా ఆయన అస్పృశ్యుల సమస్య మీద ప్రభుత్వాన్ని గట్టిగా దుయ్యబెట్టారు. నవంబరు 25వ తారీఖున శివాజీపార్కులో రెండు లక్షల మంది జనం హాజరైన బ్రహ్మాండమైన సభలో ఆయన ఒక శక్తివంతమైన ప్రతిపక్ష పార్టీ అవసరాన్ని నొక్కి చెప్పారు. నెహ్రూని సోషలిస్టు పార్టీలో ప్రవేశించమని పిలుపునిచ్చారు.

1952 జనవరిలో సాధారణ ఎన్నికలు జరిగాయి. అంబేద్కరు భూమిక కమ్యూనిష్టు వ్యతిరేకమైనదవడం చేత కామ్రేడు డాంగే రిజర్వుడు సీటుకి ఎవరికీ ఓటు వేయకండి అంటూ ప్రచారం మొదలుపెట్టారు. దాదాపు 50 వేల ఓట్లు చెల్లవని ప్రకటించబడ్డాయి. ఈ సాధారణ ఎన్నికల్లో డా॥ అంబేద్కరు 14 వేల ఓట్ల తేడాతో ఓడిపోయారు. ఎన్నికల ఫలితాలు ప్రకటించబడినప్పుడు డా॥ అంబేద్కరు బొంబాయిలో ఉన్నారు. ఆయన ఈ ఎన్నికల ఫలితం ఆశ్చర్యాన్ని కలిగించింది. అదేవిధంగా కలకత్తాలో సోషలిస్టు పార్టీ నాయకుడు జయప్రకాష్ నారాయణ కూడా ఆశ్చర్యాన్ని వెలిబుచ్చారు.

డా॥ అంబేద్కరు స్వభావమే పార్లమెంటేరియన్ స్వభావం. రాజకీయాలతో తెగతెంపులు చేసుకుని ఏ సంబంధం లేకుండా ఉండాలని ఆయన అనుకోలేదు. 1952 లో బొంబాయి విధానమండలి నుంచి రాజ్యసభకి సభ్యుల ఎన్నిక జరగవలసి ఉన్నది. దానికోసం గాను అభ్యర్థులను

ఎన్నుకోవలసి ఉంది. డా॥ అంబేద్కరు తమ నామినేషను పత్రాన్ని నింపారు. 17 మంది అభ్యర్థుల్లో ఆయన గెలుపు పొందారు.

1952 మే నెలలో రాజ్యసభ సమావేశంలో పాల్గొనడానికి బాబాసాహబు ఢిల్లీ వెళ్లారు. బడ్జెటు మీద జరిగిన చర్చలో పాల్గొంటూ ఆయన ప్రభుత్వం మీద ఆర్గ్యుమెంట్ల గుప్పెత్తించారు. "దేశోన్నతి కోసం అవసరమైన ధనాన్ని సైన్యం మీద ఖర్చు చేస్తున్నారు. దానికి కోత పెట్టాలి" అని డిమాండు చేశారు.

కొలంబియా విశ్వవిద్యాలయం వారు తమ పూర్వ విద్యార్థులను సన్మానించాలని తలపెట్టారు. 1950 జూన్ 5వ తారీఖున విశ్వవిద్యాలయం స్నాతకోత్సవం జరగబోతోంది. ఈ ఉత్సవంలో డా॥ అంబేద్కరుకి డాక్టర్ ఆఫ్ లాజ్ బిరుదుని ఇవ్వడానికి నిర్ణయించారు.

మే 31వ తారీఖున డాక్టరు సాహబు ఢిల్లీ నుంచి బొంబాయి వచ్చారు. అక్కడ క్రికెట్ క్లబ్బు ఆఫ్ ఇండియా ప్రాంగణంలో ఆయనకు గొప్ప విందు ఇచ్చారు. "భారతదేశంలోని ఏ విశ్వవిద్యాలయం వారికీ డా॥ అంబేద్కరుకి గౌరవ బిరుదం ప్రదానం చెయ్యాలన్న యోచన ఎందుకు కలగలేదో అని అక్కడ ఉపన్యాసం యిచ్చిన వక్తలు విస్మయాన్ని ప్రకటించారు. "అక్కడ నా దేశానికి వ్యతిరేకంగా నేను ఒక్క మాటన్నా మాట్లాడతానేమోనని మీరు మీ మనస్సులో ఊహించనైనా ఊహించకండి. ఎప్పుడూ దేశ హితం కోసమే దీక్షా తత్పరతతో నేను పనిచేస్తూ ఉన్నాను. దేశ హితాన్ని తప్ప మరే విషయం గురించీ ఒక్క క్షణమన్నా నేను యోచించలేదు. రౌండుటేబిలు సమావేశంలో కూడా దేశ ప్రేమ విషయంలో మహాత్మగాంధీ కన్నా కూడా నేను 200 మైళ్ల ముందే నడిచాను," అని ఆయన ఆ సందర్భంలో మాట్లాడుతూ చెప్పారు.

బాబాసాహబు బొంబాయి నుంచి 1952 జూన్ 1వ తారీఖున విమానంలో న్యూయార్కుకి బయల్దేరారు. భార్యని కూడా తీసుకు వెళ్లడానికి కావలసినంత పైకం మొత్తం లేకపోవడం చేత ఆయన ఆవిణ్ణి తీసుకుని వెళ్లలేకపోయారు. విమానాశ్రయంలో ఆయనకు వీడ్కోలు చెప్పడానికి అసంఖ్యాకంగా జనం వచ్చారు. కొలంబియా విశ్వవిద్యాలయం తొమ్మిది మంది ప్రఖ్యాత విద్వాంసులకు "డాక్టర్ ఆఫ్ లాజ్" డిగ్రీ ప్రదానం చేసింది. బాబాసాహబుకు ఈ సత్కారం చేస్తూ, ప్రశంసాత్మకంగా ఆయన

గురించి పేర్కొంటూ, ఆయన రాజ్యాంగ రచయిత, మంత్రిమండలిలోనూ రాజ్యసభలోనూ గౌరవనీయులైన సభ్యులు, భారతదేశపు అతి విశిష్ట పౌరులు, గొప్ప మేధావి, సంఘ సంస్కర్త, మానవ హక్కుల కోసం పోరాడే ప్రవక్త అని చెప్పారు.

1952 జూన్ 14వ తారీఖున డాక్టరు సాహెబు భారతదేశానికి తిరిగివచ్చారు. "అమెరికను ప్రజలలో పాకిస్తాను పట్ల సానుభూతి కనిపించింది. విదేశానికి తమ ప్రతినిధులను పంపే విషయంలో పాకిస్తాను ఎక్కువ ధ్యాస పెడుతుందన్న సంగతి వాకబు చేయగా తెలిసింది. భారతదేశం నుండి విదేశాలకి వెళ్లిన ప్రభుత్వ ప్రతినిధులు, రాయబారులు విశేషమైన అనుభవం లేనివారు. వారికి శిక్షణ యిచ్చే విధానమూ అతి తక్కువ స్థాయిది" అని అంబేద్కరు పత్రికా విలేఖరులకు సమాధానం చెప్తూ వివరించారు.

బొంబాయిలోని ఎలిఫిస్టన్ హైస్కూలులో ఏర్పాటు చేసిన సౌహార్ద్ర సమావేశంలో డిసెంబరు 16వ తారీఖున ఆయన విద్యార్థులకు హితబోధ చేశారు. ఈ నెలలోనే ఆయన పూనా కూడా వెళ్లారు. అక్కడ ఆయన డిసెంబరు 22వ తారీఖున జిల్లా గ్రంధాలయంలో శ్రీ ఎల్.ఆర్. గోఖలే చిత్రపటాన్ని ఆవిష్కరించారు. ఆ సందర్భంలో ప్రజాస్వామ్యాన్ని విజయవంతంగా నడపడానికి అవసరమైన విషయాల గురించి ఆయన వివరించి చెప్పారు. ప్రజాస్వామ్యపు స్వరూపమూ, ఉద్దేశమూ సదా మార్పు చెందుతూ ఉంటాయి. భారతీయ ప్రజాస్వామ్యంలో ప్రజాస్వామ్యపు ముఖ్యమైన వాఖ్యానం ఎల్లగ్గా వక్రభాష్యంగా చేసి చెప్పబడుతుందో ఆయన స్పష్టీకరించారు. "సమాజపు సాంఘిక జీవితంలోనూ, ఆర్థిక జీవితంలోనూ రక్తపాతమన్నది లేకుండా విప్లవాత్మకమైన మార్పు తేగలిగే పరిపాలనా వ్యవస్థ పరిపాలనా విధానం ప్రజాస్వామ్యం" అని ఆయన చెప్పారు. ఆలోచనలు రేకెత్తించే ఈ ఉపన్యాసం మీద వార్తాపత్రికల్లో చాలా రోజుల వరకూ చర్చావేదికలు నడిచాయి.

1952 డిసెంబరు 24వ తారీఖున డా|| అంబేద్కరు కోల్హాపూర్‌లోని రాజారామ్ కాలేజీ విద్యార్థులు ఏర్పాటు చేసిన సౌహార్ద్ర సమావేశంలో విజ్ఞానాత్మకమైన ఉపన్యాసాన్ని యిచ్చారు. "ఏ ప్రముఖ మహిళా ప్రస్తుతం స్త్రీల స్థితిని మెరుగుపరచటానికి నాయకత్వం వహించి ఏకదీక్షతో నడుంకట్టి

పనిచెయ్యడానికి సిద్ధంగా లేదు. హిందూ కోడ్ బిల్లు ఇప్పుడు విరిగిపోయిన పాలలాగ చెడిపోయింది," అని చెప్పారు.

భారతదేశంలోని ఏ విశ్వవిద్యాలయమూ బాబాసాహబు చేసిన మహత్తర కృషిని ప్రశంసించలేదు. కాని హైద్రాబాదు ఇస్లామియా విశ్వవిద్యాలయం వారు 1952 జనవరి 12వ తారీఖున ఆయనకు 'డాక్టర్ ఆఫ్ లిటరేచర్' గౌరవపట్టా ప్రదానం చేసి అందరికన్నా తాము ముందు ఉన్నామన్న ఖ్యాతిని పొందారు.

1953 ఫిబ్రవరిలో శ్రీ రాజభోజ్ ఢిల్లీలో శ్రీ ఎమ్. ఆర్. మూర్తి గౌరవార్థం విందు చేశారు. ఈ సందర్భంలో బాబాసాహబు కూడా దానికి హాజరు అయ్యారు. "రాబోయే తరం బుద్ధుడో - కార్ల్ మార్క్సో - వీరిద్దరిలో ఎవరినో ఒకరిని ఎన్నుకోవలసి ఉన్నాది," అని అన్నారు.

డి.వి. జాధవ్‌కి ఫిబ్రవరి 24వ తారీఖున ఆయన ఒక ఉత్తరం రాశారు. ఆ ఉత్తరం ఆత్మచింతనతో విజ్ఞానదాయకంగా ఉంది. "చాలామంది తమ సుఖం కోసం తాపత్రయపడుతూ ఉంటారు. ఉత్తమ ఆచరణ వల్లా, స్వచ్ఛమైన భావాల వల్లా లభించే ఆధ్యాత్మిక ఆనందం సంగతే వేరు. అది విలక్షణమైనది. అపూర్వమైనది. అంచేత నేను చాలా సుఖంగా ఉన్నాను. ఆరోగ్యం ప్రధానమైనది అని ఒప్పుకుంటాను అయినా ఆనందం దానికన్నా ఎంతో గొప్పది."

1953 మే నెలలో బుద్ధ భగవానుడి మహా నిర్వాణ దిన సందర్భంగా బొంబాయిలో సుమారు 50,000 మంది జనం హాజరైన సభలో ఆయన ఉపన్యసించారు. ఇహముందు తాను తన జీవితాన్ని బౌద్ధ మత కార్యాల్లో వెచ్చిస్తాను అని తమ నిర్ణయాన్ని మరోసారి చెప్పారు.

హైద్రాబాదు సంస్థానపు రైల్వే కార్మికుల ఫెడరేషను తరపున ఔరంగాబాదులో ఏర్పాటు చేసిన సమావేశంలో ఆయన మాట్లాడారు. "రాజకీయాలే సర్వస్వం కాదు. రాజకీయంగానూ, సాంఘికంగానూ, మతపరంగానూ, అన్ని దృక్పథాల నుండీ దళితుల సమస్య గురించి పదేపదే యోచించాలి. దాని గురించిన సాధన చెయ్యాలి."

ఔరంగాబాదులో పాత్రికేయులకు ఇచ్చిన ఇంటర్వ్యూలో ఆయన స్పష్టంగా చెప్పారు - "ఆంధ్ర ఇప్పుడు ఒక భాషాప్రయుక్త రాష్ట్రం అయింది. అంచేత తదితర భాషాప్రయుక్త రాష్ట్రాల నిర్మాణం జరగనే

జరుగుతుంది. మహారాష్ట్రని రెండు రాష్ట్రాల్లో ఉంచాలి. అల్లాగ్గానే కాశ్మీరీ ప్రజల అభిప్రాయాన్ని సేకరించి దానికి కూడా శాశ్వత పరిష్కారం జరగాలి." ఈ ప్రవాసకాలంలో ఏ ఆసామీ ఆయనను కలుసుకోవడానికి వచ్చినా, ఆయననీ, సంస్థలో పనిచేస్తున్న అధికారులు అందరినీ భీమసేన్ అటవీ విభాగంలో వృక్షారోపణ కార్యక్రమంలో పాల్గొనేటట్టు చేశారు. ఈవిధంగా వేలసంఖ్యలో చెట్లని నాటింపించారు.

1953 సెప్టెంబరు 2వ తారీఖున రాజ్యసభలో ఆంధ్ర రాష్ట్రం ఏర్పాటుకు గాను బిల్లు సమర్పించడం జరిగింది. ఈ బిల్లు మీద డా॥ అంబేద్కరు అప్పుడు ప్రభుత్వాన్ని తీవ్రంగా విమర్శించారు. "తన సిద్ధాంతాన్ని సాధించటానికి పొట్టి శ్రీరాములుకి తన ప్రాణాలు అర్పించవలసి వచ్చింది. అదేగాని ఇంకే దేశంలో గాని అయి ఉండినట్టైతే అక్కడి ప్రజలు ప్రభుత్వాన్ని చితకతన్ని ఉండేవారు." ఆయన అప్పటి హెూం మంత్రి మీద దోషారోపణ చేస్తూ ప్రభుత్వం అల్ప సంఖ్యాకుల భద్రత కోసం బిల్లులో ఏ ఏర్పాటూ చెయ్యలేదు అని వివరించారు.

రెండవవారంలో పెప్సూలో రాష్ట్రపతి పరిపాలనా గడువుని పెంచడానికి గాను సమర్పించబడిన బిల్లుమీద తీవ్రంగా వ్యాఖ్యానించారు. ఎన్నుకోబడకుండానే శ్రీ రాజగోపాలాచారి, మొరార్జీదేశాయి - ఇద్దరినీ రాష్ట్రాల ముఖ్యమంత్రులుగా చేసినందుకు కూడా ప్రభుత్వాన్ని తప్పు పట్టారు. "స్పెషల్ మేరేజ్ బిల్లు' మీద కూడా ఆయన మాట్లాడారు. 1953 సెప్టెంబరు 18వ తారీఖున 'స్టేట్ డ్యూటీ బిల్లు' మీద ప్రసంగిస్తూ ఆయన ఇలా అన్నారు - "ఇతరులని, అధవా పరాయివారిని గుడ్డిగా అనుకరిస్తే ఏ ప్రయోజనమూ సిద్ధించదు. యూరోపుకి సముచితమైనది భారతదేశానికి కూడా సముచితం అవడం సంభవం కాదు." ఆయన హెచ్చరిస్తూ ప్రమాదాన్ని సూచించారు. పెట్టుబడిదారు, పెట్టుబడి మధ్య ఉన్న వ్యత్యాసాన్ని వివరించి చెప్తూ ఆయన ఇలా అన్నారు - "దేశపు పెట్టుబడి పెరగాల్సిందే, కాని పెట్టుబడిదారులు పెరగకూడదు."

మరాఠ్వాడా దళిత ఫెడరేషను తరఫున భూములు లేనివారికి ప్రభుత్వ బంజరు భూములు ఇప్పించడానికిగాను సత్యాగ్రహం చెయ్యబడ్డాది. దీనిలో సుమారు 1700 మంది సత్యాగ్రహులు అరెస్టు చెయ్యబడ్డారు. 1953 నవంబరులో డా॥ అంబేద్కరు సత్యాగ్రహాన్ని నిలిపివేసినట్టు ప్రకటించారు.

తన అనుమ-యులు సత్యాగ్రహం చేస్తున్నప్పుడు చెట్టు నరికినట్టు తెలిసి ప్రకృతిని ప్రేమించే డా॥ అంబేద్కరుకి చెప్పరానంత బాధ కలిగింది.

డా॥ అంబేద్కరు చేసిన వజ్రాఘాతపు తీవ్రాతి తీవ్రమైన విమర్శ కారణంగా 1954 మార్చి నెలలో 'ది అనటచ్‌బిలిటీ (అఫెన్సు) యాక్టు 1958' బిల్లు పాసు అయింది.

రోజు రోజుకీ బాబాసాహెబు ఆరోగ్యం చూస్తూ చూస్తూ ఉండగానే క్షీణించి పోతోంది. అయినప్పటికీ 1954 జనవరి 8వ తారీఖున ఆచార్య అత్రె సినీమా 'మహాత్మ ఫులె' ముహూర్త సమయానికి ఆయన హాజరయ్యారు. తమ శుభాకాంక్షలు తెలియచేశారు. తమ గురువుగా ప్రకటించిన ఆ ఫులె మహాత్ముడి జీవిత చరిత్రని కూడా బాబాసాహెబు స్వయంగా రాయాలని అనుకున్నారు. కాని అది సంభవం కాలేదు. అత్రె తీసిన ఈ ఫిల్ము వల్ల మహాత్మా ఫులె పేరు పల్లెపల్లెలా ఆబాల గోపాలానికి తెలిసింది.

# ఏభై మూడు

డా॥ అంబేద్కరు మార్చి నెలలో పార్లమెంటు సమావేశాలకి హాజరయ్యారు. భండారాలో ఖాళీ అయిన లోక్‌సభ సీటు కోసం ఉపఎన్నిక ప్రకటించబడ్డాది. సాధారణ సీటు కోసం అశోక్‌మెహతా, రిజర్వుడు సీటు కోసం డా॥ అంబేద్కరు నిల్చున్నారు. డా॥ అంబేద్కరు అశోక్‌మెహతాని సమర్థించారు.

కమ్యూనిస్టు పార్టీ నాగపూర్ శాఖ డా॥ అంబేద్కరు అభ్యర్థిత్వాన్ని సమర్థించింది. ప్రజా సోషలిస్టు పార్టీ డా॥ అంబేద్కరు పార్టీతో చేతులు కలిపింది. 1954 ఏప్రిలు 20వ తారీఖున డా॥ అంబేద్కరు తన భార్య సవితా అంబేద్కరుతో పాటు నాగపూరు వెళ్లారు.

మావుంట్ హోటలులో ఆహూతుల సమక్షాన ప్రసంగించారు. "అధికారంలో ఉన్న పార్టీమీద అంకుశంగా ఉండడానికి బలమైన ప్రతిపక్షం ఉండడం అవసరం. రెండవ ప్రపంచ యుద్ధానికి ముందు నాలుగు వేపుల

నుండి జర్మనీ దేశం ముట్టడికి గురి అయింది. మనదేశం స్థితీ అదే. త్వరలోనే మొత్తం ముస్లిం దేశాల సంయుక్త ఇస్లామీ దేశం ఏర్పడబోతోంది. ఈ రోజు మనకు ఒక్కడైనా మిత్రుడు లేడు. అంచేత మనదేశానికి ఆయుధీకరణ తప్ప మరో మార్గం లేదు. మనకి ప్రజాస్వామ్యం మేలు చేస్తుందా లేక కమ్యూనిజం చేస్తుందా అన్నదానిని మనం వెంటనే నిర్ణయించుకోవాలి. ఆ పిమ్మట మనం ఆ బృందం దేశాలతో స్నేహం చేసుకోవాలి" అని అంబేద్కరు చెప్పారు. మరుచటి రోజు డా॥ అంబేద్కరు ఎన్నికల ప్రచారానికి గాను భండారా వెళ్లారు. స్వాతంత్ర్యం వల్ల బీదవర్గాల ప్రజలకి ఏ లాభమూ చేకూరలేదు. ప్రభుత్వం వారి సమస్యల్లో ఏ సమస్యనీ పరిష్కరించలేదు అని అక్కడ ఇచ్చిన ఉపన్యాసంలో చెప్పారు. వినోబా భావే సర్వోదయ వాదాన్ని కూడా విమర్శించారు.

ఏప్రిలు 29వ తారీఖున వడసా ఎన్నికల సభలో ఆయన ప్రసంగించారు.

1954 మే 2వ తారీఖున నాగపూర్‌లోని విదర్భ సాహిత్య సంఘం ఆఫీసుకు ఆయన వెళ్లారు. ఆ సంఘ కార్యకర్తలతో చర్చలు జరిపారు.

ఎన్నికల ఫలితాలు వెలుపడడానికి ముందు బాబాసాహబు అంబేద్కరు బుద్ధ జయంతి ఉత్సవాల్లో పాల్గొనడానికి గాను రంగూను వెళ్లారు. అక్కడే ఆయనకు తాను ఎన్నికల్లో ఓడిపోయిన విషయం తెలిసింది. ఆయనకి మొత్తం 1, 32, 483 ఓట్లు లభించాయి. కేవలం 8361 ఓట్ల తేడాతో ఆయన ఓడిపోయారు.

సుమారు 2 నెలల పాటు రంగూనులో ఉండి అక్కడి వైశాఖ పూర్ణిమ ఉత్సవాలను ఆయన బాగా అధ్యయనం చేశారు. బౌద్ధమత ప్రచారకులను తయారుచెయ్యటానికిగాను బెంగుళూరులో శిక్షణా కేంద్రం ప్రారంభం కాబోతున్నదని ఆయన జూన్ నెలలో ప్రకటించారు.

దిగజారిపోతున్న తన ఆరోగ్యాన్ని లెక్క చెయ్యకుండా బాబాసాహబు ఎల్లవేళలా పనిలో మునిగి ఉండేవారు. చదవటం, రాయటం - ఈ రెండూ నిర్విఘ్నంగా సాగుతూనే ఉన్నాయి. రాజ్యసభలో 1954 ఆగష్టు 26వ తారీఖున విదేశాంగ విధానాన్ని అతి కటువుగా ఆక్షేపించారు. రష్యా అధికారంతో నిండిన విధానాన్ని కూడా ఆయన ఘాటుగా విమర్శించారు. "సామ్యవాదం సర్వత్రా వ్యాపించే దావానలం లాంటిది. సర్వాన్నీ భస్మం చేసేస్తుంది. ప్రజాస్వామ్యం కూడా భస్మం అయిపోతుంది." - అని చెప్పి

ఆయన యూరోపు దేశాల విదేశాంగ విధానాన్ని అమెరికా విదేశాంగ విధానాన్ని అత్యంత ప్రభావవంతంగా వివేచించారు. ప్రసంగాంతంలో సభ్యులందరికి చైనా గురించి సూచన చేస్తూ "భారతదేశం మీద ఆక్రమణ జరిగి తీరుతుంది. ఆ ఆక్రమణ కూడా దండెత్తడం అన్నది ఓ అలవాటుగా మారినవారే చేస్తారు," అని చెప్పారు. మావోత్సెతుంగ్ బౌద్ధుల పట్ల వ్యవహరించిన తీరుని ఆక్షేపిస్తూ ఆయన ఇలా అన్నారు - "రాజకీయాల్లో పంచశీల ఉపయోగం ఏంలేదు. కమ్యూనిస్టు దేశాల్లో అయితే కనీసం ఉండనే ఉండదు. ఆసియా యావత్తూ ప్రస్తుతం యుద్ధరంగంగా తయారయింది. అంచేత ప్రజాస్వామ్య దేశాలతో భారతదేశం వెంటనే చేతులు కలపడం అన్నది చాలా అవసరం." ఆ రోజుల్లో గోవా పోర్చుగీసుల అధికారంలో ఉంది. గోవాపై పోలీసు చర్య జరిపించి మన అధికారంలోకి తెచ్చుకోవాలి అని ఆయన సూచించారు. చైనా విషయంలో డా|| అంబేద్కరు ఏదైతే జోస్యం చెప్పారో అది అక్షరాల నిజం అయింది. 1962 లో చైనా భారతదేశం మీద దండెత్తింది. వేలకొద్దీ మైళ్ల ప్రాంతాన్ని అనుచితంగా కాజేసింది.

షెడ్యూల్డు జాతులు, షెడ్యూల్డు తెగలు గురించి పార్లమెంటులో రిపోర్టు దాఖలు చెయ్యబడ్డాది. దానిమీద చర్చ ఆరంభం అయినప్పుడు డా|| అంబేద్కరు అస్పృశ్యుల సంస్కరణలకు గాను కొన్ని సూచనలు చేశారు. రాజ్యాంగాన్ని ఎప్పుడు పడితే అప్పుడు సవరించడానికి ఆయన వ్యతిరేకులే అయినప్పటికీ, రాజ్యాంగంలో ఉచితమైన సవరణ చేసి బంజరు భూమినంతటిని భారత ప్రభుత్వం తన అధీనంలోకి తీసుకోవాలని, దానిని అస్పృశ్యులకి పంచిపెట్టాలని ఆయన సూచించారు. అల్లాగ్గానే ఉప్పు మీద నామమాత్రపు పన్నును విధించి, దాంతో 'గాంధీ ట్రస్టు ఫండు' ని ఏర్పరచి దాని ద్వారా వచ్చే పన్ను ఆదాయాన్నంతటినీ అస్పృశ్యుల అభ్యున్నతికీ, వారు ఉండడానికి బస్తీలు ఏర్పరచటానికీ వినియోగించాలి అని ఆయన తన అభిప్రాయాన్ని తెలియజేశారు. "అస్పృశ్యులు గాంధీగారి ముద్దు బిడ్డలు అన్న సంగతి మీరందరూ ఎరుగుదురు" అని ఆయన సభ్యులకు జ్ఞాపకం చేశారు.

ధారాప్రవాహంగా మాట్లాడుతూ బ్రిటిషు ప్రభుత్వం ద్వారా అస్పృశ్య విద్యార్థులను ఉన్నత విద్య అభ్యసించడానికి గాను ఇంగ్లండు పంపించే

పథకం రాజగోపాలాచారి విద్యామంత్రిగా ఉన్న కాలంలో రద్దు చేయబడ్డాది అన్న అంశాన్ని శ్రోతల దృష్టికి తెచ్చారు.

ఆ రోజుల్లోనే రాజ్యాంగ సవరణ మూడవ బిల్లుని ప్రభుత్వం సమర్పించింది. డా|| అంబేద్కరుకి అరికాలి మంట నెత్తికెక్కింది. ఇంచుమించు నాలుగేళ్ల లోగానే రాజ్యాంగానికి మూడవ సవరణని చూసి ఆయన ఇలా అన్నాడు -

"ప్రపంచ చరిత్రలో ఏ రాజ్యాంగంలోనూ ఇంత శీఘ్రంగా సవరణలు సూచించడం జరగలేదు. కేవలం మెజారిటీ బలంతో ఇల్లాగా తొందరపడ్డం రాజ్యాంగాన్ని వెక్కిరించడమే అవుతుంది. రాజ్యాంగానికి చట్టానికీ మధ్య వ్యత్యాసాన్ని మనం ఉంచుకోవాలి."

1954 అక్టోబరు 3వ తారీఖున 'నా స్వంత తత్వజ్ఞానం' అన్న అంశం మీద డా|| సాహబు ప్రసంగాన్ని ప్రసారం చేశారు. "స్వాతంత్ర్యం, సమానత్వం, సౌభాతృత్వం" - ఈ మూడూ ఆయన జీవితానికి ఆధారాలు. వీటి బీజం ఫ్రెంచి విప్లవంలోనూ అధవా రాజకీయాల్లోనూ లేదు - బౌద్ధమతంలో ఉంది. రాజ్యాంగంలో రాజకీయాలకు చెందిన ఈ మూడు తత్వాలని చేర్చడం జరగక పోయినప్పటికీ, వీటిని సాంఘిక జీవితంలో అమలుపరచడం అవసరం." అని ఆయన ఆ ప్రసంగంలో అన్నారు.

# ఏభై నాలుగు

రంగూన్‌లో జరిగిన "వరల్డ్ ఫెలోషిప్పు ఆఫ్ బుద్దిస్టు" అనే సంస్థ మూడవ సమావేశానికి 1954 డిసెంబరులో డా|| అంబేద్కరు హాజరయ్యారు. ఆ మహాసభలో ప్రసంగించారు - భగవాన్ బుద్ధుడు పుట్టిన దేశంలోనే ఆయన మతం క్షీణించి పోవడం ఆశ్చర్యకరం అని ఆయన తన ఉపన్యాసంలో విస్మయాన్ని ప్రకటించారు.

భారతదేశపు రాజ్యాంగాన్ని తయారుచేసినప్పుడు కలిగిన అనుభవాల గురించి ఆయన తన ఉపన్యాసంలో చెప్పారు. "రాజ్యాంగంలో పాలీ భాష అధ్యయనాన్ని ఏ వ్యతిరేకతని ఎదురుకోకుండా జోడించగలిగాను. దాంతో

పాటు రాష్ట్రపతి భవనానికి ఎదురుగా అశోకుడి "సింహాలను", జాతీయ పతాకం మీద అశోక చక్రాన్ని పెట్టించగలిగాను. బొంబాయిలోనూ ఔరంగాబాదులోనూ కాలేజీల్లో బౌద్ధమతాన్ని అధ్యయనం చెయ్యటానికి ప్రోత్సాహం లభించేటట్టుగా ఏర్పాటు చేశాను." ఇంగ్లీషు, మరాఠీ, హిందీ, గుజరాతీ, - ఈ నాలుగు భాషల్లోనూ పాలీ భాష నిఘంటువుని తయారు చేసే పనిని ఆయనే స్వంతంగా ప్రారంభించారు.[1]

మహాసభల అనంతరం బర్మా పూర్వ రాజధాని మాండలెని చూపించటానికిగాను ప్రతినిధులను అక్కడికి తీసుకువెళ్ళారు. అక్కడ డా॥ అంబేద్కరు., డా॥ ఆర్.ఎల్. సోనీ యింట్లో ఇంచుమించుగా ఓ వారం రోజులు పాటు ఉన్నారు. ఇక్కడే బుద్ధుడి 2500 జన్మదిన వేడుకల సందర్భంలో బౌద్ధమతాన్ని స్వీకరిస్తామని ఆయన నిశ్చయించుకున్నారు.[2]

రంగూను నుంచి తిరిగి వచ్చాక రంగూనులో బహుమతిగా ఈయబడిన బుద్ధ విగ్రహాన్ని సుమారు 5 నెలల తర్వాత దేహు రోడ్డులోని బౌద్ధ విహార్‌లో డా॥ అంబేద్కరు ప్రతిష్ఠించారు. ఈ సందర్భంలో 20,000 మంది హాజరైన సభలో ప్రసగించారు. "2500 సంవత్సరాల తర్వాత బౌద్ధమతం పునరుజ్జీవితం పొందుతోంది. పంఢర్‌పుర్‌లోని విఠోబా ఈ బుద్ధుడే ! దీనిగురించి నేను ఓ వ్యాసాన్ని రాయబోతున్నాను. దానిని భారత చరిత్ర సవరణ బోర్డు సమక్షాన చదవబోతున్నాను. పాండురంగ పుండరీక శబ్ద రూపమే. పుండరీకం అంటే ఒక అర్థం కమల్ కమల్ బుద్ధుడి పేరు." నా జీవితపు కార్యం "ముగిసిపోవటం కాదు - ఇప్పుడూ నిజానికి నా జీవితంలో వాస్తవమైన పని ప్రారంభం కాబోతోంది." అని ఆయన చెప్పారు. విఠల్ గురించిన ఆ వ్యాసం అంబేద్కరుది పూర్తి కాలేదు. జనసామాన్యం కోసం బుద్ధుడి చరిత్ర రాస్తున్నాననీ, త్వరలోనే బౌద్ధమతం స్వీకరించబోతున్నాననీ కూడా ఆయన ప్రకటించారు.

1. మహారాష్ట్ర ప్రభుత్వం వద్ద జమ అయి ఉన్న బాబాసాహబు కాగితాలు, ఉత్తరాల్లో దగ్గర దగ్గర 2000 శబ్దాలకు అర్థాలు రాసిన కార్డులు లభ్యమయ్యాయి. వాటితోపాటు పాలీ భాష వ్యాకరణపు 64 పేజీలు కూడా దొరికాయి. ఈ వ్యాకరణం 1' × 1' అడుగు కాగితం మీద అచ్చు అయింది.

2. సంఘరక్షిత : పే. 76

జనసామాన్యం మతం - మార్పిడికి గాను తాను ఒక 'ధమ్మ దీక్షా విధి' తయారు చేశానని ఆయన వలీ సిన్హాకి ఒక ఉత్తరంలో సూచించారు.

1954 జూన్ మధ్యలో బాబాసాహబు మైసూరు రాజావారిని బెంగుళూరులో కలిశారు. అప్పుడు మహారాజా వారు ఆయనకు ఒక ఎకరం భూమి దానం చేశారు. ఈ స్థలంలో బౌద్ధ పధర్మ ప్రచారం కోసం ప్రచార శిక్షణ కేంద్రాన్ని స్థాపించాలని బాబాసాహబు నిశ్చయించారు.

అదే రోజుల్లో రాజ్యాంగ సవరణ విషయంలో బాబాసాహబుకీ పండిత పంత్‌కి మధ్య మాటా మాటా పెరిగింది. క్షీణించి పోతున్న తన ఆరోగ్యాన్ని లక్ష్య పెట్టకుండా డా॥ సాహబు పార్లమెంటులో జరుగుతున్న దైనందిన కార్యకలాపాల్లో పాల్గొంటూనే ఉన్నారు.

1955 మే నెలలో బాబాసాహబు ఆరోగ్యం బాగా క్షీణించిపోయింది. ఆసరా లేకుండా ఆయన నడవలేకపోతున్నారు. ఊపిరి తీసుకోవడం కూడా కష్టం అవుతూ వచ్చింది దాంతో ఆక్సిజను సిలెండరు తెప్పించ వలసి వచ్చింది. మధ్యమధ్యలో దానిని ఉపయోగించటం తప్పనిసరే అవుతోంది.

1955 జూన్ 19వ తారీఖున డా॥ అంబేద్కరు భవనంలో జరిగిన, షెడ్యూల్డు కాస్ట్ ఫెడరేషను వెల్ఫేర్ ఎసోసియేషను ద్వారా ఏర్పాటు చేయబడిన సమావేశానికి ఆయన హాజరయ్యారు. ప్రతినిధులకు మార్గనిర్దేశం చేశారు. కార్యనిర్వాహక సంఘాన్ని నియమించారు.[1]

తన అనారోగ్య కారణంగా రాజ్యసభ సమావేశాలకు హాజరు కావడం సాధ్యం కాకపోవడంతో ఆయన స్పీకరుకు విజ్ఞప్తిని పంపించారు. దాని ప్రకారం 1955 మార్చి 29వ తారీఖు నుంచి ఆయనకు 9వ సమావేశం వరకూ గైరు హాజరు సెలవు ఈయబడ్డాది.

1955 ఆగష్టు 27వ తారీఖున దళిత ఫెడరేషను కార్యనిర్వాహక సంఘం కేంద్ర విధానసభలోనూ రాష్ట్ర విధానసభల్లోనూ షెడ్యూల్డు కులాల రిజర్వుడు స్థానాల్ని రద్దు చేసే తీర్మానాన్ని పాసు చేసింది. ఈ సమావేశంతోనే ఫెడరేషను సంచాలకుడు శ్రీ రాజభోజ్‌ని సంచాలక పదవినుండి తొలగించడం జరిగింది. ఆయన స్థానే బారిస్టరు రాజా భావూ ఖోబ్రాగడేని ఎన్నుకున్నారు.

1. సోహన్‌లాల్ శాస్త్రి : పే. 210

1955 అక్టోబరు 19వ తారీఖున మహాబోధి సొసైటీకి వలీ సిన్హా రాసిన ఉత్తరం అందింది. మహాబోధి సొసైటీ అచ్చువేసిన అంబేద్కరు వ్యాసం 'బుద్ధుడు - ఆయన మతపు భవిష్యత్తు' ని ఫ్రెంచి రచయిత ద్వారా పునర్ముద్రించటానికి అనుమతి కావాలని ఆయన కోరారు. నవంబరు 7వ తారీఖున డాక్టరు సాహెబు వలీ సిన్హాకు జవాబు రాశారు. అందులో ఆయన ఇలా రాశారు - "ఔరంగాబాదులో మా స్థలంలో ఉన్న ఎత్తైన గుట్టమీద మేము దివ్యమైన బుద్ధ మందిరం నిర్మిస్తున్నాము. బేరులులోని పదవ గుహలోని శిల్పాన్ని అనుసరించి నిర్మిస్తున్న ఈ మందిరానికి సుమారుగా 3 లక్షల రూపాయలు ఖర్చు అవుతాయి. మీరు ఔరంగాబాదులో నిర్మించబడుతున్న ఈ మందిరం నిమిత్తం 25000 రూపాయలు ఇస్తున్నారని తెలిసింది. దీనిని గురించి మాట్లాడ్డానికి గాను మీరే స్వయంగా రండి."[1]

1956 ప్రారంభంలో డాక్టరుగారు రాసిన "ది బుద్ధ ఎండ్ హిజ్ ధమ్మ" ఇంగ్లీషు గ్రంథం పూర్తి అయింది. ఈ గ్రంథాన్ని మొదట "ది బుద్ధ ఎండ్ హిజ్ గోస్పెల్" అన్న పేరుతో కాగితానికి ఒకవేపు అచ్చు వేయించి 50 ప్రతులు తయారు చేయించడం జరిగింది. విశిష్ట వ్యక్తులకు వాటిని పంపించారు. ఈ గ్రంథాన్ని బాబాసాహెబు 1951 నుంచి రాస్తున్నారు. ఈ గ్రంథం ఆయన చనిపోయిన తర్వాత నిజానికి సరిగ్గా అచ్చయింది.

గత ఐదారేళ్ల బట్టి బాబాసాహెబు "బుద్ధుడు - కార్ల్‌మార్క్సు"[2] 'రివల్యూషన్ ఎండ్ కౌంటర్ రివల్యూషన్,'[3] 'రిడిల్స్ ఆఫ్ హిందూయిజమ్' - ఈ మూడు పుస్తకాలు రాస్తున్నారు. 'బుద్ధుడు - కార్ల్‌మార్క్సు' అన్న గ్రంథం ఈ నాటికీ ఎవరికీ లభ్యం కాలేదు. ఈ మూడు విషయాల మీద రాసిన రాతలు హైకోర్టు కాగితాల్లో దొరికిన దానిని మహారాష్ట్ర ప్రభుత్వం

1. వలీ సిన్హాకి రాసిన ఉత్తరాలు (తే. 7.11.1955) : హైకోర్టు కాగితాలు.
2. ఈ గ్రంథం గురించి కీర్, వాలీ - ఇద్దరు రచయితలూ కేవలం ఒక అధ్యాయం మాత్రమే మిగిలివున్నాది అని రాశారు. కాని ఈ గ్రంథం హైకోర్టు కాగితాల్లో కూడా దొరకలేదు. మూడవ ఖండంలో పేరుపొందిన వ్యాసం ఖచ్చితంగా ఈ గ్రంథం కాదు.
3. రివల్యూషన్ ఎండ్ కౌంటర్ రివల్యూషన్ - ఈ గ్రంథపు డ్రాఫ్టు దొరికింది కాని అన్ని అధ్యాయాలు లభ్యం కాలేదు.

ప్రచురించిన 'డా॥ అంబేద్కరు : రైటింగ్స్ ఎండ్ స్పీచస్' గ్రంథమాలలో 3, 4, 5 ఖండాల్లో పొందుపరచబడ్డాయి. ఈ రచనల వల్ల బాబాసాహబు హిందూ ధర్మశాస్త్రం, తత్వజ్ఞానం, చరిత్రల్లో లోతుగా అధ్యయనం చేశారని తెలుస్తుంది. ఆయన వ్యాసాలు - 'ఫిలాసఫీ ఆఫ్ హిందూయిజమ్,' 'ట్రైంఫ్ ఆఫ్ బ్రాహ్మణిజమ్,' 'భగవత్‌గీత, - ఫిలాసఫిక్ డిఫెన్సు ఆఫ్, కౌంటర్ రివల్యూషన్,' 'రిడిల్సు ఆఫ్ హిందూఇజమ్,' 'బుద్ధ ఎండ్ కార్ల్‌మార్క్సు' - వీటన్నిటిని అవలోకించినట్లైతే ఆయన పాండిత్యంలోని అద్భుతమైన అంశం గోచరిస్తుంది.[1]

బాబాసాహబు రచనారంగంలో చేసిన కృషి, ధర్మశాస్త్రాన్ని వివేచనాత్మకంగా అధ్యయనం చేసిన తిలక్, భాండార్‌కర్, న్యాయమూర్తి తెలంగ, పాం.వా. కాణే మొదలైన వారి సరసన ఆయనకి స్థానాన్ని కలిగించింది. మత విద్వాంసులకు ఛాలెంజి అయింది.

బాబాసాహబు రాతపని రాత్రి - పగలు సాగుతూనే ఉండేది. రత్తూ అనే తన పర్సనల్ సెక్రటరీకి శనివారం రాత్రి పని పూర్తైపోయింది అని చెప్పి వెళ్లిపోవచ్చని పంపించేశారు. మరుచటి రోజు అతడు పనిలోకి వచ్చినప్పుడు బాబాసాహబు రాత్రంతా రాస్తూనే ఉన్నట్టు తెలుసుకున్నాడు. రత్తూ సవ్వడికి వ్రాతలో మునిగిన మత్తు వదిలి ఉదయం చేసుకోవలసిన నిత్యకార్యాల్లో పడ్డారు. 1959 మార్చి 15వ తారీఖున ఆయన 'బుద్ధ ఎండ్ హిజ్ ధమ్మ' కి ప్రస్తావన రాశారు.

రాజ్యసభలో 1956 మేలో భాషాప్రయుక్త రాష్ట్రాల నిర్మాణం గురించి జరిగిన చర్చలో ఆయన పాల్గొన్నారు. 'మహారాష్ట్ర ఎజ్ ఎ లింగ్విస్టిక్ స్టేట్' అన్న తన పుస్తకంలో ఆయన తన అభిప్రాయాల నన్నిటినీ వ్యక్తీకరించారు. బొంబాయి మహారాష్ట్రలో ఓ అభిన్నమైన భాగం అని బొంబాయి స్థితిని ఋజువులతో స్థిరీకరించారు. బొంబాయి ఆది వాస్తవ్యులు కోళీ లని ఆయన వాదం. ఈ ద్వీపం లక్ష్మిబాయికి వివాహ

1. ఇవేకాక అస్పృశ్యత యొక్క సాంఘిక, రాజకీయ, ఆర్థిక, మతపరమైన అంశాలమీద విస్తృతంగా అభిప్రాయాలను వ్యక్తంచేసి రాసిన ఆయన వ్యాసాలు సుమారు 30 మహారాష్ట్ర ప్రభుత్వం అచ్చువేసిన 5వ ఖండంలో చేర్చబడ్డాయి. ఆయన రచనలు చాలా అసంపూర్ణంగా ఉండిపోయాయి. కొన్ని అసలే లభ్యం కాలేదు. డా॥ అంబేద్కరు రాసిన వాఙ్మయం లభ్యమైనది. 10 వేల పేజీల కన్నా అధికం.

కానుకగా యివ్వబడ్డాది. ఔరంగాబాదుని మహారాష్ట్రకి రాజధానిని చేయాలన్న సూచనని కూడా ఆయన ఇచ్చారు.

1956 మే నెలలో ఆయన ఉపన్యాసం బి.బి.సి. లో ప్రసారితం అయింది. ఆయన తన రేడియో ప్రసంగంలో ఇలా అన్నారు - "నాకు బౌద్ధమతం అంటే ప్రజ్ఞ, కరుణ సమానత - ఈ మూడు సిద్ధాంతాల కారణంగా ఎక్కువ యిష్టం. ఈశ్వరుడు గాని ఆత్మగాని సంఘాన్ని దాని అధోగతి నుండి కాపాడలేరు. బౌద్ధమతమే వ్యక్తినీ సంఘాన్ని పతనం కాకుండా కాపాడకలదు. బుద్ధుడి ఉపదేశం రక్తరహిత క్రాంతి ద్వారా సామ్యవాదాన్ని తేగలదు."

ఆయన 'వాయిస్ ఆఫ్ అమెరికా" రేడియోలో 'ప్రజాస్వామ్యపు భవిష్యత్తు' అనే అంశం మీద ప్రసంగించారు. తన ఈ ప్రసంగంలో ఆయన ఇలా అన్నారు - "ప్రజాస్వామ్యపు వేళ్లు - కొమ్మలూ దాని పాలన వ్యవస్థ నుంచి పుట్టవు ; ఆ ప్రజాస్వామ్యం పార్లమెంటు తరహాది అవనీ, లేదా ఫెడరల్ అవనీ ప్రజాస్వామ్యం సామూహిక జీవితపు ఓ విధానం. సంఘం ఎవరివల్ల ఏర్పడ్డాదో వారి పరస్పర సంబంధాలు ఎలా ఉన్నాయి, అన్నదానిని బట్టి ప్రజాస్వామ్యపు అస్థత్యం ఆధారపడి ఉంటుంది. జాతివాదాన్ని అంతం చేస్తామని ముందుకు వచ్చిన నిమ్న వర్గపు వారికే ప్రభుత్వం విద్యార్జనకి ఆర్థిక సహాయం చెయ్యాలి. అప్పుడే ప్రజాస్వామ్యం వేళ్లు బలం పుంజుకుని ప్రచారంలోకి వస్తుంది."

బాబాసాహెబు కొత్త రాజకీయ పార్టీని స్థాపించాలని యోచన చేస్తూ ఉన్నారు. కాని 'బుద్ధుడు - ఆయన ధమ్మ" గ్రంథం శీఘ్రంగా ప్రచురితం కావాలని విషయసూచికని, చిన్న పుస్తకం రూపంలో తయారుచేసి, బౌద్ధమతం పట్ల ఆసక్తి ఉన్న పండిత నెహ్రూకి దానిని పంపి గ్రంథ ప్రచురణకి సహాయం చెయ్యమని అభ్యర్థించారు.

1956 మే 24 వ తారీఖున నరె పార్కులో బుద్ధ జయంతి సందర్భంగా బ్రహ్మాండమైన సభ జరిగింది. 1956 అక్టోబరులో తాను బౌద్ధమతాన్ని స్వీకరించబోతున్నానని ఈ సభలో ఆయన ప్రకటించారు. బౌద్ధమతాన్ని విమర్శించేవారి మీద గట్టిగా విరుచుకుపడ్డారు. ఆయన ఇలా అన్నారు - "దళిత సమాజ సేవలో దీక్ష పూని ఎవరైతే లీనమై ఉన్నారో వారికే వారిని వ్యాఖ్యానించే హక్కు ఉన్నాది. మా జనం అమాయకపు గొర్రెలలాంటివారు.

నేను వారికి గొర్రెల కాపరిలాంటి వాణ్ణి. నా వెనక నడవడంలోనే వారి శ్రేయస్సు ఉన్నాది." ఆ తర్వాత ఆయన బౌద్ధమతం విశిష్టతలను వివేచించి చెప్పారు. "మోజెస్ ఎల్లాగ్గా తనవారిని ఈజిప్టు నుంచి బైటికి తెచ్చి వారికి ప్రత్యేకమైన పెలెస్టీయనులో నివాసం ఏర్పాటు చేశాడో అల్లాగ్గానే నేనూ నా జనానికి స్వాతంత్ర్యాన్ని ఇప్పిస్తాను." ఆయన ఇచ్చిన ఈ అభయం తర్వాత అనేకమంది మోజెస్‌కి డా|| అంబేద్కరు జీవితానికి గల సమానత్వాన్ని ఎత్తి చూపించడానికి ప్రయత్నం చేశారు.

జూన్ నుంచి అక్టోబరు వరకూ ఆయన ఢిల్లీలో ఉన్నారు. ఆయన ఆరోగ్యం దిగజారిపోతూనే ఉన్నాది. ఏ చికిత్సా ఆయనమీద పనిచెయ్యటం లేదు. ఇప్పుడిహ ఆయనకి మతం మార్పిడి తొందర పట్టుకుంది. సెప్టెంబరు 23వ తారీఖున ఆయన బై. ఖోబ్రాగడెకి ఓ ఉత్తరాన్ని పంపించారు. అక్టోబరు 16వ తారీఖుకి చాందా తప్పకుండా వస్తున్నామని అందులో ఆయన రాశారు.

# ఏభై అయిదు

ఈ రోజుల్లోనే బాబాసాహబు 'బౌద్ధ 'జనసమితి' ని స్థాపించారు. నాగపూరులో వామనరావ్ గోడ్‌బోలె, ఆయన అనుమాయులూ తమ శాఖని ప్రారంభించారని అంతా అనుకుంటున్నారు. గోడ్‌బోలె నాగపూర్‌లో 1950 నుంచీ బౌద్ధమత ప్రచారకార్యాన్ని ప్రారంభించారు. అప్పటినుంచీ సీతాబర్డీలో ఆయన మార్గదర్శకత్వంలో యువకులు బౌద్ధమతం మీద క్లాసులు నడిపారు. బుద్ధుడి జీవితం మీద మూడంకాల నాటకం 'జగాబ్యాకళ్యాణా' ని రంగస్థలం మీద ప్రదర్శించారు కూడా. గోడ్‌బోలె ఈ కార్యకర్తలకు మార్గదర్శకులు. డా|| సాహబు మతం మార్పిడి ఉత్సవం బొంబాయిలో జరుగుతుందని ముందుగా చెప్పారు. అప్పుడు చారిత్రిక దృష్ట్యా నాగపూరు ఎంత సముచిత స్థానమో గోడ్‌బోలె బాబాసాహబుకు తెలియచేశారు.[1] ఆ తర్వాత బాబాసాహబు నాగపూరులో దీక్ష తీసుకోవడానికి

1. గోడబోలెతో జరిపిన సంభాషణ.

నిశ్చయించారు. బాబాసాహబు గోడ్‌బోలెని ఢిల్లీకి పిలిపించారు. నాగపూర్‌లో ఈ సమారంభపు ఏర్పాట్లు గురించి విపులంగా ఆయనతో చర్చించారు. 'బౌద్ధ జనసమితి' తరపున జనసామాన్యానికి తెలియడానికి గాను ఒక విజ్ఞప్తిని ప్రచురించారు. తెల్లటి వస్త్రాలు ధరించి దీక్ష పుచ్చుకోవడానికి నాగపూరు రావలసినదిగా జనాలకి విజ్ఞప్తి చెయ్యబడ్డాది.

1956 సెప్టెంబరు 23వ తారీఖున తాను 1956 అక్టోబరు 14వ తారీఖున విజయదశమి ఉదయం 9-11 గంటల మధ్య నాగపూరులో బౌద్ధమత దీక్షని పుచ్చుకుంటున్నాని వార్తాపత్రికలకు విజ్ఞప్తి పంపించారు. ఈ ఉత్సవంలో దీక్ష ఇవ్వడానికిగాను భారతదేశంలో అందరికన్నా వయోవృద్ధులైన ఎనభై సంవత్సరాల వయస్సు ఉన్న భిక్షు చంద్రమణి మహాస్థవిరను కుశీనారా నుంచి రమ్మని ఆహ్వానించారు. మహాబోధి సొసైటీ జనరలు సెక్రటరీ శ్రీ డి. వలీసిన్హాకు ఉత్తరం రాసి మహాబోధి సొసైటీ సహకారం కావాలని కోరారు. ఈ ఉత్సవంలో దీక్షని ఇచ్చే విధానం గురించి ఏదన్నా అభిప్రాయభేదం ఉంటే దానిని పరస్పరం చర్చించుకుని నివారించుకోవచ్చునని ఆయన వలీసిన్హాకి సూచించారు.

1956 సెప్టెంబరు 30వ తారీఖున ఢిల్లీలో బాబాసాహబు అధ్యక్షతన కార్యనిర్వాహక సంఘం మీటింగు జరిగింది. ఒక పార్టీ ప్రభుత్వం నుంచి ప్రజాస్వామ్యాన్ని కాపాడ్డానికి గాను బలమైన ప్రతిపక్ష పార్టీ నొకదానిని ఏర్పరచాలి. దానికి 'రిపబ్లికన్ పార్టీ ఆఫ్ ఇండియా' అని పేరు పెట్టాలని ఈ సభలో నిర్ణయించడం జరిగింది.

అక్టోబరు 11వ తారీఖున డాక్టరు సాహబు తన భార్య, పర్సనలు సెక్రటరీ రత్తూతోపాటు నాగపూరు వచ్చారు. సీతాబర్డీ శామ్ హోటలులో ఆయనకి బస ఏర్పాటు చేయబడ్డాది. హోటలుకి ఎదురుగా మహార్ బస్తీకి చెందిన యువ కార్యకర్తలందరూ గోడ్‌బోలె మార్గదర్శకత్వంలో దీక్ష ఉత్సవానికి ఏర్పాట్లు చెయ్యడంలో లీనమై ఉన్నారు. హోటలు పక్కనే బౌద్ధ జనసమితి కార్యాలయం ఉన్నాది. డాక్టరు సాహబు బస దగ్గర రాత్రీ పగలూ - కర్నలుబాగు బస్తీకి చెందిన సమతాసైనిక్‌దళ్ సైనిక దళంవారు ఆయన ప్రాణాలకు ముప్పు వాటిల్లకుండా కాపలా కాస్తున్నారు.

1956 అక్టోబరు 13వ తారీఖు సాయంత్రం ఆయన రెండు ప్రెస్సు కాన్ఫెరెన్సులు ఇచ్చారు. వార్తాపత్రికల ప్రతినిధులతో ఆయన ఇలా

అన్నారు - 'హిందూమతానికి స్వల్పాతిస్వల్పమైన హాని కలిగించే మార్గాన్ని స్వీకరిస్తాను అని నేను మహాత్మాగాంధీ గారికి హామీ ఇచ్చాను. బౌద్ధమతం భారత సంస్కృతిలో భాగమే."[1] ప్రశ్నోత్తరాలలో ఆయన ఇలా చెప్పారు - 'అస్పృశ్య సమాజం మానవత్వాన్ని పొందాలని ప్రయత్నం చేస్తూ ఉంది. సౌకర్యాలు పొందడం కోసం అస్పృశ్యులుగా ఉండిపోవడం ఉచితం కాదు. బౌద్ధమతం విశ్వమతం." రిపబ్లికను పార్టీ స్థాపించినట్టు కూడా ఆయన ప్రకటించారు.

అదే రాత్రి ఫెడరేషన్ కార్యకర్తల సభ జరిగింది. అందులో ఆయన కార్యకర్తలను హెచ్చరించారు - 'మతం - మార్పిడి వద్దనుకున్న వారు విఘ్నాలు కలిగించవద్దు.

బాబాసాహబు స్నానం వగైరాలు పూర్తిచేశారు. తెల్లటి బెంగాలీ కుర్తా శ్రేష్టమైన సన్నని పంచె కట్టుకుని మహాస్థవిర్ చంద్రమణి, శ్రీమతి అంబేద్కరుతో పాటు తొమ్మిది గంటలకు ఉత్సవస్థలికి వచ్చారు. చిత్రకారుడు రామ్‌తిర్‌పుడే వేదిక ముందు సాంచీస్థూపపు నమూనాని తయారుచేసి పెట్టాడు. సుమారు 5 లక్షలమంది స్త్రీ పురుషులు హాజరయ్యారు. జయ జయ ధ్వానాలు, సద్దుమణిగాక బాబాసాహబు పత్నీసమేతంగా నిల్చుని భిక్షు చంద్రమణి దగ్గర త్రిసరణ - పంచశీలను గ్రహించి బౌద్ధమత దీక్ష పుచ్చుకున్నారు.

మాలోజీ స్మృతికి అంజలి ఘటించటానికి గాను ముందు రెండు నిమిషాల పాటు జనం అంతా నిశ్శబ్దంగా మౌనం పాటించినిల్చున్నారు. ఆ తర్వాత బుద్ధ విగ్రహానికి స్వచ్ఛ ధవళ కమలాల మాలని వేసి బాబాసాహబు తలవంచి మూడుసార్లు నమస్కరించారు. ఆ తర్వాత మరాఠీ భాషలో త్రిసరణ - పంచశీలను రెండవసారి గ్రహించారు. తాను స్వయంగా తయారుచేసిన 22 ప్రతిజ్ఞలను చేశారు. సుమారు పదిగంటలకు బాబాసాహబు ఎదురుగా ఉన్న జనసముదాయాన్ని నిల్చోమని ప్రార్థించి 22 ప్రతిజ్ఞలను మరాఠీలో తాను స్వయంగా చదివి మొత్తం దీక్ష పుచ్చుకున్న వారి అందరిచేతా అనిపించారు. వారికి బౌద్ధమత దీక్షని ఇచ్చారు. ఈ దీక్షా తంతు సుమారు 11 గంటలకు ముగిసింది. శ్రీ వలీ సిన్హా బాబాసాహబుకి బుద్ధుడి ప్రతిమ నొకదానిని బహూకరించారు. మొత్తం 22 ప్రతిజ్ఞలు చదివి

1. సంఘరక్షిత : పే. 70

నప్పుడు బాబాసాహబు కళ్లజోడు పెట్టుకోలేదు. దానికి అనేకమంది ఆశ్చర్యాన్ని వెలిబుచ్చారు.

15వ తారీఖు ఉదయం 14 ఎకరాల విశాలమైన ఆ మైదానంలో బాబాసాహబు రెండుగంటలసేపు ఉత్సాహంతో ఉరకలు ఎత్తే చారిత్రిక ఉపన్యాసాన్ని ఇచ్చారు. సూది పడితే వినిపించేటంత నిశ్శబ్దంగా సభ ప్రశాంతంగా ఉన్నాది. ధీర గంభీరమైన కంఠంతో ఆయన బౌద్ధమత దీక్ష పుచ్చుకోవడానికి వెనుక ఉన్న కారణాలను వివేచన చేసి చెప్పారు. ఆయన ఇలా అన్నారు - నాగపూర్ విభాగంలో నివసిస్తున్న నాగులు బౌద్ధమత ప్రచారంలో కరడుకట్టినవారు. నాకు గుడ్డి భక్తి అక్కర్లేదు. బౌద్ధమతంలోకి రావాలనుకున్నవారు ఆలోచించి యోచించిరండి. మనిషి శరీరం ఆరోగ్యంగా ఎలా అయితే ఉండాలో వాడి మనస్సు కూడా మంచి సంస్కారంతో కూడుకున్నది అవాలి. రాజప్రాసాదం కూడా అతి చిన్నదిగా కనిపించేటంత ఎత్తులకు వ్యక్తి ఎదగాలి. పేదవాడికి మతం అవసరం." ప్రేక్షకులకు ఆయన సరళమైన మరాఠీ భాషలో ఇలాంటి విషయాలు అనేకమైనవి వివరించి చెప్పారు. శాశ్వతంగా నిలిచే అమర సిద్ధాంతం, విద్వాంసులైన మత ప్రచారకులు, జనసామాన్యం, మత ప్రచారానికి కావలిసిన విషయాలు. ఇవన్నిటినీ వివరిస్తూ ఆయన బౌద్ధమతం గొప్పతనాన్ని వర్ణించి చెప్పారు.

ఉదయం 6-8 గంటల మధ్య నాగపూరు పురపాలకసంఘం తరపున డా॥ అంబేద్కరుకి సన్మానపత్రం ఈయబడ్డాది. దానికి జవాబుగా చెప్పిన ఉపన్యాసంలో, రాజకీయాల్లో కనిపిస్తున్న అధఃపతన లక్షణాలపట్ల ఆయన క్షోభ పడుతూ రోషాన్ని వ్యక్తం చేశారు. ఈ ఉత్సవానికి ముందు శామ్ హోటలులో దళిత ఫెడరేషను కార్యకర్తల తరపున డా॥ అంబేద్కరుకి టీ పార్టీ ఇయ్యబడ్డాది. ఈ సందర్భంలో కార్యకర్తలను ఉద్దేశించి ఉపదేశంతో నిండిన రెండు మాటలు మాట్లాడారు - "తదితరులైన సమాన దుఃఖితులైన వారిని మనదగ్గరకు తెచ్చుకుని వారిని కొత్త పార్టీలో మనం చేర్చుకోవాలి. మన ఐకమత్యాన్ని కాపాడుకోవాలి.

1956 అక్టోబరు 19వ తారీఖు ఉదయం బాబాసాహబు చంద్రపూర్ వెళ్లారు. అక్కడ వై. ఖోబ్రాగడె దీక్ష - ఉత్సవానికి ఏర్పాట్లు చేశారు. దగ్గర

దగ్గర ఒక లక్షమంది అక్కడ బౌద్ధమత దీక్ష పుచ్చుకున్నారు. అక్కడనుంచి రైలులో డా॥ అంబేద్కరు ఢిల్లీకి బయల్దేరారు.

# ఏభై ఆరు

1956 అక్టోబరు 25వ తారీఖున వలీ సిన్హా రాసిన ఉత్తరానికి 30వ తారీఖున జవాబు రాస్తూ డాక్టరు సాహెబు ఇలా రాశారు – "ఇది ఒక గొప్ప తరుణం. అనుకున్న దానికన్నా ఎక్కువమంది మతం మార్పిడి కోసం వచ్చారు. సామాన్యజనానికి బౌద్ధమతంలో శిక్షణ ఇవ్వడానికి ఏ ఏర్పాటు చెయ్యాలో మనం యోచించాలి. భిక్షు సంఘం తన దృక్పథాన్ని మార్చుకోవాలి. క్రైస్తవ మిషనరీల లాగ సాంఘిక కార్యకర్తలుగానూ, ప్రచారకులు గాను వారు తమ భూమికను నిర్వహించాలి."

ఎలి ఫిన్సటన్ కాలేజీ శతాబ్ది ఉత్సవాలకి ప్రిన్సిపాలు డా॥ అంబేద్కరుని ఉత్సవంలో పాల్గొనవలసినదనీ ఉత్సవ సంచికకు ఒక వ్యాసాన్ని ప్రచురణార్థం పంపించవలసినదనీ అభ్యర్థించారు. 'ప్రజాస్వామ్యం అంటే ఏమిటి ? భారతదేశంలో దాని భవిష్యత్తు ఏమిటి ?' అన్న విషయం మీద మాట్లాడతానని తన అభిమతాన్ని వ్యక్తం చేస్తూ ఆహ్వానాన్ని అంగీకరించారు. కాని ఆయన ఆరోగ్యం చాలా పాడైపోయిన కారణంగా వారికి ఇలా సూచించారు – "దీనికోసం ఢిల్లీ నుంచి ప్రత్యేకమైన ప్రయాణం నేను చెయ్యాలి."

బాబాసాహెబుకు అదే రోజుల్లో కాట్మాండులో జరుగుతున్న విశ్వబౌద్ధ పరిషత్తు ఆహ్వానం అందింది. బాబాసాహెబు 1956 నవంబరు 14వ తారీఖున పాట్నా నుండి బయల్దేరారు.

నవంబరు 15వ తారీఖున కాట్మాండులో సింహదర్బారు హాలులో నేపాలు రాజు మహేంద్ర పరిషత్తుని ప్రారంభించారు. శ్రీలంకకు చెందిన ప్రసిద్ధ విద్వాంసులు డా॥ మల్లశేఖర్ ఈ పరిషత్తుకి అధ్యక్షులు. బాబాసాహెబు అక్కడ హాజరైన విద్వాంసులను ఉద్దేశించి మాట్లాడుతూ ఇలా అన్నారు – "బౌద్ధమతం కేవలం మత సంబంధమైన విధి – విధానాలకు చెందిన మతం కాదు. అది సాంఘిక జీవితపు తత్వజ్ఞానం."

నవంబరు 20 తారీఖున ఆయనను ఉపన్యసించమని కోరారు. ప్రతినిధులు పట్టుబట్టడంతో ఆయన 'బుద్ధుడు - కార్ల్‌మార్క్స్' అన్న విషయం మీద మాట్లాడ్డం మొదలుపెట్టారు. ఆయన ఇలా అన్నారు - "మార్క్స్ బుద్ధుడూ ఇద్దరినీ చిట్టచివరి హేతుసంఘాలు. మార్క్స్ స్వంత ఆస్తిని దుఃఖానికి మూలకారణంగా పరిగణించాడు. బుద్ధుడు కూడా దుఃఖం శబ్దాన్ని సంపద అన్న అర్థంలోనే ఉపయోగించాడు. బౌద్ధ ధర్మం సరియైన అర్థంలో ఎలా సామ్యవాదమో విశ్లేషించి చెప్తూ ఆయన బుద్ధుడి మార్గం మార్క్స్‌కి భిన్నమైనది కాని అది ఎలా ఎక్కువ శ్రేయస్కర మైనదో వివరించారు. ఆయన ఇలా చెప్పారు - "మార్క్స్ మార్గం హింసా మార్గం."

కాట్మాండు నుంచి తిరిగివస్తూ బాబాసాహబు బనారసు విశ్వవిద్యాలయంలో ఉపన్యాసం ఇచ్చారు. శంకరాచార్యుని సూత్రం 'బ్రహ్మసత్య జగన్మిథ్య' - తాలూకు తత్వజ్ఞానాన్ని క్రమంగా పెంచుకుంటూ పోయి ఆయన ఇలా అన్నారు - "బ్రహ్మసత్యమూ సర్వవ్యాపకమూ అయితే మరి శంకరాచార్యులు బ్రాహ్మణుడికీ శూద్రుడికీ మధ్య వ్యత్యాసాన్ని ఎందుకు చెపుతున్నాడు ? వేదాంతపు ఈ తత్వం వ్యవహారంలో, ఆచరణలో ఉపయోగరహితం అవుతోంది." అంచేత ఆయన ఈ ప్రశ్న వేశారు - "నేటి విద్యార్థులు సమానత్వం, స్వాతంత్ర్యం, సౌభ్రాతృత్వం - తత్వాలమీద ఆధారపడిన సమాజ నిర్మాణాన్ని స్వీకరించాలని కోరుకుంటారా లేక పురుషసూక్తంలో చూపిన శ్రేష్ఠులూ, నీచులూ, లేదా పెద్దా - చిన్నా తేడా కొత్త ఇంద్రజాల మాయని స్వీకరిస్తారా ?"

అక్కడ నుంచి డా॥ అంబేద్కరు బౌద్ధ తీర్థాలనన్నిటినీ చూడ్డానికి వెళ్లారు. ఆఖరిని భగవాన్ బుద్ధుడి మహానిర్వాణం పొందిన స్థలాన్ని కుశీనారాలో చూసి 1956 నవంబరు 30వ తారీఖున ఢిల్లీకి తిరిగివచ్చారు.

బాబాసాహబు శరీరం వృద్ధాప్యానికి లొంగిపోతుంది. పూర్తికాకుండా సగంలో ఉండిపోయిన తన పనుల గురించిన స్మరణతో ఆయన మనస్సు చింతతో నిండిపోతుంది. ఢిల్లీ నుంచి తిరిగి వచ్చే సమయానికి ఆయన చాలా అలిసిపోయారు. ఆయన తన పెర్సనలు సెక్రటరీ శ్రీ రత్తూని ఆ రాత్రి ఉండిపొమ్మన్నారు.

డిసెంబరు 1వ తారీఖున మధురా రోడ్డున జరిగిన బుద్ధకళా ప్రదర్శనానికి వెళ్లారు. ప్రదర్శనంలో పెట్టబడిన వస్తువులను ఆయన సూక్ష్మపరిశీలన చేశారు. భిన్నభిన్న స్థలాల్లో బుద్ధుడి ప్రతిమలు భిన్నభిన్నంగా తేడాతో ఎందుకు ఉన్నాయని ఆయనని ఎవరో ప్రశ్నించారు. "బుద్ధుడి తర్వాత 600 సంవత్సరాల వరకూ విగ్రహాలు చేసే ఆచారం లేదు. ఆ తర్వాతే బహుశా ఎవరో ఆయన ప్రతిమని చేశారు. ఆ పిమ్మట ప్రతి దేశంలోనూ, అక్కడ సౌందర్యానికి కల్పన ఎలా ఉంటే అలాగ ప్రతిమలు తయారుచేయడం జరిగింది" అని ఆయన జవాబు చెప్పారు.

1956 డిసెంబరు 2వ తారీఖున అశోక్ విహార్‌లో దలాయిలామా స్వాగతార్థం ఢిల్లీలో ఒక సభ ఏర్పాటు చేశారు. ఈ సభకు బాబాసాహబు కూడా హాజరయ్యారు. సాయంత్రం అయ్యేసరికి ఆయనకి అతి అలసటగా అనిపించింది. 3వ తారీఖున ఆయన తన అత్యంత సన్నిహితులతో కలిసి ఫోటో తీయించుకున్నారు. రాత్రి తన బంగాళాలోని తోటని చూసే తోటమాలి ఆరోగ్యం ఎలాఉందో కనుక్కోవడానికి ఆయనే స్వయంగా అతని ఇంటికి వెళ్లారు. అతని ఆరోగ్యం గురించి మంచీచెడ్డా భోగట్టా చేశారు. సంకట పరిస్థితిలో మరణభయంతో విలపిస్తున్న మాలీని చూసి బాబాసాహబు రత్తూతో ఇలా అన్నారు - "చావుని ఊహించుకున్నంత మాత్రానే ఇతడు ఎంతగా భయపడుతున్నాడో చూడండి, నేను చావంటే భయపడను. మృత్యువు ఎప్పుడు రావాలని అనుకుంటే అప్పుడు రానీ, నేను దానికి స్వాగతం చెప్పడానికి సిద్ధంగా ఉన్నాను."

డిసెంబరు 19వ తారీఖున బాబాసాహబు బొంబాయిలో కొంతమందికి దీక్ష యివ్వబోతున్నారు. అందుకుగాను ఆయన 14వ తారీఖున రత్తూకి రైల్వే రిజర్వేషను చేయించిపెట్టమని చెప్పారు.

డిసెంబరు 14వ తారీఖున కొంతసేపు రాజ్యాంగసభకి కూడా హాజరయ్యారు. సాయంత్రం తన స్టెనో చేత రెండు ఉత్తరాలు రాయించారు. మహారాష్ట్ర ప్రతిపక్షానికి చెందిన ఇద్దరు ప్రముఖ నాయకులు, శ్రీ ఎస్.ఎమ్. జోషి, శ్రీ ప్ర.కె. అత్రెకి రాసిన ఈ ఉత్తరాల్లో అంబేద్కరు తాము కొత్తగా పెట్టబోతున్న రిపబ్లికన్ పార్టీలో చేరమని వారిద్దరినీ కోరారు. స్టెనో రాత్రి 1.30 కి ఈ ఉత్తరాలను రాశారు.

ఆయన ఆ రోజు అక్కడే ఉండిపోయారు. మరుచటిరోజు ఉదయం 5వ తారీఖున అక్కడనుంచి తిన్నగా తన ఆఫీసుకు ఆయన వెళ్లారు.

సాయంత్రం 5-30 కి రత్తూ రాగానే డాక్టరు సాహబు ఆయనకి టైపు చెయ్యడానికి కొంత సామగ్రిని యిచ్చారు. రాత్రి బాబాసాహబును కలుసుకోవడానికి జైన మునులు కొంతమంది వచ్చారు. వారు జైనమతం, బౌద్ధమతం రెండింటి గురించి బాబాసాహబుతో చర్చించారు. ఆయనకి "జైనుడు-బుద్ధుడు" అనే పుస్తకాన్ని కానుకగా సమర్పించారు. మరుచటిరోజు జరిగే ఒక కార్యక్రమానికి ఆహ్వానించి జైనమునులు సెలవు పుచ్చుకుని వెళ్లిపోయారు.

ఆ తర్వాత బాబాసాహబు 'బుద్ధం శరణం గచ్ఛామి' జపాన్ని కూనిరాగం తీస్తూ ఉన్నారు. ఆయన పర్సనలు సెక్రటరీ రత్తూ ఆయనకి సేవ చేస్తూనే ఉన్నారు. రాత్రి డాక్టరు సాహబు స్వల్పంగా భోజనం చేశారు. రాత్రి 11-15 గంటలకి రత్తూ ఇంటికి వెళ్లిబోతూ ఉంటే బాబాసాహబు ఆయనని పిలిచి 'బుద్ధ ఎండ్ హిజ్ ధమ్మ' గ్రంథపు ప్రస్తావన, అంకితం తాలూకు టైపు చేసిన కాపీని తీసుకురమ్మన్నారు. దాంతోపాటు అత్రె, ఎస్.ఎమ్. జోషి, బర్మా సర్కార్‌కి రాసిన ఉత్తరాలని కూడా తెమ్మన్నారు. 'రాత్రి వీటన్నిటినీ, నేను చదువుతాను. రేపు వీటిని పంపించెయ్యండి' అని ఆయన రత్తూకి చెప్పారు.

ఉదయం 6-30 గంటలకి అమ్మగారు బాబాసాహబు చదువుకునే గదిలో ఆయనని లేపడానికి వెళ్లినప్పుడు బాబాసాహబు ఇహలోకాన్ని విడిచిపెట్టారని తెలిసింది. ఆవిడ రత్తూని రమ్మనమని వెంటనే కారు పంపించారు.

రత్తూ రాగానే వెంటనే పరిచితులు, కార్యకర్తలు, కేంద్రమంత్రులు, అందరికీ ఈ దుఃఖవార్త తెలియచేయడం జరిగింది. పండిత నెహ్రూ స్వయంగా బంగళాకు వచ్చారు. ఆయన సహానుభూతి ప్రకటిస్తూ మంచిచెడ్డలు కనుక్కున్నారు. మంత్రులు అనేకమంది బంగళాకు వచ్చి తమ సంతాపాన్ని ప్రకటించారు. ఒక ప్రత్యేక విమానంలో బాబాసాహబు భౌతికకాయాన్ని బొంబాయి తీసుకువెళ్లడానికి నిశ్చయించారు.

బాబాసాహబు మరణవార్త యావద్దేశంలో తుఫానులా వ్యాపించింది. గుంపులు గుంపులు జనం ఢిల్లీకి బయల్దేరారు. బాబాసాహబు రాజ్యసభ మెంబరు అయిన కారణంగా రాజ్యసభ సమావేశం వాయిదా పడ్డాది.

ఉదయం 10 గంటలకు 26 అలీపూర్ రోడ్డులోని ఆయన బంగళాలో బాబాసాహెబు అంతిమ దర్శనార్థం జనం బారులు కట్టారు. మధ్యాహ్నం 2-3 గంటలకు బాబాసాహెబు భౌతిక కాయాన్ని బొంబాయి తీసుకువెళ్లడానికి నిర్ణయించారు. కాని విమానాన్ని ఏర్పాటు చెయ్యటానికి సమయం పట్టింది. అప్పుడు ప్రజల అభిమతం ప్రకారం సాయంత్రం ఆరుగంటలకు బాబాసాహెబు భౌతికకాయాన్ని ట్రక్కుమీద పెట్టి పువ్వులతో అలంకరించారు. వేలాదిజనం ఈ ట్రక్కు వెంబడి శవయాత్రలో పాల్గొన్నారు. 26 అలీపూర్ రోడ్డు దగ్గర నుంచి ఈ శవయాత్ర ఢిల్లీలోని ప్రధాన మార్గాల గుండా సాగి పార్లమెంటు భవనానికి చేరుకుంది. అప్పటికి రాత్రి 10 గంటలు అయింది. జనం కెరటాలు కెరటాలుగా ఉవ్వెత్తున వచ్చిపడుతున్నారు. పరుగు పరుగున వస్తున్నారు. డకోటా విమానం రాత్రి 10 గంటలకు బయల్దేరుతుంది. అంచేత ఆలస్యం అయ్యేటట్టుగా తోచి జనానికి విజ్ఞప్తి చెయ్యవలసి వచ్చింది. ట్రక్కుని వేగంగా నడిపి విమానాశ్రయానికి ఆ భౌతికకాయాన్ని అతి శీఘ్రంగా తీసుకుని వెళ్లవలసివచ్చింది. అక్కడా వేలాదిజనం గుమిగూడి ఉన్నారు.

బాబాసాహెబు భౌతిక కాయంతో పాటు రత్తూ, సోహన్‌లాల్ శాస్త్రి, ఆనంద కౌసల్యాయన్, యశవంతరావ్, శ్రీమతి బాబాసాహెబు - అందరూ కలిపి 11 మంది విమానంలో బొంబాయికి బయల్దేరారు.

అర్ధరాత్రి దాటాక 2-30, 3 గంటలకు విమానం బొంబాయి విమానాశ్రయానికి చేరింది. 'రాజగృహ' నుంచి శాంతాక్రజ్ విమానాశ్రయం వరకూ జనం మధ్యాహ్నం 1-30 దగ్గరనుంచి ఎదురుచూస్తూ కూర్చుని ఉన్నారు.

దుఃఖ విహ్వలతతో జనం ఆక్రందన చేస్తున్నారు. గట్టిగా విలపిస్తున్నారు. శాంత్రాక్రూజ్ నుంచి అర్ధరాత్రి దాటాక బయల్దేరిన శవయాత్ర నెమ్మదిగా సాగింది. రాజగృహం చేరే సమయానికి సూర్యోదయమైపోయింది. బాబాసాహెబు భౌతికకాయాన్ని అంతిమ దర్శనార్థం అక్కడ ఉంచారు. లక్షలాది జనానికి ఆయన అంతిమ దర్శనార్థం పదేసి గంటలు క్యూలో నిల్చోవలసి వచ్చింది. 7వ తారీఖున మొత్తం బొంబాయి అంతా మూసేశారు. మొత్తం మహారాష్ట్ర యావత్తూ దుఃఖంతో ఆ రోజు బంద్ నిర్వహించింది. శోకవార్త విని మూర్ఛపోయిన వారి గురించిన

వార్తలు అనేకం వచ్చాయి. బొంబాయి చరిత్రలో శోకంతో పొంగిపొరలిన ఇలాంటి దుఃఖ సముద్రం ఇంతకుముందు ఎన్నడూ గోచరం కాలేదు.

మధ్యాహ్నానంతరం అనగా సుమారు 3, 4 గంటల మధ్య డా॥ అంబేద్కరు అంతిమయాత్ర ప్రారంభం అయింది. బాబాసాహబు భౌతికకాయం బాగా అలంకరించిన ట్రక్కుమీద పువ్వులతో ఆచ్ఛాదితమై ఉన్నాది. తలవేపు బుద్ధుడి ప్రతిమ పెట్టబడ్డాది. నాలుగు పక్కలా కొవ్వొత్తులూ, ఊదొత్తులూ వెలుగుతున్నాయి. ఊరేగింపు నిశ్శబ్దంగా ముందుకు సాగుతోంది. ఉత్తరబొంబాయిలో ప్రజా జీవనం స్థంభించి పోయింది. బైట ఊళ్ల నుండి లక్షలాది జనం ఎలా రాగలిగితే అలాగ బొంబాయి చేరుకున్నారు. మార్గానికి ఇరుపక్కలా ఉన్న భవనాల మీదనుంచి జనం పువ్వులు వాన కురిపిస్తున్నారు. మొత్తం వాతావరణం శోకతప్తమై ఉన్నాది. ఈ అంతిమయాత్ర 4 గంటల తర్వాత దాదర్ శ్మశానభూమికి చేరుకుంది. అక్కడ రమారమి 10 లక్షల మంది జనం[1] అంతిమ దర్శనం చేసుకున్నారు. రాత్రి 7-30 గంటలకు యశవంతరావు అంబేద్కరు చితికి నిప్పు పెట్టారు. వేలాది జనం వెక్కివెక్కి ఏడ్చారు. బొంబాయి చరిత్రలో ఇలాంటి అంతిమ యాత్రను జనం ఎన్నడూ చూడలేదు. చితి సమక్షంలో 50 వేలమంది ప్రజలు బౌద్ధమతాన్ని స్వీకరించారు.

భారతదేశంలోని అన్ని ప్రముఖ పార్టీల నాయకులూ, విశిష్ట వ్యక్తులూ బాబాసాహబుకు శ్రద్ధాంజలి ఘటించారు. పండిత నెహ్రూ, వీర్ సావర్కర్, బొంబాయి హైకోర్టు ముఖ్య న్యాయమూర్తి, భారతదేశపు ప్రథమ రాష్ట్రపతి డా॥ రాజేంద్రప్రసాద్, చక్రవర్తి రాజాగోపాలాచారి, అందరూ డా॥ సాహబు కృషిని, చేసిన పనులను ప్రశంసించారు. భారతదేశపు వార్తాపత్రికలు సంపాదకీయాలు రాసి బాబాసాహబుకు శ్రద్ధాంజలి ఘటించాయి. బర్మాదేశపు ప్రధానమంత్రి 'ఊనూ' కూడా మనస్సుని కదిలించే మాటల్లో ఆయనని శ్లాఘించారు. అమెరికా వార్తాపత్రిక 'న్యూయార్కు టైమ్సు' ఇలా రాసింది - 'యావత్ ప్రపంచం ఆయనని అస్పృశ్యుల నాయకుడిగా గుర్తిస్తుంది. కాని భారతదేశపు రాజ్యాంగ నిర్మాణంలో ఆయనవేసిన శాశ్వతమైన ముద్ర గురించి జనం ఎక్కువగా ఎరగరు." లండను 'టైమ్సు'

1. నవశక్తి : తే. 9-12-1956

వార్తాపత్రిక ఇలా రాసింది - "భారతదేశంలో బ్రిటిషు పరిపాలనల్లోని అంతిమ దినాలకు చెందిన రాజకీయ చరిత్రలోనూ, సాంఘిక చరిత్రలోనూ ఆయన పేరు విశిష్టంగా నిలిచి ఉంటుంది. ఆయన వదనంలో ఎప్పుడూ ఆయన ధైర్యమూ, దృఢ నిశ్చయమూ గోచరిస్తూ ఉండేవి. ఆయన వివేకంతో సరిసమానమైనది మూడు లోకాల్లోనూ కానరాదు. అయినా ఆయన ఎప్పుడూ తన వివేకానికి చాటింపు వేసుకోలేదు. దానికి కారణం ఆయనకి ఆడంబరం ప్రదర్శించడం రాదు."

# ఉపసంహారం

భారతదేశపు రాజకీయ జీవనంలోనూ, సాంఘిక జీవనంలోనూ తన ప్రతాపంతో దేదీప్యమానంగా వెలిగే జ్ఞానభాస్కరుడు డా।। అంబేద్కరు ఇక లేరు. ఆయన మృతితో ఒక యుగం సమాప్తం అయింది. జాతి ఉత్పన్నమవడానికి గల కారణాలను మీమాంసచేసి ఆయనే చెప్పారు. అస్పృశ్యతను చట్టంద్వారా నిర్మూలించారు. 'మనుస్మృతి' ని దహనం చేసి అసమానత్వాన్ని ఎదురుకున్నారు. రాజ్యాంగంలోని లోటుపాట్లని పూరించే ప్రయత్నం చేశారు.

ఆయన జ్ఞానం హద్దుల్లేనిది. ఆయన అర్థశాస్త్రంలో డిగ్రీలు పుచ్చుకున్నారు. పాకిస్తాను ఏర్పడుతుందని జోస్యం చెప్పారు. ప్రాణ నష్టం కలగని విధంగా దానికి మార్గాలని సూచించారు. పార్లమెంటులో చైనా ఆక్రమణ గురించీ జోస్యం చెప్పారు. ప్రజాస్వామ్య రక్షణార్థం అనేకపర్యాయాలు ప్రమాదాల గురించిన వైనం తెలియచేశారు. ఆయన రాజకీయద్రష్ట.

డా।। అంబేద్కరు జ్ఞాన ఋషి. వెవరలె నికోలస్ అనే పాత్రికేయుడు 1944 లో భారతదేశపు ప్రథమశ్రేణికి చెందిన విద్వాంసులలో ఒకరిగా ఆయనను పరిగణించారు. కాని ఆయనకి డా।। అంబేద్కరు గారి ధర్మ శాస్త్రపు గంభీర అధ్యయనం గురించిన ఊహేలేదు. అంబేద్కరు అముద్రిత వ్యాసాల్లో కూడా ఆయన పాండిత్యంతో కూడిన ఔన్నత్యాలను చూసి

దిమ్మెరపోతాం. తిలక్, రానడే, భాండార్కర్, తెలంగ్ – ఈ విద్వాంసుల వరసలో ఆయన చివరివారు.

ఆయన గొప్ప రాజకీయవేత్త. రాజకీయ నైపుణ్యం ఉన్నవారు. కాని రాజకీయ యోగ్యతకి పాండిత్యపు జాలరు ఉన్నాది. రాజకీయాల్లో అడుగడుగునా నమ్మకద్రోహం గోచరించినా సత్యమార్గాన్ని ఆయన ఎప్పుడూ విడనాడలేదు. "నేనెప్పుడూ కంపు రాజకీయాలు చెయ్యలేదు" అని ఆయన గర్వంగా చెప్పుకుంటూ ఉండేవారు. సత్యం లేకుండా అహింసకి ఏమీ అర్థం లేదు అన్నదే ఆయన ఖచ్చితమైన వాదం. నిద్రలో మొద్దుగా పడి ఉండడం అహింస అనిపించుకోదు. అహింస అంటే పులిది అహింస. ఆయనకి బలవంతుల అహింసంటే ఇష్టం. అంచేత ఆయన బ్రాండ్ రసెలు అహింసను తమాషా పట్టించారు. మహాడ్ సత్యాగ్రహంలో ఆయనతోపాటు వీరులైన సైనికులు ఉన్నప్పటికీ, వారిమీద అన్యాయంగా ఆక్రమణ జరిగినప్పటికీ, తన అనుయాయులను హింసాత్మకంగా ప్రతీకారం తీర్చుకోవద్దని నిరంతరం ఆయన వారిని వారించారు. ఆయన రాజకీయ తత్వవేత్త. దాంతో ఆయన తత్వజ్ఞానంలోని రాజకీయాన్ని కూడా పరిష్కరించారు.

అన్నిరకాల, కుంటి, గుడ్డి, మూగ, చెవిటిగా ఉన్న అస్పృశ్య సమాజానికి ఆత్మగౌరవంతో జీవించడం నేర్పించి తన కాళ్లమీద తాను నిల్చునేటట్టు చేశారు. ఆయనని ఒకరు మోజెస్ అంటే మరొకరు అబ్రహాంలింకను, వేరొకరు బుకర్ టి. వాషింగ్టను అన్నారు. వీరందరి కార్యదక్షతా, సామర్థ్యం, యోగ్యతా కలగలుపుకుని ఆయనలో ఉన్నాయి. అశోకచక్రవర్తి తర్వాత లక్షలాది మందిని బౌద్ధమతం స్వీకరించేటట్టు చేసిన ఒకే ఒక మహాపురుషుడు డా|| అంబేద్కరు. స్పష్టమైన ఆయన వాక్చాతుర్యం మనస్సుని కదిలిస్తుంది. సాధారణులతో మాట్లాడేటప్పుడు సాధారణుల భాషా, విద్వాంసులతో మాట్లాడేటప్పుడు పాండిత్యపూర్ణమైన భాషా ఆయనది. బహిరంగసభలో మాట్లాడ్డానికి నిల్చున్నప్పుడు లక్షలకొద్దీ జనాన్ని నిశ్శబ్దంగా కట్టి పడివెయ్యగలిగే ఆకర్షణీయమైన ముగ్ధమోహనమైన కంఠం ఆయనది. ఆయన పార్లమెంటు భవనంలో పార్లమెంటు సభ్యుల ముందు మాట్లాడుతున్నపుడు దురంధరులైన సభా నిపుణులు కూడా ముగ్ధులై గంటల తరబడి ఆయన ఉపన్యాసాన్ని వినేవారు. ఆయన

కంఠస్వరంతో ప్రభావితులై తలలూపేవారు. హిందూకోడ్ బిల్లు మీద ఆయన ఉపన్యాసం ఇచ్చినప్పుడు అన్ని గాలరీలు, తలుపుల దగ్గర జనం కిక్కిరిసిఉన్నారు. స్త్రీలు చాలా ఎక్కువ సంఖ్యలో హాజరయ్యేవారు. ఆయన ఉపన్యాసం ముగిసిన వెంటనే ప్రేక్షకులు బయటికి వెళ్లిపోయేవారు. మంత్రి సమాధానం వినడానికి ఆగేవారు కాదు. వై. జయకర్ అనుబంధ సూచనని సమర్థిస్తూ ఆయన ఉపన్యసించినప్పుడు, దానిని విని ఆయన ప్రత్యర్థులు కూడా ఆయన మిత్రులు అయిపోయారు. ఆయన నోట వెలువడే ప్రతి మాటా పిస్తోలు నుంచి వెలువడే గుండులాంటిదని నికోలస్ ఉపమానం ఇచ్చారు. కాని రాజ్యాంగంలోని ప్రతి క్లాజుని వివరించి, వాటి చిక్కుల్ని విప్పి విడమర్చి చెప్పి ప్రతిపక్ష పార్టీ సభ్యుల మనస్సు కూడా తన నైపుణ్యంతో చూరగొనేవారు. వారి సమర్థననీ పొందేవారు.

సంఘటితపరిచే శక్తి నైపుణ్యాల విషయాల్లో ఆయన గురించి వేరే చెప్పవలసిన అవసరం లేదు. మొదట ఆయన అస్పృశ్యుల్లో ఆత్మగౌరవాన్ని కలిగించటానికి, ఆ చైతన్యాన్ని కలిగించే ఉద్యమాలను నడిపారు. వ్యవసాయ కూలీలను మిల్లు కార్మికులను సంఘటితపరిచి వారికోసం సంస్థలను స్థాపించారు. జనంలో ఆలోచనలను రేకెత్తించటానికి వార్తాపత్రికలు నడిపారు. తమ ప్రత్యర్థుల విమర్శలని ఎదురుకున్నారు. ప్రత్యర్థులు కేవలం రాజకీయవేత్తలే కాదు సనాతన హిందువులు, సంఘ సంస్కర్తలు, అస్పృశ్యుల్లో హరిజనులు, విద్వేషంతో ఉన్న భారతదేశపు వార్తాపత్రికలు – వీరందరిని లక్ష్యపెట్టకుండా ఆయన తిరుగులేని సంస్థని లేవనెత్తారు. ఈ బలమైన సంస్థని చూసి శౌకత్ ఆలీ లాంటి ముస్లిం నాయకులు, హిందూ మహాసభకి చెందిన డా॥ ముంజె, కాంగ్రెసుకు చెందిన బాలాసాహబు ఖరే, వల్లభభాయి పటేలు, విప్లవవీరుడు సావర్‌కర్ – ఆయనని మనసారా శ్లాఘించారు. అస్పృశ్యుల ఐకమత్యం చాలా బలమైనది. 1946 సాధారణ ఎన్నికల్లో అస్పృశ్యుల ఓటింగు శాతం 80 ఉంటే హిందువులది కేవలం 30 శాతమే ఉంది. ఇది వార్తాపత్రికల్లో ప్రచురించబడ్డాది.[1]

డా॥ అంబేద్కరు ఆందోళనవల్ల ఏం లబ్ది కలిగింది ? ఆత్మగౌరవం, స్వావలంబనం, మానవత్వం కోసం హఠం, నిస్సహాయంగా జీవించు అన్న

1. బ్లేకు క్లార్కు : రీడర్సు డైజస్టు, మార్చి 1990

నిశ్చయం, భారతీయులు కాబట్టి అన్ని రంగాల్లోనూ హక్కులు పొందాలన్న పట్టుదల, తమ మార్గాన్ని తామే అన్వేషించుకోవాలన్న నిర్ణయం, ఏ మార్గం కనపడ్డా దానివల్ల తాము మీదకి లేద్దామన్న నిశ్చయం, విద్యలోనూ, ఆర్థికంగానూ, సాంఘికంగానూ సమానత్వం పొందడానికి సంఘర్షించడం - ఈ సాఫల్యాలన్నీ అంబేద్కరు ఆందోళన విశిష్టతలు. త్యాగం, సంఘర్షణా లేకుండా ఎప్పుడూ సాఫల్యం లభించదని ఆయన ఎప్పుడూ అంటూ ఉండేవారు.

డా॥ అంబేద్కరు కేవలం కబుర్లు చెప్పే ఆలోచనాపరుడు కారు. ఏ సంస్కరణనైనా ఎలా అమలులోకి తీసుకురాగలుగుతామన్న విషయాన్ని బాగా యోచించేవారు. దేవదాసీలను కేవలం వృత్తి వదిలెయ్యమని సలహా ఇచ్చి ఆయన మౌనం వహించలేదు, ఆయన సలహాని పాటించడానికి సిద్ధపడినవారికి వివాహాలు చేయింపించారు.[1] అస్పృశ్య సమాజంలో కులాంతర విహాలను ప్రోత్సహించారు. ఆయన స్వయంగా కులాంతర వివాహం చేసుకున్నారు. ఆయన మొత్తం భారతదేశపు అస్పృశ్యుల హితాన్ని గురించి యోచన చేసేవారు. లేబరు మినిస్టరు అవగానే ఆయన ఆ అవకాశాన్ని వినియోగించుకుని మొత్తం భారతదేశపు కార్మికుల హితం కోసం చట్టాలు చేయించారు. అంతేకాదు, అస్పృశ్యుల విద్య నిమిత్తం భారత ప్రభుత్వం చేత స్కాలర్‌షిప్పులు ఇప్పించారు. ఉన్నత విద్యకోసం ఆ విద్యార్థులను విదేశాలు పంపించే ఏర్పాటు చేశారు.

తన జీవితంలో ఒక క్షణాన్నైనా వ్యర్థంగా జారవిడవని అంబేద్కరు ప్రాణం పోయే క్షణం దాకా చదువుతూ, రాస్తూ జ్ఞానార్జన చేస్తూనే ఉన్నారు. బుద్ధుడి లాగ ఆయన జ్ఞాన పిపాసిగానే చివరివరకూ ఉన్నారు.

డా॥ అంబేద్కరు తమనుతాము మొదట భారతీయుడనని అనుకునే వారు. ఆఖరిని కూడా భారతీయుడననే అనుకున్నారు. తన ఈ భారతీయత మీద మతం రంగు ఏమాత్రం రానియ్యలేదు. ఆయన ప్రజాస్వామ్య స్వభావమే నిండి ఉండేది. అంచేతే ఆయన ఎన్నో రిపోర్టులు స్వయంగా తయారుచేసినా పార్టీ తరపునే సమర్పించారు. వ్యక్తి ఆరాధన ప్రజాస్వామ్యంలో వక్రతలని పుట్టిస్తుంది. పార్లమెంటులో కూడా ప్రజాస్వామ్య సూచనల ఉల్లంఘన ఎక్కడా జరగకుండా జాగ్రత్త పడేవారు.

1. టిపణీస్. పు.జి. : మహాడ్ ప్రత్యేక సంచిక, మార్చి 1962

ఎప్పుడన్నా ఏ విందులో అయినా పాల్గొనడానికి వెళ్లవలసివస్తే ఆయన ప్రధానమంత్రి నెహ్రూకి ముందుగా సూచించి మరీ వెళ్లేవారు.[1]

కాశ్మీరు సమస్యమీద ఆయన నెహ్రూకి ఇలా చెప్పారు - "నా జనాన్ని మీరు కాశ్మీరు పంపించండి."

డా॥ సాహెబుకు ఎప్పుడూ ఏ పదవిమీదా వ్యామోహం లేదు. సంపద అన్నా లోభం లేదు. దేశంలోని ఉన్నతోన్నతమైన పదవులు ఆయనకు ఈయబడ్డాయి. హైకోర్టు న్యాయమూర్తి పదవి ఆయనకి రాబోయింది. రాష్ట్రపతి పదవికోసం కూడా ఆయన పేరు చర్చకి వచ్చింది. కాని ఆయన ఎప్పుడూ ఈ పదవుల కోసం ఆకాక్షించలేదు. ఏ పదవుల గురించిన ప్రతిపాదన వచ్చిందో వాటిని యోచనలో ఉంచారు - సమయం వచ్చినప్పుడు వాటిని నిరాకరించనూ నిరాకరించారు.

భారతదేశపు అత్యున్నత గౌరవ శిఖరాన్ని చేరుకున్న ఈ గృహస్థు కింద స్థాయిలో ఉన్న వ్యక్తిని ఎప్పుడూ అలక్ష్యం చెయ్యలేదు. ఢిల్లీలో ఆయన ఉన్నప్పుడు తన బంగళా లాంజ్‌లో పడకకుర్చీలో కూచుని మామిడిపళ్లు తింటూ తనతోపాటు తన మాలీకి పళ్లు తిండానికి పెట్టేవారు.[2]

మనుషులందరూ సమానమని ఆయన తన ఆచరణలో చూపించేవారు. పరేలు (బొంబాయి) లో ఉండేటప్పుడు గరుగ్గా మోటుగా లావుగా ఉండే బట్టలు వేసుకుని బెంచీమీద పడుకునేవారు. దామోదర్ హాలు ప్రాంగణంలో రెండు బెంచీలను జోడించి దానిమీద తన నల్ల కంబళీని పరుచుకునో, అథవా ఒట్టి బెంచీలమీదో పడుకునేవారు. మహాడ్ పరిషత్తులో తనకోసం ప్రత్యేకించి వంట వండించడాన్ని నిషేధించారు.[3]

డా॥ అంబేద్కరు వ్యక్తిత్వం తుఫానులాంటిది. హిందూ సమాజాన్ని సంస్కరించడానికి గాను తన భావాలతో భూకంపాన్ని సృష్టించారు. పండిత నెహ్రూ అన్నమాటలు వాస్తవాలు - "డా॥ అంబేద్కరు, హిందూ సమాజపు అణిచివేసే ప్రవృత్తులకు వ్యతిరేకంగా లేవనెత్తిన తిరుగుబాటుకు ప్రతీక."

1. టిపణీస్, సురబా : మహాడ్ ప్రత్యేక సంచిక, 1962
2. శాస్త్రి, సోహన్‌లాల్ : పే. 24.
3. ప్రదాన, భా.ది. జనత ప్రత్యేక సంచిక, 1933

మండిపడ్డం, దుఃఖితులవడం ఆయన పక్కా స్వభావం. అన్యాయం అన్నా అత్యాచారం అన్నా, గుడ్డివిశ్వాసం అన్నా ఆయన క్రోధంతో మండి పడేవారు. ఆయన మహాత్మాగాంధీ విధానాలపై తీవ్రంగా దాడిచేసారు. అయినా ఆయన ప్రాణాలను కాపాడ్డానికి గాను ఆయన పరుగుపెట్టారు. ఒక్కొక్క సందర్భంలో చండీరూపం దాల్చే డా॥ అంబేద్కరు ఆ మరుక్షణమే అంతా మర్చిపోయి హృదయస్ఫూర్తిగా నవ్వేవారు. "మనసారా మనిషి బాగా నవ్వాలి" అని ఆయన అంటూ ఉండేవారు.

ప్రజాస్వామ్య జీవనపు విలువలను అంగీకరించి సంఘాన్ని మార్చాలని ఆయన ప్రయత్నించారు. సమానత్వం, స్వాతంత్రము, సౌభాతృత్వము - మూడింటిని ఆరాధించే, భారతదేశంతో సంబంధం ఉన్న బౌద్ధమతాన్ని ఆయన స్వీకరించారు. ఆయన రాజకీయ ప్రజాస్వామ్యాన్ని సాంఘిక ప్రజాస్వామ్యంగా తీర్చిదిద్దాలన్న కలని అందరిముందు ఉంచారు. వెయ్యి పగుళ్లతో ఉన్న భారతదేశం అనే భవనాన్ని పునరుద్ధరిద్దామని ఆయన ప్రయత్నించారు. ఆయన భారతదేశానికి రాజ్యాంగం రూపంలో ఓ దేవాలయాన్ని ఇచ్చారు. ఈ దేవాలయాన్ని నడిపే పూర్తి బాధ్యత మనందరిదీనూ.

# సంప్రతించిన గ్రంథాలు

## (క) హిందీ, మరాఠీ


| | | |
|---|---|---|
| 1. కీర్ ధనంజయ | (మరాఠీ) డా॥ బాబా సాహబు అంబేద్కరు | పాపులర్ ప్రకాశన్ బొంబాయి రెండవ ముద్రణ - 1977 |
| | (ఇంగ్లీషు) డా॥ అంబే ద్కర్ లైఫ్ అండ్ మిషన్ | పాపులర్ ప్రకాశన్ రెండవ ఎడిషన్, డిసెంబరు, 1962 |
| 2. కేలూస్కర్ కృ.అ. | డా॥ భీమరావ్ రామ్‌జీ అంబేద్కరు | జనత, ప్రత్యేకసంచిక, 1933 సం.భా.ర కద్రేకర్ |
| 3. కోసారె, హి.ల. | విదర్భాతీల్ దళిత చలవలీచా ఇతిహాస్ | జ్ఞానదీప్ ప్రకాశన్, నాగపూర్, నబీశుక్ర నారీ,నాగపూర్ 1984 |
| 4. ఖరాత్, శంకరరావ్ | బాబాసాహబ్ గాయక్‌వాడ్ యానా డా. బాబాసాహబ్ అంబేద్కరాంచీపత్ర | త్రోకల్ ప్రకాష్‌న్, 62 బుధవార్ పేఠ, పూనా 20, 1961 |
| 5. ఖైరమోడె చా భ. | డా. భీమరావ్ రామ్‌జీ అంబేద్కరు ఖండం - 1 | యు బీ. అంబేద్కర్, భారతభూషణ ప్రింటింగు ప్రెస్, గోకుల్‌దాస్ పాస్తాలోడ్, దాదర్, బొంబాయి, 1952 |

| | | |
|---|---|---|
| | 2) -- " ఖండం - 2 | బౌద్ధజన పంచాయత్ సమితి, నానాబిల్డింగు, పహిలామణలా, పరేల్, బొంబాయి నం. 12, 1958 |
| | 3) -- " -- ఖండం-3 | ప్రతాప్ ప్రకాశన్, 29 ఈవ్, ఆంబేవాడీ, గిర్‌గావ్, బొంబాయి 4, 1964 |
| 6 గణవీరరత్నాకర్ | విలాయతేహూన్ డా బాబాసాహెబాంచీ పత్రే | రాజగృహ ప్రకాశన్, సిద్ధార్థ నగర్, నాగపూర్-17, 1974 |
| 7. గాయక్‌వాడ్ భా.కృ. | సత్యాగ్రహి డా అంబేద్కరు | జనత, ప్రత్యేక సంచిక ఏప్రిలు - 1942 |
| 8. చిత్రే, అనంతరావ్ | ఆర్‌పణీచీ మోహన్‌మాల్ | జనత, ప్రత్యేకసంచిక, 1993 |
| 9. టిపణీస్, సురేంద్రనాథ్ | మహాడ్చ్యాయా స్వతంత్ర్య యుద్ధాచీ ముహూర్తసేద | జనత, ప్రత్యేకసంచిక 1933 |
| 10. టిపణీస్ సురేంద్ర | మాఝూఆదర్శ్ - డా. అంబేద్కరు | డా. బాబాసాహబు అంబేద్కర్ కాలేజి, మహాడ్ - మాసపత్రిక, మార్చి 1962 |
| 11. దేసాయీ, హ.వి | మోఠ్యాచ్యాముతాఖతీ | హిరజీమోహన్‌జీ ప్రకాశన్, బొంబాయి-2, 1940 |
| 12. దీదె, ఎమ్.బి. | సాహిత్య డా. అంబేద్కర్ | జనత, ప్రత్యేక సంచిక, 1942 |
| 13. ప్రధాన్ ఖా.వి. | డా. అంబేద్కర్ సాహెబా చ్యా యాశాచె రహస్య | జనత, ప్రత్యేక సంచిక, 1933 |

| | | |
|---|---|---|
| 14. పానతావణె గంగాధర్ | పత్రకార్ డా. బాబా సాహెబ్ అంబేద్కర్ | అభిజీత్ ప్రకాశన్ నాగపూర్ - 22, 1987 |
| 15. ఫడకె, య.డి. | ర.ధో. కర్వే | హ.వి. మోటె ప్రకాశన్, 3, పర్వా గలీ క్ర 5, డెక్కన్ జిమ్‌ఖానా, పూనా - 4 14, అక్టోబర్, 1881 |
| 16 బనౌధా, రామచంద్ర | అంబేద్కర్‌కా జీవన్ సంఘర్ష్ (హిందీ) | 325, రాజాపుర్, అలహాబాద్, 1947 |
| 17 బోలె, ప కె | డా. అంబేద్కర్‌యాంచీ సార్వజనిక్ కామగిరి | జనత, ప్రత్యేక సంచిక, 1933 |
| 18 మూనె, జి బి | డా. బాబాసాహెబ్ ఆంబేద్కర్ యాంచా దళిత ముక్తిసంగ్రామ్ (1942-45) | పి ఇ సొసైటీ, ఆనంద్ భవన్, దాదాభాయీ నవరొజీ రోడ్, ఫోర్టు, బొంబాయి, 6 డిసెంబరు 1986 |
| 19 మోటె, హ.వి | విశ్రబ్ద శారదా ఖండం - పహలా | హ వి మోటె ప్రకాశన్, 3. వెస్ట్ వ్యూ, దాదర్ బొంబాయి - 14 |
| 20 లఠ్ఠె అణ్ణాసాహెబ్ | మూఝియా విలాయ తేచ్యా ఆఠవణీ | జి ఆ తెండోల్కర్, తరుణ భారత్ ప్రెస్, బెల్గాం, 1936 |
| 21 శాస్త్రి, శంకరానంద్ | ప్రబుద్ధ భారత | ప్రత్యేకసంచిక, 14-4-1957 |
| 22 శాస్త్రి, సోహన్‌లాల్ | బాభాసాహెబ్ బి.ఆర్ అంబేద్కర్ కే సంపర్క్ మే పచ్చీస్ వర్ష్ | సిద్ధార్థ సాహిత్య సదన్, 7154 సౌత్ పటేల్ లేనగర్, న్యూఢిల్లీ - 8, 1975 |
| 23 సత్వోధ్ హుదలీకర్ | "సిద్ధార్థ కాలీజాతీక సిద్ధార్థతా" | జనత, అంబేద్కర్ జయంతి సంచిక, 14-4-1948 |

| | | |
|---|---|---|
| 24. సత్యాగ్రహి | గ్రహ ఆణితారె | రా.జ. దేశముఖ్, దేశ్‌ముఖ్ ఆణి కంపెనీ, 191, శనివార్, పూనా-2, 15 అక్టోబరు, 1943 |
| 25 సహస్ర బుద్ధె గ్ర.సి. | ఆమెచె అంబేద్కర్ | జనత, ప్రత్యేక సంచిక, 1933 |


## (ఖ) ఇంగ్లీషు


| | | |
|---|---|---|
| Alva Joachim | Men and Supermen of Hindustan | Thacker & Co., Ltd., Bombay, 1943. |
| Ambedkar, B.R. | (1) The Evolution of Provincial Finance in British India | P.S. King & Son Ltd., Olchard House, 2–4, Great Smith Street, West minister 1925. |
| | (2) Pakistan or Partition of India | Thacker & Co. Ltd., Rampart Row, Bombay, 3rd Ed. 1946. |
| | (3) History of Indian Currancy and Banking | 1947 |
| | (4) Untouchables and Indian Consti-tution, Indian Paper No. 4. | International Secretariat, Institute of of Pacific Relations, 129 East 52 st, New york, 1942 |
| | (5) Who were the Shudras | Thacker & Co. Ltd., Bombay, 1947 |
| | (6) Administration and Finance of East India Company | Unpublished thesis for M.A. at Columbia University 15-5-1915 |

| | | |
|---|---|---|
| | (7) Memorandum to Dr. Roger Luimiley | |
| Bhagawan Das | Thus Spoke Ambedkar Vol. 3 | Ambedkar Sahitya Prakashana, Bangalore, CA-2 West of Cord Road, 2nd Stage Rajaji Nagar, Bangalore - 10, 1979 |
| | — " — Vol. 4 | – do –, 1980 |
| Clarke, Blake | – The Victory of an Untouchable | Readers Digest, March 1950 |
| Durgadas | India - From Curzon to Nehru and After | Collins, St. James Palace, London, 1969 |
| Edgunji, M.R. | Social Insurance in India | |
| Hart, Dr. Henry C. | New India's Rivers | Orient Longman Pvt. Ltd., Calcutta, 1956 |
| Khare, N.B. | My Political Memoires and Biography | J.R. Joshi Butiwada, Nagpur |
| Moon, Vasant (Ed.) | Dr. Babasaheb, Ambedkar Writings & Speeches - Vol. 1<br>Vol. 2<br>Vol. 3<br>Vol. 4 | Government of Maharashtra, Bombay April 1979<br>April 1982<br>April 1987<br>Oct. 1987 |
| Nichols Beverley | Verdict on India | Thacker & Co. Ltd., Bombay, 1946. |
| Philips, Dr. Godfrey E. | The Untouchables' Quest | The Livingstone Press, 42 Broadway Westminster, London, SW 1, 1936 |

| | | |
|---|---|---|
| Pradhan, G.R. | Untouchable Workers of Bombay City | 1936 |
| Sangharakshita | Ambedkar and Buddhism | Windhorse Publications, 136 Ranefield street, Glasgow, G2, 3AU, U.K., 1986 |
| Sanjana, J.E. | Caste and Outcaste | Thacker & Co. Ltd., Bombay, 1946 |
| Sapru, T.B. | Sapru Committee on Indian Constitutional Reforms, Appendix XI, Pt. LXXI | 1945 |
| Suman, R.D.(Ed) | Dr. Ambedkar - Pioneer of Human Rights (a) Lokhande G.S.- Dr. Ambedkar on the erstwhile princes | Bodhistta Publication, Ambedkar Institute of Buddhist Studies I–138, Ashok Vihar, New Delhi - 110 052, 1984 |
| | (b) Narayan,I and N. Upareti | Dr. B.R. Ambedkar and the Hindu Code Bill |
| | (c) Zellioo Eleanor Mao | The American Experience of Dr. Ambedkar |

## (గ) రిపోర్టులు, ఫైల్సు మొదలైనవి

(1) National Archives, Jaikar Paper No. 37, File No. 832, Delhi.
(2) Archives Deptt., Govt. of Maharashtra, Education Deptt., Vol. 66 of 1918, Part I.
(3) Report of the Committee on University Reforms, 1925-26.
(4) Report of the Royal Commission on Indian Currency and Finance ; Appendix 29 ; Vol. II ; Published by His Majesty's Stationery Office,

Adastral House Kingway, London, W.C. 2 (Correspondence between the Chairman and the Hon'ble Dr. Ambedkar)

(5) Home Deptt. File no. 335 (64) II, 1928

(6) India Office Library and Records, Templewood Collection, Dr. Ambedkar's letter to Sir Sammuel Hoare, dt. 21.8.1932.

(7) Report of the All India Scheduled Caste Students Federation, Second Session held at Nagpur on 25 – 27 December 1946; 1947.

(8) Indian Constitutional Documents (ICD), Vol. IV, Pub. A. Mukharji & Co. Pvt. Ltd., 1963.

(9) The Buddha Prabha, Vol. 5, II, Ed. Dharmanand Kosambi, Bombay, April 1937.

(10) Jaibheem, Vol. 1 – 28, Special Number, 13th April 1947, Madras, Ed. O. Mahipati.

## (ఘ) వార్తాపత్రికలు – పత్రికలు ఇత్యాదులు

Bombay Chronicle ; Servant of India ; Indian Express ;
Indian Information, 1941–47

(1) కేసరి (2) చిత్ర (3) జనత (4) తరుణభారత (5) దళితబంధు (6) నవయుగ (7) నవాకాల్ (8) నిర్భీడ్ (9) పురుషార్థ్ (10) బహిష్కృత భారత్ (11) వివిధ వృత్త (12) సకాల (13) జ్ఞానప్రకాశ్ (14) నవశక్తి.

Printed at The Central Electric Press A12/1 Naraina Indl. Area, Phase-I, New Delhi-110028